## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నీతి సుధానిధి

(MORAL EDUCATION BOOK)

తృతీయ భాగము

3

రచన - సంకలనం


శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు

ఎడిటర్ : 'శ్రీవాణి'


వ్యవస్థాపకులు : E.H.V.L. CENTRE


ప్రచురణ

నైతిక మానవతా విలువల అధ్యయన కేంద్రము

ETHICS & HUMAN VALUES' LEARNING CENTRE

(E.H.V.L. CENTRE)

24-52, Ramanaidupet, MACHILIPATNAM - 521 001.

© 08672 - 22818, 21137

# మనసులో మాట

"సత్ప్రవర్తన, సద్బుద్ధి, సత్యనిరతి
భక్తి, క్రమశిక్షణ, కర్తవ్యపాలనంబు
నేర్పునదే విద్య, అద్దాని విద్యార్థి నేర్వవలయు."

'విద్య' అంటే కేవలం చదవటం, వ్రాయటం మాత్రమే కాదు, డిగ్రీలు సంపాదించటమే కాదు. మార్కులు, ర్యాంకులు తెచ్చుకోవటమే కాదు. పై ఆరు సద్గుణములు నేర్పునదే సరియైన విద్య. కనుక ప్రతి విద్యార్థి అట్టి విద్యను అభ్యసించాలి.

వినయం లేని విద్య, వివేకం లేని విజ్ఞానం, సంస్కారంలేని చదువు ఉన్నా ప్రయోజనం లేదు. విద్యతో పాటు వినయం, వివేకం, సంస్కారం ప్రతి విద్యార్థిలో ఉండాలి. నీతి, నిజాయితీలు వీటికి తోడుకావాలి. ఈ ఐదు విద్యార్థికి పంచప్రాణములు.

సత్యం, అహింస; ప్రేమ, కరుణ; దయ, దాతృత్వం; సేవ, స్నేహం; శాంతం, సహనం - ఇవి మానవతా విలువలు. ఈ విలువలను ప్రతివిద్యార్థి పెంపొందించుకోవాలి.

ఈనాడు కులం పేరుతో క్రుమ్ములాడుకుంటున్నారు. మతంపేరిట మారణహోమాలు జరుగుతున్నాయి. 'అస్పృశ్యత' సమాజాన్ని విచ్ఛిన్నం చేస్తుంటే, 'అసూయాద్వేషములు' వ్యక్తిని పతనం చేస్తున్నాయి. కనుక భావిభారత పౌరులు వీటికి ఎంత దూరంగా వుంటే అంత మంచిది.

దుర్గుణాలను దూరం గావించి, సద్గుణాలను నేర్పునదే సరియైన విద్య. అయితే ఇటువంటి ఉత్తమమైన, పవిత్రమైన విద్యను ఎప్పుడు? ఎవరికి? ఎవరు? నేర్పాలి. ఇదే ఈనాటి ప్రధాన సమస్య. ఇలాంటి విద్య వెల చెల్లిస్తే బజారులో దొరికేది కాదు, ఎప్పుడుపడితే అప్పుడు అబ్బేది కాదు.

'శైశవేభ్యస్త విద్యానామ్' విద్య బాల్యమునందే అభ్యసించాలి. అప్పుడే అది బాగా వంటపడుతుంది. అప్పుడు నేర్చుకున్నది, అలవరచుకున్నది మాత్రమే జీవితాంతం గుర్తువుంటుంది. మధ్యలో నేర్చుకున్నది మధ్యలోనే పోతుంది. కనుక అట్టి బాల్యదశను సద్వినియోగం అయ్యేట్లుగా చూడాలి పెద్దలు.

'నైతిక విద్యావ్యాప్తి' అనే సౌధానికి నాలుగు మూలస్తంభాలు. అవి పటిష్ఠంగా, దృఢంగా ఉన్నప్పుడే 'నైతిక విద్యావ్యాప్తి' జరుగుతుంది. ఆ మూలస్తంభాలే 1. అధ్యాపకులు 2. తల్లిదండ్రులు 3. విద్యాసంస్థల అధినేతలు 4. ప్రభుత్వం. ఈ నాలుగు స్తంభాలలో ఏ స్తంభం బలహీనంగా ఉన్నా ఆ సౌధం కూలిపోతుంది. నైతిక విద్యావ్యాప్తికే అవరోధం ఏర్పడుతుంది.

ఈ పవిత్ర ఆశయసాధనకు "నైతిక మానవతా విలువల అధ్యయన కేంద్రం" Ethics & Human values' learning centre (E.H.V.L. Centre) స్థాపించబడింది. ప్రారంభంలో ప్రధానంగా ఈ క్రింది మూడు అంశాలను గురించి బాలబాలికలకు బోధించాలని సంకల్పించటమైనది.

1. నైతిక విలువల ప్రాముఖ్యతను, నైతికవిద్య ఆవశ్యకతను బోధిస్తూ, బాలబాలికలను సచ్ఛీల సంపన్నులుగా, విద్యా వినయ శోభితులుగా తీర్చిదిద్దటం.
2. మానవతా విలువలను బోధిస్తూ, బాలబాలికలలో మానవత్వాన్ని పెంపొందించటం.
3. కులమతాలకతీతంగా బాలబాలికలకు దేశభక్తి భావాలను బోధిస్తూ, వారిని ఉత్తమ భావిభారత పౌరులుగా తీర్చిదిద్దటం.

పై ఆశయ ఆదర్శములను ఆచరణలో పెట్టడానికి ఒక కార్యాచరణ పథకము కూడా రూపొందించబడింది.

1. ప్రతి జిల్లాలో 'విద్యా సదస్సులు' నిర్వహించడం.
2. అధ్యాపకులకు శిక్షణా తరగతులు ప్రతి జిల్లాలో ఏర్పాటు చేయటం.
3. ప్రతి తరగతిలో వారానికొక నీతితరగతి (Moral Class) నిర్వహించడం.
4. బాలబాలికలకు బోధించడానికి 'నీతి పుస్తకములు' (Moral Education Books) ముద్రించడం.

విద్యా సంస్థలలో 'నైతికవిద్య ఆవశ్యకత' అనే పుస్తకమును ముద్రించి,కొన్ని వేల కాపీలు రాష్ట్రం నలుమూలలా పంపిణీ చేయటం జరిగింది. ఇంకా మరికొన్ని వేల కాపీలు పంపిణీ జరగాలి. సహృదయుల సహకారం ఎంతైనా అవసరం.

నైతికవిద్యను గురించి తరగతి గదులలో బాలబాలికలకు బోధించడానికి మూడు 'సిలబస్' పుస్తకములు కూడా అందిస్తున్నాము. దీని పేరు 'నీతిసుధానిధి' ఇప్పుడు తృతీయ,

చతుర్థ, పంచమభాగములు సమర్పించుకుంటున్నాము. ముఖ్యంగా ఈ మూడు పుస్తకములు హైస్కూల్, కాలేజీ విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని వ్రాయబడినాయి. 6, 7 తరగతుల విద్యార్థులకు అవసరమైన ప్రథమ, ద్వితీయ భాగములు త్వరలో అందించబడతాయి.

ప్రస్తుతం అందిస్తున్న 'నీతి సుధానిధి' మూడు భాగములలో ఒక్కొక్క పుస్తకంలో నాలుగు అంశములున్నాయి. 1. ప్రార్థనా శ్లోకములు - గీతములు 2. నీతి శ్లోకములు - పద్యములు 3. హితోక్తులు 4. మహనీయులు - త్యాగశీలురు

మొదటి అంశములోని 'ప్రార్థనా శ్లోకములు - గీతములు' పిల్లలందరిచేత కంఠస్థం చేయించాలి. మిగతా మూడు అంశములలో ఒక్కొక్క అంశములో పది విషయములు (Topics) చొప్పున ముప్పై విషయములు ఉన్నాయి. 'నీతివిద్య' (Moral Education) బోధించడానికి ప్రతి నెలా మూడు Periods కేటాయించుతే బాగుంటుంది. ఆ విధంగా పదినెలల పాటు మూడు తరగతుల వారికి బోధించవచ్చును. ముప్పై విషయాలు వరుసగా బోధించినా బోధించవచ్చును. లేక ఒక్కొక్క అంశములోని ఒక్కొక్క విషయాన్ని తీసుకొని ప్రతినెలా మూడు అంశములలోని విషయాలను బోధించవచ్చును. నిర్ణయాధికారము విద్యాసంస్థలవారికే వదిలివేయడమైనది. ఆ విధంగా బోధించి, విద్యా సంవత్సరాంతంలో వ్రాత పరీక్షలు పెట్టి ప్రథమ, ద్వితీయ, తృతీయ శ్రేణులలో ఉత్తీర్ణులైనవారికి బహుమతులు ప్రదానం చేస్తే బాగుంటుంది. నైతికవిద్య యెడల విద్యార్థులలో ఆసక్తి పెరుగుతుంది. మానసిక మార్పు వస్తుంది. వినయశీల సంపన్నులవుతారు. సంస్కారవంతులవుతారు.

తల్లిదండ్రులు, అధ్యాపకులు, విద్యాసంస్థల అధినేతలు ముఖ్యంగా ప్రభుత్వం ఈ పవిత్ర ఉద్యమానికి సహాయ సహకారములు అందించి నైతిక విద్యావ్యాప్తికి తోడ్పడుతారని ఆశిస్తున్నాము.

"నైతిక విద్యావ్యాప్తి దేశ ప్రగతికి సోపానం"

**ధన్యవాదములు**

(కొమరగిరి కృష్ణమోహనరావు)
వ్యవస్థాపకులు : E.H.V.L CENTRE
ఎడిటర్ 'శ్రీవాణి'

మచిలీపట్నం,
ది. 20-7-2002



# కృతజ్ఞతలు

**'నీతి సుధానిధి'** పుస్తకములు (Moral Education Books) ముద్రించే ముందు చాలా మంది అనుభవజ్ఞులైన, పెద్దలను సంప్రదించాను. వారి అమూల్యమైన సలహాలు స్వీకరించాను. వారి రచనలు కూడా నాకు సహాయపడినాయి. ముఖ్యంగా గత 17 సంవత్సరాలుగా **శ్రీవాణి మాసపత్రిక** రచనలు నాకు ఎంతగానో తోడ్పడినాయి.

**సర్వశ్రీ** ఆచార్య జి.వి సుబ్రహ్మణ్యం (వైస్‌ఛాన్సలర్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్), జనమద్ది హనుమచ్ఛాస్త్రి (కడప), చర్ల రాధాకృష్ణశర్మ (తమిళనాడు), 'పద్మశ్రీ' తుర్లపాటి కుటుంబరావు (విజయవాడ), మన్నవ గిరిధరరావు (Ex. M.L.C. గుంటూరు), కీ॥శే॥ "కరుణశ్రీ" (గుంటూరు), ఆర్. సీతాలక్ష్మి (చీరాల), ఎన్.వి. ఆర్. సత్యనారాయణమూర్తి (బొబ్బిలి), రెడ్డి రాఘవయ్య (హైదరాబాద్)గార్ల రచనలు మరియు శతకములు, భర్తృహరి సుభాషితములు ఈ మహాప్రయత్నానికి తోడ్పడినాయి.

**మచిలీపట్నం**కు చెందిన డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు, సోమంచి రామం, డా॥ రేపర్ల జనార్ధనరావు, మల్లాది సూరిబాబు, డా॥ కాజ లక్ష్మీనరసింహారావు మరియు కె.వి నాయుడుగార్ల సలహాలు నాకు ప్రోత్సాహాన్ని యిచ్చాయి.

**విక్రమ్ పబ్లిషర్స్** (విజయవాడ) అధినేత శ్రీ జి.యస్. రావుగారు కవరు పేజీని అందంగా తీర్చిదిద్ది అందించారు.

**'నైతిక మానవతా విలువల అధ్యయన కేంద్రం'** (E.H.V.L. Centre) కార్యనిర్వాహక కమిటీవారు ఈ పవిత్ర ఉద్యమానికి అండగా నిలిచి ప్రోత్సహిస్తున్నారు.

**ఇంకా... ఇంకా...** ఎందరో మహానుభావుల సలహాలు మరియు ఎన్నో రచనలు ఈ ప్రయత్నానికి తోడ్పడినాయి.

ఈ మహోత్తర ప్రయత్నానికి తోడ్పడినవారందరికీ నా కృతజ్ఞతాభివందనములు.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు, నాలో కలిగించిన ప్రేరణ, అనుగ్రహించిన ఆశీస్సుల ఫలితమే ఈ **'నీతిసుధానిధి'**. ఆ మహనీయునికి నా శతకోటి ప్రణామములు.

## ధన్యవాదములు

(కొమరగిరి కృష్ణమోహనరావు)
వ్యవస్థాపకులు : E.H.V.L CENTRE
ఎడిటర్ 'శ్రీవాణి'

మచిలీపట్నం,
ది. 20-7-2002.

# విషయసూచిక

## ప్రార్థనా శ్లోకములు - గీతములు



## నీతిశ్లోకములు - పద్యములు

# వందేమాతరం

వందేమాతరం!.... వందేమాతరం !....
సుజలాం సుఫలాం మలయజ శీతలామ్
సస్య శ్యామలాం మాతరం ॥ వందేమాతరం ॥ ....1

శుభ్రజ్యోత్స్నాం పులకిత యామినీం
పుల్ల కుసుమిత ద్రుమదల శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం ॥ వందేమాతరం ॥ ....2

కోటి కోటి కంఠ కలకల నినాద కరాలే
కోటి కోటి భుజైర్ధృత ఖరకరవాలే
అబలా కేనో మాఽఏతో బలే
బహుబల ధారిణీం నమామి తారిణీం
రిపుదల వారిణీం మాతరం ॥ వందేమాతరం ॥ ....3

తుమి విద్యా తుమి ధర్మ
తుమి హృది తుమి మర్మ
త్వం హి ప్రాణాః శరీరే
బాహుతే తుమి మాఽ శక్తి
హృదయే తుమి మాఽ భక్తి
తోమారయి ప్రతిమాగడి మందిరే మందిరే ॥ వందేమాతరం ॥ ....4

త్వం హి దుర్గా దశప్రహరణధారిణీ
కమలా కమలదళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ, నమామిత్వాం, నమామి కమలాం
అమలాం, అతులాం, సుజలాం, సుఫలాం, మాతరం ॥ వందేమాతరం ॥ ...5

శ్యామలాం, సరలాం, సుస్మితాం, భూషితాం
ధరణీం, భరణీం, మాతరం ॥ వందేమాతరం ॥ ...6

- బంకించంద్ర చటర్జీ

# జనగణమన గీతము

జనగణమన అధినాయక జయ హే
భారత భాగ్యవిధాతా
పంజాబు సింధు గుజరాత మరాటా
ద్రావిడ ఉత్కళ వంగా
వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగా
తవ శుభ నామే జాగే
తవ శుభ ఆశిష మాగే
గాహే తవ జయ గాథా
జనగణ మంగళ దాయక జయ హే
భారత భాగ్య విధాతా
జయ హే జయ హే జయ హే
జయ జయ జయ జయ హే ...1

అహరహ తవ ఆహ్వాన ప్రచారిత
శుని తవ ఉదారవాణీ
హిందూ బౌద్ధ సిఖ జైన పారసిక
ముసల్మాన క్రిస్తానీ
పూరబ పశ్చిమ ఆసే
తవ సింహాసన పాసే
ప్రేమహార హయగాథా
జనగణ ఐక్య విధాయక జయ హే
భారత భాగ్య విధాతా ॥జయ హే॥ ...2

పతన అభ్యుదయ బంధుర పంథా
యుగ యుగ ధావిత యాత్రీ
తుమి చిర సారథి తవరథ చక్రే
ముఖరిత పథ దిన రాత్రీ

దారుణ విప్లవ మాఘే
తవ శంఖ ధ్వని బాజే
సంకట దుఃఖ త్రాతా
జనగణ పథ పరి చాయక జయ హే
భారత భాగ్య విధాతా ॥జయ హే॥ ....3

ఘోర తిమిర ఘన నిబిడ నిషేధే
పీడిత మూర్ఛిత దేశే
జాగృత భిలతవ అవిచల మంగళ
నతనయనే అనిమే షే
దుస్వప్నే అతంకే
రక్షాకరివే అంకే
స్నేహమయీ తుమి మాతా
జనగణ దుఃఖ త్రాయక జయ హే
భారత భాగ్య విధాతా ॥జయ హే॥ ....4

రాత్రి ప్రభాతిల ఉదిల రవిచ్ఛవి
పూర్వ ఉదయగిరి భాలే
గాహే విహగమ పుణ్య సమీరణ
నవ జీవన రస ఢాలే
తవ కరణారుణ రాగే
నిద్రిత భారత జాగే
తవ చరణే నత మాథా
జయ జయ జయ హే జయ రాజేశ్వర
భారత భాగ్య విధాతా ॥జయ హే॥ ....5

- 'విశ్వకవి' రవీంద్రనాథ టాగోర్

# మా తెలుగు తల్లి

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి
గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొర్లుతాయి
అమరావతి నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి! మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి! కృష్ణరాయలకీర్తి!
మా చెవులు రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం

**జై తెలుగుతల్లి! జై తెలుగుతల్లి!**

- శంకరంబాడి సుందరాచార్య

# ఏ దేశమేగినా....

ఏ దేశ మేఁగినా, ఎందుఁగాలిడినా
ఏ పీఠ మెక్కినా, యెవ రెదు రయిన
పొఁగడరా, నీ తల్లి భూమి భారతిని
నిలుపరా, నీ జాతి నిండు గౌరవము
లేదురా యిటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరు లింకెందు

ఏ పూర్వపుణ్యమో, ఏ యోగబలమొ,
జనియించినాడ వీస్వర్గలోకమున
ఏ మంచిపూవులన్ బ్రేమించినావొ
నిను మోసె నీ తల్లి కనక గర్భమున
సూర్యుని వెలుతురు సోకునందాక
ఓడల జెండాలు అడునందాక
నరుడు ప్రాణాలతో నడుచునందాక
అందాక గల యీ యనంతభూతలిని
మనభూమి వంటి కమ్మని భూమి లేదు

వెలిగిన దీ దివ్య విశ్వంబు పుత్ర
దీపించె నీ పుణ్య దేశంబు పుత్ర;
అవమానమేలరా, అనుమాన మేల
భరతపుత్రుఁడ నంచు భక్తిలోఁ బలుక

- రాయప్రోలు



## ప్రార్థన

"అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ"

చెడునుండి నన్ను మంచిని చేర్చుము. అజ్ఞానము (చీకటి) నుండి నన్ను జ్ఞానము (వెలుగు)ను చేర్చుము. మృత్యువు నుండి నన్ను మోక్షమును చేర్చుము.

"ఓ దేవదేవా! నన్ను చెడుపనులకు ప్రోద్బలం చేయకుము. మంచిపనులు చేయడానికి శక్తిని ప్రసాదించుము, చీకటిలో పడి కొట్టుమిట్టాడుకుంటున్న నన్ను వెలుగులోనికి తీసుకొని రమ్ము. మృత్యుముఖం లోపడి నరకయాతనలు అనుభవిస్తున్న నాకు మోక్షమును ప్రసాదించుము" అని ప్రతి నిత్యమూ ప్రాతఃకాలమున భగవంతుని ప్రార్థించవలెను.



# విఘ్నేశ్వర ధ్యానము

**"శుక్లాంబరధరం విష్ణుం, శశివర్ణం చతుర్భుజమ్**
**ప్రసన్నవదనం ధ్యాయేత్, సర్వ విఘ్నోపశాన్తయే"**

*తెల్లని వస్త్రములను ధరించినవాడును, అంతటా వ్యాపించిన చంద్రుని కాంతివంటి తెల్లని కాంతి కలవాడును, నిర్మలమైన, స్వచ్ఛమైన ముఖము గలవాడు నగు విఘ్నేశ్వరుని సమస్త విఘ్నములు నశించుట కొఱకు ధ్యానము చేయవలెను.*

**"అగజాననపద్మార్కం, గజాననమహర్నిశమ్**
**అనేకదన్తం భక్తానాం, ఏకదన్తముపాస్మహే"**

*హిమవత్పర్వతము యొక్క పుత్రికయగు పార్వతీదేవి యొక్క పద్మమువంటి ముఖమునకు సూర్యునివలె సంతోషమును కలిగించు వాడును, భక్తులకు అనేక వరములను యిచ్చువాడును, ఒకే దంతము కలవాడునగు ఆ వినాయకుని పగలు, రాత్రియును (ఎల్లప్పడునూ) సేవింతును.*



# సరస్వతీ ధ్యానము

**"సరస్వతి! నమస్తుభ్యం**
**వరదే! కామరూపిణి!**
**విద్యారంభం కరిష్యామి**
**సిద్ధిర్భవతు మే సదా."**

*"ఓ సరస్వతీదేవీ! నీ కొఱకు నమస్కారము, వరములు యిచ్చెడిదానా! చక్కని రూపము గలదానా! విద్యను ప్రారంభించుటను చేయుదును. నాకు ఎల్లప్పడూ ఈ విద్య సిద్ధించుట అగుగాక!".*

**"పద్మపత్రవిశాలాక్షీ పద్మకేసరవర్ణినీ**
**నిత్యం పద్మాలయా దేవీ సా మాం పాతు సరస్వతీ"**

పద్మము యొక్క రేకులవలె విశాలమైన కన్నులు కలదియును, పద్మము యొక్క కేసరములవంటి పసుపుపచ్చని రంగు కలదియును, పద్మమే నివాసముగా కలదియును, దేవతయునగు ఆ సరస్వతి ఎల్లప్పడూ నన్ను రక్షించుగాక!



# దైవ ప్రార్థన

"త్వమేవ మాతాచ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ."

*"ఓ దేవ దేవా! నీవే తల్లివి, నీవే తండ్రివి, నీవే బంధువు, నీవే స్నేహితుడవు, నీవే నా చదువు, నీవే నా ధనము, నీవే నా సర్వము"*

"నీవే తల్లివి తండ్రివి
నీవే నా తోడు నీడ నీవే సఖుఁడౌ
నీవే గురుఁడవు దైవము
నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా!"

*"ఓ కృష్ణా! నిజముగా నాకు తల్లిదండ్రులును, సోదరులును, మిత్రుడును, గురుడును, దైవమును, ప్రభువును, దిక్కును అన్నిటికి నీవే, నా కితరులు ఆధారము లేదు."*



# గురు ప్రార్థన

"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవేనమః"

"గురువు బ్రహ్మదేవుడు, గురువు విష్ణువు, గురువు దేవుడగు ఈశ్వరుడు, గురువు ప్రత్యక్షముగానున్న ఆ పరమాత్మయే. అటువంటి తేజోవంతుడగు గురువు కొఱకు నమస్కారము".

"అజ్ఞానతిమిరాన్ధస్య
జ్ఞానాంజనశలాకయా
చక్షురున్మీలితం యేన
తస్మై శ్రీ గురవేనమః॥"

"అజ్ఞానము అను చీకటి యందు గ్రుడ్డివాని వలె వున్న నా యొక్క కన్ను 'జ్ఞానము' అను కాటుక పుల్లతో ఏ గురువుచే తెరిపింపజేయబడినదో, అటువంటి తేజోవంతుడగు గురువు కొఱకు నమస్కారము".



# సూరయె ఫాతిహా

## (మహమ్మదీయ ప్రార్థనా శ్లోకములు)

**బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం**

అమిత దయగలవాడును, ప్రేమించు వాడును అయిన అల్లా: పేరుతో

**అల్హాందు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్**

సమస్త స్తోత్రములు అల్లా: కొరకే, ఆయన సర్వలోకములను పాలించు ప్రభువు

**అర్రహామా నిర్రహీమ్**

అమిత దయగలవాడును, ప్రేమించువాడును

**మాలికి యౌమి ద్దీన్**

తీర్పు దినమునకు సర్వాధికారి

**ఇయ్యాక నఆబుదు వఇయ్యాక నస్తయీన్**

మేము నిన్నే ఆరాధిస్తాము, సహాయం కొరకు నిన్నే అర్థిస్తాము

**ఇహ్దినస్ సిరాతల్ ముస్తఖీమ్**

మాకు సన్మార్గమును చూపుము

**సిరాతల్ లజీన అన్ అమ్తు అలైహిమ్**

ఎవరిపైనయితే నీవు అనుగ్రహించి బహుమతులు కురిపించినావో

**గైరిల్ మగ్‌జూబి అలైహిమ్, వలజ్జాల్లీన్ - ఆమీన్**

ఎవరిపైనయితే నీ ఆగ్రహం వర్షించలేదో, మరెవరైతే మార్గ భ్రష్టులు కాలేదో వారి మార్గమును చూపుము - ఆమీన్ (తథాస్తు)



# క్రైస్తవ ప్రార్థనలు

Lord, make me a channel of your **PEACE;**
Where there is hatred, let me sow **LOVE;**
Where there is injury, **PARDON;**
where there is doubt, **FAITH;**
whre there is despair, **HOPE;**
where there is darkness, **LIGHT;**
and where there is sadness, **JOY;**
O Master, grant that I may never seek
so much to be consoled as to console;
to be understood as to understand;
to be loved as to love with all my soul.
For it is in giving that we receive,
it is in pardoning that we are pardoned,
and it is in dying that we are born
to eternal life

**- ST. FRANCIS**



What a friend we have in jesus,
All our sins and griefs to bear !
What a privilege to carry
Everything to God in prayer !
O what peace we often forfeit,
O What needless pain we bear,
All because we do not carry
Everything to God in prayer !

Have we trails and temptations?
Is there trouble anywhere?
We should never be discouraged :
Take it to the lord in Prayer.
Can we find a friend so faithful,
Who will all our sorrows share?
Jesus knows our every weakness;
Take it to the Lord in prayer.

Are we weak and heavy - laden,
Cumbered with a load of care?
Jesus only is our refuge:
Take it to the Lord in Prayer.
Do thy friends despise, forsake thee ?
Take it to the Lord in prayer;
In His arms He'll take and shield thee;
Thou wilt find a solace there.

**- JOSEPH SCRIVEN, 1820-'86**

# ప్రతిజ్ఞ

భారతదేశము నా మాతృభూమి, భారతీయులందరు నా సహోదరులు.

నేను నా దేశమును ప్రేమించుచున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణము. దీనికి అర్హుడనగుటకై సర్వదా నేను కృషి చేయుదును.

నా తల్లిదండ్రులను, ఉపాధ్యాయులను, పెద్దలందరిని గౌరవింతును. ప్రతివారితోను మర్యాదగా నడచుకొందును.

నా దేశముపట్లను, నా ప్రజలపట్లను సేవానిరతి కలిగి యుందునని ప్రతిజ్ఞ చేయుచున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందమునకు మూలము.

**భారతమాతాకీ జై!**

# విద్య - వినయం

**"విద్యా దదాతి వినయం, వినయాత్ యాతి పాత్రతామ్**
**పాత్రత్వాత్ ధనమాప్నోతి, ధనాద్ధర్మం తతః సుఖమ్."**

*"విద్య వినయమును యిచ్చుచున్నది. అట్టి వినయము వలన యోగ్యతను లేక అర్హతను పొందుచున్నాడు. అట్టి యోగ్యత వలన ధనము (ఐహికసంపద)ను పొందుచున్నాడు. అట్టి సంపదవలన ధర్మమును, అట్టి ధర్మమువలన సుఖమును, ఆనందమును పొందుచున్నాడు".*

'విద్యా వినయ సంపన్నః" అని మన పెద్దలు ఏనాడో చెప్పారు. విద్యా వినయములు రెండూ కలిగి ఉన్నవాడే రాణిస్తాడు, అభివృద్ధిలోనికి వస్తాడు. పూర్వకాలమున 'విద్య'ను నేర్చుకోవడానికి వెళ్ళేవాడికి "వినేయుడు" అని పేరు ఉండేది. అనగా వినయమును అభ్యసించేవాడని అర్థం. కనుక ప్రతి విద్యార్థి, విద్యతో పాటు విధిగా వినయమును కూడా అలవరచు కోవాలి.

"వినయము" (Humility) అంటే ఏమిటి? అణకువ, నమ్రత అని చెప్పుకోవచ్చును. ఈ వినయం ఉంటే అర్హత, యోగ్యత (Eligibility) లభిస్తుంది. దాని వలన ఐహిక సంపద (ధనము)ను పొందవచ్చును. అట్టి సంపదను దుర్వినియోగపరచక దానధర్మాలు చేయాలి. అనగా దాతృత్వబుద్ధిని అభివృదిపరచుకోవాలి దానినే Charity అంటారు. ఈ దాతృత్వబుద్ధి వలన మన Credibility పెరుగుతోంది. అనగా నమ్మదగిన మనిషి అని పేరుప్రతిష్ఠలు వస్తాయి. సమాజంలో గౌరవమర్యాదలు లభిస్తాయి. దానివలన మనం సుఖమును, ఆనందమును పొందుతాము. కనుక "Humility, Eligibility, Charity, Credibility" - ఈ నాలుగు సద్గుణములను ప్రతి ఒక్కరూ, ముఖ్యముగా ప్రతి విద్యార్థి పెంపొందించుకోవాలి, ఆచరణలో పెట్టాలి. అప్పుడే విద్యార్థి రాణిస్తాడు.

**"విద్య యొసగును వినయంబు వినయమునను**
**బడయు బాత్రత, పాత్రత వలన ధనము**
**ధనము వలనను ధర్మంబు దాని వలన**
**ఐహికాముష్మిక సుఖంబులందు నరుడు".**

# విద్యయే అలంకారము

**"సుందరోఽపి సుశీలోఽపి, కులీనోఽపి మహాధనః**
**శోభతే న వినా విద్యాం, విద్యా సర్వస్య భూషణమ్"**

*"అందమైనవాడైననూ, మంచి శీలవంతుడైననూ, మంచి వంశమున జన్మించినవాడైననూ, మహా ధనవంతుడైననూ విద్య లేకుండా ప్రకాశించడు. ఎందువలననగా విద్య అందరికీ అలంకారము".*

'విద్యా విహీనః పశుః' అని చెప్పాడు భర్తృహరి. విద్యలేనివాడు వింత పశువు. విద్యలేని వాడు పశువుతో సమానం. 'పశ్యతీతి పశుః' బహిర్ దృష్టి కలది పశువు. అంతర్ దృష్టి కలవాడు మానవుడు. ఎక్కడ పచ్చగా కనిపిస్తే, అక్కడకు వెళ్ళి దానిని తినేస్తుంది పశువు. అది గడ్డా! లేక పైరా! అనే విచక్షణా జ్ఞానం దానికి ఉండదు. విద్యనభ్యసించిన మానవునికి కొద్దో! గొప్పో! విచక్షణా జ్ఞానం ఉంటుంది. అది లేనివాడు కూడా పశువుతో సమానమే. 'విద్య' అంటే కేవలం చదవటం, వ్రాయటం మాత్రమే కాదు. విచక్షణా జ్ఞానమును సంపాదించేదే సరైన విద్య. అట్టి విద్యను విద్యార్థి నేర్వాలి.

'విద్యా సర్వస్య భూషణం'. విద్యయే అందరికీ అలంకారము. భౌతికమైన అందం, వయస్సు, వంశములు కావు. ఈ భౌతిక అలంకారములు శాశ్వతం కావు. అవి కాలక్రమమున క్షీణించి, తరిగి, నశించి కాలగర్భంలో కలిసిపోతాయి. సరైన విద్య ఒక్కటే మానవునికి అలంకారము. అది ఒక్కటే సరైన భూషణం. అదే శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలను తెచ్చి పెడుతుంది. దానికి నశింపు ఉండదు. ఒకవేళ పైపై అలంకారములను దొంగలు దొంగిలించుకొనిపోవచ్చు. కానీ శ్రమపడి శ్రద్ధతో, దీక్షతో, పట్టుదలతో అభ్యసించిన విద్యను మాత్రం ఎవరు, ఎప్పుడూ కాజేయలేరు. కనుక శాశ్వతమైన కీర్తిప్రతిష్ఠలను సముపార్జించి పెట్టేటటువంటి మంచి విద్యను శ్రద్ధగా అభ్యసించి వినయ, విధేయతలతోపాటు విచక్షణా జ్ఞానమును కూడా ప్రతి విద్యార్థి పెంపొందించుకోవాలి.

**"భూషలు గావు మర్త్యులకు భూరిమయాంగదతారహారముల్**
**భూషిత కేశపాశమృదు పుష్పసుగంధజలాభిషేకముల్**
**భూషలు గావు పూరుషుని భూషితుఁ జేయుఁ బవిత్ర వాణి వా**
**గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించు నన్నియున్"**

**- భర్తృహరి**

# విద్య లేనివారు శోభించరు

**"రూప యౌవన సంపన్నా విశుద్ధ కులసంభవాః**
**విద్యా హీనా నశోభన్తే నిర్గంధా ఇవ కింశుకాః"**

*'విద్యలేనివారు మంచిరూపము, యౌవనము కలిగియున్నప్పటికినీ, గొప్ప వంశమునందు జన్మించినప్పటికినీ, వాసన లేని మోదుగు పూవువలె శోభించరు'.*

మోదుగు పూవు చూడటానికి చక్కగా, అందంగా వుంటుంది. కాని సువాసన ఏ మాత్రం ఉండదు. అట్టి వాసన లేని పూవును ఏ స్త్రీ పెట్టుకోవడానికి ఇష్టపడదు. అదేవిధంగా మేడిపండు పైకి చూడటానికి నిగనిగలాడుతుంటుంది. పొట్ట విప్పిచూస్తే పురుగులుంటాయి. అటువంటి పండును ఎవరూ తినరు గదా! అదే విధముగా పొట్టకోస్తే అక్షరంలేని మూర్ఖుని కూడా ఎవరూ ప్రేమించరు, గౌరవించరు.

ఆకర్షణీయమైన అందం, మంచిరూపం, మిసమిసలాడే వయస్సు, మంచి పేరు ప్రతిష్ఠలుగల గొప్ప వంశమున జన్మించిన ఆగర్భ శ్రీమంతుడైనప్పటికీ అసలు వుండవలసిన, విద్యే గనుక లేకపోతే అతని బ్రతుకు అడవిగాచిన వెన్నెలే అవుతుంది. అతను సమాజంలో ఏ మాత్రం గౌరవించబడడు. మేడిపండును కోసి చూచి, తినకుండా ఏ విధంగా పారవేస్తారో, అదే విధంగా విద్యలేని ఈ మన్మధుణ్ణి ముందు ప్రేమించినా, తరువాతనైనా దూరంగా వుంచుతారు. సువాసన లేని మోదుగు పూవును ఏ విధంగా అవతల పారవేస్తారో, అదే విధంగా దొక్కశుద్ధి లేనివానిని దరికి చేరనీయరు.

మానవునికి కావల్సింది పైపై మెరుగులు కావు. సౌందర్యం కన్నా సంస్కారం మిన్న.

**"మేడిపండు చూడ మేలిమై ఉండును**
**పొట్ట విప్పిచూడ పురుగులుండు**
**పిరికివాని మదిని బింకమీలాగురా**
**విశ్వదాభిరామ వినురవేమా!"**

# కొబ్బరిచెట్టు

**"ప్రథమవయసి పీతం తోయమల్పం స్మరన్తః**
**శిరసి నిహితభారా నారికేళా నర్ధాణాం**
**సలిల మమృతకల్పం దద్యురాజీవితాన్తం**
**న హి కృతముపకారం సాధవో విస్మరన్తి".**

*"చిన్నప్పుడు తనకు మనుజుడు పోసిన క్రొద్దినీటిని త్రాగి, ఆ మేలును మఱవనిదై కొబ్బరిచెట్టు తన నెత్తిన యెంతో బరువుగల కాయలను మోయుచు జీవిత పర్యంతమును మనుజునకు తీయని నీటిని యిచ్చుచున్నది. ఔరా! మహాత్ములు యెంతటి చిన్న ఉపకారమును గూడ మఱవక ప్రత్యుపకారపరులై యుందురు గదా!".*

ఈ శ్లోకమునందు కొబ్బరిచెట్టును, సత్పురుషులతో, మహాత్ములతో పోల్చ బడింది. పొందిన మేలును మరువనివారు సత్పురుషులు. అందుకొనిన ఉపకారమును మరువక ప్రత్యుపకారము చేయువారు మహాత్ములు. చేసిన మేలును మరువనివారు కృతజ్ఞులు. చేసిన మేలును మరచేవారు కృతఘ్నులు.

మానవులు కొబ్బరిచెట్టును ఆదర్శముగా తీసుకోవాలి. అది చిన్ననాట మానవుడు పోసిన కొద్దినీటితో పెరిగి, పెద్దదైన తరువాత, ఆ మేలును మరవక, తిరిగి అమృత సమానమైన నీటిని మరియు నారికేళ ఫలములను మానవులకు అందిస్తున్నది. అయితే ఈనాటి మానవులలో మాత్రం అట్టి కృతజ్ఞత మాత్రం కనిపించటంలేదు. అట్టి కృతజ్ఞత చెట్లలో మాత్రం కనిపిస్తున్నది. తీవ్రమైన ఎండనంతనూ తామే భరిస్తూ, తమను ఆశ్రయించినవారికి చల్లటి నీడను యిచ్చి సుఖపెడుతున్నాయి చెట్లు. అందువలననే "దానమివ్వని చేయి కన్నా ఫలము నిచ్చే చెట్టు మిన్న" అన్నారు. మహాత్ములు కూడా తమ సుఖములను గురించి ఏమాత్రం ఆలోచించక, నిత్యమూ ఇతరుల కొఱకే కష్టపడుతుంటారు.

**"ధీరులకు జేయు మేలది**
**సారంబగు నారికేళ సలిలము భంగిన్**
**గౌరవమును మతి మీదట**
**భూరి సుభావహము నగును భువిలో సుమతీ".**

# ఉపకారం - అపకారం

**"ఉపకారిషు యః సాధుః**
**సాధుత్వే తస్య కోగుణః**
**అపకారిషు యః సాధుః**
**స సాధుః సద్భి రుచ్యతే".**

*తనకు ఉవకారం చేసినవారివట్ల మంచిగా ఉండటం గొప్ప విషయమేమీకాదు. అపకారం చేసినవారియెడల స్నేహంగా వ్యవహరించడమే గొప్ప. అంటే అపకారం చేసినవారికి ఉవకారం చేయడమే గొప్ప విషయం.*

పరోపకారబుద్ధి చాలా గొప్పది. అయితే ఈనాడు లోకంలో చాలామంది, ఉపకారం చేసినవారికే అపకారం తలపెడుతున్నారు. ఇంకా కొంతమంది బుద్ధిమంతులు మాత్రం తమకు ఉపకారం చేసినవారికి తిరిగి ఏదో రూపంలో ఉపకారం చేస్తున్నారు. ఈ శ్లోకంలో ఇంకా అత్యున్నతమైన భావం ప్రతిపాదించబడింది. అపకారం చేసినవారికి కూడా ఉపకారం చేయాలని ఈ శ్లోక రచయిత ప్రతిపాదించాడు. ఇది అత్యున్నతమైన, ఆదర్శవంతమైన సిద్ధాంతం.

మేలు చేసినవానికి కీడు తలబెట్టటం అధముని లక్షణం. మేలు చేసినవానికి తిరిగి మేలు చేయడం బుద్ధిమంతుడి లక్షణం. కీడు చేసిన వానికి మేలు చేయటం ఉత్తముని లక్షణం. ఇది అత్యంత ఉత్తమ సిద్ధాంతం.

ఇదే ఆదర్శమును 'సుమతి' ఏనాడో ప్రతిపాదించాడు. దీనిని ఆచరణలో పెడితే ఎట్టి వైరుధ్యాలకు, వైషమ్యాలకు తావే ఉండదు.

**"ఉపకారికి నుపకారము**
**విపరీతము కాదు సేయ, వివరింపంగా**
**నపకారికి నుపకారము**
**నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ!".**



# దుర్జనుడు

"వృశ్చి కశ్చ విషం పుచ్ఛం
మక్షికస్య విషం శిరః
తక్షకస్య విషం దంష్ట్రా
సర్వాంజ్గం దుర్జనే విషమ్".

*తేలుకు ఒక్క తోక (కొండి)లోనే విషం ఉంటుంది. ఈగకు తలలోమాత్రమే విషం ఉంటుంది. పాముకు కోరల్లోనే విషం ఉంటుంది. కాని దుర్జనుడికి వళ్ళంతా విషమే.*

తేలుకు విషం ఒక్క కొండి (తోక)లోనే ఉన్నప్పటికీ, అది కుడితే, ఆ మంటకు తట్టుకోలేక ఏడుస్తారు. పాముకు విషం ఒక్క కోరలలోనే ఉంటుంది కాని, అది కాటువేస్తే ప్రాణంకూడా పోతుంది. అదేవిధంగా ఈగకు తలలో మాత్రమే విషం ఉంటుంది. కాని అది కుడితే అంటువ్యాధులు వ్యాపిస్తాయి. ఈ మూడింటిలో విషం ఒకే ఒక చోటనే ఉన్నప్పటికీ, వాటి వలన ప్రజలకు ఎంతో హాని జరుగుతున్నది. కాని వళ్ళంతా విషం ఉన్న దుర్జనుని వలన, ప్రజలకు ఇంకా ఎంత హాని చేకూరుతుందో!

'కామం' అనే ఒకే ఒక దుర్గుణం ప్రవేశించడంవలన తనతోపాటు తన వంశాన్నే నాశనం గావించుకున్నాడు, అంతటి శక్తివంతుడైన రావణాసురుడు. పంచభూతములను వశం చేసుకొనిన హిరణ్యకశిపుడు 'క్రోధం' అనే ఒకే ఒక దుర్గుణంతో సర్వనాశనం అయినాడు. 'లోభం' అనే ఒకే ఒక దుర్గుణంతో తన కుటుంబాన్నే సర్వనాశనం చేసుకొనినాడు 'దుర్యోధనుడు'. కాని ఈనాడు కలియుగంలో ఈ మూడు దుర్గుణాలు ఒకే ఒక మనిషిలో కూడుకొని ఉన్నాయి. అట్టి దుర్జనుడు ఒక్కడుంటేచాలు. పరిసరాల వాతావరణం అంతా కలుషితమవుతుంది. అందువలననే మన పెద్దలు 'దుర్జనం దూరతస్త్యజేత్' అన్నారు. అట్టి దుర్జనులకు ఎంత దూరంగా వుంటే అంత మంచిది. ముఖ్యంగా విద్యార్థులు చెడ్డవారితో సహవాసం చేయరాదు.

**"తలనుండు విషము ఫణికిని
వెలయుంగాఁ దోకనుండు వృశ్చికమునకుం
దల దోక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ!"**

# మిత్రుడి లక్షణాలు

**"పాపాన్నివారయతి యోజయతే హితాయ**
**గుహ్యం నిగూహతి గుణాన్ ప్రకటీ కరోతి**
**ఆపద్గతం చ న జహాతి దదాతి కాలే**
**సన్మిత్ర లక్షణమిదం ప్రవదన్తి సన్తః".**

*పాపపు పనులనుండి మఱల్చుట, మంచిపనులు చేయుటకు పురిగొల్పుట, రహస్యమును దాచుట, మంచిగుణములను వెల్లడిచేయుట, ఆపద కలిగినప్పుడు కూడా విడచిపోకుండుట, లేనప్పుడు అవసరమైనదానినిచ్చుట - మొదలైనవి మిత్రుడి లక్షణములు.*

"మాతా మిత్రం పితా చేతి స్వభావాత్రి తయం హితం" తల్లిదండ్రుల తరువాత, సహజంగా ప్రేమించుచూ మేలుకోరేవాడు మిత్రుడే. అటువంటి ప్రాణస్నేహితుడు అందరికీ లభ్యం కావటం చాలా కష్టం. అభివృద్ధిలో ఉన్నప్పుడు, సకల సంపదలతో విలసిల్లుతున్నప్పుడు, భోగభాగ్యములతో తులతూగుతున్నప్పుడు చాలా మంది చుట్టూ చేరుతారు.

ఎప్పుడు చెరువులో నీరు సమృద్ధిగా వస్తుందో, అప్పుడు కప్పలు అనేకం చేరుతాయి. అదేవిధముగా సిరిసంపదలు ఎప్పుడు వస్తాయో అప్పుడు బంధువులమని, మిత్రులమని చెప్పి చుట్టూ చేరుతారు. చెరువులో నీరు ఎండిపోతే, ఒక్క కప్ప కూడా కనిపించదు. అదేవిధముగ సంపదలు కరిగిపోయినప్పుడు ఎవరూ కనిపించరు.

అసలైన మిత్రులే అండగా నిలిచి, ఆదుకుంటారు.

**"అఘమువలన మఱల్చు హితార్థకలితుఁ**
**జేయు గోప్యంబు దాచుఁ బోషించు గుణము**
**విడువఁ డాపన్ను లేవడి వేళనిచ్చు**
**మిత్రుడీ లక్షణంబుల మెలుగుచుండు".**

**- ఏనుగు లక్ష్మణ కవి**

# తేనెటీగవలె...

**"పుస్తకేషు చ యా విద్యా**
**పరహస్తే చ యద్ధనం**
**సమయేతు పరిప్రాప్తే**
**న సా విద్యా న తద్ధనమ్".**

*"పుస్తకములోని విద్య, ఇతరులదగ్గర దాచి పెట్టిన ధనం సమయానికి అక్కరకు రావు. వీటివల్ల ప్రయోజనం ఉండదు. కనుక విద్య కంఠస్థమై ఉండాలి. ధనం ఎప్పుడూ తన దగ్గరే ఉండాలి".*

"పుస్తకముల నిండ మస్తుగా చదువుండ, మస్తకముల నిండ మట్టియుండె! "అని అని చమత్కరించారు శ్రీ సత్యసాయిబాబావారు. కేవలం పుస్తకజన్యజ్ఞానం వలననే ప్రయోజనంలేదు. అనుభవజ్ఞానమును సంపాదించాలి. వివేకజ్ఞానమును అభివృద్ధి పరచుకోవాలి. విచక్షణా జ్ఞానమును పెంపొందించుకోవాలి.

అనుభవజ్ఞులు వ్రాసిన పుస్తకాలను ఏకాగ్రతతో చదవాలి. చదివిన విషయాలను చక్కగా అర్థం చేసుకోవాలి. అర్థంచేసుకొనిన విషయాలను కంఠస్తం చేయాలి. అప్పుడు పుస్తకంలోని విద్య మస్తకంలో శాశ్వతంగా నిలిచిపోతుంది. ఒకవేళ ఆ పుస్తకం చినిగిపోయినా, ఎవరైనా సంగ్రహించినా ఫరవాలేదు. అయితే ఈనాటి విద్యార్థులు పాఠ్య పుస్తకాలను సమగ్రంగా చదివి, అవగాహన చేసుకోవటంలేదు. కేవలం 'గైడ్స్' మీదనే ఆధారపడుతున్నారు.

తాను సంపాదించిన ధనం తాను అనుభవించక, దానం చేయక దాచుకుంటే, తేనెటీగ చందమే అవుతుంది. కనుక తాను సంపాదించిన ధనంలో కొంత దానం చేయాలి. మరికొంత తన అవసరాలకు ఉంచుకోవాలి. అదే విధముగ విద్యా ధనమును పుస్తకములో కాక, మస్తకంలో భద్రం చేసుకోవాలి. అది ఎప్పుడు కావల్సిన అప్పుడు ఉపయోగపడుతుంది. సమయానికి ఉపయోగపడని విద్య, ధనం ఎంతవుండి ఏమి ప్రయోజనం?

**"ధనము కూడబెట్టి దానంబు చేయక**
**తానుతినక లెస్సదాచుకొనగ**
**తేనెటీగ గూర్చి తెరుపరి కీయదా**
**విశ్వదాభిరామ వినురవేమ!"**

# మహనీయులు

**"యథా చిత్తం తథా వాక్య తథా క్రియా**
**చిత్తే వాచి క్రియాయాం చ సాధూనా మేక రూపతా"**

*'తాను తలచిన విధముగ చెప్పట, చెప్పిన విధముగ ఆచరించుట - ఈ ప్రకారముగ మనస్సునందు, వాక్కునందు, క్రియయందు ఒకే రూపము కలిగియుండుట మహనీయుల లక్షణము.*

మహాత్ములు ఒక విషయమును సంకల్పించుకొని, దానిని మాటల ద్వారా చెప్పి, చెప్పిన దానిని చేసి చూపించుతారు. 'తలచింది చెప్పటం, చెప్పింది చేయటం' అనేది చాలా కష్టమైన విషయం. అది యెంతటి మహాత్ములకో గాని సాధ్యపడదు. అయితే ఈనాడు చాలామంది తద్విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు. తలచింది చెప్పరు, చెప్పింది చేయరు. పైకి మంచిగా తీయని కబుర్లు చెబుతుంటారు. ఆప్యాయతను ప్రదర్శిస్తుంటారు. మనసులో ఒకటి, మాటలలో మరొకటి, చేతలలో ఇంకొకటి. ఈనాడు చాలామంది ఇట్టి 'త్రిపాత్రాభినయం' చేస్తూ కాలం గడుపుతున్నారు. ఇటువంటివారు సమాజం పాలిటి 'చీడపురుగులు'.

"మనసు, మాట, నడత మనిషికి ఒకటైన, మనిషి కాదు వాడు మహితుడౌను". మనసులోని ఆలోచన, మాట్లాడే మాట, నడిచే నడత - ఈ మూడూ ఒకటిగా వున్నవాడే మహాత్ముడు. మన మాటలకు, మన చేతలకు మూలం మన ఆలోచనలే గదా! కాబట్టి మన ఆలోచనలు సదాలోచనలు కావాలి. మనసులోని యోచన, మాటలోని సూచన, క్రియలోని ఆచరణ - ఈ మూడు ఏకం కావాలి. దీనినే 'త్రికరణశుద్ధి' అంటారు. అయితే ఈనాడు మానవులలో అట్టి 'త్రికరణశుద్ధి' కనిపించటంలేదు. 'త్రిపాత్రాభినయం' మాత్రం కనిపిస్తున్నది.

ఈనాడు మనసులో ఒకటి పెట్టుకొని, మాట మరొకటి మాట్లాడుతున్నారు. చేసే పని మరొక విధంగా ఉంటున్నది. ఈ విధంగా నటన చేసేవారికి 'ముక్తి' ఎలా లభిస్తుంది?

**"మాటలాడుటొకటి మనసులో నొక్కటి**
**ఒడలి గుణము వేరె యోజ వేరె**
**ఎట్లు గల్గు ముక్తి యీలాగు తానుండ**
**విశ్వదాభిరామ వినురవేమ".**

# కార్యశూరులు

**"అనారంభో హి కార్యాణాం**
**ప్రథమం బుద్ధి లక్షణం**
**ప్రారబ్ధ స్యాంతగమనం**
**ద్వితీయం బుద్ధి లక్షణమ్".**

*అసాధ్యమైన పని ఏదైనా అసలు మొదలుపెట్టకుండా ఉండటమే మంచిది. ఒక వేళ అలాంటి పని ప్రారంభిస్తే, అది పూర్తిగా నెరవేరేదాకా గట్టిగా ప్రయత్నం చేయటం ఇంకా మంచిది.*

ఏదైనా మంచి పని ప్రారంభించేముందే, దాని మంచిచెడ్డలను చక్కగా విచారణ (Enquiry) చేయాలి. తరువాత పరిశీలన (Investigation) చేయాలి. చక్కగా ఆలోచించి మొదలుపెట్టడం విజ్ఞుల లక్షణం. ఎవరు, ఏది చెబితే తొందరపడి ఆ పనిని ప్రారంభించడం ఏ మాత్రం విజ్ఞత అనిపించుకోదు. ఒకవేళ ఏ కార్యమునైనా ప్రారంభించిన, దాని లక్ష్యం చేరుకునేంతవరకూ విశ్రమించరాదు. అది ఎంతటి కష్టమైన పని అయినప్పటికినీ, తమ శక్తి సామర్థ్యములచేత, పట్టుదలతో ఆ పనిని సాధించగలుగుతారు కార్యశూరులు.

అయితే ఇంకా కొంతమంది మాత్రం పనిని ప్రారంభించిన నాటి నుంచి, అది జరుగు తుందా? లేదా? అనే సంశయంతోనే ప్రారంభిస్తారు. 'సంశయాత్మా వినశ్యతి' అన్నది భగవద్గీత. ఆ విధంగా సంశయాలతో ప్రారంభించబడిన కార్యం మధ్యలోనే ఆగిపోతుంది. అందు వలన సంశయములతో కార్యం ప్రారంభించడం కంటే, అసలు ప్రారంభించకపోవటమే మంచిది.

కనుక తలపెట్టిన ఏకార్యమునైనా సాధించేంతవరకు విశ్రమించరాదు. అయితే కొందరు అధములు విఘ్నములు కలుగుననే భయంచేత అసలు కార్యమునే ప్రారంభించరు. మధ్యములు కార్యమును ప్రారంభించి, విఘ్నములు కలిగినప్పుడు దానిని మధ్యలోనే విడిచిపెడతారు. ధైర్య, శీల, గుణ సంపన్నులు మాత్రం, ప్రారంభించిన కార్యమును, ఎన్ని విఘ్నములు సంభవించినప్పటికినీ, ఏ మాత్రం వెనుకంజ వేయక ఆ కార్యమును సాధించి తీరుతారు.

**"ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై**
**యారంభించి పరిత్యజింతురురువిఘ్నాయత్తులై మధ్యముల్**
**ధీరుల్ విఘ్న నిహన్య మానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై**
**ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ! ప్రజ్ఞానిధుల్ గావునన్"**

**- ఏనుగు లక్ష్మణ కవి**

# మాతృభక్తి

'**మాతృ దేవోభవ!**' అని మన శాస్త్రాలు చెబుతున్నాయి. తల్లికి మించిన దైవము లేదని మన పెద్దలు చెబుతున్నారు. మనిషిని సృష్టించేది దేవుడే అయినా, నవమాసాలు, మోసి కనిపెంచేది '**అమ్మ**' మాత్రమే. అందువలననే తల్లిని '**మాతృదేవత**' అన్నారు.

ధర్మము మూర్తీభవించిన శ్రీరాముని తీర్చిదిద్దింది తల్లి కౌసల్యే. లవకుశులు వీరులుగా, శూరులుగా, పరాక్రమశాలులుగా తయారైనది తల్లి సీతమ్మ శిక్షణలోనే. కాలినడకన ఆసేతు హిమచలం పర్యటించి, అద్వైత సిద్ధాంతాన్ని బోధించి, దేశ సమైక్యతను సమగ్రతను కాపాడిన ఆదిశంకరుల వారు కూడా తల్లి 'ఆర్యాంబ' వడిలోనే పెరిగి పెద్దవాడైనాడు. భారత జాతికి గర్వకారణమైన వీరుడుగా శూరుడుగా, పేరు ప్రఖ్యాతల నందుకొనిన వీరశివాజీ తన తల్లి జిజియాబాయి చేతులలోనే పెరిగి పెద్దవాడైనాడు. ఒక సామాన్య బాలునిలో నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక, దేశభక్తి భావాలను నాటి, పెంచి, పోషించి గాంధీని మహాత్మునిగా రూపొందించగలిగింది ఆయన మాతృమూర్తి పుతలీబాయి. తనయుని ఒక మహాసంఘ సంస్కర్తగా తీర్చి దిద్దిన ఘనత ఒక తల్లికి దక్కింది. ఆ తల్లి తనయుడే ఈశ్వరచంద్ర విద్యాసాగర్. తల్లి భువనేశ్వరీ దేవి పెంపకంలో పెరిగి పెద్దవాడై దేశ విదేశాలలో ఖ్యాతిని సంపాదించగలిగాడు స్వామి వివేకానంద.

ప్రపంచ చరిత్రను సునిశితంగా పరిశీలిస్తే ఒక వాస్తవం తేటతెల్లమవుతున్నది. జాతి గర్వించదగిన వీరులను, శూరులను, మహనీయులను, మహాపురుషులను, ప్రవక్త లను, సంఘసంస్కర్తలను జ్ఞానులను, యోగులను రూపుదిద్దగల్గిన శిల్పులు మాతృ మూర్తులేనని స్పష్టమవుతున్నది.

**మాతృభక్తి :**

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో బర్మా దేశంలోని రంగూన్ పట్టణం సర్వనాశన మవుతుంది. అనేక కుటుంబాలు చెల్లా చెదరైపోతాయి. భర్తకు దూరమైన ఒక ఇల్లాలు తన ఇద్దరు బిడ్డలతో భారత దేశం వచ్చి బరంపురం చేరుకుంటుంది. పెద్ద కుమారుని వయసు ఐదు సంవత్సరాలు. చిన్నవాడి వయసు మూడు సంవత్సరాలు.

వారు భిక్షాటనకు బయలుదేరుతారు. రోజంతా భిక్షమెత్తినా వారికి కడుపు నిండదు. తిండిలేక ఆ ఇల్లాలు కొన్ని రోజులలోనే నీరసించి పోతుంది. భిక్షమెత్తే ఓపిక లేక చెట్టు క్రిందనే పడుకుంటుంది. ఆ పరిస్థితి చూసిన పెద్ద కుమారుడు ఒక్కడే భిక్షాటనకు బయలుదేరుతాడు. సంపాదించిన అన్నము తీసుకొనివచ్చి తల్లికి, తమ్ముడికి పెట్టి తాను పస్తు పడుకొనేవాడు. కొన్ని దినాలకు ఆ పిల్లవాడిలో కూడా ఓపిక నశిస్తుంది. ఒక రోజున ఒక శ్రీమంతుని ఇంటి ముందుకు వెళ్ళి *అమ్మా! ఆకలి!'* అని క్రింద పడిపోతాడు. వరండాలో కుర్చీలో కూర్చొని పత్రిక చదువుతున్న ఆ ఇంటి యజమాని వచ్చి, ఆ పడిపోయిన అబ్బాయి తలను తన ఒడిలో పెట్టుకొని నీళ్ళు చల్లుతాడు.

*"బాబూ! నీకు కడుపునిండా అన్నం పెడుతానులే!"* అని బ్రతిమాలాడు ఆ శ్రీమంతుడు. తెలివి వస్తుంది గాని, అతి బలహీనంగా వుండటం వలన ఆ పిల్లవాడు చెప్పే మాటలు మాత్రం స్పష్టంగా వినిపించవు. నోటి దగ్గర తన చెవిని పెట్టి వినడానికి ప్రయత్నించుతాడు. **'అమ్మకు మొదట అన్నం'** అని చెప్పి ఆ బాలుడు ప్రాణాలను వదిలాడు ఆ అబ్బాయి. ఆఖరి క్షణంలో కూడా తల్లిని గురించే ఆలోచించాడు. అతని మాతృభక్తి అంతటిది. కనుక ***ఎట్టి స్వార్థం లేకుండా, నవమాసాలు మోసి, కని ప్రేమతో పెంచిన తల్లిని సంతోషపెట్టటం, ఆమెను సేవించడం పిల్లల ప్రధాన కర్తవ్యం.*** దీనిని విస్మరించకండి!

**మాతృప్రేమ :**

అది విధ్వంస రాజకీయాలకు నిలయం బీహార్ ప్రాంతం. ఒకసారి జరిగిన ఎన్నికలలో ఇద్దరు అన్నదమ్ములు ప్రత్యర్థులుగా నిలబడుతారు. ఎన్నికల వాతావరణం వేడెక్కింది. తుపాకులతో కాల్చుకొనే స్థాయికి చేరింది. ఆ ప్రత్యర్థుల తల్లి మనసు విలవిలలాడింది. ఆ ఇద్దరిలో ఎవరు మరణించినా, ఆ తల్లికి కుమారుడే గదా! చిన్నవాడి దగ్గరకు వెళ్ళి కాళ్ళు పట్టుకుంది. పంతాలకు పోవద్దని ప్రాధేయపడింది. చిన్నవాడు కొంచం మెత్తపడ్డాడు. ఆ తల్లితో కారు ఎక్కి బయలుదేరాడు. ఈ వార్త క్షణంలో అన్నకు చేరింది. తుపాకి చేబూని తమ్ముని కాల్చడానికి సిద్ధమై నుంచున్నాడు అన్న. ఇంతలో ఆ కారు అన్నయ్య గుమ్మం ముందు ఆగింది. ముందుగా తమ్ముడు దిగాడు. తల్లిని చేయి పుచ్చుకొని దింపాడు. చిన్నవాడి నడుంచుట్టూ చెయ్యి వేసి నెమ్మదిగా నడుస్తున్నది ఆ ముసలి తల్లి. అన్న తన తమ్ముడి గుండెకు గురిపెట్టిన తుపాకి గొట్టానికి మధ్య తల్లికనిపించింది. చిన్ననాట గోరుముద్దలు తినిపించిన తల్లి చేతులు

వణుకుతున్నాయి. గతం గుర్తుకు వచ్చింది. చేతిలో వున్న తుపాకి జారి క్రిందబడింది. ఎదురుగా వచ్చి తల్లి నిలబడింది. తమ్ముడు తలవంచుకొని తల్లి ప్రక్కనే నిలబడి ఉన్నాడు. వణికే ఆమె చేతులు మెల్లగా పైకి లేచాయి. చేతులు జోడించి దీనంగా ***"నాయనా! నీ తల్లి పుత్రభిక్ష పెట్టమని అడుగుతున్నది"*** అని వణుకుతున్న గొంతుతో, కంటి ధారలు కారుస్తూ ప్రాధేయపడుతుంది. ***'అమ్మా!'*** అంటూ పెద్దవాడు తల్లి పాదాల మీద ఒరిగిపోయాడు. ***'అన్నయ్యా!'*** అంటూ చిన్నవాడు అన్నకాళ్ళమీద తలపెట్టాడు. ***'తమ్ముడూ!'*** అంటూ కౌగిలించుకుంటాడు ***'అన్న'***. ఒక్క క్షణంలో ఎంత మార్పు? ఎలా కలిగింది ఆ మార్పు? అదే మాతృప్రేమలో ఉన్న శక్తి. ప్రేమ తత్త్వానికి ప్రత్యక్ష స్వరూపం తల్లి. కనుక ఆ ప్రత్యక్షదైవమైన తల్లిని పూజించండి. మరచిపోకండి.

## పుండలీకుని ఆదర్శం :

పండరీపుర పుణ్యక్షేత్రమందు 'పుండరీకుడు' అనే బాలుడుండేవాడు. చంద్రభాగానదికి వెళ్ళి నీరు తెచ్చి, తల్లిదండ్రులను స్నానం చేయించి, వారిని భక్తితో పూజించడం అతని నిత్యకృత్యం. ఒకనాడు అతనిని పరీక్షించదలచి, పాండురంగడు వచ్చి, వాకిట వద్దనే నిలచి, పుండరీకుని పిలుస్తాడు. తల్లిదండ్రుల సేవలో నిమగ్నుడైయున్న పుండరీకుడు తల ఎత్తి చూడకుండానే ***'మీరు ఎవరు?'*** అని అడిగాడు. అప్పుడు ***"నేను పాండురంగడును. నీమీద ప్రేమతో నిన్ను అనుగ్రహించుటకు వచ్చాను. నా దర్శనం అందరికీ లభించదు. నీ కొఱకు వేచి ఉన్నాను". అని బదులు చెప్పాడు. అప్పుడు పుండరీకుడు "ఈ దీనుని కోసం యింతసేపు బురదలో నుంచున్నావు. పాపం! ఇదుగో! ఈ ఇటుక మీద కొంచం సేపు నిలుచో! నా తల్లిదండ్రులను సేవించి వస్తాను"*** అని ఒక ఇటుక విసరివేస్తాడు. చేసేదేమీ లేక భక్తుని రాకకోసం, ఆ ఇటుక మీద నుంచొని వేచి ఉన్నాడు. తల్లిదండ్రుల సేవను పూర్తి చేసుకొని, వారి అనుజ్ఞను పొంది, పండరీనాథుని దర్శించి, ఆ దేవుని అనుగ్రహానికి పాత్రుడై తరిస్తాడు పుండరీకుడు!

ఈ కథ మనకు ఒక నీతిని బోధిస్తున్నది. ***"తల్లి దండ్రులసేవలో నిమగ్నులైన వారిని, సాక్షాత్ భగవంతుడు ఆదరిస్తాడు, హర్షిస్తాడు అనుగ్రహిస్తాడు. ఈ వాస్తవాన్ని విస్మరించకండి. ప్రత్యక్ష దైవాలైన తల్లిదండ్రులను పూజించండి!"***

## తల్లి చల్లని చూపులు :

మహాభారత యుద్ధం ముగుస్తుంది. ఇరుపక్షములకు చెందిన 18 అక్షౌహిణీల సైన్యం సర్వనాశనం అయిపోయింది. దుర్యోధనుని దుష్టబుద్ధి వలన వంద మంది సహోదరులు మరణిస్తారు. పుత్రశోకంతో గాంధారి, ధృతరాష్ట్రులు కుమిలి పోతుంటారు. ఒకసారి అత్త గాంధారిని పరామర్శించడానికి శ్రీకృష్ణపరమాత్మ వచ్చి *"అత్తా! క్షేమమా!"* అని అడుగుతాడు. పుత్రశోకంతో విలపిస్తున్న గాంధారి కోపోద్రిక్తురాలై *"నీకు, మేము ఇప్పుడు కనిపించామా? తద్దినం పెట్టడానికి ఒక్క కుమారుని కూడా మిగల్చకుండా నూరు మందిని పొట్టన పెట్టుకున్నావుగదా! ఇప్పుడు నీ కళ్ళు చల్లబడ్డాయా? కౌరవులంటే, ఎందుకు నీకింత వివక్షత?"* అని ప్రశ్నిస్తుంది. అప్పుడు ఆ జగన్నాటక సూత్రధారి చిరునవ్వుతో *"అత్తా! ఇందులో నా తప్పు ఏమీ లేదు. శిశువు జన్మించగానే మొట్టమొదట చూచేది తల్లే! మామ ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు కాబట్టి, భర్తకు లేని చూపు నాకెందుకని, నీవు కూడా నీ కండ్లకు నల్లటి గుడ్డను కట్టుకున్నావు. నీ నూర్గురు కుమారులలో ఎవరి ముఖమైనా, ఎప్పుడైనా చూచావా? మాతృదేవి దృష్టిని నోచుకోని వాడు, దైవ దృష్టిని ఏవిధంగా నోచుకోగలడు?"* అని సమాధానం చెబుతాడు శ్రీకృష్ణుడు.

దీనిలో మనం నేర్చుకోవలసిన 'నీతి' ఒకటున్నది. *"తల్లి చల్లని చూపును నోచుకోలేనివానికి, తల్లి ప్రేమకు పాత్రుడు కానివానికి తల్లి అనుగ్రహం లేనివానికి, దైవానుగ్రహం కూడా లభించదు"* ఈ యదార్థమును బాలబాలికలు గుర్తించాలి. కనుక తల్లి ప్రేమను పొందడానికి ప్రతి ఒక్కరూ ప్రయత్నించాలి.

తల్లులే తనయులను తీర్చి దిద్దగలుగుతారు. తన బిడ్డ గొప్పవాడు కావాలని, మంచివాడు కావాలని ప్రతి తల్లీ కోరుకుంటుంది. *తల్లికి స్వార్థం ఉండదు. పిల్లల శ్రేయస్సే తల్లి లక్ష్యం. ఆ లక్ష్య సాధనకు ప్రతి తల్లీ నిస్వార్థంగా కృషి చేస్తుంది.* కనుక తనువునిచ్చిన తల్లిని ప్రేమించి, గౌరవించి, పూజించి, పోషించడం పిల్లల కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని విస్మరించకండి.

---

"ఈనాటి బాలికలు రేపటి తల్లులు, బాలురు రేపటి తండ్రులు. చిన్నప్పుడు మీ తల్లిదండ్రులను గౌరవించడం నేర్చుకుంటే, రేపు మీ బిడ్డలనుండి మీరు గౌరవాన్ని పొందడానికి అర్హత సంపాదించుకుంటారు. మొక్క చిన్నదిగా వున్నప్పుడు, వంపులతో పెరిగితే పెద్దదయాక ఆ వంపులు పోతాయా? అందుకే చిన్నతనంలో ప్రవర్తన మంచిగా వుండవలెను".

**- శ్రీ సత్యసాయిబాబా**

# పితృభక్తి

**'పితృదేవోభవ'** అన్నారు. తండ్రికూడా దైవంతో సమానమే. తల్లి తండ్రిని చూపిస్తుంది. తండ్రి గురువును చూపిస్తాడు. నవమాసములు మోసి, కనిపెంచిన తల్లిని ఏ విధంగా ప్రేమిస్తామో, పూజిస్తామో, అదే విధంగా, జన్మనిచ్చిన తండ్రిని కూడా గౌరవించాలి. పిల్లల అభివృద్ధికి, అనుక్షణం తాపత్రయపడే తండ్రిని మనసారా ప్రేమించాలి. వార్ధక్యంలో సకల సపర్యలు చేసి **'పితృఋణం'** తీర్చుకోవాలి పిల్లలు.

## శ్రీరామచంద్రుని ఆదర్శం :

శ్రీరామచంద్రుడు పితృభక్తి పరాయణుడు, పితృవాక్య పరిపాలకుడు. పితృవాక్య పాలన పుత్రుల కర్తవ్యమని, అది అత్యంత పరమోత్కృష్టమైన ధర్మమని ఆచరణ ద్వారా నిరూపించాడు ***శ్రీరామచంద్రుడు***. తండ్రి ఆజ్ఞను శిరసావహించి, సకల రాజభోగములను విడనాడి, పదునాలుగు సంవత్సరాలు వనవాసం చేసిన ఆదర్శ పురుషుడు ***శ్రీరామచంద్రుడు***. దశరథుని మరణానంతరం, భరతుడు సపరివారంతో శ్రీరాముని కలవడానికి బయలుదేరి దండకారణ్యం వెళ్ళుతాడు. తండ్రి మరణ వార్తను చెప్పి విలపిస్తాడు భరతుడు. అయోధ్యకు తిరిగివచ్చి, రాజ్యమును పాలించమని శ్రీరాముని వేడుకుంటాడు భరతుడు. కాని శ్రీరాముడు అంగీకరించడు. ఏమి చేయాలో తోచక, భరతుడు ప్రాయోపవేశానికి పూనుకుంటాడు. అప్పుడు శ్రీరామచంద్రుడు ***"నాయనా! ప్రాయోపవేశం బ్రాహ్మణుల ధర్మం. రాజులకు అది నిషిద్ధం. నేను తండ్రి ఆజ్ఞను శిరసావహించి ఇక్కడకు (అరణ్యాలకు) వచ్చాను. ఇది నా ధర్మం. తండ్రిగారి కోరికను, ఆజ్ఞను మన్నించి, రాజ్య పాలన చేయటం నీధర్మం . కనుక ఎవరి ధర్మాన్ని వారు పాలించాలి"*** అని నచ్చజెప్పి పాదుకలు యిచ్చి, పాలన చేయమని భరతుడ్ని పంపించివేస్తాడు.

శ్రీరాముని ధర్మనిష్ఠ, కర్తవ్య పరాయణత్వం ఎంతటిదో, ఈ సంఘటన ఋజువు చేస్తున్నది. ఏదో విధంగా అధికారాన్ని పొందాలనే తాపత్రయం ఆయనలో ఈషన్మాత్రం కనిపించదు. రాజ్యం కన్నా, రాజ్య సుఖాల కన్నా **'ధర్మమే'**

మిన్నయని, ఆచరించి, చూపించిన ఆదర్శ ప్రాయుడు 'శ్రీరామచంద్రుడు' అంతే కాదు పిత్రాజ్ఞను శిరసావహించడం కన్నా మించిన ధర్మం వేరొకటి లేదని ప్రపంచానికి చాటిన మహనీయుడు 'రామచంద్రుడు'.

*"పిత్రాజ్ఞను శిరసావహించడం పుత్రుల కర్తవ్యం"* ఈ సత్యమును విస్మరించక, ప్రతి ఒక్కరూ ఆచరణ ద్వారా నిరూపించాలి.

## శ్రవణ కుమారుని ఆదర్శం :

దశరథమహారాజు కోసల రాజ్యమును పాలిస్తున్న రోజులలో *'శ్రవణకుమారుడు'* అనే బాలుడు ఉండేవాడు. అతని తల్లి దండ్రులు ముసలివారే కాదు, గ్రుడ్డివారు కూడా. వారిని నిత్యమూ భక్తి శ్రద్ధలతో సేవించి, పూజించేవాడు, శ్రవణుడు. ఒకసారి ఆ ముసలి తల్లిదండ్రులు తీర్థ యాత్రలను చేయాలనే కోరికను వెలిబుచ్చుతారు. *తల్లిదండ్రుల కోర్కెలను నెరవేర్చడం పుత్రుల కర్తవ్యం గదా!* అయితే శ్రవణుని తల్లిదండ్రులు ముసలి వారుగదా! నడువలేరు, కండ్లు కూడా కనిపించవు. ఒకకావడి తీసుకొని వచ్చి తల్లిని ఒకవైపు, తండ్రిని మరొకవైపు కూర్చోబెట్టి, కావడి భుజాన పెట్టుకొని, తీర్థ యాత్రలకు బయలు దేరుతాడు 'శ్రవణుడు'. వారికి ఏ మాత్రం కష్టం కలిగించ కుండా, సకాలంలో ఆహార పానీయాదులను అందిస్తూ, పుణ్య తీర్థములలో స్నానంచేయిస్తూ దేశాటన చేస్తుంటాడు 'శ్రవణుడు'. తల్లిదండ్రుల యెడల అతని భక్తిశ్రద్ధలను చూచి ప్రజలు ఆశ్చర్య పడుతుంటారు. ఒకరోజు రాత్రి అడవిలో విశ్రమించ వలసి వస్తుంది. ఒక చెట్టు క్రింద సుభ్రంచేసి పడుకోపెడుతాడు. తల్లిదండ్రులకు దాహం వేస్తుంది. శ్రవణుడు ఒక ముంత తీసుకొని ప్రక్కనే ఉన్న నదికి వెళ్ళుతాడు. ఆ నదిలో ఆ కడవను ముంచుతుండగా *'బుడ...బుడ....* అనే శబ్దం వచ్చింది. అదే సమయంలో వేటకు వచ్చిన దశరథమహారాజు, ఆ శబ్దము విని, మృగం నీరు త్రాగటానికి వచ్చిందని బావించి, బాణం వదలగా, ఆ బాణం రివ్వున పోయి శ్రవణుని గుండెల్లో గ్రుచ్చుకుంటుంది. శ్రవణుడు కెవ్వున కేకపెడుతాడు. ఆకేక వినిన దశరథుడు పరుగెత్తుకొని ఆ నదీ తీరానికి వెళ్ళుతాడు. బాణం గ్రుచ్చుకొనిన శ్రవణుడు క్రిందపడి

కొట్టుకుంటుంటాడు. దగ్గరకువెళ్ళి ఆ బాలునికి సపర్యలు చేస్తాడు. కాని ప్రయోజనం ఉండదు. అవసాన దశలో వున్న శ్రవణుడు *"అయ్యా! ఈ అడవిలో ఒక చెట్టు క్రింద, నా తల్లిదండ్రులు దాహంతో బాధపడుతున్నారు మీరు వెంటనే అక్కడకు, వెళ్ళి ఈ నీరు వారికి అందించండి!"* అని చెప్పి ఆ కడవను అందించి, తల్లిదండ్రులను స్మరించుకుంటూ కన్ను మూస్తాడు శ్రవణుడు. దశరధుడు కడవను తీసుకొని వెళ్ళి, ఆ ముసలి తల్లిదండ్రులకు మంచి నీరునిచ్చి, జరిగిన విషయం చెబుతాడు. ఆ విషాధ వార్త వినిన ఆ ముసలి తల్లిదండ్రులు విలపిస్తూ *"ఏ విధంగా మేము ప్రాణాలను ఈనాడు విడువబోతున్నామో! అదేవిధంగా భవిష్యత్తులో నీవు కూడా పుత్రశోకంతో మరణిస్తావు"* అని అంటూ శ్రవణుని తల్లిదండ్రులు కన్నుమూస్తారు. ఆ తరువాత కొంతకాలానికి పుత్ర శోకంతోనే మరణిస్తాడు *'దశరథుడు'*.

తల్లిదండ్రుల సేవయే పరమావధిగా భావించి, కర్తవ్యపరాయణత్వంలో కన్నుమూసిన 'శ్రవణకుమారు'ని జీవితం లోకానికి అత్యంత ఆదర్శ ప్రాయమైనది. *సేవకు మించిన సాధన వేరొకటి లేదు. అందులో తల్లి దండ్రుల సేవతో సమానమైన సేవ మరొకటి లేదు.*

*తల్లి దండ్రులను సేవించండి! తరించండి!*



---

'పితృవాక్య పరిపాలన అన్నది గొప్పధర్మము. ఆ ధర్మాన్ని వదిలివేసి ఎంత గొప్ప ఐశ్వర్యము సంపాదించినా ఫలితం ఉండదు. పితృవాక్య పరిపాలన పరమోత్కృష్టమైన ధర్మము'

- శ్రీరామచంద్రుడు

# గురుభక్తి

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీగురవేనమః"

అనగా *"గురువు బ్రహ్మదేవుడు, గురువువిష్ణువు, గురువు దేవుడగు ఈశ్వరుడు, గురువు ప్రత్యక్షముగా నున్న ఆ పరమాత్మయే. అటువంటి తేజోవంతుడగు గురువు కొఱకు నమస్కారము"* అని అర్థము.

*'ఆచార్యదేవోభవ!'* భారతీయ సంస్కృతి యందు గురువునకు అత్యున్నతమైన స్థానం ఇవ్వబడింది. గురువును కూడా దైవముతో సమానముగా భావించమని మన శాస్త్రములు ఆదేశిస్తున్నాయి. భక్తి శ్రద్ధలతో గురువుని సేవించేవారికి దైవానుగ్రహం లభిస్తుందని మన పెద్దలు చెబుతున్నారు.

"అజ్ఞానతిమిరాన్ధస్య, జ్ఞానాంజనశలాకయా
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవేనమః"

అనగా *"అజ్ఞానము అను చీకటియందు, గ్రుడ్డి వాని వలె వున్న నాయొక్క కన్ను, 'జ్ఞానము' అను కాటుక పుల్లతో ఏ గురువుచే తెరిపింప జేయబడినదో అటువంటి తేజోవంతుడగు గురువు కొఱకు నమస్కారము"* అని అర్థము.

**'అజ్ఞానము'** అను అంధకారమును పారద్రోలి, **'జ్ఞానము'** అను వెలుగును ప్రసాదించువాడు **'గురువు!'**. **'అజ్ఞానము'** అనే అంధకారమును దూరము చేసి 'ప్రజ్ఞానము' అనే ప్రకాశవంతమైన జ్యోతిని వెలిగించువాడు 'గురువు'. కంటిపొరను తొలగించి దృష్టిని కలిగించేవాడు *'డాక్టర్'* అయితే, 'అజ్ఞానము' అనే పొరను తొలగించి, 'జ్ఞానదృష్టి' ప్రసాదించువాడు *'గురువు'*. గురువు అనే శబ్దము అత్యంత పవిత్రమైనది. అలనాడు *'జ్ఞానబోధ'* చేసేవారు గురువులు. అయితే ఈనాడు లౌకిక విద్యలను నేర్పేవారు అధ్యాపకులు (టీచర్లు).

***"గుణము లేని సుతుడు, గురిలేని విద్యలు, నీతిలేని జాతి నిష్ఫలంబు"*** అన్నారు శ్రీ సత్యసాయిబాబావారు. ***'గుణం'*** ముఖ్యం, ***'గురి'*** అత్యవసరం. ప్రతివ్యక్తిలో ***'నీతి'*** ఉండాలి. కనుక ప్రతివిద్యార్థిలో ఈ మూడూ ఉండాలి. ముఖ్యంగా గురువులు (అధ్యాపకులు) మీద విద్యార్థులకు గురి ఉండాలి. లేనివానికి విద్యరాదు. కనుక ***ప్రతి విద్యార్థి (గురువుల) అధ్యాపకుల యెడల భక్తి శ్రద్ధలు*** కలిగి ఉండాలి.

**ఏకలవ్యుని ఆదర్శం :**

గురుభక్తికి చక్కటి ఆదర్శం ఏకలవ్యుడు. ద్రోణాచార్యుడు విలువిద్యను నేర్పడానికి నిరాకరించినప్పటికీ, నిరాశ చెందక, నిస్పృహకు లోనుకాకుండా, నిగ్రహంతో, అతని విగ్రహమును ముందుంచుకొని పూజిస్తూ, శ్రద్ధతో, పట్టుదలతో, తీవ్రకృషి సలిపి, స్వబుద్ధితో, స్వశక్తితో సాటిలేని మేటి విలుకాడయ్యాడు 'ఏకలవ్యుడు. అతని విలువిద్యా నైపుణ్యాన్ని చూచి 'ద్రోణుడే' ఆశ్చర్యపడిపోతాడు. భౌతికంగా ద్రోణుడు విలువిద్యను నేర్పనప్పటికీ, ఏకలవ్యుడు విలువిద్యలో అంతటి నైపుణ్యాన్ని ప్రావీణ్యతను ఎలా సాధించగలిగాడు? సునిశితంగా పరిశీలిస్తే ఒక విషయం తేటతెల్లమవుతుంది. ***గురుభక్తి, శ్రద్ధ, పట్టుదల వుంటే దేనినైనా సాధించగలుగుతారని ఋజువుచేసాడు 'ఏకలవ్యుడు'*** ఈ మూడూ ఉన్నవారికి దైవానుగ్రహం తప్పని సరిగా తోడు నిలుస్తుందని ఏకలవ్యుని జీవితం నిరూపిస్తున్నది. కనుక ముఖ్యంగా ***విద్యార్థులలో అచంచలమైన గురుభక్తి, శ్రద్ధ, పట్టుదల, కృషి ఉండాలి. అప్పడే మానవకృషికి, దైవకృప తోడ్పడుతుంది.*** అట్టి విద్యార్థులు విజయాలను సాధించగలుగుతారు. ఈ సత్యమును మాత్రం విస్మరించకండి.

**గురుభక్తి :**

తమిళనాడులో ఒక శివభక్తుడు అయిన ఒక గురువు ఉండేవాడు. అతని పేరు ***'అప్పర్‌సాధువు'.*** అతనికి అనేకమంది శిష్యులుండేవారు. కొందరు ప్రత్యక్షంగా ఆ గురువుగారికి సేవ చేస్తుంటే, మరికొంత మంది అజ్ఞాత భక్తులుగా వుండి, ఆ గురువుగారి ఆశయ ఆదర్శములను ప్రచారం చేస్తూ, గురువుగారి పేర అనేక సత్రములను, మందిరములను నిర్మించుతుండేవారు, ఎన్నో ధర్మకార్యాలకు ధనము వెచ్చిస్తుండేవారు. ఒకసారి 'అప్పర్‌సాధువు' తన శిష్యుడున్న గ్రామానికి వెళ్ళుతాడు.

ఆ గ్రామానికి ఆ గురువుగారు వెళ్ళటం అదే మొదటిసారి. తన పేరుతో నిర్మించబడిన సత్రమును చూచి గురువుగారు ఆశ్చర్యపడుతారు. గురువుగారి రాకను తెలుసుకొనిన ఆ శిష్యుడు గురువుగారిని తన ఇంటికి ఆహ్వానించి సాదరంగా సత్కరించుతాడు. ఒక విందును కూడా ఏర్పాటు చేస్తాడు. పెద్దలను కూడా ఆ విందుకు ఆహ్వానిస్తాడు. అరటి ఆకుల కోసం తన పెద్దకుమారుని తోటకు పంపుతాడు. తన కుమారుడు ఎంత సేపటికీ అరటి ఆకులను తీసుకొని రాకపోవటంచేత తండ్రి ఆ అరటితోటకు పరుగెత్తుకొని వెళ్ళుతాడు. తీరా చూస్తే అక్కడ పాముకాటుచేత చనిపోయి పడి వుంటాడు కుమారుడు. తండ్రి ఏ మాత్రం చలించడు. కొన్ని అరటి ఆకులను ఆ శవంమీద కప్పి, విందుకు కొన్ని అరటి ఆకులను తీసుకొని వస్తాడు. భోజనానికి అందరూ కూర్చున్నారు. ఆ సమయంలో 'అప్పర్‌సాధువు' తన శిష్యునితో ***"నీ కుమారులందరిని భోజనానికి రమ్మనమని చెప్పు, పేరుపేరున అందరినీ పిలువు!"*** అని ఆజ్ఞాపిస్తాడు. మారుమాట్లాడక అదేవిధంగా పిలుస్తాడు. పేరు పెట్టి పిలవగానే అతని పెద్దకుమారుడు అరటి ఆకులతో పరుగెత్తుకొని వస్తాడు. అరటి తోటలో చనిపోయిన తన పెద్దకుమారుడు ఎలా బ్రతికి వచ్చాడు? తన కళ్ళను తానే నమ్మలేకపోతాడు. గురువు కృపాకటాక్ష ములుంటే, అది సాధ్యమేనని భావిస్తాడు. ఇది వాస్తవం.

ఈ ఉదంతం మనకు ఒక నీతిని బోధిస్తున్నది. ***ఎవరు గురువును మనసా, వాచా కర్మణా సేవించుతారో, వారికి దుఃఖ నివృత్తి అవుతుంది. సుఖప్రాప్తి కలుగుతుంది. కనుక ఈ సత్యమును మరువకండి. భక్తి శ్రద్ధలతో గురువులను పూజించండి.***

**సత్యకాముడు :**

పూర్వము గౌతమ మహర్షివద్ద అనేకమంది శిష్యులు ఉండేవారు. ఒకనాడు శిష్యులందర్ని పిలిచి *'శిష్యులారా! మన ప్రాంతంలో కరువుకాటకములు ఏర్పడినాయి. మన వద్దనున్న నాలుగువందల గోవులు తినడానికి పచ్చికగాని, త్రాగడానికి నీరుగాని లేక అలమటిస్తున్నాయి. వాటి దీనావస్థను చూచి నా హృదయం పరితపిస్తున్నది. వాటి బాధలను చూస్తూ, నా విధులను నేను సక్రమంగా నిర్వర్తించ లేకపోతున్నాను. కనుక మీలో ఒకరు ఈ గోవులను సుభిక్ష ప్రాంతాలకు తోలుకొని వెళ్ళి, వాటి సంరక్షణ భారమును*

*కొంతకాలం వహించుతే బాగుంటుంది"* అని గౌతముడు చెప్పాడు. శిష్యులు ఏమీ బదులు చెప్పక, తలవంచి నిలుచున్నారు. కాని 'సత్యకాముడు' అను ఒక శిష్యుడు మాత్రం ముందుకువచ్చి, తానా బాధ్యతను స్వీకరించుతానని చెబుతాడు. మిగతా శిష్యులు నిరుత్సాహపరుస్తారు. అయినప్పటికీ ఏ మాత్రం వెనుకాడడు. అప్పుడు గౌతముడు, ఆ నాలుగు వందల గోవులను తోలుకొని వెళ్ళి, వెయ్యి ఆవుల అయిన తరువాతనే తిరిగి రావలసినదిగా ఆదేశించి, ఆశీర్వదించి పంపుతాడు.

గోసేవయే గురుసేవగా భావించి, ఆ గోవులను దూరప్రదేశాలకు తోలుకొని వెళ్ళుతాడు 'సత్యకాముడు'. ఆ గోవులకు అక్కడ మంచి గడ్డి దొరుకుతుంది. చక్కగా మేసి మంచిగా తయారువుతాయి. గోవుల సంఖ్య కూడా పెరుగుతుంటుంది. గోసేవ చేస్తూ, భగవన్నామస్మరణలో నిమగ్నుడైన 'సత్యకాముడు' మాత్రం పెరుగుతున్న గోవుల సంఖ్యను గమనించడు. తన కర్తవ్యాన్ని తాను నిర్వర్తిస్తూ కాలం గడుపుతుంటాడు 'సత్యకాముడు'. అతని గురుభక్తికి దేవేంద్రుడు మెచ్చి, ప్రత్యక్షమై ***"సత్యకామా! ఆవుల సంఖ్య వేయి అయింది. గురువుగారి వద్దకు తోలుకొని పో!"*** అని ఆదేశించి, దేవేంద్రుడు కూడా అతని వెంట ప్రయాణం చేస్తూ, నాలుగు వేదములు అతనికి బోధించి, అంతర్థానమైపోతాడు. సత్యకాముడు ఆనందంతో, ఆవులను తోలుకొని గురువుగారి వద్దకు వెళ్ళి పాదాభివందనం చేస్తాడు. గురువుగారు శిష్యుని కౌగలించుకొని, ఆనంద భాష్పాలతో ఆశీర్వదించుతాడు.

ఈ కథ మనకొక నీతిని బోధిస్తున్నది. ***భక్తి శ్రద్ధలతో గురువును సేవించిన వారికి, గురువాజ్ఞలను శిరసావహించిన వారికి దైవానుగ్రహం తప్పనిసరిగా లభిస్తుంది.*** ఆ విధంగా సత్యకాముడు ప్రవర్తించటం వలననే దైవానుగ్రహం అతనికి సంప్రాప్తించింది. అతని ఆశయం నెరవేరింది. కనుక ***ప్రతిఒక్కరూ గురువులను పూజించాలి, గురువాజ్ఞలను శిరసావహించాలి.***

## పద్మపాదుడు

శంకరాచార్యుల వద్ద అనేక మంది శిష్యులు ఉండేవారు. అందులో ఒక శిష్యుడు గురు సేవలో నిమగ్నుడై ఉండటం వలన, అతను చదువులో వెనుకబడినాడు.

మిగతా శిష్యులు అతనిని చూచి హేళన చేస్తుండేవారు, చులకనగా మాట్లాడు తుండేవారు. అయినప్పటికీ ఆ శిష్యుడు వారి మాటలను లెక్కచేసేవాడు కాదు. నిరంతరం గురువు సేవలోనే నిమగ్నుడై ఉండేవాడు. ఒకనాడు గురువుగారి వస్త్రములను తీసుకొని, ఉతకడానికి నదికి వెళ్ళుతాడు. వాటిని మంచిగా ఉతికి, నది మధ్యలో నున్న ఇసుక తిన్నెలపై ఆరవేస్తాడు. అదే సమయంలో నది హఠాత్తుగా పొంగి, ఇసుకతిన్నెలను ముంచివేస్తుంది. ఆరబెట్టిన వస్త్రములు నదిలో కొట్టుకొని పోతుంటాయి. గురువుగారిని స్మరించుకుంటూ, ప్రాణములను సహితం లెక్క చేయకుండా, తెగించి ఆ ప్రవాహంలో దిగుతాడు. అతనికి ఈత రాదు. వస్త్రములు కొట్టుకొని పోతుంటాయి. గురువుగారు మీద భారం వేసి, గురువును స్మరించుకుంటూ ప్రవాహంలో దిగాడు కాబట్టి, అతనికి గురువుగారి అనుగ్రహం లభిస్తుంది. అతని అచంచలమైన గురుభక్తి ప్రభావంచేత, అడుగుపెట్టబోయే స్థలంలో ఒక్కొక్క పద్మము ప్రత్యక్షమవుతూ వుంటుంది. ఆ పద్మముల మీద కాలుమోపుతూ, ప్రవాహంలో నడిచి వెళ్ళి కొట్టుకొని పోతున్న గురువుగారి వస్త్రములను పట్టుకొని, ఒడ్డుకు తిరిగివస్తాడు. అది చూచిన మిగతా శిష్యులు ఆశ్చర్యపడి సిగ్గుతో తలలు వంచుకుంటారు. ఆ శిష్యుని గురుభక్తికి మెచ్చుకొని, శంకరుల వారు అతనికి **'పద్మపాదుడు'** అని నామకరణ చేస్తారు. అప్పటి నుంచి శంకరుల వారి శిష్యకోటిలో **'పద్మపాదుడు'** అత్యంత ముఖ్యశిష్యుడుగా పరిగణించబడుతాడు.

***"అతని గాఢమైన గురుభక్తియే, దైవానుగ్రహం వలన దివ్యశక్తియై, అతనిని దరికి చేర్చి, కీర్తి ప్రతిష్ఠలను తెచ్చి పెట్టింది"*** అనే సత్యం ఈ సంఘటన వలన మనకు తేటతెల్ల మవుతున్నది. ***"భక్తిశ్రద్ధలతో గురువును సేవించిన వారికి దైవముకూడా సహాయపడుతాడు"*** అనే వాస్తవాన్ని విస్మరించకండి.

**బాల అరుణి :**

పూర్వం 'ధౌమ్యుడు' అనే మహర్షి ఉండేవాడు. అతని వద్ద అనేక మంది శిష్యులు విద్యనభ్యసిస్తుండేవారు. ఒకనాడు శిష్యులకు విద్యను బోధిస్తున్న సమయంలో కుంభవృష్టి కురవ నారంభించింది. అప్పుడు 'అరుణి' అనే శిష్యుని పిలిచి 'ధౌమ్యుడు' ***"నాయనా!కుండపోతగా వర్షం కురుస్తున్నది. ఒకసారి మన పొలం వద్దకు వెళ్ళి చూచిరా!***

*బోదెగట్లు తెగిపోయినా తెగి పోవచ్చును"* అని చెబుతాడు. వెంటనే గురువుగారి ఆజ్ఞ ప్రకారం చేను దగ్గరకు వెళ్ళుతారు 'అరుణి'. గురువుగారు భావించినట్లుగానే గట్టుకు గండిపడి నీరు పోతుంటుంది. అప్పుడు ఆ గండి చిన్నదిగానే ఉంటుంది. అది పెరిగి పెద్దదైతే పంట మొత్తం కొట్టుకొని పోతుందని భావించిన 'అరుణి' ఆ గండికి అడ్డంగా పడుకుంటాడు. కొంతసేపటికి వర్షం తగ్గిపోతుంది. తెల్లవారుతుంది. అయినప్పటికీ శిష్యుడు మాత్రం ఆశ్రమానికి చేరడు. 'అరుణి' జాడ తెలియక 'ధౌమ్యుడు' తన శిష్యులతో సహా, అతనిని వెదుకుతూ చేను దగ్గరకు చేరుకుంటారు. అక్కడ గండికి అడ్డంగా స్పృహ తప్పి పడివున్న 'అరుణి'ని చూచి గురువుగారి గుండె కరిగిపోతుంది. అతను మరణించాడని శిష్యులందరూ భావిస్తారు. ఆ శిష్యుణ్ణి లేవదీసి, తన దివ్యశక్తి చేత, అతనికి స్పృహ తెప్పించి, ఆ శిష్యుని గురుభక్తికి మెచ్చి, మనసారా ఆశీర్వదించి ఆశ్రమానికి తీసుకొని వస్తాడు 'ధౌమ్యుడు'.

*"గురువును నమ్ముకున్నవారికి ఎట్టి ప్రమాదం రాదు. ఒక వేళ వచ్చినా, అది తృటిలోనే తప్పిపోతుంది"* అనే నీతి ఈ సంఘటన ఋజువు చేస్తున్నది. కనుక *గురువులను హృదయపూర్వకంగా నమ్మండి, విశ్వసించండి! వారిని సేవించండి, అనుగ్రహ ఆశీస్సులను పొందండి!.*

బుద్ధి వికాసానికి 'విద్య' అవసరం. అట్టి విద్యను గురువుల వద్ద నేర్చుకోండి. *గురువు మీద 'గురి' ఉంచండి. శ్రద్ధతో విద్యనభ్యసించండి. గురువులను భక్తితో సేవించండి. వినయవిధేయతలను పెంపొందించుకోండి. ఉత్తమ పౌరులుగా తయారుకండి!*

---

"గురువును శిష్యుడెన్నడూ ఆక్షేపింపరాదు. గురువు మానవునికి భగవంతునితో అనుసంధానము కూర్చు మధ్యవర్తి. అట్టి నీ గురువును గూర్చి ఇతరులాడు నిందావాక్యములను విని సహింపకుము. అతడు నీ తల్లిదండ్రుల కన్నా ఉత్తముడు. నీ తల్లిదండ్రుల నెవ్వడేని నీ ఎదుట దూషించుచున్నచో విని ఊరుకుందువా? అవసరమగుచో పోరాడియైనను నీ గురువు ప్రతిష్ఠను కాపాడుము".

- రామకృష్ణపరమహంస

# ఐకమత్యము

**'ఐకమత్యమే మహాబలం'** అన్నారు అనుభవజ్ఞులైన మన పెద్దలు. ఎట్టి భిన్నాభిప్రాయములు లేకుండా, ఒకేమాట మీద, ఒకే బాటలో నడవటమే **'ఐకమత్యము'** అనబడుతుంది. వ్యష్టిగా సాధించలేని కార్యం, సమిష్టిగా సాధించవచ్చును. కుటుంబం అభివృద్ధి జెందవలెననిన, గ్రామం పురోభివృద్ధి గాంచవలెననిన, దేశం సస్యశ్యామలం కావలెననిన 'ఐకమత్యం' అత్యవసరం. ***అనైక్యత అనర్థానికి దారితీస్తుంది, సమైక్యత సంరక్షిస్తుంది.***

ఉదాహరణకు ..... గడ్డిపోచ 'ఉఫ్' అంటే గాలికి లేచిపోతుంది. అతి బలహీనమైన ఆ గడ్డిపోచలనే, ఒక చోట చేర్చి వెంటి (త్రాడు)గా తయారుచేస్తే దానితో మదించిన మదపుటేనుగును సహితం బంధించవచ్చును. విడివిడిగా వున్నప్పుడు ఆ గడ్డిపోచలలో ఏ శక్తీ ఉండదు. అట్టి బలహీనమైన గడ్డి పోచలు ఒకచోట చేరినప్పుడు అజేయమైన శక్తిగా రూపొందుతుంది. అదే విధముగా ఎవరికి వారు విడివిడిగా ప్రయత్నించుతే ప్రయోజనం ఉండదు. ఆశించిన ఏ కార్యం సఫలీకృతంకాదు. అదే పదిమంది సంఘటితమై, ఐకమత్యంతో ప్రయత్నించుతే అసాధ్యమైన కార్యాలను కూడా సాధించవచ్చును. ***సంఘటిత శక్తి వలననే దేశ సమైక్యత, సమగ్రత సాధించ బడుతుంది.***

## మానవశరీరం :

ఐకమత్యమునకు చక్కటి ఉదాహరణ మానవ శరీరము. అనేక రకరకాలైన అవయవములతో మానవ శరీర నిర్మాణం జరిగింది. వేటికి ఏ పని కేటాయించబడిందో, ఆ పనిని చక్కగా, ఐకమత్యంగా అవి చేసుకుంటూ పోతాయి. మనిషి ఎక్కడికి వెళ్ళాలని మనసు సంకల్పించుకొనిన మరుక్షణంలోనే, కాళ్ళు అక్కడకు తీసుకొని వెళ్ళుతాయి. ఏ పనిని చేయాలనుకుంటే, ఆ పనిని చేతులు చేస్తాయి. దేనిని చూడదలచుకుంటే దానిని కండ్లు చూస్తాయి. దేనిని వినదలచుకుంటే దానిని చెవులు వింటాయి. దేనిని వాసన చూడదలచుకుంటే దానిని ముక్కులు వాసన చూస్తాయి. దేనిని తినదలచుకుంటే దానిని నోరు తింటుంది, కడుపు నిండుతుంది. మనసు సంతృప్తి జెందుతుంది. అది జీర్ణమై, రక్తరూపంలో తిరిగి శరీరములోని అన్ని భాగాలకు ఎట్టి వివక్షత చూపకుండా, గుండె రక్తమును సరఫరా చేస్తుంది. తిరిగి వచ్చిన రక్తమును

ఊపిరితిత్తులు పరిశుభ్రం చేస్తాయి. ఈ విధంగా ప్రతిక్షణం ఆగకుండా వేటి పని అవి సంఘీభావంతో చేస్తూనే ఉంటాయి. ఒకవేళ దురదృష్టవశాత్తు పేచీవచ్చి, ఏ అవయం పనిచేయకపోయినా అసలు ఆటే కడుతుంది. సంపాదించిన దంతా తినేది నోరు, కష్టించి పని చేయవలసింది మేమా? అని ఇతర అవయవాలు భావిస్తే, మొదటికే మోసం వస్తుంది. శరీరంలోని ఏ అవయవమునకు దెబ్బతగిలినా, జబ్బు చేసినా శరీరమంతా బాధ పడుతుంది గదా! ఒకటి ఎక్కువ, మరొకటి తక్కువ అనేది లేదు. దేనికున్న ప్రాముఖ్యత దానికున్నది. అన్నీ కలిపి పనిచేసినప్పుడే శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. అదే విధముగా కుటుంబాభివృద్ధిగాని, గ్రామాభివృద్ధిగాని, దేశాభివృద్ధిగాని అందరూ కలసి, మెలసి, ఐకమత్యంతో, సంఘీభావంతో ఎవరి బాధ్యతలను వారు నిర్వర్తించినప్పుడే జరుగుతుంది. నవభారత నిర్మాణానికి సమైక్యత, సంఘీభావం ఎంతైనా అవసరం. ***ఐకమత్యానికి చిహ్నం 'మానవశరీరం', మరచిపోకండి.***

## ధర్మరాజు ఆదర్శం :

***"వయం పంచాధికశతం"*** అని ధర్మరాజు ఏనాడో చెప్పాడు. "మేము నూట ఐదుగురము అన్నదమ్ములం" అన్నాడు ధర్మరాజు. వీరి మధ్య తగాదా వచ్చినప్పుడు మాత్రం పాండవులు ఐదుగురు, కౌరవులు నూరుగురు. వీరిమీదకు మరెవరైనా దండెత్తి వస్తే, అప్పుడు వాళ్ళు నూట ఐదుగురు సోదరులు. అదే విధంగా మనలో ఎన్ని తేడాలున్నా, ఎన్ని విభేదాలున్నా, ఎన్ని కులాలున్నా, ఎన్ని మతాలున్నా, ఎన్ని భాషలున్నా మనమంతా భారతీయులం. ***ఇటువంటి సమైక్యతాభావం, జాతీయదృక్పథం మనలో ఉండాలి.***

## చీమలు - కాకులు :

చీమలలో ఉన్నది సమైక్యత. కాకులలో ఉన్నది సంఘీభావం. చీమ ఒకచిన్న బెల్లపుగడ్డను చూస్తే అదిమాత్రమే తినదు. కొన్ని వందల చీమలను చేర్చి, అన్నీ కలిసి మోసుకొనిపోయి దాచుకొని తింటాయి. ఎంగిలి మెతుకులను చూచిన కాకి తానొక్కటే తినదు. "కా....కా...." అని పది కాకులను చేర్చి కలిసి తింటాయి. అయితే ఈనాటి మానవులలో మాత్రం ఆ సంఘీభావం కనిపించటం లేదు. ఐకమత్యం (Unity) అసలే లేదు. ఇది నిజంగా దురదృష్టకరం. ***కులాలు వేరైనా మనదంతా ఒకే జాతి. మనం భారతీయులం. 'ఐకమత్యమే మహాబలం' అని నిరూపించండి!.***

# పట్టుదల

విజయానికి మూలం పట్టుదల. పట్టుదల లేనివాడు జీవితంలో దేనినీ సాధించలేడు. అయితే మంచి విషయాలను సాధించడానికి పట్టుదల ఉండాలి. చెడ్డకోరికలను నెరవేర్చుకోవడంలో మాత్రం పట్టుదల పనికిరాదు. చెడ్డ విషయాలకోసం పట్టుపట్టడం **'మొండి పట్టుదల'** అంటారు. మొండి పట్టుదల మానవుణ్ణి పతనం చేస్తుంది. కనుక దీనిని దరికి చేరనీయరాదు. ప్రతివ్యక్తికీ ఆశయం ఉన్నతంగా ఉండాలి. ఆదర్శం శ్రేష్ఠమైనదై ఉండాలి. అట్టి లక్ష్యమును సాధించేందుకు **'పట్టుదల'** ఉండాలి.

**భగీరథుడు :**

భగీరథునిలో పట్టుదల వుండటం వలననే గంగను దివినుండి భువికి తీసుకొని రాగలిగాడు. ఈ దేశమును సస్యశ్యామలం చేయగలిగాడు. తన పూర్వీకులు సాధించలేని, అసాధ్యమైన కార్యమును పట్టుదలతో సాధించాడు భగీరథుడు. పట్టుదల వుంటే సాధించలేనిదంటూ ఏదీ లేదని ఋజువు చేశాడు భగీరథుడు. కనుక ***విజయాలను సాధించడానికి పట్టుదల అత్యవసరం.***

**తులసీదాస్ :**

గంగానదీతీరంలో 'హరిపూర్' అనే గ్రామం ఉన్నది. ఒకరోజు ఉదయం ఒక బాలుడు వెళ్ళి ఇంటి తలుపులు తడుతాడు. ఆ ఇంటి ఆవిడ తలుపు తీస్తుంది. ఆ పిల్లవాడు ***'అమ్మా! ఆకలవుతున్నది. ఒక ముద్ద పెట్టమ్మా!'*** అని జాలిగా అడుగుతాడు. ప్రేమతో ఒక గ్లాసు పాలు తీసుకొని వచ్చి ఇచ్చింది ఇల్లాలు. ఆ బాలుడు ఆ పాలను గటగటా త్రాగుతున్నాడు. ఇంతలో ఒక ముసలమ్మ వచ్చి ***"అతడెవరనుకున్నావు? వట్టి నిష్ఠదరిద్రుడు, అతనికి మేలు చేస్తే కీడు వస్తుంది. అటువంటి నష్టజాతకునికి సహాయం చేయకూడదు"*** అని కసురుకుంటుంది. త్రాగే త్రాగే గ్లాసు క్రిందపెట్టి వెళ్ళిపోతాడు ఆ బాలుడు.

***పాపం!*** ఆ బాలుడు ఒక నిర్భాగ్యుడు. పుట్టగానే తల్లి మరణించింది. అతడు పుట్టిన నక్షత్రం **'మూలా నక్షత్రం'.** కుటుంబానికి అరిష్టమని ఇంటి నుంచి వెళ్ళగొడుతాడు

తండ్రి. ఆ పిల్లవాడిని ఒక **'దాది'** పెంచుతుంది. ఆమెకూడా మరణించింది. **'నష్టజాతకుడు'** అనే పేరు ఆ పిల్లవాడికి స్థిరపడింది. అయితే పుట్టినప్పుడు **'రామ్! రామ్!'** అన్నాడుట. కాబట్టి ఆ పిల్లవాడిని **'రామ్‌బోలా'** అని పిలిచేవారు.

ఆ పిల్లవాడిని ఎవరూ దరికి చేరనీయకపోవడంవలన దేశదిమ్మరి అయినాడు. వరాహక్షేత్రంలో ఉన్న 'నరహరిదాస్' అనే భక్తుడు ఆ పిల్లవాడిని చేరదీశాడు. అతని ఆదరణలో పెరిగి పెద్దవాడై, పట్టుదలతో చదువుకున్నాడు. తరువాత కొంతకాలానికి కాశీ చేరాడు. **'శేషసనాతనుడు'** అనే పండితుని ఆశ్రయించాడు. సేవ చేసి అతని మెప్పను పొందాడు. సకల శాస్త్రాలు అధ్యయనం చేశాడు. మంచి పండితుడయ్యాడు. **'రామచరిత మానస్', 'హనుమాన్ చాలీసా'**లను రచించాడు. ఆ రెండు గ్రంథములు బహుళ ప్రచారంలోకి వచ్చాయి. ఆ రచయితే 'తులసీదాస్'.

ఈ సంఘటన మనకు ఒక సందేశాన్ని అందిస్తున్నది. ***పట్టుదల గనుక వుంటే, ఎంతటి మహత్కార్యాలనయినా సాధించవచ్చును. ముఖ్యంగా విద్యార్థులలో ఇటువంటి పట్టుదల ఉండాలి. పట్టుదల వున్నవారే ప్రగతిపథంలో ముందుకు పోగలుగుతారు.***



---

"పట్టుదల యనెడు విల్లునుబూని, జ్ఞానమనెడు వాడి బాణము సంధించి, వివేకమనెడు కవచమును ధరించి, ధృఢచిత్తముతో దుర్గుణములను శత్రువులతో పోరాడి జయించవలెను".

**- బుద్ధుడు**

# స్నేహం

***"విశాలమైన హృదయం, వ్యక్తిత్వం కలిగిన మనుష్యుల మధ్యనే స్నేహం పొసగడానికి అవకాశం వుంటుంది. సంకుచిత మనస్తత్వం, పిరికితనం కలిగిన మనుష్యులు నిజమైన స్నేహితులు కాలేరు"*** అని ఛార్లెస్ కింగ్స్‌వే చెబుతారు. ఇది వాస్తవం.

నిజాయితీ స్నేహానికి పునాదివంటిది. మానవ స్వరూప స్వభావాలు అధ్యయనం చేయడానికి స్నేహం ఎంతగానో ఉపకరిస్తుంది. ఒక పొరపాటు కప్పిపుచ్చుకోవడానికి పది అబద్ధాలు ఆడవలసి వస్తుంది. అబద్ధాలు ఆడి స్నేహాన్ని నిలబెట్టుకోవడానికి ప్రయత్నించే కంటే, నిజాన్ని ధైర్యంగా ఒప్పుకోవడం వలన నీ గౌరవం పెరుగుతుందే తప్ప ఏ మాత్రం తరగదు. అట్టి స్నేహమే చిరస్థాయిగా నిలుస్తుంది. నిజమైన స్నేహితుడు దొరకడానికి చాలా కాలం పడుతుంది. రోజుకొక క్రొత్త వ్యక్తితో స్నేహం చేయడానికి ప్రయత్నించేకంటే, అసలు స్నేహితులు లేకుండా వుండటమే ఉత్తమమైన మార్గం.

అభివృద్ధిలో ఉన్నప్పుడు ఎందరో వస్తారు. మిత్రభావమును చూపుతారు. స్వప్రయోజనం కోసం స్నేహాన్ని ప్రదర్శిస్తుంటారు. కష్టకాలం దాపురించినప్పుడు ***'చెరువు ఎండగానే చేపలు మాయమైనట్లు'*** అందరూ దూరనువుతారు. పైపెచ్చు నిందలు మోపుతారు. కష్టకాలంలో కూడా ఛాయవలె, ఎవరు విడవకుండా అంటిపెట్టుకొని ఉంటారో, అట్టివారే నిజమైన స్నేహితులు. అట్టి స్నేహాన్ని మాత్రమే ప్రతిఒక్కరూ చేయాలి.

**ప్రాణ స్నేహితులు :**

పూర్వకాలంలో ఇటలీ దేశంలో 'డయానిషస్' అనే రాజుండేవాడు. అతను మహా క్రూరుడు. అతనికి దయాదాక్షిణ్యాలే లేవు. అతనిని ఎదిరించినవారు, నిందించిన వారెందరో అతని చేతిలో హతులైపోయారు. అతనిని ధైర్యంగా ఎదిరించిన 'డామన్' కు రాజ ధిక్కారం నేరం క్రింద ఉరిశిక్ష విధించబడింది. జైలులో పెట్టారు. ఉరిశిక్ష సమయం ఆసన్నమవుతున్నది. తన ముసలి తండ్రిని, భార్యాబిడ్డలను చూడాలనే కోరిక అతనిలో జనించింది. అవకాశం యిప్పించమని రాజుగారిని ప్రార్థించుతాడు. అప్పుడు ఆ రాజు ***"డామన్! ఇంతగా ప్రార్థిస్తున్నావు గనుక నీకు బదులుగా ఎవరినైనా నీ స్థానంలో ఉంచి వెళ్ళు! గడువులోపల నీవు రాకున్న, నీకు బదులుగా అతనిని ఉరితీస్తారు"*** అని చెబుతాడు.

ఆ విధంగా ఎవరు ఒప్పకుంటారా! అని ఆలోచిస్తున్న సమయంలో, అతని చిన్ననాటి ప్రాణస్నేహితుడు 'పిథియాస్' డామన్‌ను చూడటానికి వస్తాడు. రాజుగారు విధించిన షరతును తెలుసుకొని పిథియాస్ ***"నీకు బదులుగా జైలులో నేనుంటాను నిశ్చింతగా ఇంటికి వెళ్ళి నీకుటుంబ సభ్యులను చూచిరా!"*** అని చెబుతాడు. రాజు కూడా అంగీకరిస్తాడు. మిత్రుడి త్యాగమును మెచ్చుకొని కన్నీరు కారుస్తాడు 'డామన్'. జైలులో 'పిథియాస్'ను ఉంచి ఇంటికి పరుగెత్తుకొని వెళ్ళుతాడు 'డామన్'. తన కుటుంబ సభ్యులను చూచి తిరిగి వస్తుండగా బ్రహ్మాండమైన గాలివాన వస్తుంది. చెట్లు విరిగి పడిపోతుంటాయి. గాఢాంధకారం, త్రోవకూడా కనిపించదు. క్రిందపడుతూ, లేస్తూ వస్తుంటాడు. దారిలో ముళ్ళపొదలు, చీరుకొని వళ్ళంతా రక్తసిక్తమైతుంది. అయినప్పటికీ పరుగెడుతునే ఉంటాడు. ఉరిశిక్ష సమయం దగ్గరపడుతుంది. 'పిథియాస్'ను ఉరితీయడానికి ఉరికంబానికి తీసుకొని వెళ్ళుతుంటారు జైలు అధికారులు. 'డామన్' మాటనిలబెట్టుకుంటాడా? లేదా? అని జనం కుతూహలంగా చూస్తుంటారు ఇంతలో డామన్ పడుతూ లేస్తూ జైలుకు చేరుతాడు. ***"ఆపండీ! ఆపండీ!'***అని కేకలు వేస్తాడు. ***"నా స్నేహితుని ఉరితీయకండి! నేను వచ్చాను నన్నే ఉరితీయండి!"*** అని ప్రాధేయపడుతాడు. రాజు ఆ సన్నివేశాన్ని చూస్తాడు. మతిపోతుంది. చుట్టూగుమికూడిన జనం ఆశ్చర్య పడుతారు. పిథియాస్ మరణదండనను స్వీకరించడానికి సంతోషంగా సిద్ధంగా ఉంటాడు. కాని డామన్ వచ్చి ***"నన్ను ఉరితీయండి!"*** అంటాడు. ప్రాణస్నేహితులిరువురూ ***"నన్ను ఉరితీయండి! నన్ను ఉరిదీయండి!"*** అంటారు. ఆ ఇరువురి స్నేహితుల మధ్యనున్న ప్రగాఢమైన మైత్రిని చూచి, ఆ రాజుగారి కఠిన హృదయం కూడా కరిగిపోతుంది. ఆ ఇద్దరి అనుబంధాన్ని ప్రశంసించి ఆ ఇరువురిని తనకొలువలో చేర్చుకుంటాడు ఆ రాజు.

ఈ కథ మనకొక మంచి ఆదర్శమును చాటుచున్నది. 'ప్రాణంకన్న మిన్న స్నేహం' అని ఋజువు చేశారు ఆ ప్రాణ స్నేహితులు.

**స్నేహితులు :**

కృష్ణ, కుచేలమైత్రి కూడా అటువంటిదే. శ్రీకృష్ణుని చిన్ననాటి స్నేహితుడు కుచేలుడు. కృష్ణుని స్థాయి పెరిగింది. మహారాజు అయినాడు. కుచేలునికి గంపెడు పిల్లలు. అత్యంత పేదరికాన్ని అనుభవిస్తుంటాడు. తినటానికి కూడా తిండి వుండదు.

ఆ దుర్భర పరిస్థితులలో ఒకసారి కృష్ణుని చూడటానికి ద్వారకకు వెళ్ళుతాడు. అతని అవతారం చూచి ద్వారపాలకులు లోపలికి కూడా వెళ్ళనివ్వరు. ఇంతలో రథము ఎక్కి బయటకు వస్తుంటాడు శ్రీకృష్ణుడు. ద్వారపాలకులు కుచేలుని బయటకు నెట్టివేస్తారు. తిండిలేక నీరసించి వుండటం వలన క్రింద పడి స్పృహను కోల్పోతాడు కుచేలుడు. ఇంతలో శ్రీకృష్ణుని రథం అక్కడకు వస్తుంది. క్రిందపడి వున్న చిన్ననాటి స్నేహితుడైన కుచేలుని చూస్తాడు. రథం దిగి కుచేలుని తలను తన తొడమీద పెట్టుకొని, మంచినీరు తెప్పించి త్రాగించుతాడు. కుచేలుని లేవనెత్తి తన సౌధంలోనికి తీసుకొని వెళ్ళి సకల మర్యాదలు చేస్తాడు. పంచభక్ష పరమాన్నములతో భోజనం పెడుతాడు. దగ్గర కూర్చొని ఆప్యాయతతో అన్నం తినిపించుతాడు. ధరించడానికి పట్టువస్త్రములు తెప్పించి యిస్తాడు. ఆ ఇరువురు స్నేహితులూ చిన్ననాటి ముచ్చట్లు చెప్పకుంటారు. ఉన్నట్లుండి "కుచేలా! నాకోసం ఏం తెచ్చావు?" అని అడుగుతాడు శ్రీకృష్ణుడు. తాను తెచ్చిన అటుకుల మూటను చూపించడానికి సిగ్గుపడుతాడు కుచేలుడు కాని, శ్రీకృష్ణుడు ఆ మూటను లాక్కొని విప్పి, ఆ అటుకులను సంతోషంగా తింటాడు.

మరునాడు తన స్నేహితుని వద్ద శలవు తీసుకొని ఇంటికి చేరుతాడు కుచేలుడు. తన పూరిల్లు ఎక్కడ ఉన్నదా? అని వెదుకుతుంటాడు. ఇంతలో ఒక భవనం నుండి అతని భార్య బయటకు వచ్చి *'ఇదేనండీ మన ఇల్లు!'* అంటుంది. కుచేలుడు ఆశ్చర్యపోతాడు. ఆ భవనంలోకి వెళ్ళి జరిగినదంతా తన భార్యకు చెబుతాడు.

ఈ ఉదంతం మనకొక గొప్ప ఆదర్శమును బోధిస్తున్నది. ***నిజమైన స్నేహానికి హద్దులు ఉండవు. ఉన్నవారు, లేనివారు అనే తారతమ్యం కూడా ఉండదు. అదే నిజమైన స్నేహం. అట్టి వారే నిజమైన స్నేహితులు.***



---

**"A friend in need is a friend in deed"**

అక్కరకు ఆదుకొనేవాడే నిజమైన స్నేహితుడు.

# సోమరితనము

'An Idleman's Brain is devil's work shop' సోమరితల దయ్యాల కొంప గదా! పని లేనివానికి అనేక పిచ్చిపిచ్చి ఆలోచనలు వస్తుంటాయి. ***సోమరితనం ప్రగతికి అవరోధం.*** సోమరి ప్రధాన లక్షణం 'బద్ధకం'. ఇది చాలా చెడ్డగుణం. ముఖ్యంగా విద్యార్థులలో ఉండకూడని 'దుర్గుణం'. ఈవేళ చేయవలసిన పని 'రేపు' చేద్దాములే! అని వాయిదా వేస్తుంటారు సోమరులు. ***'ఆలస్యం అమృతం విషం గదా!'*** ఒక్కొక్కప్పుడు ఆలస్యం చేస్తే అమృతం కూడా విషమైపోతుంది. సోమరులు దేనినీ సాధించలేరు. కనుక దీనిని దరికి చేరనీయరాదు.

'Laziness is Rust and dust' (సోమరితనం తుప్పు, ధూళి) ఇనుము మీద తుప్పు మరియు ధూళి ఉండటంవలననే అయస్కాంతం దానిని ఆకర్షించలేక పోతున్నది. అదే విధముగ 'బద్ధకం' అనే దుర్గుణం ఆవరించడంవలన విద్యార్థులు ప్రగతిని సాధించలేకపోతున్నారు. కనుక ***సోమరితనాన్ని పారద్రోలాలి.***

**సోమరి శిష్యుడు :**

అది ఒక ఆశ్రమం. ఒకనాడు సూర్యాస్తమయ సమయంలో పెనుగాలి వీస్తుంది. గురువుగారి కుటీరం పైనున్న తాటాకులు కొన్ని లేచిపోతాయి. శిష్యుడ్ని పిలిచి ఎగిరిపోయిన తాటాకులు తెచ్చి కప్పమంటాడు. ఆ శిష్యుడు మహాబద్ధకస్తుడు, సోమరి. కూర్చున్న చోట నుండి కదలడు, మెదలడు, మాటలు మాత్రం బాగా చెప్పగలడు. పని చేయడు. ఆ సోమరి శిష్యుడు ***"గురూజీ! ఇప్పుడు చీకటి పడింది. ఈ కటిక చీకటిలో ఎక్కడ వెదుకుదును? వెదికినా తాటాకులు కనిపించునా? ఒక వేళ కనిపించినా, వాటినితెచ్చి కుటీరంపై కప్పట సాధ్యమా? రేపుప్రొద్దున తెచ్చి కప్పెదను. క్షమించండి!"*** అని బదులు చెబుతాడు.

ఆ రోజు రాత్రి వర్షంకూడా బాగా కురిసింది. కుటీరమంతా తడిసింది. గురువుగారికి రాత్రంతా నిద్రలేదు. తెల్లవారింది. కాని, వర్షం పడుతునే ఉన్నది. ఎంత పెద్దగా కేకలు వేసినా శిష్యుడు రాలేదు. శిష్యుని కుటీరంవద్దకే గురువుగారు తడుస్తూ వెళ్ళుతాడు. నిద్రపోతున్న శిష్యుని లేపి ***"ఒరే శంభూ! రెండు ఆకులు తీసుకొనివచ్చి కప్పరా!"*** అని బ్రతిమాలుతాడు. ***'స్వామీ! వర్షం కురుస్తుంటే కప్పటం సాధ్యం కాదు. వర్షం వెలిసినవెంటనే కప్పతాను స్వామీ!"*** అని బదులు చెబుతాడు శిష్యుడు. చేసేదేమిలేక గురువుగారు తిరిగివెళ్ళుతాడు. కొంతసేపటికి వర్షం ఆగిపోతుంది. శిష్యుని పిలిచి

ఆకులు తెచ్చి కప్పమంటాడు. శిష్యుడు వస్తాడు, ఆకాశం చూస్తాడు. *"గురూజీ! వర్షం ఆగిపోయింది గదా! ఇంకా కప్పటం దేనికి? మరల వర్షం వస్తే కప్పుతాను"* అని చెప్పి వెళ్ళిపోతాడు శిష్యుడు.

శిష్యుని సోమరితనాన్ని చూచి గురువుగారు చాలా బాధపడుతాడు. వాయిదా వేసి తప్పించుకోవటం సోమరి ప్రధాన లక్షణం. చేయవలసిన పనిని సకాలంలో చేయరు బద్ధకస్తులు. సోమరితనం గలవారు తమను తామే రక్షించు కోలేరు, ఇక ఇతరులకు ఏవిధంగా సహాయపడగలరు?

**సోమరికి శిక్ష:**

మానవుని సృష్టించాడు సృష్టికర్త. తాను సృష్టించిన మానవుని అవయవములు ఏవి, ఎట్లా పనిచేస్తున్నాయో ఒకసారి పరిశీలించాలను కున్నాడు. ఆ విధంగా అన్ని అవయవాలు కార్యకలాపాలను పరీక్షిస్తుంటే కుడిచేయికి, ఎడమచేయికి పెద్ద తేడా కనిపించింది. కుడిచేతిలో కనిపించిన కార్యదక్షత, కార్యకుశలత్వము, కార్యోత్సాహం, ఎడమ చేతిలో కనిపించలేదు. పైపెచ్చు ఎడమ చేతిలో అలసత్వము (సోమరితనం) కనిపించింది. ఆశ్చర్యం వేసింది. ఒకనాడు రెండు చేతులను తనవద్దకు పిలిపించుకున్నాడు. ***"ఓ చేతులారా! మీ ఇద్దరిని ఒకే సమయాన నేను సృష్టించాను. అయితే మీలో, కుడి చేయి పనిచేయటంలో చాలా ఉత్సాహాన్ని చూపుచున్నది. ఎడమ చేయి సోమరితనాన్ని అలవాటు చేసుకున్నది. కాబట్టి కుడి చేయికి ఒక వరమును ప్రసాదిస్తున్నాను, దేవుని పూజ చేయు అధికారం కుడి చేయికి అనుగ్రహిస్తున్నాను"*** అని చెప్పాడు సృష్టికర్త.

ఎడమచేయి చాలా బాధపడి ***"మహా ప్రభో! నాకు కూడా ఏదైనా వరమును ప్రసాదించండి!"*** అని వేడుకుంది. అప్పుడు సృష్టికర్త ***"నీకు వరమును ఇవ్వను. నీవు పరమ సోమరివి, ఒక్క పనిలో కూడా నీవు ఉత్సాహమును చూపటంలేదు"*** అని తిరస్కరిస్తాడు. అప్పుడు ఎడమచేయి "వరము ఇవ్వకపోయిననూ, ఏదైనా ఒక్కపని అయినా చెప్పండి. దానిని ఆచరించుతూ ఉంటాను" అని ప్రాధేయ పడుతుంది. అప్పుడు సృష్టికర్త "ప్రతి రోజూ నిద్రలేవగానే బహిర్ భూమికి వెళ్ళుతావు గదా! ఆ పనిని నీకు యిచ్చాను ఆచరించు!" అని చెబుతాడు.

ఈ కథలో ఒక మంచి నీతి ఉన్నది. సోమరితనమునకు తగిన శిక్ష విధించాడు సృష్టికర్త. కనుక ప్రతివ్యక్తి సోమరితనానికి తిలోదకాలివ్వాలి. అలసత్వమును దరికి చేరనీయక ఉత్సాహంతో కార్యదీక్షాదక్షులు కావాలి.

# పరోపకారబుద్ధి

'పరోపకార బుద్ధి' అన్ని బుద్ధులలో మిక్కిలి శ్రేష్ఠమైనది. పరులకు ఉపకారం చేయటమే 'పరోపకారము'. అయితే ఉపకారం చేసేటప్పుడు మనలో ఎట్టి స్వార్థం ఉండకూడదు. ప్రతిఫలాన్ని ఆశించకుండా ఇతరులకు ఉపకారం చేయాలి. నిస్వార్థబుద్ధితో సహాయం చేయటమే నిజమైన 'పరోపకారము'.
ఇదే భావమును ఈ నీతి శ్లోకం విశదీకరిస్తున్నది.

**"పరోపకారాయ ఫలంతి వృక్షాః**
**పరోపకారాయ వహంతి నద్యః**
**పరోపకారాయ దుహంతి గావః**
**పరోపకారాయ సతాం విభూతయః"**

అనగా ***"పరోపకారము కొఱకు వృక్షములు ఫలముల నిచ్చుచున్నవి. పరోపకారము కొఱకు నదులు ప్రవహించుచున్నవి. పరోపకారము కొఱకు గోవులు పాలను యిచ్చుచున్నవి. పరోపకారము కొఱకే సజ్జనుల యొక్క సంపదలు వినియోగపడుతున్నవి"*** అని అర్థం.

వృక్షములకు, నదులకు, గోవులకు ఎట్టి స్వార్థం లేదు. పరోపకారమే వాటి పరమావధి. అదే విధముగా సజ్జనులలో కూడా స్వార్థం కనిపించదు. నిరంతరం ఇతరులకు సహాయపడటమే సజ్జనుల లక్ష్యం. కనుక ***పరోపకారబుద్ధిని ప్రతిఒక్కరూ పెంపొందించుకోవాలి.***

**చిన్నకథ :**

యుద్ధంలో గాయపడిన ఒక సైనికుడు చంకకర్రల సహాయంతో తన గ్రామానికి బయలుదేరుతాడు. నడవలేక దారిలో కనిపించిన ఒక సత్రంలో విశ్రమిస్తాడు. తినటానికి అన్నం వుండదు, సపర్యలు చేసేవారు అంతకన్నా ఉండరు. బాధతో మూలుగుతూ పడుకొని వుంటాడు. ఏదైనా కొనుక్కొని తినాలంటే డబ్బులు కావాలి గదా! డబ్బులు లేవు. ఆకలి అవుతుంటుంది, పెట్టేవారులేరు. మంచినీళ్ళు త్రాగి పడుకుంటాడు. నిత్యమూ ఒక పేద బాలిక అదే దారిలో బడికివెళ్ళి వస్తుంటుంది. సత్రంలో పడుకొని వున్న ఆ సైనికుడ్ని చూచి జాలిపడుతుంది. బడినుంచి తిరిగి వచ్చేటప్పుడు రెండు నాణెములు తెచ్చి యిస్తుంది. ఆ విధంగా ప్రతిరోజు సాయంత్రం డబ్బులు తెచ్చి ఆ సైనికుడికి యిచ్చి వెళ్ళుతుంటుంది. ఆ డబ్బులతో తినుపదార్థములను కొనుక్కొని కడుపు నింపుకుంటుంటాడు ఆ సైనికుడు.

సైనికుడికి ఆశ్చర్యం వేస్తుంది. ఒకరోజు ఆ బాలికను దగ్గరకు పిలిచి *"అమ్మాయీ! నీ తల్లిదండ్రులు అతి పేదవారని ఈ రోజుననే విన్నాను. ప్రతి దినం నాకు డబ్బులు యిస్తున్నావు. ఈ డబ్బులు నీకు ఎక్కడివి? ఎవరిస్తున్నారు? నీ తల్లిదండ్రులకు తెలుసా? దాచక నిజం చెప్పు!"* అని అడుగుతాడు. అప్పుడు ఆ బాలిక *"నేను నీకు యిస్తున్న డబ్బులు, నేను సంపాదిస్తున్నవే! నేను బడికి పోయే త్రోవలో అడవి వున్నది. రేగిపండ్లు దొరుకుతాయి. వాటిని తీసుకొని వెళ్ళి, బడిలోని తోటి బాలికలకు అమ్మి డబ్బు సంపాదిస్తున్నాను. ఆ డబ్బులే నీకు యిస్తున్నాను. దొంగిలించి యివ్వటంలేదు"* అని చెబుతుంది. సైనికుడు ఆశ్చర్యపోయి *"ఈ విషయం నీ తల్లిదండ్రులకు తెలుసా?"* అని అడుగుతాడు. *"బాగా తెలుసు. నన్నేమి అనరు. లోకంలో మనకంటే దరిద్రులు చాలా మంది ఉన్నారు. మనకున్న దానిలో కొంత బీదలకు పెట్టటం మంచిదని నాతో ఎప్పుడూ చెబుతుంటారు. అందువల్ల నేను యీ విధంగా చేస్తున్నాను"* అని చెబుతుంది ఆ బాలిక. అప్పుడు ఆ సైనికుడు కంట తడిపెట్టి *"నీకూ, నీ తల్లిదండ్రులకు శుభము కలుగు గాక!"* అని ఆ బాలికను ఆశీర్వదించుతాడు.

**చిన్న సంఘటన :**

ఒకసారి ఒక గొప్ప ఉద్యోగి అదే బాటన గుర్రము మీద వెళ్ళుతుంటాడు. గుర్రమునకు నీళ్ళుపెట్టడానికి ఆ సత్రం దగ్గర ఆగుతాడు. అక్కడ పడుకొని వున్న సైనికుడ్ని చూచి గుర్తుపడుతాడు. ఆ సైనికుడు అంతకు పూర్వం అతని క్రింద పని చేసినవాడేనని తెలుసుకుంటాడు. సత్రం యజమానిని పిలిచి కొంత డబ్బుయిచ్చి, ఆ సైనికునికి మందు యిప్పించమని, అన్నం పెట్టమని ఆదేశిస్తాడు. నిత్యమూ సహాయం చేస్తున్న బాలిక వివరాలు తెలుసుకొని తిన్నగా వాళ్ళింటికి వెళ్ళుతాడు. తల్లిదండ్రుల వద్దనున్న ఆ అమ్మాయిని చూచి *"అమ్మాయీ! నీ పరోపకారబుద్ధికి నేనెంతో సంతోషిస్తున్నాను. నీకు కొన్ని బంగారు నాణెములు యిస్తున్నాను. ఈ సంచీతీసుకో!"* అని ఒక సంచీని ఆ బాలికకు యిస్తాడు. అప్పుడు ఆ తల్లిదండ్రులు ఆశ్చర్య పడుతూ *"అయ్యా! ఇంతసొమ్ము తీసుకునే అర్హత మాకులేదు. మాకు వద్దు బాబూ!"* అని చెప్పినప్పటికీ వినక ఆ సంచీనిచ్చి ఆ ఉద్యోగి వెళ్ళిపోతాడు.

ఈ సంఘటన మనకు ఒక సందేశాన్ని అందిస్తున్నది. బీదవారు సహితం తనకున్నదానిలో ఇతరులకు చేతనైనంత సహాయం చేయాలి. ప్రతిఫలాన్ని ఆశించకుండా సహాయం చేసిన వారికి దైవానుగ్రహము లభిస్తుంది. ఏదో ఒక రూపంలో, ఎవరో ఒకరు వచ్చి సహాయపడుతారు. పరోపకారము చేయువారికి ఇహమునందు మేలు కలుగుతుంది, పరమునందు ముక్తిని పొందుతారు. కనుక ***పరోపకార బుద్ధిని ప్రతి ఒక్కరూ పెంపొందించుకోవాలి.***

# దూరదృష్టి

జీవితంలో విజయాన్ని సాధించవలెననిన 'దూరదృష్టి' అత్యవసరం. ఆలోచించకుండా, తొందరపడి ఏ నిర్ణయం గైకొనరాదు, ఏ పనీ చేయరాదు. ఆలోచన చేయకుండా చేసే పనులు అనర్థాన్ని తెచ్చి పెడుతాయి. తొందరపాటుతనంవల్ల చేబట్టిన కార్యం చెడిపోతుంది. పూర్వా పరాలను చక్కగా విచారించి రానున్న ఆపదలను ముందుగానే పసిగట్టి, తరుణోపాయమును కనుగొనుటనే **'దూరదృష్టి'** అంటారు. కనుక ప్రతి ఒక్కరూ కార్యమును ప్రారంభించే ముందే, దూరదృష్టితో ఆలోచించి ప్రారంభించాలి.

ఈ విషయమును గురించిన కథ ఒకటి మహాభారతంలో ఉన్నది. దీనిని భీష్ముడు, ధర్మరాజుకు చెబుతాడు.

ఒక కొలనులో మూడు చేపలు ఉండేవి. వాటి పేర్లు 1. ***దీర్ఘదర్శి*** 2. ***ప్రాప్తకాలజ్ఞుడు*** 3. ***దీర్ఘసూత్రి.*** ఈ మూడింటిలో దీర్ఘదర్శి, దూరదృష్టికలది. రానున్న ఆపదలను ముందుగానే పసిగట్టి, తరుణోపాయాన్ని ఆలోచించి, ముందుజాగ్రత్త పడగల సామర్థ్యం కలది. రెండవ చేప అయిన ప్రాప్తకాలజ్ఞుడికి అటువంటి దూరదృష్టి లేదు. కొంత ప్రయత్నలోపం కూడా ఉన్నది. కాని ఆపదలు ముంచుకొని వచ్చినప్పుడు మాత్రం సమయస్ఫూర్తితో వ్యవహరించి, తప్పించుకొనే సామర్థ్యం మాత్రం దానికి కలదు. మూడవ చేప అయిన దీర్ఘ సూత్రికి దూరదృష్టి అసలే లేదు. సమయస్ఫూర్తి అంతకన్నా లేదు. ఏ ప్రయత్నమూ చేయని సోమరి అది. స్వల్పకాలంలో చేయవలసిన చిన్నపనిని కూడా గంటల తరబడి చేయుస్వభావం కలది. ఎట్లా జరుగవలసి వుంటే అట్లా జరుగుతుందనే స్వభావం కలది.

ఈ మూడు చేపలూ నివసిస్తున్న ఆ కొలనును చూడటానికి ఒకరోజు సాయత్రం బెస్తవారు వచ్చారు. బాగా బలిసి వున్న చేపలను చూచి మురిసిపోయారు. మరునాడు ఉదయం వలలు తీసుకొని వచ్చి చేపలను పట్టుకుందామని వారిలో వారు సంప్రదించుకొని ఇండ్లకు తిరిగి వెళ్ళారు. ఆ బెస్తవారి మాటలను ఆ మూడు చేపలు విన్నాయి. అందులో మొదటి చేప అయిన 'దీర్ఘదర్శి' రానున్న ఆపదను గ్రహించి, మిగతా రెండు చేపలను హెచ్చరిస్తుంది. ఆ బెస్తవారు రాకమునుపే ఆ కొలను వదిలి, మరొక కొలనుకు చేరటం మంచిదని హితవు చెబుతుంది. కాని మిగతా రెండు చేపలు దీర్ఘదర్శి మాటలను ఖాతరు చేయవు. రెండవ చేప అయిన 'ప్రాప్తకాలజ్ఞుడు'

ఎప్పుడో రానున్న ఆపదలను గురించి, యిప్పటినుంచే అనవసరంగా బుర్ర చెడగొట్టు కోవడం అనవసరమని చెబుతుంది. మూడవ చేప అయిన 'దీర్ఘసూత్రి' మాత్రం వేదాంతం చెబుతుంది. మరణించే కాలం వస్తే, ఎక్కడనున్నా తప్పించుకోలేమని శ్రీరంగనీతులు పలుకుతుంది. రెండు, మూడు చేపలు చెప్పిన మాటలు విని మొదటి చేప అయిన 'దీర్ఘదర్శి' వాళ్ళ అవివేకమునకు చింతించి, ఆ కొలనును మరుక్షణంలోనే వదలి మరొక కొలనును చేరి సురక్షితంగా ఉంటుంది.

మరునాడు ఉదయమే జాలరులు, వలలు తీసుకొనివచ్చి, ఆ కొలనులో వేస్తారు. ప్రాప్తకాలజ్ఞుడు, దీర్ఘసూత్రి ఆ వలలో చిక్కుకుంటారు. జాలరులు వాటిని పైకి తీసి ఒడ్డున పడవేస్తారు. రెండవ చేప అయిన 'ప్రాప్తకాలజ్ఞుడు' వచ్చిన ఆపదను గ్రహించి, సమయస్ఫూర్తితో, చచ్చినదానిలా కదలక మెదలక పడి ఉంటుంది. ఆ చచ్చిన చేపదేనికని భావించి, జాలరులు దానిని తిరిగి కొలనులో విసిరి పారేస్తారు. బ్రతికాను కదాయని, కొలనులోపలికి వెళ్ళి ప్రాణాలను రక్షించుకుంటుంది. మూడవ చేప అయిన దీర్ఘసూత్రి మాత్రం స్వబుద్ధినుప్రయోగించక, ఒడ్డున పడి గిలగిలా కొట్టుకుంటూ వుంటుంది. బాగా బలిసిన చేప దొరికిందనే సంతోషంతో, ఆ జాలరులు ఆ చేపను బుట్టలో వేసుకొని, ఇంటికి తీసుకొని వెళ్ళి కోసి కూరవండుకొని తిని హాయిగా పడుకుంటారు.

ఈ కథవల్ల మనం ఒక నీతిని నేర్చుకోవాలి. అదేమనగా మొదటి చేప అయిన 'దీర్ఘదర్శి' యొక్క దూరదృష్టిని ప్రతిఒక్కరూ కలిగి ఉండాలి. అటువంటి ముందుచూపు గలవారు మాత్రమే ఆపదలలో చిక్కుకొనరు. ***దూరదృష్టి కలవారు మాత్రమే విజయాలను సాధించగలరు.***

రెండవ చేప అయిన 'ప్రాప్తకాలజ్ఞుడు' లాగే కష్టములొచ్చి మీద పడేదాకా మెదలకుండా కూర్చోకూడదు. ఒక వేళ అనుకోకుండా, దురదృష్టవశాత్తు ఆపదలు వచ్చి మీద పడితే మాత్రం 'ప్రాప్తకాలజ్ఞుడు' చూపిన ***సమయస్ఫూర్తిని చూపి ఆపదలనుండి కడుచాతుర్యంగా బయట పడటం నేర్చుకోవాలి.***

మూడవ చేప అయిన 'దీర్ఘసూత్రి'లాగా ఎవరూ ప్రవర్తించ కూడదు. అది వల్లించినట్లుగా మెట్టవేదాంతం చెప్పినందువల్ల ప్రయోజనం వుండదు. ప్రయోజనం వుండకపోగా ప్రమాదాలు కూడా సంభవిస్తాయి.

*కనుక ప్రతిఒక్కరికీ 'దూరదృష్టి' అత్యవసరం. సమయస్ఫూర్తి కూడా ఉండాలి.*

**ముంగీస పాము :**

పూర్వం ఒక గ్రామంలో ఒక చదువుకున్న పండితకుటుంబం ఉండేది. ఎంతో కాలానికి వారికి ఒక చిన్నారి కలిగింది. ఎంతో ప్రేమగా పెంచుకుంటున్నారు. ఆ పిల్లతో పాటు ఒక ముంగిసను కూడా వీరు పెంచుకుంటున్నారు. ఒక రోజున ఉదయం భార్య నదికి వెళ్ళుతుంది. అదే సమయంలో ఆ పండితునికి రాజుగారి నుండి ఆహ్వానం వస్తుంది. ఎంతో కాలం నుండి రాజుగారి ఆహ్వానం కోసం ఎదురుతెన్నులు చూస్తున్న ఆ పండితునికి ఏమీ తోచక, ముంగిసను ఆ పసిపాపకు కాపలా వుంచి రాజుగారి కొలువుకు వెళ్ళుతాడు. ఇంతలో ఒక సర్పం ఆ ఇంటికి వచ్చి, ఆ పసిపాపను కాటు వేయబోతుంటుంది. అప్పడు ఆ ముంగిస దానితో పోరాడి ఆ పామును చంపివేస్తుంది. విజయగర్వంతో, ఆ నెత్తురు మూతితోనే పండితునికి ఎదురుగా పోతుంది ముంగిస. తన పసిపాపను చంపి ముంగిస వస్తున్నదని భావించి ఆ పండితుడు కోపంతో ఆ ముంగిసను కర్రతో కొడుతాడు. ముంగిస చనిపోతుంది. ఆ పండితుడు లోపలికి వెళ్ళి చూడగా పసిపాప కేరింతలు కొడుతూ ఆడుకుంటూ వుంటుంది. పాము చచ్చి ప్రక్కనే పడి వుంటుంది. కోపంతో తాను చేసిన పనికి పండితుడు చింతిస్తాడు. ప్రేమతో పెంచిన ముంగిసను తన చేతులతోనే చంపి నందులకు విచారిస్తాడు కాని ప్రయోజనం ఉండదుగదా!

ఈ కథ మనకు ఒక నీతిని బోధిస్తున్నది. ***అసలు జరిగినదేమిటో తెలుసుకోకుండా, తొందరపడి నిర్ణయాలు గైకొనరాదు. తొందరపాటు చర్యల వలన జరగరానివి జరుగుతుంటాయి. తరువాత విచారించి ప్రయోజనం ఉండదు. అనాలోచితంగా, ఉద్రేకంతో ఏ పనులూ చేయరాదు. దూరదృష్టితో వ్యవహరించాలి.***

---

"అభిమన్యునిలా పోరాడటం మానుకోవాలి, కుర్రతనంగా ప్రవర్తించరాదు. దూరదృష్టితో, మెళుకువతో నడుచుకోవడం నేర్చుకోవాలి. అభిమన్యునిలోని ధైర్యసాహసాలను మాత్రం అలవరచుకోండి"

**- హరి సర్వోత్తమరావు**

# వివేకం - విచక్షణ

ఈనాడు సాంకేతికపరిజ్ఞానం అభివృద్ధి చెందినది. రేడియో, టి.వి.లు వచ్చాయి. ఎక్కడో ఢిల్లీలో ఒక నర్తకి నాట్యం చేస్తుంటే, కొన్ని వేల కిలోమీటర్ల దూరాన ఉన్న మనం, మన ఇంట్లో కూర్చొని టి.వి.లో ఆ నర్తకి నాట్యాన్ని చూస్తూ ఆనందిస్తున్నాం. సాంకేతికజ్ఞానం అభివృద్ధి గాంచిన మాట వాస్తవమే. కాని ఆ పరిజ్ఞానంతో మానవ వినాశనానికి దోహద పడే అణుబాంబులను కూడా తయారు చేస్తున్నారు. ఎక్కడో ఒక గదిలో కూర్చొని 'రిమోట్' నొక్కితే చాలు! వేల కిలోమీటర్ల దూరాన వున్న పట్టణాలు కూడా ఒక్క క్షణంలో భస్మీపటలం అయిపోతాయి. ఈనాడు మానవుడు అంతటి సాంకేతిక పరిజ్ఞానాన్ని సంపాదించాడు. కాని మానవత్వం మాత్రం కనిపించటంలేదు. సహృదయం అసలే లేదు. విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయారు. వివేకం అంతకన్నా లేదు. విజ్ఞానం మాత్రం అభివృద్ధి అవుతున్నది. దీనివలన ప్రయోజనం ఏమిటి? ఇదే ఈనాటి ప్రశ్న?

***మానవత్వాన్ని కోల్పోయిన విజ్ఞానం మారణహోమానికి దారితీస్తుంది. సహృదయంలేని సాంకేతికపరిజ్ఞానం సర్వనాశనానికి దారితీస్తుంది. విచక్షణా రహితమైన నైపుణ్యం (Skill) వినాశనానికి దోహదం చేస్తుంది. ఆలోచనా రహితమైన మేధాశక్తి (Intel-lect) మానవ కళ్యాణానికి ఏ మాత్రం ఉపయోగపడదు. ఈనాడు మేధాశక్తి (Intellect)కి, నైపుణ్యానికి (Skill) మధ్య సమతూకం (Balance) లోపించటం వలననే, ప్రపంచంలో నేడు తరచుగా ఉప్పెనలు, తుఫానులు, భూకంపాలు సంభవిస్తున్నాయి.***

విషయపరిశోధనకు విజ్ఞానం ఎంత అవసరమో పరిశోధనా ఫలితాలను వినియోగించడానికి **'వివేకం'** అంత అవసరం. పరిశోధనవలన సంపాదించిన సాంకేతికపరిజ్ఞానమును ఎప్పుడు, ఎక్కడ, దేనికి ఉపయోగించాలో అవసరమైన 'విచక్షణా జ్ఞానం' కూడా ఉండాలి. కనుక ప్రతివిద్యార్థి విజ్ఞానాదులను అభివృద్ధి పరచుకుంటూ, వివేక విచక్షణా జ్ఞానములను కూడా పెంపొందించుకోవాలి. వివేకం లేని విద్య, విచక్షణా జ్ఞానం లేని విజ్ఞానం వలన ప్రయోజనం లేదు. ప్రయోజనం లేకపోగా ప్రమాదాలను కూడా తెచ్చి పెడుతాయి. కనుక ప్రతివిద్యార్థి ***విద్యతో పాటు వివేకమును, విజ్ఞానంతోపాటు విచక్షణా జ్ఞానాన్ని అభివృద్ధి పరచుకోవాలి.***

**వివేకం అవసరం :**

ఏసుక్రీస్తు ఒకసారి ఒక నగరవీధులలో నడిచి వెళ్ళుతున్నాడు. దూరాన నుంచి అరుపులు, కేకలు వినిపిస్తున్నాయి. దగ్గరకు వెళ్ళి చూచాడు. ఒక మురుగు

కాలువ ప్రక్కన ఒక యువకుడు తప్పత్రాగి పడి వున్నాడు. అతని బంధువులు చుట్టూ చేరి ఏడుస్తుంటారు. ఆ యువకుడి ముఖాన నీళ్ళు చల్లి లేపి ఏసుక్రీస్తు *"నాయనా! ఇలా ఎందుకు త్రాగావు?"* అని అడుగుతాడు. అప్పుడు ఆ యువకుడు *"నేను ఒకప్పుడు కుష్ఠురోగంతో బాధపడే వాడిని. ఆ రోగమును మీరే నయం చేశారు. ఆ ఆనందంలో త్రాగటం అలవాటు చేసుకున్నాను"* అని జవాబు యిస్తాడు.

ఏసుక్రీస్తు మరికొంత దూరం వెళ్ళాడు. అక్కడ ఒక యువకుడు కామవాంఛతో ఒక యువతిని బలాత్కారం చేస్తుంటాడు. ఆ దృశ్యం చూచిన ఏసుక్రీస్తు, ఆ యువకుడితో *"నాయనా! వ్యభిచారం నేరం కాదా! అందులో ఇష్టం లేని యువతిని బలాత్కారం చేయటం మహాపాపం!"* అని మందలించడానికి ప్రయత్నిస్తాడు. అప్పుడు ఆ యువకుడు *"స్వామీ! నేను గ్రుడ్డివాడను. నన్ను కరుణించి లోగడ నాకు మీరే దృష్టిని ప్రసాదించారు. అప్పటి నుంచి లోకంలోని అందాలన్నింటినీ చూడగలుగుతున్నాను కాబట్టి, వాటిని అనుభవించాలనే కోరిక నాలో జనించింది"* అని ధైర్యంగా ఆ యువకుడు సమాధానం చెప్పాడు.

మానవాతీత శక్తులవలన ఏసుక్రీస్తు వారివారి బాధలను నివారించగలిగాడు. కాని వారు తమకు కలిగిన మేలును సద్వినియోగ పరచుకొనక తప్పడు మార్గంలో నడిచారు. ***భగవంతుడు చేసిన మేలును సద్వినియోగపరచుకొనే 'వివేకము' వారిలో లేకపోవటంవలన వారు చెడు మార్గాన నడిచారు. కనుక ప్రతిఒక్కరూ వివేక జ్ఞానమును పెంపొందించుకోవాలి.***

## వివేక-విచక్షణలు :

సైన్సు చెడ్డదికాదు. సైన్సువలన మానవాళికి ఎంతో మేలు జరుగుతున్నది. అయితే ఈనాడు ఆ సాంకేతిక విజ్ఞానం మంచికన్నా చెడుకే ఉపయోగపడుతున్నది. అణుశక్తి మంచికీ ఉపయోగపడుతుంది. చెడుకూ ఉపయోగపడుతుంది. అణుశక్తి ద్వారా కొన్ని కోట్ల కిలోవాట్ల శక్తి గల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసి పరిశ్రమలను, వ్యవసాయ మును అభివృద్ధి పరచవచ్చును. అదే అణుశక్తి మానవవినాశనానికి కూడా ఉపయోగపడుతుంది. తాము కనిపెట్టిన శక్తిని చెడుకు, సంక్షోభానికి, సర్వ నాశనానికి గాక, మంచికి, మానవ కళ్యాణమునకు, అధికోత్పత్తికి ఉపయోగపడే విధంగా చూడటమునే 'వివేకజ్ఞానం' అంటారు. *కనుక మనం చేయు ప్రతి పనిలో 'వివేకం' ఉండాలి, 'విచక్షణ'ను ప్రదర్శించాలి.* ఒక్క *శాస్త్రజ్ఞానముతోనే సంతృప్తి జెందరాదు. వివేక విచక్షణాజ్ఞానములను కూడా అభివృద్ధి* పరచుకోవాలి.



# మహాత్మా గాంధీజీ

*'మీకు ఒక్కరోజు వైస్రాయి పదవి ఇచ్చారనుకోండి! అప్పుడు మీరు ఏం చేస్తారు?'*
అని ఒక విదేశీయుడు అడుగుతాడు.

*'వైస్రాయి భవనం ప్రక్కన ఉన్న హరిజనవాడలను శుభ్రం చేస్తాను'*
అంటాడు ఆ మహాత్ముడు.

*'మీ వైస్రాయి పదవి మరో రోజు పొడిగించుతే!'* అని అడుగుతాడు ఆ విదేశీయుడు.

*'మరునాడు కూడా సరిగ్గా ఆ పనే చేస్తా!'*
అని తడుముకోకుండా సమాధానం చెబుతాడు ఆ మహాత్ముడు.

ప్రతి దేశంలోనూ మహాత్ములు ఎందరో జన్మిస్తుంటారు. కాని ఈ మహాత్ముడు మాత్రం భారతదేశంలో జన్మించాడు. మానవత్వం మూర్తీభవించిన మానవతావాది ఈ మహాత్ముడు. మానవత్వంతో దానవత్వాన్ని జయించాడు ఈ మహాత్ముడు. అహింసతో హింసను ఓడించాడు ఈ మహాత్ముడు. అంటరానితనంపై నిరంతర పోరాటం కొనసాగించాడు ఈ మహాత్ముడు. *ఆ మహాత్ముడే మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ.* ఆయనే మహాత్మా గాంధీగా పేరు గాంచారు. *'మహాత్మా గాంధీ'* అనగానే అందరి మనసులలో ఈయనే మెదలుతాడు. నిజంగా ఆయన అక్షరాలా మహాత్ముడే!

ఒకసారి గాంధీజీ, ఉపన్యసించడానికి ఒక పల్లెటూరు వెళ్లుతారు. ఒక పెద్ద పందిరి నిర్మిస్తారు ఆ గ్రామస్థులు. ఎంతో మంది పెద్దలు గాంధీజీ ఉపన్యాసం వినడానికి ఆ చల్లని పందిరిలోకి వచ్చి కూర్చుంటారు. కాని కొంతమంది మాత్రం, ఆ పందిరికి దూరంగా గుమికూడి ఉంటారు. దూరంగా వున్న ఆ గుంపుని చూచి *'వాళ్ళెవరు?'* అని

ప్రశ్నిస్తాడు గాంధీజీ. *'వాళ్ళు హరిజనులు'* అని నిర్వాహకులు సమాధానం చెబుతారు. అప్పుడు గాంధీజీ *'హరిజనులకు కనుక ఇక్కడ చోటు లేకపోతే, నాకు ఇక్కడ చోటు లేదు'* అంటూ వేదిక దిగి, గుంపుగా నిలుచొనివున్న హరిజనుల దగ్గరకు వెళ్ళి, వాళ్ళతో మాట్లాడటం మొదలు పెడుతాడు. ఆ గ్రామస్థులు తమ తప్పను తెలుసుకొని, క్షమించమని కోరుతారు.

గాంధీజీ చిన్ననాట ఒక ప్రాణమిత్రుడు ఉండేవాడు. అతని పేరు *'యుకా'*, అతను వీధులూడ్చే పాకీవాని కొడుకు. ఒకసారి ఆ పిల్లవాడిని తన ఇంటికి రమ్మనమని పిలుస్తాడు. వస్తాడు గాని ఇంట్లోకి రాకుండా బజారులోనే నుంచుంటాడు. గాంధీ పరుగెత్తుకొని ఇంట్లోకి వెళ్ళి మిఠాయిల్ని తీసుకొని, ఆ కుర్రవానికి యివ్వడానికి బయటకు వెళ్ళగా *'బాబూ! దగ్గరకు రాకండి ! నన్నంటుకోకండి ! అక్కడ పెట్టండి ! నేనే తీసుకుంటా!'* అంటాడు. *'ఏం అంటుకుంటే? ఏమవుతుంది?'* అంటూ ఆ మిఠాయిల్ని అతని చేతిలో పెడుతాడు. కిటికీలో నుంచి గాంధీ తల్లి చూస్తుంది, కోపంతో గాంధీని మందలిస్తుంది. *"అమ్మా! వాడుకూడా మనలాంటి మనిషే గదా! ఏం ముట్టుకుంటే?"* అని తల్లిని అమాయకంగా అడుగుతాడు గాంధీ. ఏం చెప్పాలో అర్థంకాక ఆ తల్లి నివ్వెరబోతుంది. అంటరానితనం అంటే అంతటి ఏవగింపు చిన్ననాటనే కలిగింది గాంధీకి. అతని వయసుతో పాటు, అంటరానితనం యెడల అతని భావాలు కూడా పెరిగి పెద్దవై ఒక గొప్ప మహా సంస్కర్తగా యావత్ ప్రపంచంలోనే పేరు ప్రఖ్యాతులను తెచ్చుకున్నారు మహాత్మాగాంధీజీ.

మహాత్మాజీ పేరు చెప్పగానే *'హరిజనోద్ధరణ'* ఆయన ప్రధాన ఆశయమని, సత్య, అహింసలు ఆయన చేబట్టిన ఆయుధాలని ప్రతి ఒక్కరికీ బాగా తెలుసు. గాంధీజీ ప్రబోధించిన మహోన్నత సూత్రాలు సత్యం, అహింసలు. *'సత్యం విస్మరించి, స్వేఛ్ఛ సాధించడం కన్న దేశం నాశనమైనా నేను విచారించను'* అంటారు గాంధీజీ. గాంధీజీకి 'సత్యం' యెడల ఎంతటి గౌరవముండేదో! సత్యమునకు ఎంతటి ప్రాముఖ్యతనిచ్చేవారో! ఆయన మాటలే ఋజువు చేస్తున్నాయి. *'సత్యమే దైవం'* (Truth is God) అని అసత్యమే మహా పాపమని భావించేవారు గాంధీజీ.

*'అహింసా పరమోధర్మః'* అనే సిద్ధాంతానికి కట్టుబడి ప్రచారం చేయడమేగాక నిజజీవితంలో ఆచరించి చూపించారు గాంధీజీ. *'సత్యం, అహింసలు అవిభాజ్యములు.*

*అవి నాణెపు రెండు ముఖములు. ఏ వైపు అరిగినా ఆ నాణెం చెల్లదు. సత్యం అన్వేషించే వ్యక్తి తప్పనిసరిగా అహింసా పథమును అనుసరించక తప్పదు. అలాగే సత్యమును అనుసరించని వానికి అహింస సాధ్యపడదు. అందుచేత ప్రతి వ్యక్తీ తనలో అంతర్గతమై ఉన్న అహింసా విధానాన్ని అనుసరించి ఆ పరమ సత్యాన్ని అన్వేషించాలి'* అని గాంధీజీ ప్రబోధించారు.

*"అస్పృశ్యతను సమూలంగా నిర్మూలించడానికే నేను జీవిస్తున్నాను. దాని కోసం ఆత్మార్పణం చేసుకోవడానికి కూడా నేను ఏమాత్రం వెరువను. నాకు మరో జన్మ అనేది ఉంటే అస్పృశ్యుడుగానే జన్మిస్తాను. అప్పుడు బాధలలో, కష్టాలలో, విచారములలో, అవమానములలో పాలు పంచుకునే అవకాశం నాకు లభిస్తుంది'* అని తన ఆవేదనను ఒకసారి వెలిబుచ్చారు గాంధీజీ. అస్పృశ్యతా నిర్మూలనకు గాంధీజీ ఎంతో శ్రమించారు. నిరసన దీక్షలు, సత్యాగ్రహాలు కూడా చేశారు. తన జీవితాన్ని ఆ ఉద్యమానికే అంకితం చేశారు.

*'సత్యాగ్రహం అంటే సత్యాన్వేషణ. సత్యం అంటే భగవంతుడు. నాకు సత్యాన్ని చూపే జ్యోతి 'అహింస'.* ఈ సత్యములోని భాగమే స్వరాజ్యం. *'స్వరాజ్యం నా జన్మ హక్కు'* అని మనం ఏ విధంగా భావిస్తున్నామో, దానిని సాధించడానికి *'సత్యాగ్రహం మన జన్మ హక్కు'* ఈ వాస్తవాన్ని విస్మరించకండి' అని గాంధీజీ ఎలుగెత్తి చాటారు.

*'జాతిపిత'* మహాత్మా గాంధీజీ ప్రధాన ఆశయాలైన ***'సత్యము, అహింస, హరిజనోద్ధరణ'*** లను ఆచరణలో పెట్టి చూపించడం మనందరి కర్తవ్యం. ***సత్యమును పలుకుదాం. అహింసను ఆచరణలో పెడదాం. హరిజనోద్ధరణ ఉద్యమానికి కంకణం కడదాం.*** ఇదే ఈనాటి మన కర్తవ్యం, విద్యుక్త ధర్మం. విస్మరించకండి!



---

"విద్యను దాచుకోవద్దు. పదిమందికీ పంచు. అది మరింత రాణిస్తుంది"

\- గాంధీ





# బాబూరాజేంద్ర ప్రసాద్

ఆయన ఇల్లు పాట్నానగరంలో పెద్దబంగళా. అందులో చాలా గదులు ఉండేవి. వచ్చిపోయేవారితో బంగళా నిత్యమూ కళకళలాడుతూ ఉండేది. ఎవరి పనుల నిమిత్తం వారు వచ్చేవారు. ఆ బంగళాలో ఉండటానికి మంచి వసతి ఉండేది కాబట్టి, అక్కడ ఉండి, ఎవరి పనులు వారు పూర్తిచేసుకొని, వెళ్ళేటప్పుడు, ఆ బంగళాయజమాని వద్దకు వెళ్ళి *'బాబుగారు! వెళ్ళివస్తాం'* అనేవారుట. అప్పుడు ఆ యజమాని *"మీది ఏ ఊరు? ఎక్కడికి వెళ్ళాలి? చార్జీలు ఉన్నాయా?"* అని అడిగి చార్జీలు, ఇతర ఖర్చులు యిచ్చి పంపేవారుట. ఆయన ఎవరో కాదు. ఆ త్యాగమూర్తే ***బాబూ రాజేంద్రప్రసాద్.*** ఆయన ప్రముఖ న్యాయవాది. న్యాయవాదవృత్తి ద్వారా, ఆ రోజులలోనే, ప్రతి నెలా వేలాది రూపాయిలు సంపాదించే గొప్ప ధనవంతుడు ఆయన.

ఒకసారి గాంధీజీ పిలుపునందుకొని, సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొనబోయే ముందు, తన భార్యను పిలిచి ***"నా వద్ద ఉన్నవి తొమ్మిది రూపాయిలు మాత్రమే ఉన్నాయి. ఇవి తీసుకో! నేను ఎప్పుడు తిరిగి వస్తానో! నాకే తెలియదు".*** అని చెప్పి ఉద్యమంలో పాల్గొనడానికి వెళ్ళుతాడు బాబూరాజేంద్ర ప్రసాద్. ప్రతి నెలా వేలాది రూపాయిలు సంపాదించే ఆ ధనవంతుడు, సత్యాగ్రహానికి వెళ్ళేటప్పుడు, తన భార్యకు కేవలం తొమ్మిది రూపాయిలు మాత్రమే ఇవ్వగలిగాడంటే, ఆయన నిత్యమూ చేసే వితరణ ఎంతటిదో ఆశ్చర్యం వేయక మానదు. ఆనాటి స్వాతంత్ర్య మహోత్సవంలో ఆయన చేసే త్యాగాలను చూచి, ప్రజలు ముగ్ధులై, ఆనాటి నుంచి ఆయనను ***'బీహార్ గాంధి'*** అని పిలిచేవారు.

ఆయన కాంగ్రేసు అధ్యక్ష పీఠాన్ని అలంకరించారు. స్వాతంత్ర్యానంతరం భారత రాజ్యాంగ పరిషత్ సభాధ్యక్షులైనారు. పది సంవత్సరాల పాటు భారత రాష్ట్రపతిగా అత్యున్నతమైన సేవలందించి మంచి పేరుప్రఖ్యాతులను గడించారు. స్వాతంత్ర్య ఉద్యమంలో తన సర్వస్వాన్ని సమర్పించారు. చిట్టచివరకు తన పెద్ద బంగళాను కూడా

క్రోల్పోయారు. పది సంవత్సరాల పాటు రాష్ట్రపతి పదవిలో ఉండి కూడా, తనదంటూ ఒక స్వంత ఇల్లును కూడా ఏర్పాటు చేసుకోలేకపోయారు. రాష్ట్రపతి పదవీ విరమణ చేసిన తరువాత 'సదాకత్' ఆశ్రమంలో ఒక ప్రక్క నివసిస్తూ, అక్కడనే ఆయన కన్ను మూశారు. ఇది నమ్మశక్యంకాని నగ్నసత్యం. ఎన్నో వేలమందికి ఆశ్రయాన్ని ఇచ్చిన ఆయనకు, చిట్టచివరకి ఆశ్రమమే గతి అయింది. ఆయన జీవితమే ఆయన సందేశం. ***చెట్టునాటేది ఒకరు, పోషించేది ఇంకొకరు, దాని ఫలితం అనుభవించేది మరొకరు. చెట్టు పేరు చెప్పి కాయలు అమ్ముకొనేవారు మరికొందరు. ఇదే ఈ నాటి పరిస్థితి.***

పూర్వం కలకత్తాలోని ప్రెసిడెన్సి కాలేజీలో ఒక నియమం ఉండేది. ఎంట్రన్స్ పరీక్షలో నెగ్గినవారికి మాత్రమే ఆ కాలేజీలో సీటు లభించేది. ఆ విధంగా ఎంట్రన్స్ పరీక్ష జరిగింది. ఆ కాలేజి ప్రిన్సిపాల్ తెల్లదొర. కరుకైనవాడు. అతనే ఫలితాలను ప్రకటించాడు. అందులో ఒక సాధుశీలుడైన, తెలివిగల విద్యార్థిపేరు లేదు. ఆ విద్యార్థిలేచి ***"సార్! నా పేరు చదువలేదేమిటి?"*** అని ప్రశ్నించాడు ***"నీ పేరు ఈ పట్టికలో లేదు. నీవు పరీక్షలో నెగ్గలేదు. అందువలన నీ పేరును, నేను ప్రకటించలేదు"*** అన్నాడు ప్రిన్సిపాల్. ***"నేను ఈ పరీక్షలో తప్పటం అసంభవం"*** అన్నాడు ఆ విద్యార్థి. ప్రిన్సిపాల్‌కు కోపం వచ్చింది. 'కూర్చో!' అని గద్దించాడు ప్రిన్సిపాల్. ఆ విద్యార్థి కూర్చోక ***'దయచేసి మరోమారు చూడండి సార్!'*** అని అడిగాడు వినయంగా విద్యార్థి. ప్రిన్సిపాల్‌కు ఇంకా కోపం వచ్చి ***'పది రూపాయిలు ఫైన్'*** అన్నాడు ప్రిన్సిపాల్. ఆ విద్యార్థి కూర్చోలేదు. ***'సిట్‌డౌన్',*** అని గర్జించాడు ప్రిన్సిపాల్. ఆ విద్యార్థి కూర్చోలేదు. చిట్టచివరికి యాభై రూపాయిలు ఫైన్ అని ప్రకటించాడు ప్రిన్సిపాల్. ఇదంతా గమనించిన హెడ్ క్లర్క్ ప్రిన్సిపాల్ దగ్గరకు వచ్చి ***'తప్పజరిగింది సార్!'*** అన్నాడు. ఆ విద్యార్థి అందరికంటే మిన్నగా ఉత్తీర్ణుడయ్యాడని చెప్పాడు. అందరూ సంతోషించారు. అంత స్వాభిమానం గల ఆ సాహసవిద్యార్థి ఎవరో కాదు! మన ***బాబూరాజేంద్ర ప్రసాద్.***

బాల్యము నందు రాజేంద్రునకు అతని తల్లి, నాయనమ్మ రోజూ రామాయణ, భారత గాథలు చెప్పేవారుట. దేశభక్తుల, సంఘసంస్కర్తల ఆదర్శ జీవితాలను, నీతులను బోధించేవారని, రాజేంద్రప్రసాద్ తన ఆత్మ కథలో వ్రాసుకున్నారు. ఆ చిన్ననాటి ఇంటి వాతావరణం ఆయన మీద చెరగని ముద్రవేసింది. చిన్ననాట ఆయన తల్లి, నాయనమ్మలు బోధించిన నీతి బోధలు ఆయన జీవిత గమనాన్నే మార్చివేశాయి. త్యాగం, సహనం, సహకారములు ఆయన జీవిత లక్ష్యాలైనాయి. పిల్లలు బాగుపడాలంటే, ఆదర్శ జీవితాలను గడిపే స్థాయికి ఎదగాలంటే, ప్రధాన కారకులు తల్లిదండ్రులు, గురువులు మాత్రమే. ఈ వాస్తవమును విస్మరించకండి.



# పండిత జవహర్ లాల్ నెహ్రూ

కాలింగ్ బెల్ మ్రోగుతుంది

సోఫాలో కూర్చొని, ఆనాటి దినపత్రికను చదువుతున్న ఒక పెద్దాయన తలుపు తీస్తాడు.

ఒక మధ్య వయస్కురాలు అతి దీనంగా చూస్తూ నిలబడి ఉంటుంది.

*'ఏమమ్మా! ఏం కావాలి?'* అని అడుగుతాడు.

*"నా అవస్థ ఏమని చెప్పకొనేది! నేను సర్వస్వాన్ని కోల్పోయిన ఒక అనాథను. సహా కోసం వచ్చాను"* అని దీనంగా తన గాధను చెప్పకొని కన్నీరు పెట్టుకుంటుంది.

ఆ అభాగ్యురాలి విషాదగాధను వినిన ఆ పెద్దాయన హృదయం ద్రవిస్తుంద

*'కాస్త ఉండు! వస్తాను!,* అని లోపలికి వెళ్ళుతాడు. ఆ ఇంటి యజమాని భా దగ్గరకు వెళ్లి *'నాకు కొంత పైకం కావాలి? ఉంటే ఇవ్వు! తర్వాత ఇస్తా!'* అని అడుగుతాడ

*'నా వద్ద ఐదువందలు మాత్రమే ఉన్నాయి'* అని చెప్పి యిస్తుంది ఆ గృహిణి.

ఆ మొత్తం తీసుకొని వెళ్ళి, ఆ అభాగ్యురాలి చేతిలో పెడతాడు. ఆ అభాగ్యురాల సంతోషించి, కృతజ్ఞతలు చెప్పకొని వెళ్లిపోతుంది.

ఆ పెద్దాయన ఎవరు? ఆ ఇల్లు ఎవరిది? ఆ పెద్దాయన ఆ ఇంటికి ఎందుకు వచ్చాడు? ఆ గృహిణి ఎవరు? సమయసందర్భాలు తెలుసుకుంటే ఆశ్చర్యం వేస్తుంది.

ఆ ఇల్లు ఒక ఐ.సి.యస్ అధికారిది. ఆయన కేంద్ర ప్రభుత్వంలో ఒక ఉన్నతోద్యోగి. ఆయన పేరు **'రతన్‌కుమార్ నెహ్రూ'** ఆయన ఇల్లాలు **శ్రీమతి రాజన్ నెహ్రూ.** ఆ పెద్దాయన భారతదేశ ప్రధానమంత్రి పదవీ బాధ్యతలను స్వీకరించడానికి అలహాబాద్ నుండి ఢిల్లీకి

వచ్చి ఆయన బంధువు ఇంట్లో బసచేస్తారు. ఆయనే పండిత *జవహర్‌లాల్ నెహ్రూ.* భారతదేశ ప్రథమ ప్రధాని ఆయన. అంతటి ఉన్నత పదవీ బాధ్యతలను చేపట్టటానికి వచ్చిన సమయంలో ఆయన జేబులో డబ్బులు లేవంటే నమ్మశక్యంగాని నగ్నసత్యం అది. ఆయన ఆగర్భ శ్రీమంతుడు. ఆయన తండ్రి మోతిలాల్ నెహ్రూ గొప్ప న్యాయవాది. ఆ రోజులలోనే నెలకు ముప్పైవేలు సంపాదించేవాడుట. తన కుమారుని అతి గారాబంగా పెంచాడు. ఇంగ్లండులోని 'హారో' విశ్వవిద్యాలయానికి చదువుకోసం పంపించాడు. అక్కడ న్యాయశాస్త్ర పట్టమును పొంది స్వదేశానికి తిరిగి వస్తారు జవహర్‌లాల్ నెహ్రూ. మహాత్మా గాంధీజీ బోధనలు విని న్యాయవాద వృత్తిని చేబట్టకుండా, తన జీవితాన్ని దేశసేవకు అంకితం చేసుకొనిన త్యాగశీలి మన పండిత నెహ్రూ.

స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని పలుపర్యాయములు జైలుకు వెళ్ళుతారు. జైలులో కాలం వృథా చేయకుండా ఎన్నో అమూల్యమైన గ్రంథాలు చదివేవారు. బయటకు వచ్చిన తరువాత ఇంగ్లీషులో ఎన్నో గ్రంథాలు కూడా వ్రాసారు. ఆయన వ్రాసిన గ్రంథాలలో Glimpses of world history, Discovery of India మరియు తన 'స్వీయచరిత్ర' మొదలైనవి అత్యంత ప్రాచుర్యాన్ని పొందాయి. జైలునుంచి తన ప్రియతమ పుత్రిక ఇందిరకు ఎన్నో లేఖలు కూడా వ్రాసారు. అవి విశేషమైన ప్రచారాన్ని పొందాయి. కాలాన్ని వృథాచేయడమంటే ఆయనకు మనస్కరించేది కాదు. 'లిఫ్టులో వెళ్ళేటప్పుడు, వచ్చేటప్పుడు కూడా పుస్తకం చదువుతుండేవారుట. చదవటమంటే ఆయనకు అంత ఆసక్తి. ***"నేను నా జీవితంలో తగ్గించుకోలేక పోయిన ఖర్చు ఒకటే, అదే పుస్తకాలు కొంటూ వుండటం"*** అని అంటారు నెహ్రూ. కనపడిన ప్రతి మంచి పుస్తకమూ కొనేవారు, చదివేవారు. అది ఆయన ప్రవృత్తి.

1954 సం॥లో మన దేశంలో వున్న వివిధ భాషలను అభివృద్ధి పరచాలనే పరమావధితో ***'సాహిత్య అకాడమీ'***అనే సంస్థ స్థాపించబడింది. ఆ సంస్థకు తొలి అధ్యక్షుడు ఆయనే. మరణించే నాటిదాకా ఆయనే ఆ సంస్థకు అధ్యక్షుడు. ***"అకాడమీ అధ్యక్షుడి నైన నా కార్యకలాపాలలో భారత ప్రధాన మంత్రి (అప్పట్లో ఆయనే ప్రధానమంత్రి) జోక్యం కల్పించుకోవడం నాకు అంతగా ఇష్టం వుండదు"*** అని అంటారు నెహ్రూ. సాహిత్యమంటే ఆయనకు అంతటి అపార గౌరవం ఉండేది.

పండిత నెహ్రూ సాహితీవేత్తేకాదు, రాజకీయ దురంధురుడే కాదు, గొప్ప మానవతావాది కూడాను. అద్దెకారు తోలి, బ్రతికే 'బలబీర్ సింగ్' అనే డ్రయివర్ నిత్యమూ

'తీన్‌మూర్తి' భవనం గేటువద్ద నిలబడి, పార్లమెంటుకు వెళ్ళేటప్పుడు నెహ్రూగారికి నమస్కరించి వెళ్ళేవాడు. అది అతని నిత్యకృత్యం. ఒకరోజున అతనిని పిలిచి భుజంపై చేయి వేసి *"నీవు రోజూ ఇక్కడికి వచ్చి నమస్కారం చేస్తున్నావు. ఎందుకోసం? నావల్ల ఏమైనా సహాయం కావాలా?"* అని అడుగగా *"మిమ్ములను చూస్తే ఎంతో సంతోషంగా ఉంటుంది. అంతకంటే మరేంలేదు"* అంటాడు బలబీర్ సింగ్. అప్పుడు నెహ్రూ *"నన్ను చూస్తే నీ ఆకలి తీరుతుందా! నీ అద్దెకారు వల్ల నీ కుటుంబం పోషించబడుతున్నదా?"* అని అడుగుతాడు. అప్పుడు *"నా కుటుంబ పోషణకు కావలసిన ఆదాయం ఇంతకు పూర్వం వస్తుండేది. కాని దురదృష్టవశాత్తు, ఈ మధ్య నాకారు ప్రమాదానికి గురైంది. సంపాదన దెబ్బతిన్నది, అప్పుల పాలయ్యాను'* అంటాడు సింగ్. నెహ్రూ అతని కారును చూచి *"ఈ కారు ఈ విధంగా ఉంటే, ఎవరు అద్దెకు తీసుకుంటారు? వేరే కారు కొని బాగా సంపాదించు"* అని చెబుతాడు. సింగ్ తలవంచుకొని *"నాదగ్గర పైకం లేదు బాబు! బ్యాంక్ వాళ్ళను అడిగితే జామీను కావాలన్నారు. నాకు ఎవరు జామీను యిస్తారు?"* అంటాడు సింగ్. *"సరే! రేపు బ్యాంక్‌లో ధరఖాస్తు యివ్వు! జామీను ఎవరు? అని అడిగితే నాపేరు దరఖాస్తులో వ్రాయి! నేను రేపు మధ్యాహ్నం బ్యాంకుకు వస్తాను"* అని చెప్పి పార్లమెంటుకు వెళ్ళుతాడు నెహ్రూ. మరుసటి దినం బ్యాంక్‌కు వెళ్ళి దరఖాస్తు మేనేజర్‌కు యిస్తాడు సింగ్. మేనేజర్ ఆ దరఖాస్తును చూచి *"నీకేమైనా పిచ్చి పట్టిందా! పెద్దవారి పేరు చెప్పి మోసం చేయాలనుకుంటున్నావా!* అని గద్దించి బయటకు వెళ్ళకొడుతాడు. ఏమి చేయాలో తోచక గేటువద్దనే నిలుచుంటాడు సింగ్. ఇంతలో ఒక చిన్న కారువచ్చి ఆగుతుంది. నెహ్రూ ఆ కారునుంచి దిగి సింగ్‌ను చూస్తాడు. *"అప్పు పత్రాలు ఇచ్చావా?"* అని అడుగగా *"ఇచ్చాను బాబూ! వారు నా మాట నమ్మలేదు"* అంటాడు సింగ్. అప్పుడు అతనిని వెంటబెట్టుకొని బ్యాంక్‌లోనికి వెళ్ళుతాడు నెహ్రూ. మేనేజర్ లేచి నిలబడి *"సార్! మీరు కబురు పంపితే నేనే వచ్చేవాడను కదా!"* అని అంటాడు మేనేజర్. ఆ అప్పు దరఖాస్తు మీద జామీను సంతకం చేసి వెళ్ళిపోతాడు నెహ్రూ. ప్రధానమంత్రి పదవిలో వున్న గొప్పవ్యక్తి సామాన్య కారు డ్రయివరుకు సహాయం చేయడాని కోసం బ్యాంకుకు రావడం విశేషం కాదా! *మహనీయులకు భేదభావాలు ఉండవు. అందరినీ సమంగా చూడగలుగుతారు. బాధలలో ఆదుకుంటారు. అది మహనీయుల లక్షణం. ఏమీ లేని విస్తరి ఎగిరెగిరి పడుతుంటుంది. అన్నీ వున్న విస్తరి అణిగి, మణిగి ఉంటుంది. అటువంటిదే మహనీయుల ప్రత్యేకత.*

ఒకసారి ప్రధాని నెహ్రూ కామన్‌వెల్త్ ప్రధాన మంత్రుల సభలో పాల్గొనేందుకు లండన్ వెళ్ళుతారు. ఆయన వెంట వ్యక్తిగత కార్యదర్శి 'మత్తాయ్' కూడా వెళ్ళుతాడు. సమావేశం ముగించుకొని హోటల్‌కు వస్తారు నెహ్రూ. దేనికోసమో వెదుకుతుంటే *"సార్!*

*మీరు దేనికోసం వెదుకుతున్నారు?"* అని అడుగుతాడు మత్తాయ్. *"నా బనియన్ ఇక్కడ వదలివెళ్ళాను అది కనిపించటం లేదు"* అంటారు నెహ్రూ. *"సార్! ఉతకడానికి దానిని చాకలికి వేశాను"* అని చెబుతాడు మత్తాయ్. అప్పుడు *"దానిని ఉతకడానికి దోభీకి యివ్వాలా? దానికి డబ్బుచెల్లించాలి గదా! నేనే దానిని ఉతకాలనుకున్నాను"* అంటారు నెహ్రూ. ***మహనీయులు తమ పనులను తామే చేసుకుంటారు. ఇతరుల మీద ఆధారపడరు.*** ఈ సంఘటన నెహ్రూగారి నిరాడంబరతను చాటుచున్నది.

నెహ్రూ చిన్నతనంలో ఒక చిన్న సంఘటన జరిగింది. తండ్రి మోతీలాల్ గదిలో రెండు కలాలుండేవి. తండ్రికి చెప్పకుండా ఒక కలం తీసుకుంటాడు జవహర్‌లాల్. తండ్రి వచ్చి ఎంత వెతికినా రెండవ కలం కనిపించదు. చివరకు అసలు విషయం బయట పడుతుంది. తండ్రి చేతిలో దెబ్బలు తింటాడు జవహర్‌లాల్. ఆ దెబ్బలకు మందు కూడా వ్రాయవలసి వస్తుంది. అంత జరిగినా జవహర్‌లాల్‌కు ఇసుమంతైననూ తండ్రిపై కోపం రాకపోగా నేరం చేసినవారు శిక్ష అనుభవించాల్సిందేనని భావిస్తాడు. శిక్ష లేకుండా చేసుకోవాలంటే అసలు నేరమే చేయకూడదనే నిర్ణయానికి వస్తాడు జవహర్‌లాల్. ***మహనీయులు చిన్నచిన్న సంఘటనల ద్వారా జీవితంలో పెద్ద పాఠాలు నేర్చుకుంటారు. సామాన్యులు మాత్రం అసలు ఆ సంఘటనలనే మరచిపోతారు. సామాన్యులకు గొప్పవారికి మధ్యనున్న తేడా అదే.***

*"నా పుట్టినరోజును బాలల దినంగా గడపండి. అలా చెయ్యడమే నా అభిమతం"* అని చెబుతారు పండిత జవహర్‌లాల్ నెహ్రూ. ఆ పండితుడు పుట్టినరోజు 1889 సం॥ నవంబర్ 14వ తేదీ. ఆ దినమునే బాలల దినోత్సవంగా జరుపుకుంటున్నారు. ఆయనకు పిల్లలంటే చాలా ప్రేమ. ఎంత వత్తిడి పని ఉన్నా సరే! పిల్లలొస్తే చాలు! పిల్లలతో పిల్లవాడుగా ఆడుకొనేవాడు మన నెహ్రూ. పిల్లలతో మాట్లాడటమంటే, ఆటలాడటమంటే, కాలం గడపటమంటే ఆయనకు అంతులేని సంతోషం. ***పిల్లలు దేవునితో సమానం గదా! కనుక పిల్లలలోనే దేవుడ్ని చూచి ఆనందించేవాడు నెహ్రూ.***

స్వతంత్ర భారతదేశానికి 17 సంవత్సరాలపాటు ప్రధానమంత్రిగా, వ్యవహరించి, శాంతి దూతగా, నవభారత నిర్మాతగా చాచా నెహ్రూగా పేరుప్రఖ్యాతుల నందుకొని, 1964 సం॥ మే 27వ తేదీన పరమపదించుతారు.

***చాచా! నెహ్రూను మరువకండి! బాలల దినోత్సవాలలో పాల్గొనండి! స్ఫూర్తిని పొందండి.***





## 'ఆంధ్రకేసరి'

# టంగుటూరి ప్రకాశం పంతులు

*"సైమన్ గోబ్యాక్ - సైమన్ గోబ్యాక్...* "అనే నినాదాలతో చెన్నపట్టణపు పురవీధులు ప్రతిధ్వనిస్తున్నాయి. అశేష ప్రజానీకం ప్రవాహంలా ముందుకు సాగి పోతున్నది. ఆ ప్రజా ప్రవాహానికి అడ్డుకట్ట వేయగల శక్తి ఎవరికీ ఉన్నట్లు కనిపించలేదు. పోలీసులు లాఠీలను ప్రయోగించారు. ప్రయోజనం లేకపోయింది. తుపాకులు కాల్చారు. అజ్ఞాత దేశభక్తులు కొందరు నేలకొరిగారు. ప్రజలు కోపోద్రిక్తులయ్యారు. పోలీసులపై ప్రజలు రాళ్ళు విసరనారంభించారు. దొరికినవాడినల్లా పోలీసులు లాఠీలతో చితకబాదుతున్నారు. శరీరాలు చిట్లి రక్తం ప్రవహిస్తున్నది. చేతులు విరిగిన వారు కొందరు, కాళ్ళు విరిగిన వారు మరికొందరు, తలలు పగిలినవారు మరిఎందరో! అది ఒక రణరంగంగా మారింది. ఇంతలో వీరావేశంతో ఒక సింహకిశోరం ముందుకు దూకింది. చొక్కా గుండీలు తీసి, ఎదురు రొమ్మును చూపిస్తూ *"కాల్చండి! సిద్ధంగా ఉన్నా!"* అని గర్జిస్తుంది ఆ యువ కిశోరం. *'ఊ! షూట్ చేయండి'* అని ఆజ్ఞాపిస్తాడు ఒక పోలీస్ అధికారి. వందలాది పోలీసులు కాల్చడానికి సిద్ధమై తుపాకులు గురిపెట్టి బారులు తీర్చి నిలుచుంటారు. ఇంతలో అశేష ప్రజానీకం త్రోసుకొని ముందుకు వచ్చి, ఆ యువ కిశోరం ముందు నిల్చుంటుంది. *"భారతమాతాకీ జై! సైమన్ గోబ్యాక్! ...* " నినాదాలతో ఆ ప్రాంతమంతా మారుమ్రోగుతుంటుంది. పరిస్థితి విషమిస్తున్నదని భావించిన ఆ పోలీస్ అధికారి తుపాకులను దించమని ఆజ్ఞాపిస్తాడు. ఆ యువ కిశోరం మరల ప్రజల మధ్య నుండి వచ్చి, అగ్రభాగాన ఠీవిగా ముందుకు నడుస్తుంటుంది. పోలీసులు చేయగలిగేదేమీ లేక ప్రేక్షకులుగా చూస్తుంటారు. ఆ చారిత్రాత్మక సంఘటన దేశాన్ని ఉర్రూతలూగించింది. ఎక్కడ చూచినా ఊరేగింపులు, నిరసన ప్రదర్శనలే.

ఎదురురొమ్ము చూపించి, *'కాల్చండ్రా!'* అని సింహగర్జన చేసిన ఆ యువ కిశోరం ఎవరో తెలుసా? ఆయనే మన **ప్రకాశం పంతులు**. ఆయన ఆనాడు ప్రదర్శించిన అద్భుత ధైర్య సాహసాలను ప్రశంసిస్తూ, ముట్నూరి కృష్ణారావుగారు కృష్ణా పత్రికలో సంపాదకీయం వ్రాసారు. ఆ సంపాదకీయంలో 'ముట్నూరి' వారు మొట్టమొదటగా ప్రకాశం గారికి 'ఆంధ్రకేసరి' అనే బిరుదు యిచ్చారు. ఆ బిరుదుని ప్రకాశంగారికి ప్రదానం చేసిన ఘనత ముట్నూరివారికి, కృష్ణా పత్రికకే దక్కుతుంది.

ప్రకాశం అద్వితీయమైన ధైర్య సాహసాలుగల ధీశాలి. పిరికి జీర లేని సమర వీరుడు. స్వార్థమెరుగని త్యాగశీలి. వారిది నిర్మలమైన దేశభక్తి, నిష్కపటమైన మనసు - ఇవన్నీ ప్రకాశం గారికి పుట్టుకతోనే వచ్చిన సద్గుణాలు. ఎక్కడ ఏ ప్రమాదం సంభవించినా, ఎవరికి ఆపదలు వచ్చినా, అక్కడ ప్రకాశంగారు ప్రత్యక్షమయ్యేవారు. బారిష్టర్‌గా లక్షలు ఆర్జించిన ఐశ్వర్యవంతుడయినప్పటికీ, ప్రజాసేవకు అంకితమై, తమ సర్వస్వాన్ని కోల్పోయి, అవసాన దశలో కనీస అవసరాలకు కూడా ధనంలేక అతి పేదరికాన్ని అనుభవించిన ఆదర్శశీలి. మన దేశంలో ***అంతటి దారిద్ర్యాన్ని అనుభవించిన వారిలో ప్రథముడు 'దేశబంధు' చిత్తరంజన్ దాస్ అయితే ద్వితీయుడు 'ఆంధ్రకేసరి' ప్రకాశం పంతులు.***

ఆయన సంపాదించిన స్థిరచరాస్థులను పరిశీలిస్తే, ఆయన చేసిన త్యాగం ఎంతటిదో మనకు బోధపడుతుంది, ఎంతటి వారికైనా ఆశ్చర్యం వేస్తుంది. 1. ఊటీలో రెండు పెద్ద బంగళాలు (వాటి విలువ ఆనాడే రెండు లక్షలు) 2. మదరాసు మైలాపూర్‌లో ఇల్లూ, తోట (లక్ష రూపాయిలు) 3. రాజమండ్రిలో ఇల్లు, 6వేల చ.గజముల స్థలం (50 వేలు) 4. రాజమండ్రి సెంట్రల్ జైలు సమీపంలో 100 ఎకరాల భూమి (విలువ తెలియదు) 5. పశ్చిమ గోదావరి జిల్లా పోణంగిలో 40 ఎకరముల పొలం (విలువ తెలియదు) 6. రైల్వే షేర్లు లక్షరూపాయిలు 7. గవర్నమెంటు బాండ్లు ఒక లక్ష 8. మద్రాస్ కార్పోరేషన్ డిబెంచర్లు 15 వేల రూపాయలు 9.ఆంధ్రా బ్యాంకులో 50వేల రూపాయిల డిపాజిట్లు ***(ఈ వివరాలన్నీ ప్రకాశం గారి జైలు డైరీలో గ్రహించబడినాయి)*** ఇప్పటి అంచనాల ప్రకారం ఎన్ని కోట్లు ఉంటుందో...!

స్వాతంత్ర్య పోరాటకాలంలో ఈ స్థిర, చరాస్థులన్నీ కరిగిపోయి, ఆయన అవసాన దశలో, ఎవరైనా సహృదయులు టిక్కెట్టుకొని యిస్తే, రైలులో ప్రయాణం చేయగలిగే దుస్థితి ఏర్పడినదంటే, ఆశ్చర్యంగానే ఉంటుంది.

1921 సం॥లో గాంధీజీ పిలుపు నందుకొని, నెలకు వేలాది రూపాయిలు ఆదాయం వచ్చే న్యాయవాద వృత్తిని త్యజించి, స్వాతంత్ర్యోద్యమంలో చేరారు. తన పెద్దకుమారుడు మరణావస్థలో వున్నప్పటికీ, అతనిని తన తమ్ముడి దగ్గరవదిలి, కలకత్తాలో జరిగిన అఖిల భారత జాతీయ కాంగ్రేస్ సభలకు హాజరైన నిస్వార్థ జీవి ప్రకాశం. 1921 సం॥లో మూడు లక్షల మూలధనం పెట్టి, ఒక లిమిటెడ్ కంపెనీని ఏర్పాటు చేసి, శాసనోల్లంఘన కార్యక్రమాలను ప్రచారం చేయడానికి 'స్వరాజ్య' అనే ఆంగ్ల పత్రికను స్థాపించారు. మద్రాసు రాష్ట్ర రెవిన్యూ మంత్రిగా, ముఖ్యమంత్రిగా, మరియు 1953 సం॥లో ఆంధ్ర రాష్ట్ర తొలి ముఖ్యమంత్రిగా ఎన్నుకోబడి , అనేక సంస్కరణలను ప్రవేశపెట్టి ప్రజల మన్ననలను అందుకొనిన చక్కటి పరిపాలనా దక్షుడు ప్రకాశం.

అకుంఠిత దీక్షతో ఆరు దశాబ్దాలపైగా మాతృదేశారాధన చేసి, ప్రజా హృదయాలలో చెరగని ముద్రవేసి, ప్రజల అవ్యాజ అనురాగాన్ని, గౌరవాన్ని, ఆదరణలను పుష్కలంగా అనుభవించిన ప్రజలమనిషి అయిన ఆంధ్రకేసరి ప్రకాశం, 1957 సం॥ మే 20వ తేదీన కీర్తి శేషులైనారు. జాతి యావత్తు కన్నీరు కార్చింది. ముఖ్యంగా ఆంధ్ర ప్రజానీకం తమ ఆత్మ బంధువును కోల్పోయినందులకు విలపించింది. అయితే ఈనాడు ఆ త్యాగమూర్తి ఎందరికి గుర్తు ఉన్నారు?

*భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు* ***"అంత పట్టుదలతో, ఉత్సాహంతో, త్యాగదీక్షతో అన్ని ఏండ్లు దేశసేవ చేసిన వ్యక్తి చరిత్రలో మరొకరు లేరు. ప్రకాశం గారికి చేయెత్తి నమస్కరించడం మన విధి"*** అన్నారు. ఇది వాస్తవం . ఆ పుణ్యమూర్తికి భక్తి శ్రద్ధలతో జోహారులర్పిద్దాం.

---

'అన్యాయం, అక్రమం జరుగుతుంటే చూస్తూ ఊరుకోవటం ప్రాజ్ఞుల లక్షణం కాదు. మన కళ్ళముందు అన్యాయం జరుగుతుంటే మనకెందుకులేయని ఊరుకోరాదు. అన్యాయాన్ని అధర్మాన్ని ధైర్యంగా ఎదుర్కోనాలి. చేతులు ముడుచుకొని కూర్చోవడం బలహీనతకు చిహ్నం. ఉదాసీన వైఖరి అసమర్థ లక్షణం. అసమర్థులుగా వుండటంకంటే మరణం మేలు'

- టంగుటూరి ప్రకాశం



# వీరకిశోరం భగత్సింగ్

*"అమ్మా! మీరెవరూ, నా శవం కోసం ఇక్కడికి రాకండి! కుల వీరుణ్ణి సాగనంపిన, మీరు కన్నీరు కారిస్తే, చూచినవారు ఈ వీరకిశోరం తల్లి కన్నీరు కారుస్తుంది అనుకుంటారు. అమ్మా! తాతగారు బాగా పెద్దవారయ్యారు. మీరు గ్రామానికి వెళ్ళి వారి బాగోగులు చూడండి! అమ్మా! ఈ మధ్య నా బరువెంత పెరిగిందో, తెలుసా!...."*

అంటూ పెద్దగా నవ్వుతాడు ఆ వీర కిశోరం. అది 1931 సం॥ మార్చి 23వ తేది. ఆ వీరకిశోరాన్ని చూడాలని అతని తల్లి, బంధువులు, మిత్రులు జైలు వద్దకు వెళ్ళిన సమయం అది. అదే వారి చివరి దర్శనం. అప్పుడు వెళ్ళిన వారిలో ఆ యువకునిలో విప్లవ బీజాలను నాటిన అర్జున్‌సింగ్ కూడా ఉంటాడు. ఆ విప్లవవీరుని తల నిమురుతూ ఏదో చెప్పాలనుకుంటాడు అర్జున్‌సింగ్. కాని ఉద్వేగంతో మాటలు పెగల్లేదు. కొంత దూరంవెళ్ళి కన్నీరు కారుస్తాడు. అదే ఆ వీరకిశోరం జీవితంలో చివరిరోజు అయినప్పటికి ఆనాడు అతను ప్రదర్శించిన ధైర్యాన్ని చూచి జైలు అధికారులు సహితం నివ్వెరపోతారు. ఆ వీరకిశోరం ఎవరో తెలుసా! ఆంగ్లదొరలను గడగడలాడించిన *'భగత్సింగ్'.*

1929 సం॥లో *"లాహోర్ కుట్రకేసు"*లో నేరం మోపి కారాగారంలో బంధించబడ్డారు భగత్సింగ్, సుఖదేవ్, రాజగురులు. ఆ జైలులో ఖైదీలకు కనీస సదుపాయాలు కూడా లేకపోవటం వలన భగత్సింగ్ ప్రభృతులు నిరసనగా 114 రోజులపాటు నిరాహార దీక్ష చేసారు. ఆ నిరసనదీక్ష యావత్ దేశాన్ని కదిలించివేస్తుంది. ఆహారం తినడానికి నిరాకరించిన ఆ వీరకిశోరాల గొంతులలో గొట్టాలు దూర్చి బలవంతంగా ఆహారం, నీరు పోయడానికి ప్రయత్నిస్తారు జైలు అధికారులు. పైశాచికంగా పోయబడిన ఆహారాన్నంతటిని బయటకు కక్కివేసి తమ దీక్షను కొనసాగిస్తుంటారు ఆ వీరకిశోరాలు.

1930 సం॥ అక్టోబర్ 7వ తేదీన ప్రత్యేక కోర్టు భగత్సింగ్, సుఖదేవ్, రాజగురులకు 'మరణశిక్ష' విధిస్తుంది. తన బిడ్డ (భగత్సింగ్) ప్రాణాలను కాపాడమని స్పెషల్ ట్రిబ్యునల్‌కి అప్పీలు చేస్తాడు సర్దార్ కిషన్‌సింగ్. ఆ విషయమును తెలిసికొని భగత్సింగ్ తన తండ్రికి ఒక లేఖ వ్రాస్తాడు. ఆ లేఖలో ' *'నన్ను లాహోర్ కుట్రకేసునుంచి తప్పించడానికి స్పెషల్ ట్రిబ్యునల్‌కి తమరు అప్పీలు చేసినట్లు తెలిసికొని చాలా ఆశ్చర్యపోయాను. భారత దేశ దాస్య విముక్తికై, మీ జీవిత సర్వస్వాన్ని బలిపెట్టిన మీరేనా! ఈ పని చేసింది? అని బాధపడ్డాను. నాన్నగారు! ఈ విషయం నా మనస్సు నెంతగానో కలిచివేస్తున్నదండీ! నిర్దోషినని కోర్టు ముందు వాంగ్మూలం యిచ్చి, ఏదో విధంగా బయటపడాలనే కోరిక నాకు ఏమాత్రం లేదు. మీ కొడుకునయినందులకు తండ్రిగా మీ ఆశల్ని, ఆకాంక్షలను గౌరవిస్తాను. కాని మీరనుకుంటున్నట్లుగా, నా దృష్టిలో నా జీవితం అంత విలువైనది కాదు. సిద్ధాంతాలను సైతం బలిపెట్టేటంత అమూల్యమైనది మాత్రం కాదు నా జీవితం. ఈ సమయంలో దేశంలో విప్లవాగ్ని చల్లారకుండా వుండాలంటే ప్రాణత్యాగం చేయడం ఒక్కటే ఉత్తమమార్గం".* అని వ్రాస్తాడు భగత్సింగ్. భారత దేశ స్వాతంత్ర్య మొక్కటే అతని లక్ష్యం. ఆ లక్ష్యసాధనలో ఎన్ని యిక్కట్లు వచ్చినా వాటినన్నింటిని ధైర్యంతో ఎదిరించి ముందుకు కొనసాగిపోవడమే ఆయన ధ్యేయం. ఆ ధ్యేయసాధనలో తన జీవితాన్ని సమర్పించిన యోధుడు, వీరుడు, భగత్సింగ్.

1931సం॥ మార్చి 24 ఉదయం భగత్సింగ్, సుఖదేవ్, రాజగురులను ఉరి తీయాలని ఆంగ్ల ప్రభుత్వం నిర్ణయిస్తుంది. సహజంగా తెల్లవారుజామున ఉరి తీయడం ఆనవాయితీ. కాని, దానికి భిన్నంగా మార్చి 23వ తేది రాత్రి గం॥ 7-27 ని॥లకు ఆ వీరకిశోరాలను రహస్యంగా ఉరితీసి, ఫిరోజాబాద్ వద్ద, సట్లేజ్ నది ఒడ్డున ఆ మృత శరీరాలను తగులబెడుతారు జైలు అధికారులు.

1931 మార్చి 23వ తేదీ సాయంత్రం చీకటి పడిన తరువాత జైలులో భగత్సింగ్ ఉన్న గదికి వెళ్ళి జైలర్ "Are you Ready" అని అడుగుతాడు. "Yes! I am ready" అని సమాధానం ఇస్తాడు భగత్సింగ్. జైలు ఆవరణలోనే ఉరితీయడానికి ప్రత్యేకంగా ఒక వేదిక నిర్మాణం చేస్తారు. జైలు గదులనుండి సాయుధ భటులు ఆ బలిపీఠం మీదకు తీసుకొని వెళ్ళుతుంటే, ఆ ముగ్గురు యువకిశోరాలు **"ఇంక్విలాబ్ జిందాబాద్"**,

*'వందే మాతరం'* అంటూ ముందుకు నడుస్తుంటారు. మరుక్షణంలో తమ ప్రాణాలను కోల్పోతామని వారికి బాగా తెలుసు. అయినప్పటికి వారి ముఖాలమీద చిరునవ్వు తాండవిస్తునే ఉంటుంది. ఆంగ్లేయులను గడగడలాడించిన ఆ ముగ్గురు వీర కిశోరాలను బలిపీఠమెక్కిస్తారు. చివరిసారిగా తల్లి భారతికి వినమ్రులై నమస్కరిస్తారు. అక్కడనే ఉన్న సీనియర్ ఆంగ్ల జైలర్ వైపు వేలు ఎత్తి చూపుతూ భగత్సింగ్, *"మీరు చాలా అదృష్ట వంతులు. భారత స్వాతంత్ర్య సంగ్రామ సైనికులు నిర్భయంగా, నవ్వుతూ మృత్యువును ఎలా ఆహ్వానిస్తారో! కళ్ళారా చూచే మహత్తర అవకాశం ఈనాడు మీకు లభించబోతున్నది. మేము మీకు దానిని చూపిస్తాం. అది ఒక అపూర్వ సంఘటన"* అని అంటాడు భగత్సింగ్. సరీగా గం॥ 7-20 ని॥లకు ఆ యువకిశోరాల ముఖాలకు నల్లటి ముసుగు వేయ బడుతోంది. ఆ ముగ్గురూ ఒకరినొకరు మనసారా గాఢంగా కౌగలించుకొని, *"ఇంక్విలాబ్ జిందాబాద్'* 'అంటూ బిగ్గరగా నినాదం చేస్తారు. మరుక్షణంలో ఆ విప్లవ వీరకిశోరముల మెడలు చుట్టూ ఉరిత్రాడు చుట్టబడుతుంది. *'వందేమాతరం'* అంటూ ఆ ముగ్గురు వీరకిశోరాలు ఒకే పర్యాయం సింహగర్జన చేస్తారు. సరీగా గం॥ 7-27 ని॥లకు ఆ బలిపీఠం వేదిక క్రింద కొయ్యపలక 'టక్' అని శబ్దం చేస్తూ ఊడిపడుతుంది. ఆ వీరకిశోరాల పంచ ప్రాణాలు అనంతాకాశంలో విలీనమైపోతాయి. భారతమాత కన్నీరు కారుస్తుంది. భరత జన హృదయాలలో వారు ఎప్పటికీ అమరవీరులే. వారి ఆత్మ శాంతికి జోహారులర్పిద్దాం!



---

"విప్లవమంటే బాంబుల పిస్తోళ్ళ సంస్కృతి కాదు. విప్లవం నుంచి మేం ఆశిస్తున్న ప్రయోజనం ఏమిటంటే, అన్యాయం పునాది మీద నిలబడివున్న వర్తమాన వ్యవస్థలో మార్పువచ్చి తీరాలి. కొందరు దోపిడీదారులు శ్రామికుల శ్రమ ఫలితాన్ని దోచుకుంటున్నారు. శ్రామిక వర్గమే సమాజపు వాస్తవిక పునాది. ఈ వాస్తవము గుర్తించబడేట్లు చేయుటమే మా లక్ష్యం. విప్లవం మానవజాతి జన్మహక్కు. స్వాతంత్ర్యం సమస్తమానవుల జన్మహక్కు. అట్టి విప్లవసాధనలో మేం అగరువత్తుల్లాగా కాలిపోవడానికి సిద్ధంగా ఉన్నాం".

- భగత్సింగ్



## 'ప్రముఖ సంఘసంస్కర్త'

# కందుకూరి వీరేశలింగం

సమాజంలో మూఢనమ్మకాలు, మూఢాచారాలు పరాకాష్ట నందుకున్న దుర్దినాలలో; దేవుడి పేరిట అనేక అవాంఛనీయమైన పనులు చేయడానికి ఏమాత్రం వెరువని దినాలలో; హింసా ప్రవృత్తి ప్రబలి, నోరులేని అమాయక జంతువులను నిర్దాక్షిణ్యంగా హింసిస్తూ, అది దేవుని అనుగ్రహాన్ని పొందవచ్చునని ప్రచారం చేస్తున్న ఛాందసకాలంలో; డబ్బుకోసం కక్కుర్తిపడి, తమ కన్నబిడ్డలను కాటికి కాళ్ళుజాపిన ముదుసలులకు కట్టబెడుతున్న నికృష్టకాలంలో; దురదృష్టవశాత్తు ఆ ముదుసలి మరణిస్తే, ముక్కుపచ్చలారని ఆ కన్యల శిరోజాలను తీసివేయించి, తమ ఇండ్లలో పనికత్తెకంటే అన్యాయంగా వెట్టిచాకిరి చేయించుకొనే పరిస్థితులలో *"నేను ఉన్నాను! జాగ్రత్త!"* అని గర్జించి, అమాయక, నిస్సహాయక ప్రజలకు అండగా నిలిచి ఆనాటి సమజాన్ని చైతన్య వంతం గావించిన మహనీయులలో ఒకరు, తెలుగునాట జన్మించిన సంఘసంస్కర ణోద్యమ సారథులలో ప్రథముడు ఎవరో తెలుసా? ఆయనే ***కందుకూరి వీరేశలింగం పంతులు.***

అయన 1848 సం॥ ఏప్రియల్ 16వ తేదీన రాజమహేంద్రవరంలో జన్మించారు. రాజమండ్రి ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేస్తూనే న్యాయవాది పరీక్షలో ఒక భాగానికి పరీక్ష వ్రాసి ప్యాసయ్యారు. ఆ న్యాయవాద వృత్తిలో అబద్ధాలు ఆడవలసి వస్తుందని భావించి, న్యాయవాది కాదలచుకోక, బాదర బందీలేని ఆదర్శ ఉపాధ్యాయ వృత్తిలోనే స్థిరపడదలచుకున్నారు 'కందుకూరి'. ఆ తరువాత కొంత కాలం మద్రాసులోని

రాజధాని కళాశాలలో గూడా ప్రధానాంధ్ర పండితుడుగా పని చేశారు. మొదటి నుంచీ న్యాయంకోసం నిర్భయంగా పోరాడే స్వభావం ఆయనది. ఈ విషయాన్ని ఆయన తన స్వీయ చరిత్రలో కూడా ఇలా వ్రాసుకున్నారు. ***"ఎక్కడ? ఏ అక్రమము కనబడినా సహించెడి స్వభావము నాదికాదు. అక్రమమునకు ప్రతిక్రియ జూచేంతవరకు నా మనస్సునకు ఊరట కలగదు"*** అని ఆయన వ్రాసుకున్నారు.

రాజమహేంద్రవరంలో దీర్ఘవ్యాధితో బాధ పడుతున్న ఒక వ్యక్తి జబ్బును కుదురుస్తానని చెప్పి, ఒక భూత వైద్యుడు వారింట్లో చేరి నిత్యమూ 'హ్రాం, హ్రీం' అంటూ జపాలు చేస్తుంటాడు, ఏవేవో మంత్రాలు చదువుతుంటాడు. నెలరోజులైనా ఆ జబ్బు ఏమాత్రం తగ్గదు. కాని డబ్బు యివ్వమని వత్తిడి చేస్తుంటాడు ఆ భూతవైద్యుడు. కుటుంబీకులు కటిక బీదవారు కావటం వలననూ, ఆ జబ్బు కూడా కుదరకపోవటం వలననూ వారు డబ్బు యివ్వరు. ఆ భూతవైద్యుడు మాత్రం వారిని భయపెడుతుంటాడు. ఆ ఇంటి ప్రక్కననే ఉన్న ఒక అబ్బాయి, ఈ విషయాన్ని తెలుసుకొని, అక్కడకు వెళ్ళి ఆ భూతవైద్యునితో ***"డబ్బు యివ్వరు, దిక్కున్నచోట చెప్పకో!"*** అని డబాయించగా ***"నిన్ను చేతబడిచేసి చంపేస్తా!"*** అని ఆ భూతవైద్యుడు భయపెడుతాడు. ఆ పిల్లవాడు ఏమాత్రం భయపడక ***"నీకంటే నాకు పెద్దమంత్రాలే వచ్చు. మళ్ళీ మాట్లాడావంటే శరభ సాళ్వ మంత్రం చదివి నిన్ను ఇక్కడనే నెత్తురు కక్కిస్తా!"*** అనే సరికి ఆ భూతవైద్యుడు భయపడి అక్కడ నుంచి పారిపోతాడు. ఆ పిల్లవాడే పెరిగి పెద్దవాడై గొప్ప సంస్కర్త అవుతాడు. అన్యాయ, అక్రమ, అనాచారాలతో, మూఢనమ్మకాలతో కుళ్ళు కంపుకొడుతున్న ఆనాటి సమాజాన్ని ప్రక్షాళన చేసి, ఛాందస ప్రవృత్తిని పారద్రోలి నవ్యాంధ్ర నిర్మాతలలో ప్రముఖుడుగా పేరుగాంచుతాడు. నిజంగా నవ్యాంధ్ర నిర్మాతలలో మొదటి వరసలో మొదటి పీట ఆయనదే అనటంలో ఏమాత్రం అతిశయోక్తి కాదు. ఆ మహాపురుషుడే ***'కందుకూరి'.***

విద్యార్థిగా ఉన్నరోజులలోనే కవిత్వం చెప్పేవాడు. పెరిగి పెద్దవాడై సుమారు 130 పుస్తకాలు వ్రాశాడు. ఒక్క మాటలో చెప్పాలంటే, పాఠ్యపుస్తకాలు మొదలు, పండితులకు పనికివచ్చే గ్రంథాలు కూడా వ్రాశాడు. కేవలం పండితులకే అర్థమయ్యే భాషను విడిచి పెట్టి అందరికీ సులభంగా తెలిసే భాషలో ఆయన రచనలు కొనసాగించాడు.

ఆనాటి సంఘమునకు ఉపయోగపడే రచనలు చేశాడు. **వివేకవర్ధిని, హాస్య సంజీవిని మొదలైన పత్రికలను ప్రారంభించి, అనేక అభ్యుదయ కరమైన వ్యాసాలను ప్రజలకు అందించి వారిని చైతన్యవంతులను గావించాడు. ముఖ్యంగా స్త్రీ విద్యను ప్రోత్సహించే నిమిత్తమై 'సతీహితబోధిని' అనే మాస పత్రికను కూడా నడిపారు కందుకూరి.**

ఆయన ధనవంతుడు కాదు. పెద్ద పెద్ద ఉద్యోగాలు చేయలేదు. ఆయన చేసింది సామాన్య బడిపంతులు ఉద్యోగమే. అందులో తెలుగు మాస్టర్. అయినప్పటికీ ఆయన తెలుగు దేశానికి, తెలుగు సాహిత్యానికి గొప్పసేవ చేశారు. వచ్చే ఆదాయాన్నంతా సంఘ సంస్కరణోద్యమానికి ఖర్చు చేసిన మహనీయుడు ఆయన. తెలుగునాట ఆయన పేరు తెలియనివారే ఉండరు.

ఆ అబ్బాయికి ఎనిమిదవ యేటనే వడుగు చేశారు. అప్పటినుంచి అతడు శ్రద్ధా భక్తులతో మూడు వేళలా గోదావరి నదికి వెళ్ళి స్నానం చేసివచ్చి, విభూతి రేఖలు పెట్టుకొని సంధ్యా వందనం చేసేవాడు. భారత, భాగవత, భగవద్గీత గ్రంథాలలోని కొన్ని భాగాలు నిత్యమూ చదివేవాడు. చూడటానికి శుద్ధ శోత్రియుడులా కనిపించేవాడు. కాని పెరిగి పెద్దవాడయ్యే కొద్దీ, అర్థం లేని ఆచారాలన్నా, మూఢనమ్మకాలన్నా ఆయనకు అసహ్యం కలిగింది. వాటిని సంఘంలో రూపుమాపాలని ఆశించాడు. అంతమాత్రమున ఆయన నాస్తికుడు అనుకుంటారేమో! ఆయన ఎన్నటికీ నాస్తికుడు కాదు. **'మానవ సేవే మాధవసేవ'** అని ఆయన భావించేవాడు. తోటి మానవులకు ఉపయోగపడని వ్యక్తి ఎన్నటికీ దైవభక్తుడు కాలేడని ఆయన విశ్వాసం. ఈశ్వర చంద్ర విద్యాసాగర్, రాజారామ మోహన రాయ్‌ల ప్రభావం ఆయనమీద పడింది. వితంతువుల బాధలను వర్ణిస్తూ **'బ్రాహ్మణవివాహం'**, లంచగొండి తనాన్ని అవహేళన చేస్తూ "ప్లీడర్ నాటకం" సతీ సహగమనమును, బాల్య వివాహాలను విమర్శిస్తూ, స్త్రీ పునర్వివాహాలను ప్రోత్సహిస్తూ **"సత్యవతీ చరిత్ర"** పిల్లలకు పనికి వచ్చే నీతి కథలు సంపుటి **'నీతి కథామంజరి'** మరియు 'రాజశేఖర చరిత్ర' మొదలగు గ్రంథములను రచించి, ప్రచురించారు. 1880సం॥లో **"కామెడీ ఆఫ్ ఎర్రర్స్"** అనే ఆంగ్లనాటకమును తెలుగులోనికి తర్జుమా చేసి **'చమత్కార రత్నావళి'** అనే పేరుతో తమ విద్యార్థుల ద్వారా ప్రదర్శనలు యిప్పించేవారు. కాళిదాసు

'అభిజ్ఞాన శాకుంతలము'ను తెలుగులోనికి అనువదించారు. 'ఆంధ్రకవుల చరిత్ర' అను గ్రంథమును కూడా రచించారు. తెలుగులో మొట్టమొదటి వచన ప్రబంధకర్త వీరేశలింగం గారే. ప్రథమంగా నాటకాన్ని తెలిగించింది ఆయనే. మహిళలకు మొదటి పుస్తకము ప్రచురించింది కూడా ఆయనే. ఆ గ్రంథములను తన స్వంత ఖర్చులతో ముద్రించి, వాటి పైన వచ్చిన ఆదాయాన్ని సంఘసంస్కరణోద్యమానికి వినియోగించేవారు. ఆయనకు 'గద్యతిక్కన' 'దక్షిణ హిందూదేశ విద్యాసాగర్' అని బిరుదులు కూడా లభించాయి.

రాజమహేంద్రవరంలో ***'వితంతు శరణాలయము'*** స్థాపించారు. తాను స్థాపించిన సంస్థలను నిర్వహించడానికి ***'హితకారిణి'*** సమాజాన్ని నెలకొలిపి, తన యావదాస్తిని ఆ సంస్థకు యిచ్చివేశారు. ఆ విధంగా పట్టుదలతో, నిరంతరం సాంఘిక సేవా కార్యక్రమాలను నిర్వహిస్తు, 1919లో మే 27న మద్రాసులోని కొమర్రాజు లక్ష్మణరావుగారి గృహంలో పరమ పదించారు ***'కందుకూరి'***.

***సంఘ సంస్కర్తలందరూ సాహితీవేత్తలు కాలేరు. సాహితీవేత్తలందరూ సంఘ సంస్కరణాభిలాషులు కారు. కాని, కందుకూరి వారిలో ఈ రెండూ కనిపిస్తాయి.*** తన రచనల ద్వారా ప్రజలను చైతన్యవంతులను చేసి, సంస్కరణోద్యమాన్ని విజయవంతంగా నిర్వహించిన మహా పురుషుడు కందుకూరి వీరేశ లింగం పంతులు. అలాంటి సంఘ సంస్కర్తలు ప్రతి శతాబ్దానికి కనీసం ఒకరైన జన్మించుతే ఈ దేశం ఇంకా బాగు పడుతుందేమో!



---

"వినయ వివేకాదులను వృద్ధి పొందించుటకు అనుకూలపడని విద్య లేకపోయినను, దానివలన వచ్చెడి నష్టమేమియూ లేదు. సుగుణ సంపదను గడించుటకై విద్య నేర్వవలసినదే గాని, విద్యనిమిత్తమై సద్గుణములను విడువరాదు. పలువురు మూఢులైన నిరక్షరకుక్షులు చేరి చేయు హాని కంటెను, ఒక చదువుకున్న దుష్టుడు చేయు హానియే అధికము"

- కందుకూరి



# డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు

*"ఉస్మాన్‌గారు నాకు సన్నిహితులు. వారు కాలేజీలో మొదట నాకు సీనియర్, తరువాత నా క్లాస్‌మేట్, ఆ తరువాత నాకు జూనియర్. నేను ప్రొఫెసర్‌గా ఉన్నప్పుడు ఆయన వైస్‌ఛాన్సలర్, నేను వైస్‌ఛాన్సలర్‌గా ఉన్నప్పుడు, వారు ఛాన్సలర్"*

అని ఒక సభలో ఒక గొప్పవ్యక్తి ఛలోక్తిగా మాట్లాడారు. ఆ మాటల అంతర్యమును అర్థంచేసుకొనిన సభికులందరూ చప్పట్లు కొట్టారు. ఆయన ఎవరో తెలుసా?భారతదేశమునకు ఉపరాష్ట్రపతిగా, రాష్ట్రపతిగా ఉన్నత పదవులనధిష్ఠించిన, ఒక మహా తత్త్వవేత్త, మేధావి. ఆయనే *డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు.* ఆయన ఉపన్యాసంలో ఛలోక్తులు, హాస్యోక్తులు తరచుగా దొర్లుతుండేవి. ఛలోక్తులు విసరటంలో ఆయనకు ఆయనే సాటి.

ఆయన ఒకసారి మన దేశంలోని ఒక పేరెన్నికగల ఆసుపత్రిలో కన్ను ఆపరేషన్ చేయించుకున్నారు. అది తృప్తికరంగా జరగలేదు. రెండో కన్ను ఆపరేషన్ కోసం లండన్ వెళ్లే ముందు మాట్లాడుతూ ***"ఇక్కడ నన్ను శుక్రాచార్యుని చేశారు. ఇప్పుడు ధృతరాష్ట్రుని చేస్తారేమో!"*** అని భయపడి ఇప్పుడు లండన్ వెళ్ళుతున్నానన్నారు. స్వదేశంలో నున్న ఆసుపత్రుల దుస్థితిని సూటిగా చెప్పకుండా, ఛలోక్తిగా చెప్పారు. ఆ మహనీయుని మాటలను అర్థంచేసుకొనిన డాక్టర్లు సిగ్గుపడక మానరు. ***మహనీయులు సున్నితంగా హెచ్చరిస్తారు గాని, సూటిగా, కఠినంగా చెప్పరు.*** అదే వారి ప్రత్యేకత.

ఒకసారి మహాత్మా గాంధీజీ ***'ఆవుపాలను త్రాగడం కూడా మాంస భక్షణ అవుతుంది'*** అన్నారు అప్పుడు ***"తల్లి పాలుత్రాగిన మనం పరోక్షంగా నరమాంస భక్షకులం కాదా?"*** అని

రాధాకృష్ణ పండితులు అనేసరికి ప్రక్కన నున్న వారందరూ నవ్వారు. గాంధీజి నివ్వెర పోయారు. సమయస్ఫూర్తిగా, హాస్యంగా మాట్లాడటం రాధాకృష్ణ పండితుని స్వభావం. *కటువుగా మాట్లాడితే, అది యదార్థమే అయినప్పటికీ ఎదుటివారు బాధ పడుతారు. హాస్య ధోరణిలో మాట్లాడుతే బాధపడరు, పైపెచ్చు నవ్వుతారు. కనుక మనం కఠినంగా మాట్లాడకూడదు. కానీ అర్థమయ్యేట్లు సున్నితంగా హెచ్చరించడం నేర్చుకోవాలి. అది విజ్ఞుల లక్షణం.* ముఖ్యంగా అధ్యాపకులు అయినవారు దీనిని గ్రహించాలి, సహజంగా అల్లరి చేయటం, తప్పలు చేయటం పిల్లల లక్షణం. అధ్యాపకులు కోపగించి వారిని దండించరాదు. ఛలోక్తులతో హాస్యంగా మాట్లాడి పిల్లలను సరిదిద్దే ప్రయత్నం చేయాలి అధ్యాపకులు.

శ్రీమతి విజయలక్ష్మి పండిట్ 18 మాసాల పాటు రష్యాలో రాయబారిగా ఉన్నప్పటికీ, ఒక సారి కూడా ఆమెకు స్టాలిన్‌తో ఇంటర్వ్యూ లభించలేదు. అలాంటి పరిస్థితులలో రాధాకృష్ణన్ గారు రాయబారిగా రష్యాలో నియమింపబడినారు. అంతకు పూర్వం దౌత్యవ్యవహారాలతో ఆయనకు పరిచయమే లేదు. ఈ తత్త్వవేత్త అక్కడ నెగ్గుకొని రాగలడా? అనే సంశయం అందరిలో కలిగింది. అయితే ఆయన రోజుకు 18 గంటల పాటు పుస్తక పఠనంలోనే నిమగ్నుడై వుంటారనే సమాచారం స్టాలిన్‌కు తెలిసిందట. అది విన్నప్పటి నుంచి రాధాకృష్ణన్ గారిని చూడాలనే కోరిక స్టాలిన్‌లో కలిగింది. సాధారణంగా స్టాలిన్ ఏ దేశ రాయబారులను చూచేవారు కాదు. 1952 సం॥లో ఉపాధ్యక్ష పదవికి పోటీ చేయడానికి ఇండియాకు తిరిగి వస్తున్నప్పడు, స్టాలిన్ కోరికపై డా. రాధాకృష్ణన్ ఆయనను కలుసుకున్నారు. స్టాలిన్ ఆరోగ్య పరిస్థితిలో వచ్చిన మార్పును గమనించిన రాధాకృష్ణన్ ఆయన బుగ్గలను, తలను నిమిరి, వీపును తట్టి *"ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకోండి!"* అని అనేటప్పటికీ అంతటి నియంత విచలితుడై పోయాడుట. రాధాకృష్ణన్ చూపించిన అనురాగం ఆప్యాయత ఆ నియంతను కదిలించివేసి *"నేనెంతో కాలం బ్రతకకపోవచ్చును"* అని కంటతడి పెట్టాడుట స్టాలిన్. స్టాలిన్‌తో అంత సన్నిహితంగా మెలిగిన రాయబారి మరెవరూ లేరేమో! తత్త్వవేత్త కాబట్టే, అంతటి నియంత సన్నిధికి వెళ్ళగలిగాడు, ఆయన మనస్సును దోచుకోగలిగాడు రాధాకృష్ణన్. అంతర్జాతీయ రంగంలో ఆయన అంతస్థును పెంచుకోగలిగాడు. కేవలం తత్త్వవేత్తే కాదని, రాజకీయ దురంధరుడని అనిపించుకోగలిగాడు రాధాకృష్ణన్.

డా॥ రాధాకృష్ణన్ మైసూరు విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా ఉండేవారు. 1921 సం॥ మార్చిలో కలకత్తా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు డా॥ అశుతోష్ ముఖర్జీ



కోరికపై డా॥ రాధాకృష్ణన్ గారు కలకత్తా విశ్వవిద్యాలయంలో పని చేయడానికి బయలు దేరుతున్న సమయం అది. ఇంటి ముందు 'గుర్రపు బగ్గీ' వచ్చి నిలచింది. మైసూరు విశ్వవిద్యాలయ విద్యార్థులు, అధ్యాపకులు వీడ్కోలు యివ్వడానికి పెద్ద సంఖ్యలో వచ్చారు. అంతా సందడిగా ఉన్నది. డా॥ సర్వేపల్లి సామానును విద్యార్థులు బగ్గీలో పెట్టారు. డా॥ సర్వేపల్లి లోపల నుంచి బయటకు వచ్చారు. కొందరు విద్యార్థులు డా॥ సర్వేపల్లిని చేతుల మీద ఎక్కించుకున్నారు, మరికొందరు విద్యార్థులు బగ్గీకి వున్న గుర్రాలను వదిలివేసి, ఆ కాడిని తమ మెడలపైన పెట్టుకున్నారు. డా॥ సర్వేపల్లిని ఎత్తుకొనిపోయి బగ్గీలో కూర్చో బెట్టారు విద్యార్థులు. ఇదంతా డా॥ సర్వేపల్లికి విచిత్రంగా కనిపించింది.. 'ఇదేమిటి?' 'అని ఆశ్చర్యంగా అడిగారు డా॥ సర్వేపల్లి. అప్పుడు ఆ విద్యార్థులు "**జ్ఞానభిక్ష పెట్టిన అధ్యాపకునికి కృతజ్ఞతను తెలియపరచటం**" అని ముక్తసరిగా సమాధానం చెప్పారు. విద్యార్థులే ఆ బగ్గీని స్టేషన్ వరకు లాక్కొని తీసుకొని వెళ్లారు. చేతుల మీదగా ఎత్తుకొని, రైలు బోగీలో డా॥ సర్వేపల్లిని కూర్చోబెట్టారు. పరిసరాలలో నున్న వారందరూ, ఆ విద్యార్థులు ప్రదర్శించిన గురుభక్తిని చూచి ఆశ్చర్యపోయారు.

అధ్యాపకులను విద్యార్థులు అవహేళన చేస్తున్న ఆ సమయంలో, విద్యార్థుల ఆదరాభిమానములను చూరగొనిన ఉత్తమ అధ్యాపకుడు డా॥ సర్వేపల్లి. అంతటి అభిమానాన్ని పొందిన ఆయన ఎంత అదృష్టవంతుడు? అది ఆయన స్వరాష్ట్రం కాదు. అక్కడ ఆయన పని చేసిన కాలం కూడా రెండేళ్లకు మించలేదు. అంత స్వల్ప కాలంలోనే విద్యార్థుల హృదయాలపై చెరగని ముద్రవేసిన ఆదర్శ అధ్యాపకుడు ఆయన. "విద్వాన్ సర్వత్ర పూజ్యతే" అనే ఆర్యోక్తిని ఆచరణ ద్వారా నిరూపించిన ఆ మహో మనీషి డా॥ సర్వేపల్లి. అందువలననే కాబోలు భారత ప్రభుత్వం ఆ మహాపురుషుని జన్మదినము అయిన సెప్టెంబరు 5వ తేదీన '**ఉపాధ్యాయ దినోత్సవముగా**'జరుపుకోమని ఆదేశించింది. కనుక ప్రతిఉపాధ్యాయుడు డా. సర్వేపల్లిని ఆదర్శంగా తీసుకొని, ఆయన సమాజమునకు అందించిన ఆదర్శముల నుంచి స్ఫూర్తిని పొంది, ఆదర్శ అధ్యాపకులుగా వెలుగొందు తారని ఆశిద్దాం.

---

***"National integration cannot be built by brick and mortar, by chisel and hammer, but it has to grow silently in the minds and hearts of Men".***

***- Dr. Sarvepalli***



# లాల్ బహదూర్ శాస్త్రి

*"మంత్రి పదవి ఒక మహత్తరమైన బాధ్యతే గాని, అది అధికార భోగ్యం, విలాసయోగ్యం కారాదు. సుఖ సౌకర్యాల పేరుతో మనం ప్రజాధనాన్ని దుర్వినియోగం చేయరాదు. లభించిన పదవిని సేవాదృష్టితో నిర్వహించాలి".*

అని అధికారులకు చెప్పి, తన అధికార నివాసానికి *'ఎయిర్ కండీషన్'* తీయించి వేస్తారు. తొలిసారిగా ఆయన కేంద్రమంత్రి పదవిని అలంకరించినప్పుడు, ఆయన అనుమతి లేకుండానే, ఆయన పర్యటనలో ఉన్నప్పుడు, ఆయన అధికార నివాసానికి 'ఎయిర్ కండీషన్'ను అధికారులు చేయిస్తారు. మంత్రిగారి మెప్పను పొందవచ్చని అధికారులు సహజంగా భావిస్తారు. కాని మెప్పను పొందకపోగా, చివాట్లు తింటారు. అదే అక్కడ జరిగిన విచిత్రం. ఆయన ఎవరో తెలుసా? అత్యున్నతమైన కేంద్రమంత్రి పదవిని అధిష్టించినా, భోగవిలాసాల నాశించని, నిరాడంబరుడు, నిజాయితీ పరుడు, స్వార్థమెరగని సేవానిరతుడు, పొట్టివాడైనా, అతి గట్టివాడని పేరుగాంచి, పరిపాలనా దక్షుడుగా కీర్తి శిఖరాలనందుకొనిన కర్మయోగి ***లాల్ బహదూర్ శాస్త్రిగారు.***

*'శాస్త్రి'* అనేది కాశీ విద్యాపీఠం వారు ప్రదానం చేసిన Master Degree. ఆయన అసలు పేరు శ్రీవాత్సవ లాల్‌బహదూర్. ఆయనే లాల్‌బహదూర్ శాస్త్రిగా ప్రజలకు సుపరిచితులయ్యారు. భారత దేశప్రధానిగా సుదీర్ఘకాలం జవహర్‌లాల్ నెహ్రూ పాలించారు. మంచి పేరును తెచ్చుకున్నారు. ఆయన తరువాత అంతటి వారు ఎవరు? నెహ్రూలా ఆయన పాలించగలడా? అని దేశవిదేశాలలో చర్చలు జరుగుతున్న సమయంలో 1964 సం॥ మే 27న గుండెపోటుతో నెహ్రూ పరమపదించుతారు. జూన్ 9వ తేదీన లాల్‌బహదూర్ శాస్త్రి ప్రధాన మంత్రి పదవీ బాధ్యతను చేబడుతారు.

ఆయన నిజాయితీ అందరికీ బాగా తెలుసు. కాని ఆయన సమర్థత మీద సందేహాలు మాత్రం పూర్తిగా తీరలేదు. ఆయనది నిరాడంబరమైన వేషం. ఆడంబరం ఏ మాత్రం ఉండేదికాదు. అతి సామాన్య వ్యక్తిగా కనిపించేవాడు. గంభీరమైన విగ్రహం కాదు. పొట్టివాడు. ప్రధాని పదవి చేబట్టిన తరువాత కూడా ఆయన వేషంలోగాని, అలవాట్లలో ఏమాత్రం మార్పురాలేదు.

భోపాల్‌లో ఒకసారి ఒక ఉర్దూ కవి లాల్‌బహదూర్ శాస్త్రిగారిని కలిసి *"మీ ప్రస్తుత వేషం (ధోవతి, కుర్తా) ప్రధాన మంత్రి హోదాకి తగినట్టుగా లేదు. పైగా మీరు ప్రతిరోజు ఎందరో విదేశీయుల్ని కూడా కలుసుకోవాలాయే!"* అని అంటాడు. ఆ మాటలు విన్న లాల్ బహదూర్ శాస్త్రిగారు కోపించక, ప్రశాంతంగా వివేకానందుని మాటలు గుర్తుచేశారుట. *"చేతలనుబట్టి ఒక వ్యక్తి శీలమును నిర్ణయించాలి గాని, అతను వేషధారణను బట్టి కాదు. అతను చేసే పనులను గమనించి, అతని సమర్థతను అంచనా వేయాలి గాని , వేషమును చూచి నిర్ణయానికి రాకూడదు. అలాగే ఒక దేశమును గురించి చెప్పేటప్పుడు, ఆ దేశ ప్రజల గుణగణాలను చూడాలి గాని, జనసంఖ్య ముఖ్యం కాదు".* ఈ దృష్టితో గనుక చూస్తే లాల్‌బహదూర్ శాస్త్రి సామర్థ్యం, నీతి నిజాయితీలు ఎంతటివో మనకు అవగతమవుతాయి. ప్రధాన మంత్రిగా పాలన చేసిన సమయం 19 మాసములే అయినప్పటికీ, చిరస్థాయిగా గుర్తుంచుకోవలసిన ఘనకార్యాలను ఎన్నో సాధించారు శాస్త్రిగారు.

ఆయన ఎంత నిరాడంబరుడో, అంత నిజాయితీపరుడు కూడా. 1952 సం॥ నుంచి కన్నుమూసేదాకా కొన్ని నెలలు తప్ప కేంద్రంలో అనేక మంత్రి పదవుల బాధ్యతను కడు సమర్థవంతంగా, నిజాయితీగా నిర్వహించారు. తమిళనాడులోని 'అరియలూర్' వద్ద జరిగిన రైలు ప్రమాదంలో 112 మంది మరణించినప్పుడు, నైతిక బాధ్యత వహించి మంత్రి పదవికి రాజీనామా చేసారు. ఆ తరువాత కార్యాలయము నుంచి బయటకు రాగానే, మామూలు ప్రకారం ఆయనను ఇంటికి తీసుకొని వెళ్ళడానికి చిన్నకారు సిద్ధంగా ఉంటుంది. ఆ కారులో ఎక్కక, బస్సులో ఇంటికి వెళ్ళుతారు. ఇంటికి వెళ్ళి ఆయన భార్యతో *'నేటి నుంచి నాకు పదవి లేదు. కనుక ఒక్క కూరకంటె ఎక్కువ వండవద్దు'* అని చెబుతాడట. సుదీర్ఘ కాలం మంత్రి పదవులను, ప్రధాన మంత్రి లాంటి ఉన్నత పదవులను అధిష్ఠించినప్పటికినీ, ఆర్జించింది ఏమీ లేదు. స్వంత ఇల్లు అంటూ లేకుండానే కన్ను మూసారు *లాల్‌బహదూర్ శాస్త్రిగారు.*

ఒకసారి ప్రమాదవశాత్తు శాస్త్రిగారు ప్రయాణం చేస్తున్న కారు ఆగిపోయింది. దగ్గరలోనే వున్న పోలీసుస్టేషన్‌కు ఆయనే స్వయంగా నడచి వెళ్ళుతాడు. *'ఫిర్యాదు చేయడానికి వచ్చాను, ఇన్‌స్పెక్టర్ గారు లేరా?'* అని అక్కడ వున్న హెడ్ కానిస్టేబుల్‌ను ప్రశ్నిస్తాడు. *'లేరు. ఆ బెంచీమీద కూర్చో! వస్తారు'* అని సమాధానం చెబుతాడు హెడ్ కానిస్టేబుల్. ఎంత సేపు కూర్చున్నా, ఇన్‌స్పెక్టర్ రాడు. కొంచంసేపు అయిన తరువాత *'ఇన్‌స్పెక్టర్ గారు ఎప్పటికి వస్తారు సార్!'* అని వినయంగా అడుగుతాడు. *"నువ్వేదో పెద్ద అధికారిలా! మినిష్టర్‌లా! అడుగుతావేంటయ్యా! ఇష్టం వుంటే ఉండు లేకపోతే పో!"* అని దురుసుగా మాట్లాడుతాడు ఆ హెడ్. ఇంకా కొంత సేపటికి లోపలికి వస్తూనే *'నమస్కారం సార్!'* అంటూ వస్తాడు ఇన్‌స్పెక్టర్. *'హెడ్ కానిస్టేబుల్! ఈయన ఎవరో తెలుసా! మన హోంమంత్రి లాల్ బహదూర్ శాస్త్రిగారు'* అని చెబుతాడు. హెడ్ కానిస్టేబుల్‌కు చెమటలు పట్టి ఖాకీ దుస్తులు తడిసిపోతాయి. అది గమనించిన శాస్త్రి గారు, జాలిపడి, అతని మీద ఫిర్యాదు చేయకుండా, తన పనిముగించుకొని వెళ్ళిపోతారు. ఆనాటి నుంచి ఆ కానిస్టేబుల్ ప్రవర్తనలో చాలా మార్పు వస్తుంది. ***అందువలననే గొప్పవారి ప్రవర్తన మూర్ఖులలో సహితం పరివర్తనం తెస్తుంది అంటారు.***

లాల్ బహుదూర్ మొత్తం ఎనిమిది సార్లు జైలుకి వెళ్ళారు. ఒకసారి జైలులో ఉన్నప్పుడు ఆయన ఎనిమిదేళ్ళ కూతురికి జ్వరం తీవ్రంగా వస్తుంది. తండ్రి కోసం కలవరిస్తుంటుంది. ఈ విషయం తెలిసిన 'శాస్త్రి'గారు జైలు అధికారులను పెరోల్ అడుగుతాడు. అయితే జైలు అధికారులు ***"మీ అమ్మాయిని చూడాలనుకుంటే పెరోల్ మీద వెళ్ళవచ్చు కాని ఇంకెప్పుడూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగే ప్రదర్శనలలో పాల్గొనని హామీ యివ్వాలి"*** అని షరతు పెడుతారు. ఆ షరతు ఆయనకు నచ్చలేదు. అయితే ఆ అమ్మాయికి జ్వరం మరీఎక్కువయింది. ఆమె మీద ఆశ వదులుకున్నారు. ఆ పరిస్థితులలో ప్రభుత్వం, లాల్‌బహుదూర్‌ను పెరోల్ మీద పంపడానికి అంగీకరించింది. జైలు నుంచి ఇంటికి వెళ్ళుతారు. అయితే తండ్రిని చూడకుండానే ఆమె కన్ను మూస్తుంది. అంత విచారంలో కూడా జైలుకు తిరిగి వస్తారు లాల్ బహుదూర్. ఆయన నిజంగా స్థిత ప్రజ్ఞుడే.

ఒకసారి గాంధీజీ వారణాసి వస్తారు. గాంధీజీ ఉపన్యాసాన్ని వినిన లాల్ బహుదూర్, ఉత్సాహంతో సహాయనిరాకరణోద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళుతాడు. అప్పుడు ఆయన వయస్సు 16 సంవత్సరాలు మాత్రమే. విడుదల అయిన తరువాత గాంధీజీ సలహా మేరకు కాశీ విద్యాపీఠంలో చేరి నాలుగు సంవత్సరాలు విద్యాభ్యాసం

చేస్తారు. ఆ రోజులలో విద్యార్థులు సైకిళ్ల మీద వెళ్లి వస్తుంటే, సైకిలు కొనుక్కొనే స్తోమత లేక లాల్‌బహదూర్ మాత్రం రోజు 16 మైళ్లు నడిచి వెళ్లి తిరిగి వచ్చేవాడట. అయినప్పటికీ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడై 'శాస్త్రి' పట్టాను సాధించిన దీక్షా దక్షుడు **లాల్‌బహదూర్ శాస్త్రి.**

లాల్‌బహదూర్ శాస్త్రి ప్రధాన మంత్రిగా ఉన్న సమయంలో, పాకిస్థాన్ అధ్యక్షుడు అయూబ్ ఖాన్, అహంకారంతో అంతకు పూర్వం చేసికొన్న ఒడంబడికలను కూడా ఉల్లంఘించి **"రాణ్ ఆఫ్ కచ్"** మీద సైనిక చర్యకు తలబడుతాడు. శాంతిని, సహజీవనాన్ని కోరే లాల్ బహూదూర్ ఈ దురాక్రమణను ఎదుర్కొనగలడా? అని యావత్ ప్రపంచం సంశయిస్తున్న తరుణంలో "జై కిసాన్!.. జై జవాన్!" నినాదాన్ని యిచ్చి రైతులను, జవాన్లను ఉత్తేజ పరచి పాకిస్థాన్ సాయుధ దురాక్రమణను త్రిప్పికొట్టి, ప్రపంచాధినేతల ప్రశంసల నందుకుంటారు. పొట్టివాడేకాదు, అతి గట్టివాడని నిరూపించుకుంటాడు లాల్ బహుదూర్ శాస్త్రి.

రష్యా ప్రధాని సలహా ప్రకారం, భారత పాకిస్థాన్‌ల మధ్య యుద్ధ వాతావరణం ప్రబలటం మంచిదికాదని భావించిన శాస్త్రిగారు యుద్ధ విరమణ సంప్రదింపులకు 'తాష్కెంట్' వెళ్ళుతారు. అలా వెళ్లిన శాస్త్రిగారు విధివశాత్తు మరల తిరిగి రాలేదు. జరగరానిదే జరిగింది. 1966 సం॥ జనవరి 11వ తేదీ రాత్రి అకస్మాత్తుగా, అనూహ్యమైన పరిస్థితిలో పరమపదించుతారు.

మాజీ రాష్ట్రపతి *డాక్టర్ సర్వేపల్లి* పేర్కొనినట్లు లాల్‌బహదూర్ శాస్త్రి ప్రజలమనిషి. ఇది అక్షరాలా నిజం. ***'ఓర్పు, పట్టుదల, గుండెదిటవు, నిజాయితీ, నిరాడంబరత, శాంతి ప్రియత్వం, వేషభాషలు, వినయవిధేయతలు, ధైర్య స్థైర్యములు - ఇవన్నియూ ఒక్కచోట కలిసిన ఆకృతియే 'లాల్‌బహదూర్ శాస్త్రి'*** అని అంటారు ***సర్వేపల్లి.***

*ఇది వాస్తవం. పొట్టివాడైనా అతి గట్టివాడు, నిరాడంబరుడైనా నిర్భయుడు. వేషభాషలు సామాన్యంగా కనిపించినా, సమర్థుడైన పరిపాలనాదక్షుడు. పాలించింది కొద్దినెలలే అయినప్పటికీ, ఆయన పేరు చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయింది. పేదవాడైనా నిజాయితీ పరుడు అనిపించుకున్నాడు. ఉన్నత పదవులనధిష్టించినా సామాన్య జీవితాన్నే గడిపాడు. మనిషి వ్యక్తిత్వాన్ని పెంచేవి పదవులు కావని, సచ్ఛీలత మాత్రమేనని ఆచరణ ద్వారా నిరూపించారు లాల్‌బహదూర్ శాస్త్రి. ఆ మహనీయుని అడుగుజాడలలో నడుద్దాం, మన జీవితాలను సార్థకం చేసుకుందాం!*



# సర్దార్ వల్లభాయి పటేల్

*"ఎక్కడ కొన్నావురా ఈ పుస్తకం?"*

*"బజార్లో పుస్తకాల కొట్లోనండి!"*

*"నాదగ్గరే కొనాలని నీకు తెలియదా?"*

*"మీ దగ్గర చదువుకునేందుకేగాని బేరసారాలు చెయ్యటం కోసం కాదండీ, నేను బడికి రావడం".*

ఈ జవాబు విని ఆ ఉపాధ్యాయుడు ఉలిక్కి పడుతాడు. అయినా గంభీరంగా *"ఇదిగో! ఈసారి నువ్వు ఇతరత్రా పుస్తకాలు కొన్నావో! బడికి రానివ్వను, తెలిసిందా?"* అన్నాడు.

*"మీకా కష్టం ఎందుకులెండి. నేనింక బడికి రాను, సార్!"* అన్నాడు ఆ బాలుడు. ఆ ఉపాధ్యాయుడు నిర్ఘాంతపోయాడు.

ఆ మరునాడు అతడేకాదు. ఆ తరగతి విద్యార్థులెవ్వరూ బడికి రాలేదు. ఆ గ్రామపెద్దలు జోక్యం చేసుకొని, అందరినీ శాంత పరిచారు. పిల్లలందరూ బడికి వెళ్ళారు.

అంత నిర్భయంగా జవాబు చెప్పిన బాలుడెవరో తెలుసా? 'బార్డోలి రైతుల భూములలో అడుగుపెడితే ప్రాణాలతో తిరిగి వెళ్ళరు" అని ఆంగ్లేయ అధికారులను హెచ్చరించి, వారికి సింహస్వప్నంగా నిలచిన *'బార్డోలి సర్దార్'* గా పేరు ప్రఖ్యాతులనందు కొనిన మహావీరుడు ఆయన.

స్వాతంత్ర్య మహోద్యమంలో అగ్రభాగాన నిలబడి, బ్రిటీష్ వారిని గజగజలాడించి, వీరోచితంగా పోరాటం కొనసాగించి **ఉక్కుమనిషి** (Iron man of India) గా కీర్తి

ప్రతిష్ఠలందుకొనిన ధీరుడు ఆయన. ఆయన పేరు చెబితే చాలు, రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాధినేతలు వణికి పోయేవారు. మన దేశంలో చెల్లాచెదురుగా ఉన్న 565 సంస్థానాలను భారత ప్రభుత్వం క్రిందకు తీసుకొనివచ్చిన గొప్ప రాజనీతి దురంధరుడు ఆయన. ఆయనే ***సర్దార్ వల్లభాయి పటేల్.***

ఆయన ఎప్పుడూ పదవుల కోసం ప్రాకులాడలేదు. అయినప్పటికీ ప్రథమ భారత ప్రధాన మంత్రిగా ఆయన ఉండాలని, ఆనాడు మన దేశంలో ఉన్న 15 రాష్ట్రములలో, 12 రాష్ట్రములవారు బలపరిచారు. అయినప్పటికీ మహాత్మా గాంధీజీ జోక్యం చేసుకోవటం వలన, పండిత నెహ్రూ ప్రథమ ప్రధాన మంత్రి పీఠాన్ని అలంకరించారు. ఉప ప్రధాన పదవిని పటేల్ స్వీకరించారు.

పటేల్ వీధి బడిలో చదువుకునే రోజులవి. ఒకనాడు మాస్టారు ఎక్కాలు వ్రాసుకొని రమ్మనమని పిల్లలను ఆదేశిస్తాడు. మరునాడు పటేల్ దగ్గరకువచ్చి ***"ఎక్కాలు వ్రాసి తెచ్చావా?"*** అని అడుగుతాడు ఆ మాస్టారు. ***"ఆ! తెచ్చాను ... కాని"*** అన్నాడు పటేల్. ***'కానీ ఏమిట్రా'*** అని ప్రశ్నిస్తాడు మాస్టరు. ***"ప్రొద్దున స్కూల్ దగ్గరకు రాగానే, పిల్లలు భయపడి పరుగెత్తారండి!"*** అని సమాధానం చెబుతాడు పటేల్. మాస్టారుకి కోపం వస్తుంది, అర్థం కాదు ఆశ్చర్యం వేస్తుంది. పిల్లలంతా పకాలున నవ్వుతారు. ఆ మాస్టారు ఎక్కాలు వ్రాసి తెమ్మనమని 'పహడోం' అని హిందీలో చెప్పారు. కాని పటేల్ దాన్ని గుజరాతీ భాషలో అర్థం చేసుకున్నాడు. ***'పహడోం'*** అంటే గుజరాతీ భాషలో ఆవులూ, గేదెలూ అని అర్థం. అందువలన పటేల్ ఆవులను, గేదెలను స్కూల్‌కి తోలుకొని వస్తాడు. వాటిని చూచి పిల్లలు భయపడి పారిపోతారు. ఆ మాస్టార్‌కు కోపం వచ్చి రెండు వందల ఎక్కాలు వ్రాసుకొని రమ్మనమని కఠినంగా ఆదేశిస్తాడు. ఆ మరునాడు మరల అడుగుతాడు. పలక తెచ్చి చూపిస్తాడు పటేల్. ఆ పలక మీద రెండు వందల ఎక్కములు వ్రాయబడి ఉంటాయి. ఆ మాస్టార్ ఆశ్చర్యపోయి, ఒక చిరునవ్వు నవ్వి అతని తెలివి తేటలకు, గుండె నిబ్బరానికి, ధైర్యానికి ఆనందిస్తాడు.

న్యాయ శాస్త్రం చదవడానికి పటేల్ లండన్ వెళ్లుతాడు. అక్కడ ఉన్నప్పుడు అతని కాలిపై ఒక గడ్డ లేస్తుంది. డాక్టర్‌కు చూపిస్తాడు. ఆపరేషన్ చేయాలంటాడు

డాక్టర్. పటేల్‌ను బల్లపై పడుకోపెడుతారు. అతనికి మత్తుమందు యివ్వడానికి సిద్ధమవుతారు. వద్దంటాడు పటేల్. అప్పుడు ఆ డాక్టర్లు శస్త్రచికిత్స చేసి ఆ గడ్డను తీసివేస్తారు. మత్తుమందు యివ్వకుండా ఆపరేషన్ చేస్తున్నప్పటికీ ఏ మాత్రం చలించడు, తొణకడు, బెణకడు, బాధపడడు. ఆ దృశ్యం చూచిన డాక్టర్లే ఆశ్చర్యపోతారు.

బార్డోలి శిస్తుసత్యాగ్రహంలో పటేల్ ప్రదర్శించిన ధైర్యసాహసాలను చూచి గాంధీ మహాత్ముడంతటివాడు ఆశ్చర్యపోయి ఆయనకు 'సర్దార్'అనే బిరుదును యిస్తారు. ఇలా పటేల్‌ను గురించి తెలుసుకోదగిన కథలెన్నో ఉన్నాయి. మొత్తం మీద అఖండ భారత నిర్మాతగా, 565 స్వదేశీ సంస్థానాలను భారత రిపబ్లిక్‌లో విలీనం చేసిన ఉక్కు మనిషి (Iron man of India) గా ఆయన మన దేశచరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయారు.

విశ్రాంతి ఎరుగని మహావీరుడు ఆయన. కర్తవ్య పరాయణత్వంలో అహర్నిశలూ శ్రమించడం వలన ఆయన ఆరోగ్యం బాగా దెబ్బతింటుంది. డాక్టర్ల సలహా ప్రకారం, విశ్రాంతి కోసం, ఆయన మిత్రులు బొంబాయిలోని బిర్లా మందిరానికి తీసుకొని వెళ్ళుతారు. ఆ మహావీరుడు అక్కడనే ది. 15-12-1950న శాశ్వతంగా విశ్రాంతి తీసుకుంటాడు. జీవిత కాలంలో ఆయన చేసిన త్యాగాలు, సాధించిన విజయాలు ఈ తరంవారికి ఎందరికి తెలుసు? అసలు ఆయన ఉజ్వల జీవిత చరిత్రను తెలుసుకొని స్ఫూర్తిని పొందాలనే తాపత్రయం ఎందరిలో ఉన్నది? ఇది కొంచెం ఆలోచించవలసిన విషయమే.



---

"తక్కువ మాట్లాడండి, ఎక్కువ సాధించండి. మర్యాదగా మాట్లాడటానికి, పొగడ్తకున్న తేడా గ్రహించండి. 'విప్లవం... విప్లవం...' అనే కేకలు వేయకండి. ఆ కేకలు వేసే నాయకులు కార్యాచరణకు వెనుకంజ వేస్తారు. దేశంలో నాయకులకు కొదవలేదు. క్రమశిక్షణా శీలురైన అనుచరులు లేనిదే పోరాటం విజయంపొందదు. కాన అట్టి సుశిక్షితులైన సైనికులుగా తయారుకండి".

- పటేల్



# డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య

*"ప్రకాశంగారికి రేపు అనేది లేదు. నాకు రేపూ, ఎల్లుండికూడా ఉన్నాయి"* అని ఒకసారి ఛలోక్తిగా అన్నారు డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు. ఈ మాటలు ఛలోక్తిగా ఉన్నప్పటికీ, అంతరార్థం ఎంతో ఉన్నది. ప్రకాశంగారు రేపును గురించి ఆలోచించక తన సర్వస్వాన్ని స్వాతంత్ర్యమహోద్యమంలో సమర్పించివేశారు. ఆఖరి దశలో కటిక దారిద్ర్యాన్ని అనుభవించవలసి వచ్చింది. అయితే డా॥ పట్టాభిగారు చిన్న తనంలోనే దారిద్ర్యబాధను అనుభవించడంచేత, జీవితంలో డబ్బును విచ్చల విడిగా ఖర్చుచేసేవారు కాదు. పొదుపు చేసేవారు. ఒకవైపు వ్రాసిన కాగితాన్ని కూడా పారవేసేవారు కాదుట. ఏమాత్రం తెల్లటి కాగితం కనిపించినా, అంతవరకు కత్తిరించి, అది పెద్దదయినా, చిన్నదైనాసరే టేబుల్ మీద క్లిప్పకు పెట్టి వుంచుకొనే వారుట. అవసరమొచ్చినప్పడు ఆ కాగితాలను వినియోగించేవారు పట్టాభి.

మధ్యతరగతి కుటుంబీకుల ఆర్థిక స్థితిగతుల విషయంలో అవగాహన బాగా ఉండటంవలన, అనేకమంది నిరుద్యోగ యువకులకు ఉపాధి కలిపించాలని సంకల్పించుకొని బ్యాంకులూ, ఇన్సూరెన్సు కంపెనీలను స్థాపించారు పట్టాభి. 1915 సం॥లో బందరులో కృష్ణా కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్‌ను, 1923 సం॥లో ఆంధ్రాబ్యాంకును, 1925 సం॥లో ఆంధ్రా ఇన్సూరెన్సు కంపెనీని, 1927 సం॥లో వడ్లమన్నాడు ల్యాండు మార్టిగేజ్‌బ్యాంక్‌ను, 1929 సం॥లో భారతలక్ష్మీబ్యాంకును, 1935 సం॥లో హిందూస్థాన్ ఐడియల్ ఇన్సూరెన్సు కంపెనీలను స్థాపించి ఎన్నో వేలమంది విద్యావంతులకు జీవనభృతిని కలుగజేసారు. ఈనాటికీ ఎన్నోవేలమంది ఆ సంస్థలలో చేరి జీవనయాత్రను సాగిస్తున్నారు.

భారత జాతీయ కాంగ్రేస్ స్వర్ణోత్సవాల సందర్భంలో అనగా 1935 సం॥లో "History of the Indian National Congress" అనే ఉద్గ్రంథాన్ని ఇంగ్లీషులో రచించారు. దానిని కొడాలి ఆంజనేయులుగారు తెలుగులోనికి అనువదించారు.

ఒక బొంబాయి పబ్లిషర్‌వచ్చి, ఆ గ్రంథం కాపీరైటు హక్కులు యిస్తే యాభైవేల రూపాయిలు యిస్తానంటాడు. ఆయన డబ్బుకు ఆశపడక ఆ గ్రంథాన్ని కాంగ్రెసు సంస్థకే అంకితం చేస్తారు పట్టాభి.

అబద్ధం ఆడకుండా న్యాయవాదిగా రాణించడం సాధ్యం కాదని భావించి పట్టాభి వైద్యవృత్తిని స్వీకరించుతారు. చదువు పూర్తి అయిన తరువాత పిఠాపురం సంస్థానంలో ఉద్యోగం యిస్తానంటారు మహారాజుగారు. దానిని అంగీకరించక డాక్టర్‌గా బందరులో స్థిరపడుతారు పట్టాభి. పదేళ్లలో పుష్కలంగా డబ్బు సంపాదిస్తారు పట్టాభిగారు. మద్రాసులో చదువుతున్నప్పుడే 1898 సం॥లో గాంధీజీతో పరిచయం ఏర్పడుతుంది. బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటన చేసినప్పుడు ఆయనతో కూడా పట్టాభికి పరిచయం ఏర్పడుతుంది. వారి పరిచయంతో పట్టాభిలో జాతీయభావాలు ఒక రూపం సంతరించుకుంటాయి. కోపల్లె, ముట్నూరిల సహకారంతో బందరులో ఆంధ్రజాతీయ కళాశాలను స్థాపించుతారు. 1921, 1929 సంవత్సరాలలో గాంధీజీ ఆ కళాశాలను దర్శించి, ఉన్నత ఆశయాలతో నడుపబడుతున్న ఆ విద్యాసంస్థను ఎంతగానో మెచ్చుకుంటారు.

1939 సం॥లో కాంగ్రెసు అధ్యక్షుడుగా సుభాస్ చంద్రబోస్ మీద పోటీ చేసి ఓడిపోతారు పట్టాభి. ఆ ఎన్నికలలో గాంధీజీ పట్టాభిని బలపరుస్తారు. **'పట్టాభి ఓటమే నా ఓటమి'** అని బహిరంగంగా గాంధీజీ వెల్లడిస్తారు. దీనిని బట్టి పట్టాభి మీద గాంధీజీకి ఎంత గౌరవమూ, అభిమానమూ, ఉండేదో అర్థమౌ తుంది. కాంగ్రేస్‌లో ప్రముఖ పాత్ర వహించిన ఆయన ఏ పదవినీ ఆశించలేదు. రాజాజీ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు మంత్రి పదవి చేబట్టమని ఆహ్వానించినా అంగీకరించ లేదు పట్టాభి. మధ్యప్రదేశ్ గవర్నరుగా ఐదు సంవత్సరాలుండి 1957 సం॥లో హైదరాబాద్‌లో స్థిరబడ్డారు పట్టాభి. తన స్వీయచరిత్ర వ్రాస్తూ, అది పూర్తికాక మునుపే, తన 79వ ఏట 1959 సం॥ డిశంబర్ 15వ తేదీన పట్టాభి పరమపదిస్తారు. గాంధీజీ తత్త్వాన్ని బాగా జీర్ణం చేసుకొని Indian Nationalisam, why vote congress, National Education మొదలగు అనేక రచనలు చేశారు. అందుకే గాంధీజీ ఒకసారి ***"నేను వైశ్య సూత్రకారుడ్ని, పట్టాభి బ్రాహ్మణభాష్యకారుడు"*** అని మెచ్చుకుంటారు.

పట్టాభికి చిన్నప్పటినుంచే నిర్మొగమాటంగా, నిర్భయంగా మాట్లాడటం అలవాటు. బందరు నోబుల్ కళాశాలలో ఎమ్.ఎ. చదువుతున్నప్పుడు ఒక చిన్న సంఘటన జరిగింది. ప్రతిఒక్కరూ కళ్ళుమూసుకొని ప్రార్థనలో పాల్గొనాలి. అది ఆ కాలేజీ నియమం.

ఒకసారి ఒక పిల్లవాడు కళ్ళుతెరచి ప్రార్థన చేస్తుంటాడు. ఆ కాలేజీ ప్రిన్సిపాల్ 'క్లార్క్' ఆ విద్యార్థిని మందలిస్తాడు. పట్టాభి ప్రిన్సిపాల్ వద్దకువెళ్ళి *"కళ్ళుమూసుకొని మీరు ప్రార్థనలో పాల్గొనాలి గదా! అయితే అతను కళ్ళు తెరచిఉన్నట్లు మీకు ఎలా తెలిసింది?"* అని నిర్భయంగా అడుగుతాడు. అప్పుడు ఆ ప్రిన్సిపాల్ ఏమీ సమాధానం యివ్వడు. చిన్నప్పటినుంచే అంత నిర్భయంగా మాట్లాడటం ఆయన ప్రవృత్తి.

ఒకసారి బందరులోని విక్టోరియా మెమోరియల్ హాల్‌లో ఒక సమావేశం జరిగింది. చాలామంది పురప్రముఖులు ఆ సమావేశంలో పాల్గొన్నారు. ఆంగ్లేయుడైన జిల్లా కలక్టర్ అధ్యక్షస్థానంలో వుండి ఆ సమావేశాన్ని నిర్వహిస్తున్నాడు. విద్యార్థిగా ఉన్న పట్టాభికూడా వెనుక బెంచీలో కూర్చున్నాడు. అయితే అధ్యక్షస్థానంలో ఉన్న కలక్టరుగారు ఒక పద్ధతిలో ఆ సభను నిర్వహించటంలేదు. వెంటనే ఆ విద్యార్థి (పట్టాభి) లేచి *'మీ ప్రొసీజర్ తప్పు సార్!"* అని బిగ్గరగా చెబుతాడు. ఆ కలక్టర్‌గారికి అత్యంత సన్నిహితుడైన ప్రముఖ లాయర్ జే.డి. శామ్యూల్ లేచి "Who is that self advertising charlatan" (ఎవరా స్వంత డబ్బా వాయించుకునే వదరుబోతు) అని మండిపడుతాడు. అప్పుడు ఆ విద్యార్థిలేచి నిర్భయంగా ఆ ప్రొసీజర్‌లోని తప్పులను, పార్లమెంటరీ నియమ నిబంధనలను చెప్పేటప్పటికి, కలక్టర్‌తో సహా సభికులందరూ ఆశ్చర్యపోతారు. పట్టాభి మేధావి మాత్రమేకాదు. చమత్కారంగా మాట్లాడి సభికులను ఆకట్టుకోగల సమర్థుడు. ఒకసారి పట్టాభిగారిని ఒక మిత్రుడు 'అల్పాహారము'నకు ఆహ్వానిస్తాడు. డా॥ పట్టాభి ఆ అల్పాహార విందులోని Items ను గురించి చమత్కారంగా వ్యాఖ్యానించి అందరినీ నవ్విస్తాడు. "ఇచ్చే కాఫీ ఫ్రెంచిది, చక్కర జావాది, కలిపేది ఆస్ట్రేలియన్ టిన్‌మిల్క్, త్రాగేది జపాన్ కప్పుతో, కలియబెట్టేది జర్మన్ స్పూన్‌తో, మరగకాచేది అమెరికన్ స్టౌవ్‌పైన, కాగబెట్టేది బర్మాఆయిల్‌తో, తినేది గ్లాస్కో బిస్కట్లు, టేబుల్‌పైన పరచిన గుడ్డ లాంకషైర్‌మిల్లుది, తుడుచుకునే చేతిరుమాలా టర్కిష్ నాప్‌కిన్, కాలిక్రింద కార్పెట్ డెన్మార్కుది, ఎదురుగా వుండే అద్దం బెల్జియంది. ఇకపోతే వాటిల్లో వుండే స్వదేశీయం కేవలం నీరు మాత్రమే. కాబట్టి అదొక్కటే నాకు యివ్వండి చాలు!" అని హాస్యంగా అనడంతోనే అక్కడి మిత్రులందరూ నవ్వుతారు, ఆశ్చర్యపోతారు. అంతేకాదు ఆయన స్వదేశీ అభిమానాన్ని మెచ్చుకుంటారు.

***నిజాయితీ వ్యక్తి ప్రతిష్ఠను పెంచుతే, చమత్కారం అందరినీ ఆకట్టుకుంటుంది.***

---

"Your Replies should be as quick as eagle and as sharp as needle"

**'మీ సమాధానములు గరుత్మంతుని వలె వేగముగాను, సూదిమొనంత పదునుగాను ఉండాలి.**

**- డా. పట్టాభి**

# నీతి సుధానిధి

*(MORAL EDUCATION BOOK)*

చతుర్ధ భాగము

4


రచన - సంకలనం

శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు

*ఎడిటర్ : 'శ్రీవాణి'*

*వ్యవస్థాపకులు : E.H.V.L. CENTRE*



ప్రచురణ

నైతిక మానవతా విలువల అధ్యయన కేంద్రము

**ETHICS & HUMAN VALUES' LEARNING CENTRE**

(E.H.V.L. CENTRE)

**24-52, Ramanaidupet, MACHILIPATNAM - 521 001.**

**✆ 08672 - 22818, 21137**

# మనసులో మాట

"సత్ప్రవర్తన, సద్బుద్ధి, సత్యనిరతి
భక్తి, క్రమశిక్షణ, కర్తవ్యపాలనంబు
నేర్పునదే విద్య, అద్దాని విద్యార్థి నేర్వవలయు."

'విద్య' అంటే కేవలం చదవటం, వ్రాయటం మాత్రమే కాదు, డిగ్రీలు సంపాదించటమే కాదు. మార్కులు, ర్యాంకులు తెచ్చుకోవటమే కాదు. పై ఆరు సద్గుణములు నేర్పునదే సరియైన విద్య. కనుక ప్రతి విద్యార్థి అట్టి విద్యను అభ్యసించాలి.

వినయం లేని విద్య, వివేకం లేని విజ్ఞానం, సంస్కారంలేని చదువు ఉన్నా ప్రయోజనం లేదు. విద్యతో పాటు వినయం, వివేకం, సంస్కారం ప్రతి విద్యార్థిలో ఉండాలి. నీతి, నిజాయితీలు వీటికి తోడుకావాలి. ఈ ఐదు విద్యార్థికి పంచప్రాణములు.

సత్యం, అహింస; ప్రేమ, కరుణ; దయ, దాతృత్వం; సేవ, స్నేహం; శాంతం, సహనం - ఇవి మానవతా విలువలు. ఈ విలువలను ప్రతివిద్యార్థి పెంపొందించుకోవాలి.

ఈనాడు కులం పేరుతో క్రుమ్ములాడుకుంటున్నారు. మతంపేరిట మారణహోమాలు జరుగుతున్నాయి. 'అస్పృశ్యత' సమాజాన్ని విచ్ఛిన్నం చేస్తుంటే, 'అసూయాద్వేషములు' వ్యక్తిని పతనం చేస్తున్నాయి. కనుక భావిభారత పౌరులు వీటికి ఎంత దూరంగా వుంటే అంత మంచిది.

దుర్గుణాలను దూరం గావించి, సద్గుణాలను నేర్పునదే సరియైన విద్య. అయితే ఇటువంటి ఉత్తమమైన, పవిత్రమైన విద్యను ఎప్పుడు? ఎవరికి? ఎవరు? నేర్పాలి. ఇదే ఈనాటి ప్రధాన సమస్య. ఇలాంటి విద్య వెల చెల్లిస్తే బజారులో దొరికేది కాదు, ఎప్పుడుపడితే అప్పుడు అబ్బేది కాదు.

'శైశవేభ్యస్త విద్యానామ్' విద్య బాల్యమునందే అభ్యసించాలి. అప్పుడే అది బాగా వంటపడుతుంది. అప్పుడు నేర్చుకున్నది, అలవరచుకున్నది మాత్రమే జీవితాంతం గుర్తువుంటుంది. మధ్యలో నేర్చుకున్నది మధ్యలోనే పోతుంది. కనుక అట్టి బాల్యదశను సద్వినియోగం అయ్యేట్లుగా చూడాలి పెద్దలు.

'నైతిక విద్యావ్యాప్తి' అనే సౌధానికి నాలుగు మూలస్తంభాలు. అవి పటిష్ఠంగా, ధృఢంగా ఉన్నప్పుడే 'నైతిక విద్యావ్యాప్తి' జరుగుతుంది. ఆ మూలస్తంభాలే 1. అధ్యాపకులు 2. తల్లిదండ్రులు 3. విద్యాసంస్థల అధినేతలు 4. ప్రభుత్వం. ఈ నాలుగు స్తంభాలలో ఏ స్తంభం బలహీనంగా ఉన్నా ఆ సౌధం కూలిపోతుంది. నైతిక విద్యావ్యాప్తికే అవరోధం ఏర్పడుతుంది.

ఈ పవిత్ర ఆశయసాధనకు "నైతిక మానవతా విలువల అధ్యయన కేంద్రం" **Ethics & Human values' learning centre (E.H.V.L. Centre)** స్థాపించబడింది. ప్రారంభంలో ప్రధానంగా ఈ క్రింది మూడు అంశాలను గురించి బాలబాలికలకు బోధించాలని సంకల్పించటమైనది.

1. నైతిక విలువల ప్రాముఖ్యతను, నైతికవిద్య ఆవశ్యకతను బోధిస్తూ, బాలబాలికలను సచ్ఛీల సంపన్నులుగా, విద్యా వినయ శోభితులుగా తీర్చిదిద్దటం.
2. మానవతా విలువలను బోధిస్తూ, బాలబాలికలలో మానవత్వాన్ని పెంపొందించటం.
3. కులమతాలకతీతంగా బాలబాలికలకు దేశభక్తి భావాలను బోధిస్తూ, వారిని ఉత్తమ భావిభారత పౌరులుగా తీర్చిదిద్దటం.

పై ఆశయ ఆదర్శములను ఆచరణలో పెట్టడానికి ఒక కార్యాచరణ పథకము కూడా రూపొందించబడింది.

1. ప్రతి జిల్లాలో 'విద్యా సదస్సులు' నిర్వహించడం.
2. అధ్యాపకులకు శిక్షణా తరగతులు ప్రతి జిల్లాలో ఏర్పాటు చేయటం.
3. ప్రతి తరగతిలో వారానికొక నీతితరగతి (Moral Class) నిర్వహించడం.
4. బాలబాలికలకు బోధించడానికి 'నీతి పుస్తకములు' (Moral Education Books) ముద్రించడం.

విద్యా సంస్థలలో 'నైతికవిద్య ఆవశ్యకత' అనే పుస్తకమును ముద్రించి, కొన్ని వేల కాపీలు రాష్ట్రం నలుమూలలా పంపిణీ చేయటం జరిగింది. ఇంకా మరికొన్ని వేల కాపీలు పంపిణీ జరగాలి. సహృదయుల సహకారం ఎంతైనా అవసరం.

నైతికవిద్యను గురించి తరగతి గదులలో బాలబాలికలకు బోధించడానికి మూడు 'సిలబస్' పుస్తకములు కూడా అందిస్తున్నాము. దీని పేరు 'నీతిసుధానిధి' ఇప్పుడు తృతీయ,

చతుర్థ, పంచమభాగములు సమర్పించుకుంటున్నాము. ముఖ్యంగా ఈ మూడు పుస్తకములు హైస్కూల్, కాలేజీ విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని వ్రాయబడినాయి. 6, 7 తరగతుల విద్యార్థులకు అవసరమైన ప్రథమ, ద్వితీయ భాగములు త్వరలో అందించబడతాయి.

ప్రస్తుతం అందిస్తున్న 'నీతి సుధానిధి' మూడు భాగములలో ఒక్కొక్క పుస్తకంలో నాలుగు అంశములున్నాయి. 1. ప్రార్థనా శ్లోకములు - గీతములు 2. నీతి శ్లోకములు - పద్యములు 3. హితోక్తులు 4. మహనీయులు - త్యాగశీలురు

మొదటి అంశములోని 'ప్రార్థనా శ్లోకములు - గీతములు' పిల్లలందరిచేత కంఠస్థం చేయించాలి. మిగతా మూడు అంశములలో ఒక్కొక్క అంశములో పది విషయములు (Topics) చొప్పున ముప్పై విషయములు ఉన్నాయి. 'నీతివిద్య' (Moral Education) బోధించడానికి ప్రతి నెలా మూడు Periods కేటాయించుతే బాగుంటుంది. ఆ విధంగా పదినెలల పాటు మూడు తరగతుల వారికి బోధించవచ్చును. ముప్పై విషయాలు వరుసగా బోధించినా బోధించవచ్చును. లేక ఒక్కొక్క అంశములోని ఒక్కొక్క విషయాన్ని తీసుకొని ప్రతినెలా మూడు అంశములలోని విషయాలను బోధించవచ్చును. నిర్ణయాధికారము విద్యాసంస్థలవారికే వదిలివేయడమైనది. ఆ విధంగా బోధించి, విద్యా సంవత్సరాంతంలో వ్రాత పరీక్షలు పెట్టి ప్రథమ, ద్వితీయ, తృతీయ శ్రేణులలో ఉత్తీర్ణులైనవారికి బహుమతులు ప్రదానం చేస్తే బాగుంటుంది. నైతికవిద్య యెడల విద్యార్థులలో ఆసక్తి పెరుగుతుంది. మానసిక మార్పు వస్తుంది. వినయశీల సంపన్నులవుతారు. సంస్కారవంతులవుతారు.

తల్లిదండ్రులు, అధ్యాపకులు, విద్యాసంస్థల అధినేతలు ముఖ్యంగా ప్రభుత్వం ఈ పవిత్ర ఉద్యమానికి సహాయ సహకారములు అందించి 'నైతిక విద్యావ్యాప్తి'కి తోడ్పడుతారని ఆశిస్తున్నాము.

"నైతిక విద్యావ్యాప్తి దేశ ప్రగతికి సోపానం"

**ధన్యవాదములు**

(కొమరగిరి కృష్ణమోహనరావు)
వ్యవస్థాపకులు : E.H.V.L CENTRE
ఎడిటర్ 'శ్రీవాణి'

మచిలీపట్నం,
ది. 20-7-2002



# కృతజ్ఞతలు

**'నీతి సుధానిధి'** పుస్తకములు (**Moral Education Books**) ముద్రించే ముందు చాలా మంది అనుభవజ్ఞులైన, పెద్దలను సంప్రదించాను. వారి అమూల్యమైన సలహాలు స్వీకరించాను. వారి రచనలు కూడా నాకు సహాయపడినాయి. ముఖ్యంగా గత 17 సంవత్సరాలుగా **శ్రీవాణి మాసపత్రిక** రచనలు నాకు ఎంతగానో తోడ్పడినాయి.

**సర్వశ్రీ** ఆచార్య జి.వి సుబ్రహ్మణ్యం (వైస్‌ఛాన్సలర్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్), జానమద్ది హనుమచ్ఛాస్త్రి (కడప), చర్ల రాధాకృష్ణశర్మ (తమిళనాడు), 'పద్మశ్రీ' తుర్లపాటి కుటుంబరావు (విజయవాడ), మన్నవ గిరిధరరావు (Ex. M.L.C. గుంటూరు), కీ॥శే॥ "కరుణశ్రీ" (గుంటూరు), ఆర్. సీతాలక్ష్మి (చీరాల), ఎన్.వి. ఆర్. సత్యనారాయణమూర్తి (బొబ్బిలి), రెడ్డి రాఘవయ్య (హైదరాబాద్)గార్ల రచనలు మరియు శతకములు, భర్తృహరి సుభాషితములు ఈ మహాప్రయత్నానికి తోడ్పడినాయి.

**మచిలీపట్నం**కు చెందిన డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు, సోమంచి రామం, డా॥ రాపర్ల జనార్దనరావు, మల్లాది సూరిబాబు, డా॥ కాజ లక్ష్మీనరసింహారావు మరియు కె.పి నాయుడుగార్ల సలహాలు నాకు ప్రోత్సాహాన్ని యిచ్చాయి.

**విక్రమ్ పబ్లిషర్స్** (విజయవాడ) అధినేత శ్రీ జి.యస్. రావుగారు కవరు పేజీని అందంగా తీర్చిదిద్ది అందించారు.

**'నైతిక మానవతా విలువల అధ్యయన కేంద్రం'** (E.H.V.L. Centre) కార్యనిర్వాహక కమిటీవారు ఈ పవిత్ర ఉద్యమానికి అండగా నిలిచి ప్రోత్సహిస్తున్నారు.

**ఇంకా... ఇంకా...** ఎందరో మహానుభావుల సలహాలు మరియు ఎన్నో రచనలు ఈ ప్రయత్నానికి తోడ్పడినాయి.

ఈ మహోత్తర ప్రయత్నానికి తోడ్పడినవారందరికీ నా కృతజ్ఞతాభివందనములు.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు, నాలో కలిగించిన ప్రేరణ, అనుగ్రహించిన ఆశీస్సుల ఫలితమే ఈ 'నీతిసుధానిధి'. ఆ మహనీయునికి నా శతకోటి ప్రణామములు.

## ధన్యవాదములు

(కొమరగిరి కృష్ణమోహనరావు)
వ్యవస్థాపకులు : E.H.V.L CENTRE
ఎడిటర్ 'శ్రీవాణి'

మచిలీపట్నం,
ది. 20-7-2002.

# విషయసూచిక

## ప్రార్థనా శ్లోకములు - గీతములు



## నీతి శ్లోకములు - పద్యములు





## హితోక్తులు



## మహనీయులు - త్యాగశీలురు





# వందేమాతరం

వందేమాతరం!.... వందేమాతరం !....
సుజలాం సుఫలాం మలయజ శీతలామ్
సస్య శ్యామలాం మాతరం ॥ వందేమాతరం ॥ ....1

శుభ్రజ్యోత్స్నాం పులకిత యామినీం
పుల్ల కుసుమిత ద్రుమదల శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం ॥ వందేమాతరం ॥ ....2

కోటి కోటి కంఠ కలకల నినాద కరాలే
కోటి కోటి భుజైర్ధృత ఖరకరవాలే
అబలా కేనో మాఁఎతో బలే
బహుబల ధారిణీం నమామి తారిణీం
రిపుదల వారిణీం మాతరం ॥ వందేమాతరం ॥ ....3

తుమి విద్యా తుమి ధర్మ
తుమి హృది తుమి మర్మ
త్వం హి ప్రాణాః శరీరే
బాహుతే తుమి మాఁ శక్తి
హృదయే తుమి మాఁ భక్తి
తోమారయి ప్రతిమాగడి మందిరే మందిరే ॥ వందేమాతరం ॥ ....4

త్వం హి దుర్గా దశప్రహరణధారిణీ
కమలా కమలదళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ, నమామిత్వాం, నమామి కమలాం
అమలాం, అతులాం, సుజలాం, సుఫలాం, మాతరం ॥ వందేమాతరం ॥ ...5

శ్యామలాం, సరలాం, సుస్మితాం, భూషితాం
ధరణీం, భరణీం, మాతరం ॥ వందేమాతరం ॥ ...6

- బంకించంద్ర చటర్జీ

# జనగణమన గీతము

జనగణమన అధినాయక జయ హే
భారత భాగ్యవిధాతా
పంజాబు సింధు గుజరాత మరాటా
ద్రావిడ ఉత్కళ వంగా
వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగా
తవ శుభ నామే జాగే
తవ శుభ ఆశిష మాగే
గాహే తవ జయ గాథా
జనగణ మంగళ దాయక జయ హే
భారత భాగ్య విధాతా
జయ హే జయ హే జయ హే
జయ జయ జయ జయ హే ...1

అహరహ తవ ఆహ్వాన ప్రచారిత
శుని తవ ఉదారవాణీ
హిందూ బౌద్ధ సిఖ జైన పారసిక
ముసల్మాన క్రిస్తానీ
పూరబ పశ్చిమ ఆసే
తవ సింహాసన పాసే
ప్రేమహార హయగాథా
జనగణ ఐక్య విధాయక జయ హే
భారత భాగ్య విధాతా ॥జయ హే॥ ...2

పతన అభ్యుదయ బంధుర పంథా
యుగ యుగ ధావిత యాత్రీ
తుమి చిర సారథి తవరథ చక్రే
ముఖరిత పథ దిన రాత్రీ

దారుణ విప్లవ మాఘే
తవ శంఖ ధ్వని బాజే
సంకట దుఃఖ త్రాతా
జనగణ పథ పరి చాయక జయ హే
భారత భాగ్య విధాతా ॥జయ హే॥ ....3

ఘోర తిమిర ఘన నిబిడ నిషేధే
పీడిత మూర్ఛిత దేశే
జాగృత భిలతవ అవిచల మంగళ
నతనయనే అనిమే షే
దుస్వప్నే అతంకే
రక్షాకరివే అంకే
స్నేహమయీ తుమి మాతా
జనగణ దుఃఖ త్రాయక జయ హే
భారత భాగ్య విధాతా ॥జయ హే॥ ....4

రాత్రి ప్రభాతిల ఉదిల రవిచ్ఛవి
పూర్వ ఉదయగిరి భాలే
గాహే విహగమ పుణ్య సమీరణ
నవ జీవన రస ఢాలే
తవ కరణారుణ రాగే
నిద్రిత భారత జాగే
తవ చరణే నత మాధా
జయ జయ జయ హే జయ రాజేశ్వర
భారత భాగ్య విధాతా ॥జయ హే॥ ....5

- 'విశ్వకవి' రవీంద్రనాధ టాగోర్

# మా తెలుగు తల్లి

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి
గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొర్లుతాయి
అమరావతి నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి! మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి! కృష్ణరాయలకీర్తి!
మా చెవులు రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం

**జై తెలుగుతల్లి! జై తెలుగుతల్లి!**

- శంకరంబాడి సుందరాచార్య

# ఏ దేశమేగినా....

ఏ దేశ మేఁగినా, ఎందుఁగాలిడినా
ఏ పీఠ మెక్కినా, యెవ రెదు రయిన
పొగడరా, నీ తల్లి భూమి భారతిని
నిలుపరా, నీ జాతి నిండు గౌరవము
లేదురా యిటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరు లింకెందు

ఏ పూర్వపుణ్యమో, ఏ యోగబలమొ,
జనియించినాడ వీస్వర్గలోకమున
ఏ మంచిపూవులన్ ప్రేమించినావొ
నిను మోసె నీ తల్లి కనక గర్భమున
సూర్యుని వెలుతురు సోకునందాక
ఓడల జెండాలు ఆడునందాక
నరుడు ప్రాణాలతో నడుచునందాక
అందాక గల యీ యనంతభూతలిని
మనభూమి వంటి కమ్మని భూమి లేదు

వెలిగిన దీ దివ్య విశ్వంబు పుత్ర
దీపించె నీ పుణ్య దేశంబు పుత్ర;
అవమానమేలరా, అనుమాన మేల
భరతపుత్రుఁడ నంచు భక్తిలోఁ బలుక

- రాయప్రోలు



# ప్రార్థన

"అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ"

చెడునుండి నన్ను మంచిని చేర్చుము. అజ్ఞానము (చీకటి) నుండి నన్ను జ్ఞానము (వెలుగు)ను చేర్చుము. మృత్యువు నుండి నన్ను మోక్షమును చేర్చుము.

"ఓ దేవదేవా! నన్ను చెడుపనులకు ప్రోద్బలం చేయకుము. మంచిపనులు చేయడానికి శక్తిని ప్రసాదించుము, చీకటిలో పడి కొట్టుమిట్టాడుకుంటున్న నన్ను వెలుగులోనికి తీసుకొని రమ్ము. మృత్యుముఖం లోపడి నరకయాతనలు అనుభవిస్తున్న నాకు మోక్షమును ప్రసాదించుము" అని ప్రతి నిత్యమూ ప్రాతఃకాలమున భగవంతుని ప్రార్థించవలెను.



# విఘ్నేశ్వర ధ్యానము

**"శుక్లాంబరధరం విష్ణుం, శశివర్ణం చతుర్భుజమ్**
**ప్రసన్నవదనం ధ్యాయేత్, సర్వ విఘ్నోపశాన్తయే"**

తెల్లని వస్త్రములను ధరించినవాడును, అంతటా వ్యాపించిన చంద్రుని కాంతివంటి తెల్లని కాంతి కలవాడును, నిర్మలమైన, స్వచ్ఛమైన ముఖము గలవాడు నగు విఘ్నేశ్వరుని సమస్త విఘ్నములు నశించుట కొఱకు ధ్యానము చేయవలెను.

**"అగజాననపద్మార్కం, గజాననమహర్నిశమ్**
**అనేకదన్తం భక్తానాం, ఏకదన్తముపాస్మహే"**

హిమవత్పర్వతము యొక్క పుత్రికయగు పార్వతీదేవి యొక్క పద్మమువంటి ముఖమునకు సూర్యునివలె సంతోషమును కలిగించు వాడును, భక్తులకు అనేక వరములను యిచ్చువాడును, ఒకే దంతము కలవాడునగు ఆ వినాయకుని పగలు, రాత్రియును (ఎల్లప్పడునూ) సేవింతును.



# సరస్వతీ ధ్యానము

**"సరస్వతి! నమస్తుభ్యం**
**వరదే! కామరూపిణి!**
**విద్యారంభం కరిష్యామి**
**సిద్ధిర్భవతు మే సదా."**

"ఓ సరస్వతీదేవీ! నీ కొఱకు నమస్కారము, వరములు యిచ్చెడిదానా! చక్కని రూపము గలదానా! విద్యను ప్రారంభించుటను చేయుదును. నాకు ఎల్లప్పడూ ఈ విద్య సిద్ధించుట అగుగాక!".

**"పద్మపత్రవిశాలాక్షీ పద్మకేసరవర్ణినీ**
**నిత్యం పద్మాలయా దేవీ సా మాం పాతు సరస్వతీ"**

పద్మము యొక్క రేకులవలె విశాలమైన కన్నులు కలదియును, పద్మము యొక్క కేసరములవంటి పసుపుపచ్చని రంగు కలదియును, పద్మమే నివాసముగా కలదియును, దేవతయునగు ఆ సరస్వతి ఎల్లప్పడూ నన్ను రక్షించుగాక!



# దైవ ప్రార్థన

"త్వమేవ మాతాచ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ."

*"ఓ దేవ దేవా! నీవే తల్లివి, నీవే తండ్రివి, నీవే బంధువు, నీవే స్నేహితుడవు, నీవే నా చదువు, నీవే నా ధనము, నీవే నా సర్వము"*

"నీవే తల్లివి తండ్రివి
నీవే నా తోడు నీడ నీవే సఖుఁడౌ
నీవే గురుఁడవు దైవము
నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా!"

*"ఓ కృష్ణా! నిజముగా నాకు తల్లిదండ్రులును, సోదరులును, మిత్రుడును, గురుడును, దైవమును, ప్రభువును, దిక్కును అన్నిటికి నీవే, నా కితరులు ఆధారము లేదు."*



# గురు ప్రార్థన

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవేనమః"

"గురువు బ్రహ్మదేవుడు, గురువు విష్ణువు, గురువు దేవుడగు ఈశ్వరుడు, గురువు ప్రత్యక్షముగానున్న ఆ పరమాత్మయే. అటువంటి తేజోవంతుడగు గురువు కొఱకు నమస్కారము".

"అజ్ఞానతిమిరాన్ధస్య
జ్ఞానాంజనశలాకయా
చక్షురున్మీలితం యేన
తస్మై శ్రీ గురవేనమః॥"

"అజ్ఞానము అను చీకటి యందు గ్రుడ్డివాని వలె వున్న నా యొక్క కన్ను 'జ్ఞానము' అను కాటుక పుల్లతో ఏ గురువుచే తెరిపింపజేయబడినదో, అటువంటి తేజోవంతుడగు గురువు కొఱకు నమస్కారము".



# సూరయె ఫాతిహా

## (మహమ్మదీయ ప్రార్థనా శ్లోకములు)

**బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం**

అమిత దయగలవాడును, ప్రేమించు వాడును అయిన అల్లాః పేరుతో

**అల్హాందు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్**

సమస్త స్తోత్రములు అల్లాః కొరకే, ఆయన సర్వలోకములను పాలించు ప్రభువు

**అర్రహమా నిర్రహీమ్**

అమిత దయగలవాడును, ప్రేమించువాడును

**మాలికి యౌమి ద్దీన్**

తీర్పు దినమునకు సర్వాధికారి

**ఇయ్యాక నఆబుదు వఇయ్యాక నస్తయీన్**

మేము నిన్నే ఆరాధిస్తాము, సహాయం కొరకు నిన్నే అర్థిస్తాము

**ఇహ్దినస్ సిరాతల్ ముస్తఖీమ్**

మాకు సన్మార్గమును చూపుము

**సిరాతల్ లజీన అన్ అమ్త అలైహిమ్**

ఎవరిపైనయితే నీవు అనుగ్రహించి బహుమతులు కురిపించినావో

**గైరిల్ మగ్‌జూబి అలైహిమ్, వలజ్జాల్లీన్ - ఆమీన్**

ఎవరిపైనయితే నీ ఆగ్రహం వర్షించలేదో, మరెవరైతే మార్గ భ్రష్టులు కాలేదో వారి మార్గమును చూపుము - ఆమీన్ (తథాస్తు)



# క్రైస్తవ ప్రార్థనలు

Lord, make me a channel of your **PEACE;**
Where there is hatred, let me sow **LOVE;**
Where there is injury, **PARDON;**
where there is doubt, **FAITH;**
whre there is despair, **HOPE;**
where there is darkness, **LIGHT;**
and where there is sadness, **JOY;**
O Master, grant that I may never seek
so much to be consoled as to console;
to be understood as to understand;
to be loved as to love with all my soul.
For it is in giving that we receive,
it is in pardoning that we are pardoned,
and it is in dying that we are born
to eternal life

**- ST. FRANCIS**



What a friend we have in jesus,
All our sins and griefs to bear !
What a privilege to carry
Everything to God in prayer !
O what peace we often forfeit,
O What needless pain we bear,
All because we do not carry
Everything to God in prayer !

Have we trails and temptations?
Is there trouble anywhere?
We should never be discouraged :
Take it to the lord in Prayer.
Can we find a friend so faithful,
Who will all our sorrows share?
Jesus knows our every weakness;
Take it to the Lord in prayer.

Are we weak and heavy - laden,
Cumbered with a load of care?
Jesus only is our refuge:
Take it to the Lord in Prayer.
Do thy friends despise, forsake thee ?
Take it to the Lord in prayer;
In His arms He'll take and shield thee;
Thou wilt find a solace there.

**- JOSEPH SCRIVEN, 1820-'86**

# ప్రతిజ్ఞ

భారతదేశము నా మాతృభూమి, భారతీయులందరు నా సహోదరులు.

నేను నా దేశమును ప్రేమించుచున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణము. దీనికి అర్హుడనగుటకై సర్వదా నేను కృషి చేయుదును.

నా తల్లిదండ్రులను, ఉపాధ్యాయులను, పెద్దలందరిని గౌరవింతును. ప్రతివారితోను మర్యాదగా నడచుకొందును.

నా దేశముపట్లను, నా ప్రజలపట్లను సేవానిరతి కలిగి యుందునని ప్రతిజ్ఞ చేయుచున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందమునకు మూలము.

**భారతమాతాకీ జై!**

# దుర్జనమైత్రి - సజ్జనమైత్రి

**"ఆరమ్భ గుర్వీ క్షయిణీ క్రమేణ**
**లఘ్వీ పురా వృద్ధి ముపైతి పశ్చాత్**
**దినస్య పూర్వార్ధ పరార్ధ భిన్నా**
**ఛాయేవ మైత్రీ ఖలసజ్జనానామ్"**

*దుర్జనుల మైత్రి ప్రొద్దుటిపూటనీడవలె మొదట పెద్దదిగా ఉండి క్రమముగా తరిగిపోతుంది. సజ్జనులమైత్రి మాపటి పూట నీడవలె మొదట చిన్నదిగా వుండి, పోను పోను పెరుగుతుంది. కనుక ఎప్పుడూ సజ్జనులతో స్నేహం చేయటం క్షేమం.*

దుర్జన మైత్రి ఎలాంటిదో, సజ్జనమైత్రి ఎలాంటిదో భర్తృహరి చక్కగా ఈ శ్లోకంలో వివరించారు. చెడ్డవారి స్నేహం ప్రారంభంలో ఆర్భాటంగా ఉంటుంది. ఎక్కడాలేని ఆప్యాయతను వెలిబుస్తారు. ప్రేమను ప్రదర్శిస్తారు. రాసుకొని, పూసుకొని తిరుగుతారు. అట్టివారిని 'ఆరంభశూరులు' అంటారు. కాలం గడిచినకొద్దీ, క్రమకమేణా అది తరిగిపోయి, అదృశ్యమైపోతుంది. ఒక్కొక్క సమయంలో అట్టివారితో విరోధం వచ్చినా, ఆశ్చర్య పడనవసరం లేదు. అందువలననే **'అతి సర్వత్రా వర్జయేత్'** అన్నారు అనుభవజ్ఞులు. కనుక ఏవిషయంలోనైనా సరే 'అతి' పనికి రాదు.

ఇకపోతే మంచివారిమైత్రి ప్రారంభంలో అంతపెద్దగా కనిపించదు. సామాన్యంగా ఉంటుంది. అయితే కాలం గడిచినకొద్దీ వారిస్నేహం అభివృద్ధి అవుతూ ఉంటుంది. ఆత్మీయత పెరుగుతూ ఉంటుంది. పోనుపోనూ సన్నిహితులవుతుంటారు. అట్టివారినే 'ప్రాణమిత్రులు' అంటారు. ఒక్క సుఖంలోనేగాక, కష్టాలలో కూడా అట్టివారు పాలు పంచుకుంటారు.

చెడ్డవారి స్నేహం తాత్కాలికం, మంచివారి స్నేహం శాశ్వతం. కనుక ఎవరు మంచివారో? ఎవరు చెడ్డవారో? ఎవరు దుర్జనులో? ఎవరు సజ్జనులో? విజ్ఞతతో గ్రహించి, మంచివారితో అనగా సజ్జనులతో మాత్రమే స్నేహం చేయాలి. 'భర్తృహరి' పై సంస్కృత శ్లోకాన్ని 'ఏనుగు లక్ష్మణకవి' యథాతథంగా తెనిగించి, మనకు అందించారు.

**"మొదలఁ జూచిన గడు గొప్ప పిదపఁ గుఱుచ**
**యాది గొంచెము తర్వాత నధిక మగుచుఁ**
**దనరు దినపూర్వ పరభాగ జనిత మయిన**
**ఛాయ పోలికఁగు జన సజ్జనులమైత్రి".**

**- ఏనుగు లక్ష్మణ కవి**

# చెట్టు ఆదర్శం

**"దత్తేభరం కుసుమ పత్ర ఫలావలీనామ్**
**మర్మ వ్యథాం వహతి శీతభవారుజంచ,**
**యో దేహ మర్పయతి చాస్యసుఖస్య హేతోః**
**తస్మై వదాన్య గురవే తరవే నమోస్తు".**

*చెట్టు, పూలు, పండ్లు, ఆకులు అందరికీ యిస్తుంది. ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ, పెనుగాలికి ఊగుతూ, ఎన్నెన్నో బాధలు అనుభవిస్తూ కూడా ఎవరితోనూ చెప్పకోదు. ఇతరుల సుఖము కోసమే అది బ్రతుకుతుంది. బాటసారులకు నీడనిచ్చి, వారి శ్రమను పోగొడుతుంది. అది ఎండిపోయి, కూలిపోయిన తరువాత కూడా వంట చెఱకుగా ఉపయోగపడుతుంది. ఇంకా అనేక విధముల దానిని జనం ఉపయోగించుకుంటారు. నిజానికి చెట్టుకు మించిన దాత ఎవరూ లేరు. అలాగే లోకంలో ఇతరుల సౌఖ్యం కోసం తమ సర్వస్వాన్ని సమర్పణ చేసే మహనీయులు కూడా కొందరున్నారు.*

మన ఇతిహాస పురాణాల పుటలను త్రిప్పితే శిబి చక్రవర్తి, బలి చక్రవర్తి, హరిశ్చంద్రుడు, దధీచి, కర్ణుడు మొదలైన త్యాగశీలురు ఎందరో కనిపిస్తారు. భారతదేశం త్యాగధనులకు పుట్టినిల్లు. సత్యమే జీవిత పరమావధిగా భావించి, పరోపకారమే ధర్మంగా నెంచి, మృత్యువునకు కూడా ఏ మాత్రం భయపడక, ధర్మసంస్థాపనార్థం, తమ జీవిత సర్వస్వాన్ని సమర్పించుకొనిన త్యాగశీలురులను కన్నది ఈ భరతమాత. అట్టి మహనీయులను మనం ఆదర్శంగా గైకొనాలి.

"దానమివ్వని చేయికన్న ఫలమునిచ్చే చెట్టుమిన్న" చెట్టు యొక్క త్యాగమయమైన జీవితాన్ని ఆదర్శంగా తీసుకోవాలి. ప్రతి వ్యక్తి అలవరచుకోవలసిన సద్గుణములలో అతి ప్రధానమైనది 'త్యాగం'. త్యాగానికి ప్రతీక చెట్టు.

**"బ్రతికినన్నినాళ్ళు ఫలములిచ్చుటెకాదు**
**చచ్చికూడ చీల్చి యిచ్చి తనువు**
**త్యాగభావమునకు తరువులే గురువులు**
**లలిత సుగుణజాల! తెలుగుబాల!".** - **కరుణశ్రీ**

# దూరదృష్టి

**"చింతనీయా హి విపదాం**
**ఆదౌ ఏవ ప్రతిక్రియా**
**న కూపఖననం యుక్తం**
**ప్రదీప్తే వహ్నినా గృహే"**

*ఆపదలు దాటుటకు ఉపాయము ముందుగనే ఆలోచించవలెనుగాని, అవి వచ్చి మీదపడిన తరువాత కాదు. అదే విధముగ అగ్నిచే గృహము తగులబడుచుండగా నీళ్లకోసం నూతిని త్రవ్వటం మొదలుపెట్టటం విజ్ఞత అనిపించుకోదు.*

జీవితంలో విజయాన్ని సాధించడానికి 'దూరదృష్టి' అత్యవసరం. రానున్న ఆపదలను ముందుగానే పసికట్టి, తరుణోపాయాన్ని కనుగొనటమే 'దూరదృష్టి' అంటారు. అట్టి దూరదృష్టి కలవారు మాత్రమే ఆపదలను దాటగలుగుతారు. అది లేనివారు ఆపదలకు గురి అవుతారు. కనుక విజ్ఞతతో కూడిన 'దూరదృష్టి' ని పెంపొందించుకోవాలి. అయితే 'ఆపదలు వచ్చినప్పుడు ఆలోచిద్దాం' అంటారు కొందరు. అయితే సమయ స్ఫూర్తిని ప్రదర్శించి కొందరు బయటపడితే పడవచ్చును. కాని కొందరు ఆపదల నుండి బయటపడలేరు. కనుక రానున్న ఆపదలను ముందుగానే ఊహించి, తరుణోపాయాన్ని అన్వేషించి, జాగ్రత్తపడటం విజ్ఞుల లక్షణం.

చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే ప్రయోజనం లేదు. "Prevention is better than cure" అన్నారు గదా! వ్యాధి వచ్చిన తరువాత డాక్టర్ వద్దకు పరుగెత్తటంకంటే, అసలు వ్యాధి రాకుండానే ముందుగా జాగ్రత్తపడటం ఉత్తమం. అదే విధముగ ఇల్లు తగలపడుతుంటే, బావిని త్రవ్వడానికి మొదలుపెడితే ప్రయోజనం ఉంటుందా? ఉండదు. కనుక ముందుగానే ప్రతి ఇంట్లో బావిఉంటే మంచిది.

**"కొంప గాలు వేళ గునపంబు చేబూని**
**బావి త్రవ్వ, నేమి ఫలము గలుగు?**
**ముందు చూపులేని మూర్ఖుండు చెడిపోవు**
**లలిత సుగుణజాల! తెలుగుబాల!".**

**- కరుణశ్రీ**



# పరోపకారము

**"శ్లోకార్ధేన ప్రవక్ష్యామి**
**యదుక్తం గ్రంథకోటిభిః**
**పరోపకారః పుణ్యాయ**
**పాపాయ పరపీడనమ్".**

*"కోట్లకొలది గ్రంథాలలో ఎన్నో నీతులు చెప్పబడినాయి. ఆ గొప్ప విషయాల సారాంశమంతా ఇక్కడ ఒక అర్థశ్లోకంలో చెప్పబడింది. అదేమిటంటే, ఒకరికి ఉపకారం చేయడం పుణ్యం, ఒకరిని పీడించడం పాపం".*

ఎన్ని లౌకిక విద్యలు నేర్చినప్పటికినీ, ఎన్ని గ్రంథములు చదివినప్పటికినీ, పరోపకారబుద్ధిని అలవరచుకొనని యెడల ప్రయోజనం శూన్యం. ఎట్టి ఫలాపేక్షలేకుండా, నిస్వార్థబుద్ధితో పరులకు సహాయం చేయటమే నిజమైన పరోపకారము.

పరులకు ఉపకారం చేయడమే పరోపకారము. ఉపకారం చేయడానికి వీలు కాకపోతే అపకారం మాత్రం చేయకూడదు. అపకారం జేయకుండా ఉండటమే గొప్ప ఉపకారం. అసలు నీవు పరులకు చేసిన ఉపకారం, పరులు నీకు చేసిన అపకారం మరచిపోవాలి. ఎందువలనంటే, పరులకు మనం చేసిన ఉపకారం మన మనస్సులో ఉంటే, ఎప్పుడో ఒకప్పుడు వారి నుండి ప్రత్యుపకారం కోరాలనిపిస్తుంది. అప్పుడు వారు ఉపకారం చేయకపోతే బాధపడుతాం, నిందిస్తాం, క్రోధమును పెంచుకుంటాం.

ఇకపోతే పరులు నీకు చేసిన అపకారమును మరచిపోవాలి. పరులు నీకు చేసిన అపకారం గుర్తుంటే, నీలో కక్ష సాధించాలనే మనస్తత్వం ప్రబలుతుంది. కనుక పరులు నీకు చేసిన అపకారమును కూడా వెంటనే మరచిపోవాలి.

"పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్" అని అష్టాదశపురాణములు బోధిస్తున్నాయి. సర్వగ్రంథముల సారము కూడా అదే. పరులకు ఉపకారం చేయడం పుణ్యం, అపకారం చేయడం పాపం. కనుక సాధ్యమైనంతవరకూ పరులకు ఉపకారం చేయటమే నేర్చుకోవాలిగాని, అపకారం మాత్రం చేయరాదు.

**"పరులకొఱకె నదులు ప్రవహించు, గోవులు**
**పాలు పిండు, చెట్లు పూలుపూచు,**
**పరహితమ్ము కంటె పరమార్థమున్నదా**
**లలిత సుగుణజాల! తెలుగుబాల".**

**-కరుణశ్రీ**

# వసుధైక కుటుంబకం

**"అయం నిజః పరోవేతి**
**వికల్పో లఘు చేతసామ్**
**ఉదార చరితానాం తు**
**వసధైక కుటుంబకమ్."**

*'వీడు నావాడు, వాడు పరాయివాడు' అని భేద భావం అల్పమైన బుద్ధి గలవారికి మాత్రమే ఉంటుంది. విశాలమైన దృక్పథం గలవారు, ప్రపంచంలోని మానవులంతా తన కుటుంబమేనని భావిస్తారు. అనగా మానవులందరియందు సమభావం కలిగి, అందరినీ సమదృష్టితో చూస్తుంటారు ఉత్తములైన సాధుపుంగవులు".*

అల్పమైన బుద్ధి గలవారికి, విశాలదృక్పథం గలవారికి వ్యత్యాసము ఈ శ్లోకములో చెప్పబడింది. అల్పుల ఆలోచన ఎల్లప్పుడూ సంకుచితత్వంగానే ఉంటుంది. విశాలస్వభావంగలవారి ఆలోచన ఉన్నతంగా ఉంటుంది. అల్పదృష్టి చాలా నీచమైనది. అసలు నీచమైన లక్ష్యమే నేరము. ఊర్ధ్వదృష్టి ఉన్నతమైనది. ఉన్నతమైన లక్ష్యం ఉత్తమమైనది. కనుక లక్ష్యం ఉన్నతమైనదిగా ఉండాలి. ఆశయం పవిత్రమైనదిగా ఉండాలి. అట్టివారు మాత్రమే జీవితంలో ఉన్నత శిఖరాలను అందుకోగలుగుతారు. వారి భవిష్యత్తు అత్యంత ఉజ్జ్వలంగా ఉంటుంది. అల్పదృష్టి గలవారి పరిధి అల్పంగానే ఉంటుంది. 'వీడు నావాడు, నా కులంవాడు, నా దగ్గర బంధువు' అనే ఆలోచిస్తుంటాడేగాని సమాజమును గురించి ఏ మాత్రం పట్టించుకోడు. మానవులంతా ఒకే కుటుంబానికి చెందిన వారనే భావన, విశాలదృక్పథం గలవారిలో ఉంటుంది. ఇట్టి భావన ఈనాడు ప్రతిఒక్కరిలో ఉండాలి.

వ్యష్టి జీవుడు, సమిష్టి దేవుడు, కనుక సమాజమే దేవుడు. ఆ దృక్పథమును మనం అభివృద్ధి పరచుకోవాలి. వ్యష్టి నుండి సమిష్టిలో ప్రవేశించాలి. 'నేను' (I) నుండి 'మనము' (We) వరకు ప్రయాణం చేయాలి. 'నేను-నాది' అనే సంకుచిత జీవితం గడపరాదు. 'మనము' అనే విశాల హృదయమును పెంచుకోవాలి. విశాలమైన 'ప్రేమ' ను అభివృద్ధి పరచుకోవాలి. అట్టివారే సాధుపుంగవులు, సజ్జనులు.

**"వీడు పరుల వాడు వాడు నావాడని**
**అల్పబుద్ధి తలచు నాత్మయందు;**
**సాధుపుంగవులకు జగమే కుటుంబంబు**
**లలిత సుగుణజాల! తెలుగుబాల!**

**- కరుణశ్రీ**

# అల్పమైనవాటిని ఆశించరు

**"ఉత్తుంగ మత్త మాతంగ**
**మస్తకన్యస్త లోచనః**
**ఆసన్నే నపి సారంగే**
**కరోత్యాశాం మృగాధి పః"**

*"మృగాలకు రాజైన సింహం, మదించిన ఏనుగుల కుంభస్థలాలను ఎప్పుడు చీలుస్తానా! అని ఎదురు చూస్తూ ఉంటుంది. అంతేగాని, ప్రక్కనే ఉన్న లేడి పిల్లకోసం ఆశపడదు. అలాగే గొప్పవాడు ఎల్లప్పుడూ గొప్పవిషయాలను గురించే ఆలోచిస్తాడు గాని, అల్పమైన విషయాల మీదికి మనసు పోనివ్వడు".*

'Look up, Aim High, Low Aim is Crime' "పైకి చూడు! పైకే గురిపెట్టుము! నీచమైన లక్ష్యమే నేరము" అన్నారు అనుభవజ్ఞులైన మన పెద్దలు. కనుక ఉత్తమమైన ఆశయం, ఉన్నతమైన ఆదర్శము, పవిత్రమైన లక్ష్యం ప్రతిఒక్కరికీ ఉండాలి. అదే గొప్పవారి లక్షణం. ఉన్నతమైన, ధృడమైన మనస్సు కలవారు ఎల్లప్పుడూ ఉన్నతమైన, ఆదర్శమైన వాటిని అందుకోవాలనే ప్రయత్నిస్తుంటారు గాని అల్పమైన వాటిని కన్నెత్తి కూడా చూడరు.

తాను రచించిన 'మహాభాగవతము'ను నరాధములకు (సామాన్యరాజులకు) అమ్మనిరాకరించి, సకల గుణసంపన్నుడైన శ్రీరామచంద్రుని పాదపద్మములకు సమర్పించాడు 'పోతన'. 'నిధి చాలా సుఖమా!' 'రాముని సన్నిధి సుఖమా' అని తర్కించి రామభక్తి సామ్రాజ్యాన్నే కోరుకున్నాడుగాని, భౌతికమైన సిరిసంపదలను కోరుకోలేదు 'త్యాగరాజు'. కనుక గొప్పవారి మనసు గొప్పగొప్ప విషయాలయందే లగ్నమై ఉంటుంది కాని, అల్పమైన విషయాలపైకి పోదు. అల్పమైన వాటిని ఆశించరు.

**"గ్రాసములేక స్రుక్కిన జరాకృశమైన విశీర్ణమైన సా**
**యాసము నైన నష్టరుచియైనను బ్రాణ భయార్తమైన సం**
**త్రాసమదేభకుంభ పిశితగ్రహలాలస శీల సాగ్రహా**
**గ్రేసర భాసమానమగు కేసరి జీర్ణతృణంబు మేయునే!".**

**- ఏనుగు లక్ష్మణ కవి**

# నీచుడు పాముతో సమానం

**"ఉపకారేణ నీచానా**
**మపకారో హి జాయతే**
**పయః పానం భుజంగానాం**
**కేవలం విష వర్ధనమ్".**

*"పాముకు పాలుపోసి పెంచితే, అది విషాన్ని వృద్ధి చేస్తుంది. అది కాటు వేయక మానదు. అలాగే, నీచునికి ఉపకారం చేస్తే అది అపకారమే అవుతుంది.*

నీచుడిని ఎంత గౌరవించినా, ఆదరించినా, ఆ గౌరవమర్యాదలను నిలబెట్టుకోలేడు. సహాయం అందించినవానికే కీడు తలబెడుతాడు. ఎదుటివాడు ఏమైనా ఫరవాలేదని భావిస్తాడు. తన స్వార్థంకోసం ఎదుటివానిని బలిచేయడానికి కూడా ఏ మాత్రం వెరువడు. తన కడుపునిండితే చాలు. ఇట్టి స్వార్థపరులకు, నీచులకు సహాయం చేయడం "పాముకు పాలు పోసినట్లే" అవుతుంది.

అసలు 'నీచుడి' గుణగణాలు ఎట్లా ఉంటాయి? నీచుడిది నీచమైన స్వభావం. హీనమైన బుద్ధి. నీచబుద్ధి అంటే సంకుచితమైన, స్వార్థభూయిష్టమైన, అత్యంత హీనమైన మనస్తత్వం. తుచ్ఛమైన స్వభావం. తన స్వార్థంకోసం ఎదుటివానిని నిర్దాక్షిణ్యంగా సర్వనాశనం చేయడానికి ఏ మాత్రం సంకోచించడు నీచుడు. 'అసూయ' అతని సహజ లక్షణం. 'స్వార్థం' అతని ప్రవృత్తి. 'ద్వేషం' అతని సహజగుణం. 'ఓర్వలేనీతనం' అతని సొత్తు. పాముతో చెలిమి చేయటం కన్నా, నీచుడితో స్నేహం చేయటం మరింత ప్రమాదం. కనుక దుష్టునికి దూరముగా ఉండాలి అన్నారు మన పెద్దలు.

నీచుడికి సహాయం చేయడమంటే, పాముకు పాలుపోసి పెంచినట్లే అవుతుంది. పాము తన సహజబుద్ధిని ఏదో ఒక రోజున ప్రదర్శిస్తుంది. కాటువేస్తుంది, విషం కక్కుతుంది, నిండు ప్రాణాలను తీస్తుంది. అందుకోసమనే 'పగ' యొక్క పరాకాష్టను 'పాముపగ'తో పోల్చటం పరిపాటి. నీచుడికి ఉపకారం చేయడం ఒక విధంగా అపాత్ర దానమే అవుతుంది. అంతేకాదు కోరి కష్టాలు తెచ్చుకోవటమే. నీచుని ప్రవర్తనకూడా అదే విధంగా ఉంటుంది. కనుక నీచుని దరికి చేరనీయరాదు.

**"నీచబుద్ధి నెంత నాదరించినగాని**
**కీడొనర్చు నెట్టివాడికైన**
**విషమునున్న ఫణిని విపరీతము బెంచ**
**కాటు వేయు నెంత ఘనుడినైన".**

*- బాబా*

# కూచమ్మ కూడపెడితే...

**"దానం భోగో నాశస్తి స్రో**
**గతయో భవంతి విత్తస్య**
**యోన దదాతి న భుంక్తే**
**తస్య తృతీయా గతిర్భవతి".**

*ధనానికి మూడు విధములైన అవస్థలున్నాయి. ధనం ఒకరికి యివ్వడం వలన నశించిపోతుంది లేదా మనం అనుభవించినా తరిగిపోతుంది. ఈ రెండూ కాకపోతే మరెవరైనా అపహరించినప్పడు కూడా ధనం పోతుంది.*

పుట్టిన ప్రతి మానవుడూ ధనమును సంపాదించవలసినదే. అయితే తాను సంపాదించిన సంపదను, తన న్యాయసమ్మతమైన అవసరాలకు కొంత ఖర్చు పెట్టుకొన వచ్చును. మరికొంత దానధర్మములకు, పుణ్యకార్యములకు సద్వినియోగపరచాలి. అంతేగాని తాను తినక, ఇతరులకు పెట్టక దాచివుంచుతే 'కూచమ్మ కూడపెడితే, మాచమ్మ మాయం చేసింది' అన్నట్లుగా, మధ్యలో ఎవరో వచ్చి ఎత్తుకొనిపోతారు.

'లోభి' దాచిన సొమ్ము కూడా చిట్టచివరికి ఎవరోఒకరు సంగ్రహిస్తారు. కనుక సంపాదించిన ధనములో కొంత తాము అనుభవించాలి. మరికొంత దానంచేయాలి. ఈ రెండింటికి ఖర్చుచేయకుండా దాచుకుంటే ఎవరో ఒకరు, ఎప్పుడో ఒకప్పుడు దోచుకుంటారు. తింటే కడుపు నిండుతుంది. ప్రక్కవారికి యిస్తే 'తృప్తి' కలుగుతుంది. ఈ రెండూ చేయకపోతే 'నిరాశ' మిగులుతుంది.

**"మూడు దశలు విత్తమునకు - దానమ్ము, భో**
**గమ్ము మఱియు నాశనమ్మనంగ;**
**మొదటి రెండు లేమి మూడవ దశవచ్చు**
**లలిత సుగుణజాల! తెలుగు బాల!**

**- కరుణశ్రీ**

# ఎక్కడ నివసించాలి?

**"ధనికః శ్రోత్రియో రాజా**
**నదీ వైద్యస్తు పంచమః**
**పంచ యత్ర న విద్యన్తే**
**న తత్ర దివసం వసేత్"**

*అప్పిచ్చు ధనవంతుడు, వేదజ్ఞానియగు బ్రాహ్మణుడు, రక్షించే రాజు, నిరంతరం ప్రవహించే నది, వైద్యుడు - ఈ ఐదుగురు ఎక్కడైతే ఉండరో! అక్కడ ఒక్క దినమైనా నివసించరాదు.*

సహజంగా ఎవరికైనా, ఎంతటి సంపన్నులకైనా, ఏదో ఒకనాడు అప్పుతీసుకోక తప్పదు. చిన్నవారు చిన్నమొత్తం, పెద్దవారు పెద్దమొత్తం అప్పు చేయక తప్పదు. సహృదయంతో అప్పుయిచ్చి ఆదుకొనే వారుండాలి గదా! అట్టి దాతృత్వబుద్ధి గల ధనవంతుల సమీపంలో ఉంటే ఏ ఇబ్బందీ ఉండదు.

వేదజ్ఞాని అయిన బ్రాహ్మణుడు కూడా సమీపంలోనే వుంటే మంచిది. ఇక్కడ కులంకాదు ప్రధానం. మంచిచెడులను చక్కగా వివరించి చెప్పే సకల శాస్త్ర పారంగతుడైన 'పండితుడు' అని అర్థం చెప్పుకుంటే బాగుంటుంది. కనుక సమబుద్ధిగల బుద్ధిమంతుడు కూడా సమీపంలో ఉంటే బాగుంటుంది.

ప్రజల యోగక్షేమాలుచూచే ప్రభువు కూడా ఉండాలి. అటువంటి రాజు గనుక లేకపోతే రక్షించేవారుండరు. రక్షణ లేకపోతే ప్రజలు ప్రశాంతంగా జీవించలేరు. కనుక చక్కటి పాలనను అందించే ప్రభువు కూడా ఉండాలి. నీరు మానవునికి ప్రాణం. త్రాగడానికి నీరు కావాలి. పంటలు పండించడానికి నీరు కావాలి. నీరు గనుక లేకపోతే మానవునికి మనుగడకే అవరోధం ఏర్పడుతుంది. కనుక నిరంతరం ప్రవహించే నది సమీపంలోనే ఉండటం చాలా మంచిది

'వైద్యో నారాయణో హరిః' అనారు గదా! ప్రతిఒక్కరికీ వైద్యుని అవసరం ఎంతైనా ఉంటుంది. సకాలంలో మందు యివ్వడానికి వైద్యుడు సమీపంలో ఉండాలి. జీవితం సాఫీగా, ప్రశాంతంగా కొనసాగాలంటే ఈ ఐదుగురి అవసరం ముఖ్యం. ఇవి అందుబాటులో లేనిచోట ఉన్నవారి జీవితం దుర్భరమవుతుంది. కనుక ఈ ఐదు సౌకర్యములు ఉన్నచోటనే స్థిరనివాసం ఏర్పాటు చేసుకోవాలి. అదే విజ్ఞుల లక్షణం.

**"అప్పిచ్చువాడు వైద్యుడు**
**ఎప్పుడు నెడతెగకపాఱు నేఱును, ద్విజుడున్**
**జొప్పడిన యూరనుండుము**
**చొప్పడకున్నట్టి యూర జొరకుము సుమతీ!"**

# సుపుత్రః కులదీపకః

**"ప్రదోషే దీపకశ్చంద్రః, ప్రభాతే దీపకో రవిః**
**త్రైలోక్యే దీపకో ధర్మః, సుపుత్రః కులదీపకః"**

*"రాత్రియందు వెలుగు నిచ్చువాడు చంద్రుడు. ఉదయమున (పగలు) వెలుగునిచ్చువాడు సూర్యుడు. ముల్లోకములందును వెలుగు నిచ్చెడిది ధర్మము. కులమునకు కీర్తి దెచ్చువాడు సుపుత్రుడు (మంచి కుమారుడు).*

పూర్ణిమరాత్రికి, అమావాస్యరాత్రికి ఎంతో తేడా ఉంటుంది. పూర్ణిమరాత్రి వెన్నెలరాత్రి, అమావాస్యరాత్రి చీకటిరాత్రి. మంచివారు, సహృదయులు, ప్రేమికులు కవులు, బాలబాలికలు, పసిపిల్లలు, చల్లటి వెన్నెలరాత్రిని కోరుకుంటారు. దుష్టులు, దుర్మార్గులు, దొంగలు, రౌడీలు, హంతకులు అమావాస్య చీకటిరాత్రిని కోరుకుంటారు. వెన్నెలను సజ్జనులు కోరుకుంటే, చీకటిని దుర్జనులు కోరుకుంటారు. వెన్నెల సదాలోచనలకు దోహదం చేస్తుంది. చీకటి దురాలోచనలను ప్రేరేపిస్తుంది. చెడును, మంచి ఏ విధంగా పారద్రోలగలుగుతుందో, చీకటిని, వెన్నెల ఆవిధంగా పారద్రోలుతుంది. రాత్రి వెలుగునిచ్చువాడు చంద్రుడు కాబట్టి - అతను రాత్రికి రాజు.

సూర్యోదయము నుంచి సూర్యాస్తమయం వరకు 'పగలు' అంటారు. ప్రపంచానికి వెలుగు ప్రసాదించువాడు సూర్యుడు. సూర్యచంద్రాదులు లేకపోతే ప్రపంచ గమనమే నిలిచిపోతుంది. సకల చరాచర సృష్టి ఆగిపోతుంది. మానవాళికి మనుగడ ఉండదు. సమస్త జీవరాసులు నశిస్తాయి. పంటలు పండవు, చెట్లు పెరగవు, కాయలు కాయవు. ఉత్పత్తి దెబ్బతింటుంది. తినటానికి తిండి ఉండదు. కరువుకాటకాలు వస్తాయి. క్షామదేవత విశృంఖలంగా విలయతాండవం జేస్తుంది. సూర్యకిరణాల ద్వారా విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయవచ్చును, రోగనివారణ కూడా గావించవచ్చును. కనుక సూర్యచంద్రాదులు మానవులకు కనిపించే ప్రత్యక్షదైవాలు.

రాత్రి వెలుగునిచ్చేవాడు చంద్రుడైతే, పగలు వెలుగునిచ్చేవాడు సూర్యుడు. ముల్లోకములకు వెలుగు నిచ్చేది ధర్మం. **"ధృయతా ఇతి ధర్మః"** నిలిపి వుంచునది (Uphold) ధర్మం. ఒక దాని అస్థిత్వాన్ని నిలుపు శాశ్వతసూత్రం ధర్మం. వ్యక్తికీ, వ్యక్తికీ మధ్య; వ్యక్తికి సమాజమునకు మధ్య, ఒక సమాజమునకు మరొక సమాజమునకు

మధ్యగల సంబంధములను నిర్వచించేది ధర్మం. హక్కుల (Rights) తో పాటు బాధ్యతలను (Duties) కూడా చెప్పేది ధర్మం. 'ధర్మము' అనగా ఋజుమార్గ ప్రవర్తన. "సర్వేజనా సుఖినోభవంతు", "లోకాస్సమస్తా స్సుఖినోభవంతు" భారతీయ ధర్మమునకు మరియు సర్వమతాలకు, సర్వధర్మాలకు మూలం.

తల్లిదండ్రుల మాటలను శిరసావహించడం పుత్రులధర్మం. గురువాజ్ఞను పాటించడం శిష్యులధర్మం. అతిధి మర్యాద గృహస్థధర్మం. పతిసేవ సతి ధర్మం. సతిని ప్రేమించడం పతి ధర్మం. దైవభక్తి అందరి ధర్మం. చక్కగా పాలించటం ప్రభుత్వ ధర్మం. మాతృదేశభక్తి పౌరుల ధర్మం. దేశాన్ని రక్షించడం సైనికుల ధర్మం. దుష్టశిక్షణ, శిష్టరక్షణ భారతీయ ధర్మం. ఎవరు ఏ విధంగా బాధ్యతలను నిర్వహించాలో నిర్దేశించేదే ధర్మం. అట్టి ధర్మం నాశనమైతే జాతి నాశనమవుతుంది. ధర్మంలేని రాజ్యం రాక్షసరాజ్యంతో సమానం.

ధర్మం ఒక మహత్తరమైన శక్తి. 'సత్యంవద, ధర్మంచర' అనేది భారతీయధర్మం. చెప్పవలసింది సత్యం, ఆచరించవలసినది ధర్మం. అప్పుడే మానవుని మనస్సు నిర్మలమవుతుంది. తనకున్నదానిలో ఎంతోకొంత దానం చేయటం, పరోపకారం చేయటం, మానవ ధర్మం. అభ్యుదయ పథమున నడుపునది ధర్మం. ధర్మమే మానవునికి రక్ష. అట్టి ధర్మమును అలక్ష్యం చేస్తే, ఆ ధర్మమే మానవుణ్ని ధ్వంసం చేస్తుంది. "ధర్మో రక్షతి రక్షితః". ఎవరు ధర్మమును కాపాడుదురో, వారిని ఆ ధర్మమే రక్షిస్తుంది. ముల్లోకములలో వెలుగునిచ్చేది ధర్మం. కనుక మనం ధర్మమును అనుసరించాలి, ధర్మాచరణమే జీవితలక్ష్యం కావాలి.

"సుపుత్రః కులదీపకః" కులమునకు కీర్తి దెచ్చువాడు సుపుత్రుడు. తల్లిదండ్రులను ప్రేమిస్తూ, సేవిస్తూ; వినయవిధేయతలతో అతిధులను ఆదరిస్తూ, బంధువులను గౌరవించేవాడే 'సుపుత్రుడు' అట్టి సుపుత్రునివలన ఆ వంశమే తరిస్తుంది. అప్పుడే ఆ తల్లిదండ్రులు ఆనందిస్తారు.

**"పుత్రోత్సాహము తండ్రికి**
**పుత్రుడు జన్మించినపుడె పుట్టదు జనులా**
**పుత్రుని కనుగొని పొగడగ**
**పుత్రోత్సాహంబు నాడు పొందుర సుమతీ!"**

# అతిథి భక్తి

***"అతిథి దేవోభవ".*** అతిథులను కూడా దైవసమానులుగా భావించి గౌరవించడం మన భారతీయ సంప్రదాయం. అది మన ధర్మం. జన్మ నిచ్చిన తల్లిని, రక్షణ యిస్తున్న తండ్రిని, బుద్ధి వికాసానికి తోడ్పడుతున్న గురువును, మనం ఏ విధంగా గౌరవించి, పూజిస్తుంటామో, అదే విధముగా అతిథిని కూడా గౌరవించటం మన సంప్రదాయం. అతిథులు సంఘంలో మనకు సరియైన సముచితమైన స్థానాన్ని యిస్తారు.

పూర్వకాలంలో ప్రతి ఇంట్లో యజమాని భోజనం చేసేటప్పుడు, అతని ప్రక్కనే కనీసం ఒక అతిథి కూడా భోజనం చేసే సంప్రదాయం ఉండేది. ఇంకా ఎవరైనా ఆగంతకులు భోజనానికి వస్తారేమోనని చూచి, ప్రతి ఇంట్లో మధ్యాహ్నం 12 గంటలు తరువాతనే భోజనం చేసేవారుట. మనకున్నదానిలో కొంత అతిథులకు పెట్టడం అనాదిగా వస్తున్న మన సంప్రదాయం. అయితే రానురాను మన సత్సంప్రదాయములను విస్మరిస్తున్నాం. ఫలితంగా అనేక కష్టాలకు గురిఅవుతున్నాం.

### ధర్మరాజు - ముంగిస :

ధర్మరాజు అశ్వమేధ యాగము చేసి ఎంతో మందికి అన్నదానం చేసాడు, మరెన్నో దానధర్మాలు చేసాడు. యాగం నిర్విఘ్నంగా జరిగిందని అందరూ భావిస్తున్న తరుణంలో, ఒక ముంగిస పాండవుల వద్దకు వచ్చి పకపకా నవ్వుతుంది. అందరికీ ఆశ్చర్యం వేస్తుంది. ఆ ముంగిసను చూడగా, దాని యొక్క ప్రక్కభాగం, బంగారపు పూత పూసినట్లుగా ధగధగలాడుతుంటుంది. ఆ విచిత్రమును చూచిన ధర్మరాజు, ఆ ముంగిసను సమీపించి ***"ఎందుకు నవ్వితివి?"*** అని అడుగుతాడు. అప్పుడు ఆ ముంగిస ***"ఓ రాజా! నీవు చాలా గొప్ప అన్నదానం చేశానని సంతృప్తి పడుతున్నావు. త్యాగశీలుడవని భావిస్తున్నావు. కాని ఒకప్పుడు ఒక పేద బ్రాహ్మణుడు చేసిన దానములతో పోలిస్తే, నీ త్యాగము ఏపాటిది?"*** అంటూ ఒక కథ చెబుతుంది.

### సక్తుప్రస్థుని కథ

ఒకప్పుడు కురుక్షేత్రంలో 'సక్తుప్రస్థుడు' అనే పేద బ్రాహ్మణ కుటుంబం ఉండేది. తమకున్న కొద్దిపాటి పొలంలో కష్టించి పండించుకున్న ఆహార ధాన్యములను, తాము

తింటూ, అందులోనే కొంత దానం చేస్తూ, నీతి నిజాయితీలతో కాలం గడుపుతుండేవారు. ఉన్నంతలో, ఇతరులకు సహాయపడటం తమ విద్యుక్త ధర్మంగా భావించేవారు. ఒకసారి ఆ ప్రాంతంలో కరువు వచ్చింది. ప్రజలంతా ఆకలితో అలమటిస్తుంటారు. ఆ పేద కుటుంబానికి కూడా కడుపు నిండా తినడానికి ఆహారముండదు. తమ వద్దనున్న కొద్దిపాటి పిండితో రొట్టెలు చేసుకొని తినబోతుంటారు. ఆ సమయంలో ఒక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చి *"అమ్మా! ఆకలి!"* అని దీనంగా అడుగుతాడు. లోపలకు ఆహ్వానిస్తాడు యజమాని. ప్రక్కనే పీట వేసి, విస్తరి పరిచి, కూర్చోపెడతాడు. మొదట తాను తినడానికి పెట్టుకున్న రొట్టెలను ఆ వృద్ధునికి పెడుతాడు. వాటిని తిని ఆకలి తీరలేదనగా, తన భార్యవంతు రొట్టెలను పెడుతాడు. అప్పటికీ ఆకలి తీరలేదంటే, తన కుమారుని భాగమును కూడా పెడుతాడు. అప్పటికీ అతిథికి ఆకలి తీరదు. చివరకు ఆ ఇంటి కోడలు, తనవంతు రొట్టెలను కూడా ఇచ్చివేస్తుంది. ఆ విధంగా ఆ కుటుంబ సభ్యులు నల్గురూ తాము తినడానికి పెట్టుకున్నదంతా అతిథికే పెడుతారు.

ఆ పేదకుటుంబం యొక్క త్యాగబుద్ధికి సేవాతత్పరతకు ఆ వృద్ధ బ్రాహ్మణుడు సంతసించి, తాను ధర్మదేవతనని, పరీక్షించుటకు వచ్చితినని చెప్పి ఆ కుటుంబమును ఆశీర్వదించి వెళ్ళుతాడు.

***"ఓ రాజా! ఆ సంఘటనంతయూ నేను కళ్ళారా చూచాను. రొట్టెలు వత్తుతుంటే క్రింద రాలిన పిండిని కొంచం చవిచూచాను. అందులో కొంత పిండి నా శరీరమునకు అంటుకొనగా, ఆ భాగమంతయూ సువర్ణమయ మయ్యెను. దానం చేసిన పిండిలో అంత మహాత్యమున్నదని గుర్తించాను. అప్పటి నుండి దానంలోనున్న మహత్తును, త్యాగంలో వున్న గొప్పతనమును గ్రహించాను"*** అని ముంగిస చెప్పగా అందరూ ఆశ్చర్యపడి తలలు వంచుకుంటారు.

సిరి సంపదలు గలవారు దానం చేయడంలో విశేషం ఏమీ లేదు. తమకున్న కొద్దిపాటి ఆహారమును తాము తినక, ఇతరులకు పెట్టటంలోనే ఉన్నది విశేషం. ఇదే నీతిని ఈ కథ మనకు బోధిస్తున్నది.

***అతిథులను ఆదరించడం, సేవించడం మన భారతీయ సంప్రదాయం. తనకున్న దానిలో కొంత దానం చేయండి, తరించండి!***



# పతిభక్తి

మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, అతిథి భక్తులతో పాటు ప్రతి స్త్రీకి పతిభక్తి ప్రధానం. పాతివ్రత్యము భారతీయ స్త్రీల పరమోత్కృష్టమైన ధర్మము. బంగారు ఆభరణాలు స్త్రీకి పైకి కనిపించిన అలంకారాలు మాత్రమే. శీల సంపద మాత్రమే స్త్రీకి అసలైన అలంకారం. పాతివ్రత్యమునకు మించిన అలంకారం మరొకటి లేదు. పాతివ్రత్య మహిమచే, ఎందరో భారత నారీమణులు అసాధ్యాలను సుసాధ్యం చేయగలిగారు.

వివాహిత అయిన స్త్రీని గృహలక్ష్మి, ఇల్లాలు, ధర్మపత్ని, అర్ధాంగి అని సంబోధించడం మన భారతీయ సంప్రదాయం. పాతివ్రత్యమహిమను ప్రపంచానికి చాటిన స్త్రీలు, ఒక్క మన భారతావనిలోనే కనిపిస్తారు, మరెక్కడా కనిపించరు. అదే భారతీయ సంస్కృతి ప్రత్యేకత. మనదేశంలో వివాహవ్యవస్థ అత్యంత పవిత్రమైనది, అర్థవంతమైనది.

అనీబిసెంటు ఒకసారి భారతీయ వివాహవ్యవస్థను ప్రశంసిస్తూ ***"ప్రాచీన భారత వివాహ పద్ధతి యందలి పవిత్రత ఆదర్శం ప్రపంచమందలి ఏ ఇతర దేశములో గాని, మతములోగాని కనిపించదు"*** అని చెబుతుంది.

శ్రీ సత్యసాయిబాబావారు ఒకసారి భారత స్త్రీల ఔన్నత్యమును గురించి, వారి శక్తి సామర్థ్యములను గురించి ముఖ్యంగా వారి పతిభక్తిని చక్కగా వర్ణించారు.

**"గత జీవుడగు పతిన్ బ్రతికించుకొన్నట్టి**
**సావిత్రి భారత సతియె కాదే**
**తన సత్యమహిమచే దావాగ్ని చల్లార్చె**
**చంద్రమతి పవిత్ర పడతి కాదే**
**కుల సతీత్వమునకై గుండాన దూకిన**
**సీత భారత ధరాజాత కాదే**
**కినిసి దుర్మద కిరాతుని బూది గావించె**
**దమయంతి భారత రమణి కాదే**
**సత్యసాగర పరివేష్టితోర్వితలము**
**భరత జాతి పాతివ్రత్య ప్రవిమలంబు**
**భావ సంపదకిది మహా పంటభూమి**
**అఖిల దేశాలకిది ఉపాధ్యాయి కాదే!"**

భారతీయ మహిళల జీవితాలు అత్యంత ఆదర్శ ప్రాయములు. పాతివ్రత్య మునకు మించిన శక్తి, ఈ జగత్తులో మరొకటి లేదని భారతీయ స్త్రీలెందరో ఋజువు చేసారు. అట్టివారిలో సీత, సావిత్రి. చంద్రమతి, సతీ అనసూయ, దమయంతి, సుమతి, మండోదరి మొదలగు పతివ్రతా శిరోమణులు ఎందరో కనిపిస్తారు.

**సీతాదేవి :**

***"ఏ దేశవాజ్మయము నందైననూ శ్రీరామచంద్రుని వంటి పురుషోత్తములు లభించిన లభించవచ్చునేమో గాని, సీత వంటి ఆదర్శ చరిత్ర గల పతివ్రతా తిలకము లభించుట దుర్లభము"*** అని స్వామీ వివేకానంద అంటారు. తన జీవన గమనం ద్వారా పాతివ్రత్యమహిమను నిరూపించి, చూపించి, ఆచరించిన పరమ సాధ్వీమణి, పతివ్రతా శిరోమణి **'సీతాదేవి'.**

శ్రీరామచంద్రుడు తనతో అరణ్యవాసానికి తీసుకొనివెళ్ళడానికి నిరాకరించినప్పడు సీతాదేవి ***"భర్తలేని స్వర్గ సుఖములకంటె, భర్తతో అరణ్యవాస దుఃఖమే మేలు. నీతో కలిసివుండటమే నాకు స్వర్గము, నిన్ను విడచివుండటమే నాకు నరకము"*** అని చెప్పి శ్రీరాముని అనుసరిస్తుంది. భారత స్త్రీ కోరుకొనేది మేడలు, మిద్దెలు కావని, సుఖభోగాలంతకన్నాకావని, భర్తయొక్క ప్రేమానురాగాలు మాత్రమేనని, పతిసన్నిధి సతికి ముఖ్యమని లోకానికి చాటింది **'సీతాదేవి'.**

సీతాదేవి ఎంత పతివ్రతయో, అంత త్యాగమూర్తి. ఆమె తన పతి కొఱకు తన ప్రాణాలనైనా సంతోషంగా త్యజించగల త్యాగమూర్తి. అసలు ఆమె జీవితమే త్యాగమయం. ఒకసారి 'విరాధుడు' అనే రాక్షసుడు, రామలక్ష్మణులను ఎత్తుకొని పారిపోతున్న సన్నివేశమును చూచి పెద్దగా రోదిస్తూ ***"మాం హరోత్సృజ కాకుత్స్థౌ నమస్తే రాక్షసోత్తమ!"*** (తనను భక్షించి రామలక్ష్మణులను వదిలి వేయుము) అని విరాధుని ప్రార్థిస్తుంది. తన పతి కొఱకు, తన జీవితాన్ని సహితం సంతోషంగా సమర్పించుకొవడానికి కూడా ఏ మాత్రం వెనుకంజ వేయలేదనే విషయం ఈ సంఘటన ఋజువు చేస్తున్నది. కనుక త్యాగమయమైన సీతాదేవి ఆదర్శ జీవితాన్ని ముఖ్యంగా స్త్రీజాతి ఆదర్శముగా గైకొనాలి.

సీతాదేవి యొక్క పాతివ్రత్య ప్రతాప సౌందర్యమును గురించి 'సుందరకాండలో వాల్మీకి చక్కగా వర్ణించాడు. శ్రీరాముని గురించి హీనంగా, తేలికగా అవహేళన చేస్తున్న రాక్షస స్త్రీలకు చక్కటి సమాధానం ధైర్యంగా చెబుతుంది 'సీతాదేవి'.

"దీనోవా రాజ్య హీనోవా యోమే భర్తా సమే గురుః
తం నిత్యమనురక్తాస్మి యథా సూర్యం సువర్చలా"

*"దీనుడుగాని, రాజ్యహీనుడుగాని, నా భర్తయే నాకు పూజ్యుడు. సూర్యుని యందు సువర్చల వలె, నేనతనియందు నిత్యానురక్తియై యందును"* అని సీతాదేవి తన భర్తను గురించి సగర్వంగా, ధైర్యంగా చెప్పకుంటుంది. నా అనేవాళ్ళ దరిదాపులలో ఒక్కరూ లేకపోయినప్పటికీ, అంత ధైర్యంగా సమాధానం చెప్పగలగడం సామాన్యమైన విషయం కాదు. *"సచ్ఛీల సంపన్నులు మాత్రమే అధర్మమును ధైర్యంగా ఎదుర్కొనగలుగుతారు. నైతిక శీల సంపన్నులు అధర్మమును సహించరు, దుష్టులకు తలవంచరు"* అనే వాస్తవమును నిరూపించింది *'సీతాదేవి'.*

సీతాదేవి యొక్క పాతివ్రత్య మహిమను గురించి రావణుని భార్య *'మండోదరి'* సహితం ప్రశంసిస్తుంది. రావణుడు మరణించిన తరువాత మండోదరి అతని మృత శరీరంపై బడి విలపిస్తూ *"పతివ్రతా యాస్తప సానూనం దగ్ధోஉసిమే ప్రభో!"* నీవు పతివ్రత యగు సీతయొక్క తేజము చేత దగ్ధమైనావు అని విలపిస్తుంది. మిత్రులు సహజంగా పొగుడుతారు. కాని శత్రువులు పొగడటంలోనే ఉన్నది సీతాదేవి యొక్క ప్రత్యేకత. సీతయొక్క పాతివ్రత్య సౌశీల్యం ఎంతటిదో, ఈ సంఘటన చాటి చెబుతున్నది.

రావణవధానంతరం శ్రీరాముడు సీతను పరీక్షించదలచుకొని అనరాని మాటలు అంటాడు. ఆమె శీలాన్నే శంకిస్తాడు. రామాజ్ఞ ప్రకారం లక్ష్మణుడు చితిని పేరుస్తాడు. అయినప్పటికీ సీత ఏ మాత్రం బాధపడక అగ్నికి ఆహుతి కావడానికి సిద్ధమై, శ్రీరాముని చుట్టూ ప్రదక్షిణ చేసి, అగ్నిలో దుమికేముందు దేవతలకు ప్రణామం చేస్తూ ***"నా యొక్క హృదయం నిత్యమూ రాఘవుని తప్ప, ఇతరుల మీదకు పోకుండ నున్నచో, నన్ను సకల విధముల అగ్నిదేవుడు రక్షించుగాక!"*** అని అగ్నిలో ప్రవేశిస్తుంది. ఆ భయంకర సన్నివేశాన్ని చూస్తున్నవారందరూ హాహాకారములు చేస్తుంటారు. ఇంతలో చితిమీద అగ్ని ఆరిపోతుంది. సీత చెక్కు చెదరకుండా నిలబడి ఉంటుంది. దేవతలు ప్రత్యక్షమవుతారు. సీతాదేవి యొక్క మహత్తర పాతివ్రత్య మహిమను ప్రశంసిస్తూ *"ఓ రామా! పాపరహితురాలగు సీతను పరిగ్రహింపుము"* అని ఆదేశిస్తారు.

ఎవరికోసమైతే క్షణం ఒకయుగంగా గడిపిందో, ఆ వ్యక్తి కనపడి, నిర్దాక్షిణ్యంగా నిరాకరించుతే, అప్పుడు ఆ హృదయం ఎంత పరితపిస్తుందో! ఊహించడం కూడ కష్టమే. అదే సీత జీవితంలో కూడా జరిగింది. తను ఆరాధిస్తున్న భర్త కనపడి, తృణీకరించినప్పటికీ, ఏమాత్రం తొణకక, బెణకక, ఆత్మ స్థైర్యంతో నిలబడి తన పాతివ్రత్యమును నిరూపించుకున్నది సీతాదేవి. అందువలననే ఆమె సచ్ఛీల చరిత్ర సకల నారీలోకానికి గర్వకారణమైనది. అందుకనే రామాయణ మహాకావ్యాన్ని మనకు వాల్మీకి **"సీతా యాశ్చరితమ్"** అనే పేరుకూడా పెట్టాడు.

తపోబలం కంటే పాతివ్రత్య మహిమ చాలా గొప్పదని నిరూపించారు ఇంకా ఎందరో మహిళలు. సుఖదుఃఖములలో కష్టనష్టాలలో అర్ధాంగిగా తన ధర్మాన్ని నిర్వహించి ఆదర్శసతిగా వెలుగొందింది **'చంద్రమతి'**. తన పాతివ్రత్య మహిమ చేత మరణించిన తన భర్త సత్యవంతుని ప్రాణాలను తిరిగి తెప్పించగలిగింది **"సతీసావిత్రి"**. తన పాతివ్రత్యమహిమ చేత ఇనుపగుండ్లను గుగ్గిళ్ళుగా వండి నారదునికి పెట్టి త్రిమూర్తుల భార్యలను ఆశ్చర్య చకితులను గావించింది **"సతీ అనసూయ"**. తన పాతివ్రత్య మహిమ చేత, సూర్య గమనాన్ని సహితం నిలిపివేసి తన భర్తప్రాణాలను రక్షించుకున్నది **'సతీసుమతి'**. సుఖాలలోనే గాక కష్టాలలో కూడా భర్తను అనుసరించడం సతిధర్మమని లోకానికి చాటింది **'దమయంతి'**. కామాంధకారంతో పతివ్రతలను అవమాన పరచే వారెంతటి తపఃసంపన్నులైనా, పతనం కాకతప్పదని, పతివ్రతల కన్నీరెప్పటికినీ వ్యర్థంకాదని, తన భర్త రావణబ్రహ్మను ముందుగానే హెచ్చరించిన వివేకశీలి **'మండోదరి'**. ఇలా ఎందరో పతివ్రతామతల్లులకు జన్మ నిచ్చింది ఈ **'భరతమాత'**. కనుక ఈ భరతమాతను పూజించడం మనందరి కర్తవ్యం. విస్మరించకండి!

---

"పాతివ్రత్యము అనునది ఒక మహత్తరమైన శక్తి. అట్టి దివ్యశక్తి సంపాదించిన స్త్రీలను వంచించువారు ఎంతటి బలపరాక్రమ సంపన్నులైనా అగ్నిలో పడిన మిడతలవలె దగ్ధమై పోతారు".

# భ్రాతృభక్తి - భ్రాతృప్రేమ

భ్రాతృప్రేమకు ఆదర్శం దశరథుని కుమారులు. భ్రాతృభక్తికి నిదర్శనం శ్రీరామ సోదరులు. భ్రాతృభక్తి వారి జీవిత పరమావధి. పితృభక్తి పరాయణుడు. శ్రీరామచంద్రుడు. భ్రాతృభక్తి పరాయణుడు లక్ష్మణుడు. శ్రీరామునికి సేవచేయటమే లక్ష్మణుని జీవిత లక్ష్యం. భరతుని అనుసరించడమే శత్రుఘ్నుని జీవిత ఆశయం. అందరూ అందరే. ఒకరికి మించినవారు మరొకరు. అందువలననే కాబోలు! మనకు స్వాతంత్ర్యం లభించిన వెంటనే ***"ఈ దేశంలో రామరాజ్యాన్ని తిరిగి నెలకొల్పటమే నా జీవిత పరమావధి"*** అని చెప్పారు మహాత్మాగాంధీ.

**శ్రీరాముని భ్రాతృప్రేమ :**

ఒకసారి యుద్ధభూమిలో రామలక్ష్మణులిద్దరూ ఒకేసారి నాగపాశబద్ధులై స్పృహ తప్పి పడిపోతారు. అయితే వారిద్దరిలో శ్రీరామునికి ముందుగా తెలివి వస్తుంది. లక్ష్మణుని చూచి కన్నీరు కారుస్తూ శ్రీరాముడు ***"సీతవంటి భార్య భూలోకమున ఎచటనైనను వెదికిన లభించవచ్చును. కాని లక్ష్మణునితో సమానమగు సోదరుడు మాత్రం లభించుట దుర్లభం"*** అని బావురుమని ఏడుస్తాడు. శ్రీరామునికి, లక్ష్మణుని మీద గల ప్రేమను ఈ సంఘటన ఋజువుచేస్తున్నది.

మరోసారి యుద్ధ భూమిలో రావణుడు అతి శక్తివంతమైన 'శక్తి' అనే అస్త్రమును వదలగానే లక్ష్మణుడు మూర్ఛిల్లుతాడు. లక్ష్మణుడు గతించిన తరువాత, రావణునితో యుద్ధం చేయటం వ్యర్థమని భావించి విలపిస్తూ శ్రీరాముడు ***"నేను వనవాసమునకు బయలు దేరునప్పుడు, తల్లి సుమిత్రను భార్య ఊర్మిళను వదిలి, నాతో పాటు బయలుదేరి ఏవిధంగా కానలకొచ్చాడో, అదే విధంగా ఈనాడు యమపురికేగు లక్ష్మణునితో కలిసి నేను కూడా యమలోకానికి పోతాను"*** అని అంటాడు. సోదరుల పట్ల శ్రీరాముని ప్రేమ ఎంత నిష్కల్మషమైనదో స్పష్టమవుతున్నది.

శ్రీరాముని భ్రాతృప్రేమ వర్ణనాతీతము. సోదరులంటే అత్యంత మమకారము. లక్ష్మణుడు లేకుండా అన్నం తినేవాడు కాదు. నిద్రించేవాడు కాదు. ఒకసారి లక్ష్మణునితో ***"భరతుడు గాని, శత్రుఘ్నుడుగాని, నీవు గాని లేకుండా ఎట్టి అల్పసుఖమును కోరను. మీకు సుఖములను కలుగజేయాలనేదే నా మనోవాంఛ. అంతకు మించి ఏ కోరిక నా మదిలో జనించినా, దానిని అగ్నిదేవుడు భస్మము చేయుగాక!"*** అని అంటాడు శ్రీరాముడు.

శ్రీరాముని మనోభావాలను ఆదర్శంగా గైకొంటే కుటుంబాలలో కలతలే ఉండవు. ద్వేషాలకు, వైషమ్యాలకు ఆస్కారమే ఉండదు.

**లక్ష్మణుని భ్రాతృభక్తి :**

లక్ష్మణుని 'భ్రాతృభక్తి'ని వర్ణించుటకు మాటలు చాలవు. అడవులకు వెళ్ళనవసరం లేనప్పటికీ, సకల రాజభోగములను త్యజించి, శ్రీరాముని వెంట వెళ్ళడానికి సిద్ధపడుతాడు. వద్దంటే అంగీకరించడు. ***"నీవు లేకుండగ త్రిలోకైశ్వర్యములు ఇచ్చిననూ నేను వాటిని కోరను"*** అని స్పష్టంచేసి శ్రీరామునితో బయలుదేరి అడవులకు వెళ్లిన స్వార్థమెరుగని త్యాగశీలి లక్ష్మణుడు.

ఒకసారి ***'కబంధుడు'*** అనే రాక్షసుడు రామలక్ష్మణులను బంధించుతాడు. అప్పుడు లక్ష్మణుడు తన అన్నయందు కనబరచిన ప్రేమ, భక్తి అసాధారణమైనది. ఆ సంకట స్థితిలో కూడా ఉదారంగా ప్రవర్తిస్తాడు. కర్తవ్యాన్ని బోధిస్తాడు. ***"ఓ రామా! నన్ను గూర్చి ఆలోచింపకుము. ఈ కబంధునికి నన్నుబలిగా యిచ్చి, నీవు సుఖముగా పో! కొద్ది కాలంలోనే సీత నీకులభిస్తుంది. వనవాసమును పూర్తి చేసుకొని, తిరిగి అయోధ్యకువెళ్ళి సుఖముగా రాజ్యమును పాలింపుము"*** అని లక్ష్మణుడు వేడుకుంటాడు. తన స్వసుఖాలను వదలుకొని తన జీవిత సర్వస్వమును శ్రీరాముని పాదపద్మములకు సమర్పించిన భ్రాతృభక్తి పరాయణుడు 'లక్ష్మణుడు'.

**భరతుని భ్రాతృభక్తి :**

***"న సర్వే భ్రాతర స్తాత భవంతి భరతో సమాః"*** (సోదరులందరూ భరతుని వంటి వారు కాదు) అని శ్రీరామచంద్రుడే భరతుని భ్రాతృభక్తిని ప్రశంసిస్తాడు. ***"రామాదపి హితం మన్యే ధర్మతో బలవత్తరమ్"*** (రాముని కంటే గూడ ధర్మ విషయమున భరతుడు చాలా నిష్ఠ గలవాడు) అని దశరథుడే స్వయముగ ప్రశంసిస్తాడు. ***'ఆకాశ ఇవ నిర్మలః'*** (ఆకాశము వలె నిర్మలమైన మనసు గలవాడు) అని వాల్మీకి కూడా ప్రశంసించుతాడు.

దశరథుని మరణానంతరం భరతుడు, శ్రీరాముని తీసుకొని రావడానికి అడవులకు వెళ్ళుతాడు. శ్రీరాముని పాదాలపై పడి ఏడుస్తాడు, అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యపాలన చేయమని వేడుకుంటాడు. శ్రీరామునికి బదులుగా తానే అరణ్యవాసం చేస్తానని అర్థిస్తాడు. శ్రీరాముడు అంగీకరించకపోతే ప్రాయోపవేశమునకు పూను

కుంటాడు. అయినప్పటికీ శ్రీరాముడు అంగీకరించడు. వశిష్టాది మహర్షులు ధర్మసూక్ష్మమును వివరించగా, గత్యంతరంలేక శ్రీరాముని పాదుకలను శిరస్సున ధరించి తిరిగి ప్రయాణమై, అయోధ్యకు వెళ్ళకుండా, సమీపమునే ఉన్న నంది గ్రామంలో సింహాసనమును ఏర్పాటు చేసి, దానిపై శ్రీరాముడు ప్రసాదించిన పాదుకలను ఉంచి, ప్రజాసమక్షంలో వాటికి పట్టాభిషేకం గావించి ***"ఈ రాజ్యం శ్రీరాముడిది. దానిని ఆయన తాత్కాలికంగా నాకు వప్పజెప్పాడు. నేను ఆయన ప్రతినిధిగా, ధర్మబద్ధంగా రాచ కార్యాలను నిర్వహించుతాను"*** అని అందరిముందర భరతుడు ప్రతిజ్ఞ చేస్తాడు. సకల భోగభాగ్యములను విడనాడి, నారబట్టలను ధరించి, కందమూలాలను మాత్రమే భుజిస్తూ, కటిక నేలపై శయనిస్తూ, శ్రీరాముని ప్రతినిధిగా, పదునాలుగు సంవత్సరాలపాటు ప్రజానురంజకంగా పరిపాలన చేసి, తిరిగి రాజ్యమును శ్రీరామునికి వప్పగించుతాడు. ఇటువంటి మహత్తర అద్భుత సన్నివేశం ప్రపంచ చరిత్రలోనే మరెక్కడా కనిపించదు. రాజ్య కాంక్షతో, ధర్మాధర్మములను విచారించక, స్వార్ధంతో తండ్రులను చంపిన పితృ హంతకులు, సోదరులను తుదముట్టించిన భ్రాతృహంతకులు ఎందరో చరిత్ర పుటాలను త్రిప్పతే కనిపిస్తారు. అటువంటి పరిస్థితులలో భరతుడి ప్రవర్తన ఆదర్శప్రాయం కాదా? స్వార్ధంతో, అక్రమంగా రాజ్యాలను స్వాహా చేస్తున్న నేటి పాలకులు, భరతుని త్యాగమయమైన చరిత్రను చదివి సిగ్గుపడాలి. ఈ సంఘటన భరతుని *'భ్రాతృభక్తి'* ఎంతటిదో చాటుచున్నది.

**శత్రుఘ్నుని భ్రాతృభక్తి :**

రామరాజ్య పాలనా కాలంలో ***'లవణాసురుడు'*** పెట్టే బాధలకు తట్టుకోలేక మహర్షులు శ్రీరాముని వద్దకు వచ్చి, రక్షించమని మొర పెట్టుకుంటారు. అతనిని వధించే బాధ్యత భరతునికి వప్పగించుతాడు శ్రీరాముడు. ***"పదునాలుగు సంవత్సరాలపాటు జటాధారియై, దర్భలపై పరుండి, కంద మూలాలను మాత్రమే తింటూ కష్టపడిన భరతునికి మరల ఈ బాధ్యత వప్పగించడం ఏమాత్రం భావ్యం కాదు. నేనే లవణాసురుని సంహరిస్తాను. నాకు అనుమతి ఇవ్వండి"*** అని ప్రాధేయపడుతాడు శతృఘ్నుడు. అప్పుడు శ్రీరాముడు ఆ బాధ్యతను అప్పగించగా, లవణాసురుని సంహరించి వస్తాడు శత్రుఘ్నుడు. అప్పుడు శ్రీరాముడు ఆనందంతో మధురానగరమును పాలించమని శత్రుఘ్నుని ఆదేశించుతాడు. అంగీకరించక శత్రుఘ్నుడు ***"కథం తిష్టత్సు జ్యేష్ఠేషు కనీయాన భిషిచ్యతే"*** (నాకంటే

పెద్దలుండగా, నాకేల ఈ రాజ్యాభిషేకము) అని తిరస్కరిస్తాడు. అంతేకాదు పదునాలుగు సంవత్సరాలపాటు శ్రీరాముని వియోగ దుఃఖమును పొందిన తనకు మరల ఈ వియోగమును కల్పించవద్దని ప్రాధేయపడుతూ **"తల్లి లేని శిశువువలె నిన్ను విడిచి క్షణమైనా వేరొకచోట ఉండజాలను"** అని విలపిస్తాడు శత్రుఘ్నుడు. ఈ సంఘటనను బట్టి శత్రుఘ్నుని 'భ్రాతృభక్తి' ఎంతటిదో తేటతెల్లమవుతున్నది.

శ్రీరాముని సోదరులు ఒకరికి మించినవారు మరొకరు. భ్రాతృప్రేమ వారి జీవిత పరమాశయము. భ్రాతృభక్తి వారి జీవిత లక్ష్యం. శ్రీరాముని వంటి అన్నను పొందిన లక్ష్మణ, భరత శత్రుఘ్నులు ఎంతటి అదృష్టవంతులో, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు వంటి తమ్ములను కలిగిన శ్రీరాముడు కూడా అంతే అదృష్టవంతుడు.

సత్యధర్మ త్యాగాలే వారిని నడిపించాయి. స్వార్థంతో సంకుచితత్వంతో, ఆస్తుల కోసం పోరాటం చేస్తూ, పండంటి కాపురాలను సర్వనాశనం గావించుకుంటున్న, నేటి సోదరులు, శ్రీరామ సోదరులను ఆదర్శంగా తీసుకుంటే ఎంత బాగుంటుందో! ఆలోచించండి.

*భ్రాతృప్రేమను మరువకండి! భ్రాతృభక్తిని విస్మరించకండి.*

---

'రామాయణం వంటి మహాకావ్యం ప్రపంచమునందే సాహిత్యమునన్నూ కానరాదు. భారతదేశంలోని అన్ని తరగతులకు చెందిన ప్రజలలో ఈ మహాకావ్యము వేలాది సంవత్సరము లైనప్పటికీ జీవించి వుండగలదు. ఈ మహా కావ్యములోని పాత్రలు అత్యంత ఆదర్శనీయమైనవి. వివిధ పాత్రలమధ్య సంఘర్షణలకు తావివ్వకుండా, పాత్రలకు జీవంపోసి, పోషించి, చైతన్యాన్ని కలుగజేసిన ఘనత ఈ మహాకావ్యరచయిత వాల్మీకి మహర్షికే దక్కింది. ఈ కావ్యమును పఠించినచో ఆనాటి సమాజదృక్పథమును సమగ్రంగా అవగాహన చేసుకొనవచ్చును. వ్యక్తి-సమాజం, ప్రభువు-ప్రజలు, తండ్రి-పిల్లలు, భార్య-భర్త, సోదరులు-మిత్రుల మధ్య పరస్పరము ఉండవలసిన సంబంధబాంధవ్యాలు, కట్టుబాటులు ఈ మహాకావ్యంలో చక్కగా వివరించ బడినాయి. ముఖ్యంగా భ్రాతృభక్తి-భ్రాతృప్రేమల విశిష్టతను గురించి ఈ మహాకావ్యం చక్కటి ఆదర్శాన్ని సమాజానికి అందించింది"

- వింటర్ విడ్జ (జర్మన్ పండితులు)

# త్యాగము

*త్యాగం* కూడా ఒక రకమైన శీలమే (Character). మేడమెట్లలో అత్యున్నతమైన ఆఖరి మెట్టు త్యాగం. 'త్యాగం' అనగానే దానం చేయడమని, చాలామంది భావిస్తుంటారు. దానానికి, త్యాగానికి చాలా తేడా ఉన్నది. తనకున్న సంపదలో ఎంతో కొంత యితరులకు యివ్వడం **'దానం'** అంటారు. తన సర్వస్వమును సమర్పించుకోవటం, 'త్యాగం' అంటారు.

**త్యాగము :**

అమిత ప్రియమైన వాటిని సహితం నవ్వుతూ, నవ్వుతూ, ఏమాత్రం సంకోచించకుండా, ఇతరులకు యివ్వగలిగిన వానినే 'త్యాగి' అంటారు. దేనిని ఇతరులకు యివ్వటం వలన, తన సర్వస్వాన్ని కోల్పోతానని తెలిసినప్పటికీ, ఏ మాత్రం సంకోచించకుండా యిచ్చివేయువాడే నిజమైన 'త్యాగి'. తన అస్తిత్వానికే మూలాధారమైన, ఈ భౌతిక శరీరమును సహితం, తృణప్రాయంగా భావించి త్యజించడానికి సిద్ధమయ్యేవాడే 'త్యాగి'. సత్యమే జీవిత పరమావధిగా భావించి, పరోపకారమే ధర్మముగా నెంచి, మృత్యువుకు కూడా ఏ మాత్రం భయపడక, ధర్మ సంస్థాపనార్ధం తన జీవిత సర్వస్వాన్ని సమర్పించుకొనువారే నిజమైన **'త్యాగశీలురు.**

**శిబిచక్రవర్తి :**

శిబిచక్రవర్తి త్యాగనిరతిని పరీక్షించాలనే అభిలాష ఒకసారి ఇంద్రాగ్నులకు కలుగుతుంది. డేగ, పావురాల రూపంలో బయలుదేరి శిబిచక్రవర్తి విహరిస్తున్న ఉద్యానవనమునకు వస్తారు. డేగ చేత తరుమబడుతున్న పావురం 'రక్షించు! రక్షించు' అంటూ శిబి వడిలో వచ్చిపడుతుంది. భూతదయ పరాయణుడైన శిబిచక్రవర్తి అభయమిస్తాడు. ఇంతలో డేగ వచ్చి తనకు ఆహారమైన పావురాన్ని యిచ్చి వేయమని 'శిబి'ని కోరుతుంది. అభయమిచ్చిన పావురాన్ని ఏ పరిస్థితులలోనూ వదలనని నిక్కచ్చిగా చెబుతాడు 'శిబి'. కాని డేగ తన మొండి పట్టువదలను విడనాడదు. తన ఆహారాన్ని దాచటం ధర్మం కాదని డేగ వాదిస్తుంది. అప్పుడు శిబిచక్రవర్తి, ఆ పావురం ఎత్తు మాంసమును, తన శరీరమునుండి కోసి యివ్వనయినా యిస్తానుగాని, అభయమిచ్చిన పావురాన్ని మాత్రం యివ్వనంటాడు.

డేగ అంగీకరిస్తుంది. ఒక త్రాసును తెప్పించి ఒక ప్రక్క పావురాన్ని వుంచి, రెండవ ప్రక్క తన శరీరాన్ని కోసి కొంత మాంసమును వుంచుతాడు 'శిబి'. ఆ విధంగా ఎన్ని మాంసపు ముక్కలుంచినప్పటికీ, పావురంతో సరిసమానంగా సరితూగదు. తన వాగ్దానమును నిలబెట్టుకోవడానికోసం, తన శరీరమును సంపూర్ణంగా డేగకు సమర్పించుకుంటాడు 'శిబి చక్రవర్తి'.

ఈ సంఘటన మనకు ఒక మహత్తరమైన, పరమోత్కృష్టమైన నీతిని బోధిస్తున్నది. ఆడిన మాటను నిలబెట్టుకోవడాని కోసం, ఇచ్చిన వాగ్దానమును నెరవేర్చుకోవడాని కోసం, అభయమిచ్చిన పావురాన్ని రక్షించడాని కోసం 'శిబి' లాంటి మహాచక్రవర్తి, ఏ మాత్రం వెనకాడకుండా, సంకోచించకుండా తన శరీరాన్నే సంపూర్ణంగా సమర్పించుకొని, ప్రపంచానికి త్యాగం యొక్క విలువను చాటాడు, గొప్పతనాన్ని నిరూపించాడు. త్యాగానికి ప్రతీక శిబిచక్రవర్తి.

**త్యాగశీలి కర్ణుడు :**

అది మహాభారత యుద్ధభూమి. 17వ రోజు పరిసమాప్త మవుతుంది. కర్ణుడు యుద్ధభూమిలో పడి ఉంటాడు. పాండవుల శిబిరంలో ఆనందోల్లాసాలు. శ్రీకృష్ణుడు మాత్రం విచార సముద్రంలో మునిగి ఉంటాడు. అర్జునునికి కోపం వస్తుంది. కృష్ణుడి దగ్గరకు వెళ్ళి ***"బావా! ఎందుకు విచారిస్తున్నావు? కర్ణుడు అస్తమిస్తున్న సుదినం గదా! సంతోషించడానికి బదులు విచారిస్తున్నావేమి?"*** అని ప్రశ్నిస్తాడు? అప్పుడు కృష్ణుడు ఖిన్న వదనంతో ***"అర్జునా! నేను నిజంగానే విచారిస్తున్నాను. నిజమైన దాత ఈ భూమిని నేడు వదలి పోతున్నాడు"*** అని బదులు చెబుతాడు. తన ప్రత్యర్థిని పొగడుతున్నందులకు అర్జునుడు బాధపడుతాడు. అప్పుడు కృష్ణుడు "ధనంజయా! దుఃఖమేల? ఇది యదార్థం. రా! నావెంట, దానకర్ణుడింకా చావలేదు. ఆయన త్యాగశీలం ఎంతటిదో ఆఖరి సారిగా చూడు" అని చెప్పి అర్జునుని తన వెంట తీసుకొని వెళ్ళి ఒక చెట్టుక్రింద వుంచి, బ్రాహ్మణ వేషం ధరించి కృష్ణుడు కొంచం ముందుకు వెళ్ళి ***"కర్ణా! దానకర్ణా! ఎక్కడున్నావయ్యా! నీకోసం వచ్చాను!"*** అని బిగ్గరగా పిలుస్తాడు. యుద్ధభూమిలో పడివున్న కర్ణుడు, లేవలేక లేస్తూ తల పైకెత్తి ***"ఆ! ఇక్కడ....ఇక్కడనే ఉన్నాను. ఎవరు పిలుస్తున్నారు నన్ను? ఎవరదీ? ఏం కావాలి?"*** అని అడుగుతాడు. బ్రాహ్మణ వేషంలో వున్న శ్రీకృష్ణుడు ***"నేను, మీపేరు ప్రతిష్ఠలు విని,***

*గంపెడంత ఆశతో యిక్కడకు వచ్చాను, నేను చాలా యిబ్బందులలో ఉన్నాను. నాకు కొంచెం బంగారం కావాలి"* అని అడుగుతాడు. అప్పుడు కర్ణుడు *"నా పరిస్థితి చూస్తున్నారు గదా! అల్లంత దూరంలో నాయిల్లు ఉంది. అక్కడకు వెళ్లండి. మీకు కావలిసినంత బంగారం నా భార్య యిస్తుంది"* అని అంటాడు. అప్పుడు ఆ బ్రాహ్మణుడు *"నాకు కావల్సిన కొద్ది బంగారం కోసం అంత దూరం వెళ్ళాలా? నాకు ఓపికలేదు, నడువలేను, ఏమైనా యిస్తే మీరే యివ్వండి లేకపోతే లేదని చెప్పండి. నా దోవన నేను వెళ్ళుతాను"* అని కోపంతో అంటాడు. అప్పుడు కర్ణుడు తన నోరుతెరచి చూపుతూ, తన దంతాలకున్న బంగారాన్ని తీసుకోమంటాడు. అప్పుడు ఆ బ్రాహ్మణుడు కోపంతో *"సజీవంగా వున్న మనిషి యొక్క దంతాలు ఊడబెరకమని చెబుతున్నావా? నీకు సిగ్గులేదా?"* అని అంటాడు. ఏమి చెప్పాలో తోచక కర్ణుడు అటూ, ఇటూ చూస్తాడు. కొద్ది దూరంలో ఒక రాతి బండ కనిపిస్తుంది. అతి కష్టం మీద, తన శరీరాన్ని ఈడ్చుకుంటూ ఆ రాయి దగ్గరకు చేరుతాడు. ఆ రాతిపై తన ముఖాన్ని కొట్టుకుంటాడు. ముఖం పచ్చడి పచ్చడై పళ్ళూడి క్రింద పడుతాయి. బంగారం తొడుగువున్న ఆ పళ్లను తీసుకొమ్మని ప్రాధేయపడుతాడు. *"ఛీ! రక్తసిక్తమై వున్న అపవిత్రమైన వాటిని స్వీకరిస్తానా?"* అని ఆ బ్రాహ్మణుడు రెండడుగులు వెనక్కి వేస్తాడు. కర్ణుడు తన ఖడ్గంతో ఆ పళ్లను కొట్టి బంగారాన్ని వేరుచేసి స్వీకరించమని కోరుతాడు. ఆ బంగారానికి రక్తం అంటి వుండటం వలన, దానిని కూడా అపవిత్రంగా భావించి స్వీకరించ నిరాకరిస్తాడు ఆ బ్రాహ్మణుడు.

అప్పుడు కర్ణుడు అతి కష్టంమీద బాణములను చేతబూని, శిరస్సు సహాయంతో విల్లునెక్కుపెట్టి, వారుణాస్త్రంతో జలమును సృష్టించి, ఆ బంగారాన్ని కడిగి, దానిని స్వీకరించమని అర్థిస్తాడు.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు సంభ్రమాశ్చర్యాలతో తన నిజస్వరూపాన్ని చూపించి *"వరం కోరుకో! వీరుడా!"* అని అంటాడు. అప్పుడు కర్ణుడు ఆనందంతో తడబడుతూ *"సాక్షాత్ త్రిభువనేనుడే! నా అవసానదశలో నా ముందున్నాడు. ఇంకా నాకేం కావాలి?"* అంటూ ఆనందభాష్పాలు రాలుస్తాడు కర్ణుడు. ఈ సన్నివేశాన్ని చూస్తున్న అర్జునుడు సిగ్గుతో తలవంచుకుంటాడు.

సూర్యుడు ఎంత వద్దని చెబుతున్నప్పటికీ, తన శక్తికి మూలమైన కవచ కుండలాలను సునాయాసంగా ఇంద్రునికి దానం చేసిన త్యాగశీలికి ఇది ఒక లెక్కా! దుస్సంగంలో చేరటం వలన అతనికి కొంత చెడ్డపేరు వచ్చిందిగాని, నిజంగా కర్ణుడు మహోత్యాగశీలి.

ఇంకా...ఇంకా...ఎందరో త్యాగశీలురకు ఈ భరతమాత జన్మనిచ్చింది. శుక్రాచార్యుడు వద్దని చెబుతున్నప్పటికీ, వినకుండా, వామనునికి మూడడుగులు దానం యిచ్చి ఆత్మార్పణ చేసుకున్న మహోత్యాగి *'బలిచక్రవర్తి'*, ఈ పవిత్ర భూమిలోనే జన్మించాడు. ఇంద్రుడు కోరగానే ఏ మాత్రం వెనుకాడక తానాహుతియై, తన వెన్నెముకను వజ్రాయుధంగా తయారుచేసుకోవడానికి యిచ్చిన త్యాగశీలి 'దధీచి' ఈ పుణ్య భూమిలోనే జన్మించాడు. పసుపు బట్టలతో వివాహవేదిక నుండి బయటకు వచ్చి, కొదమసింహంలా రణరంగంలోనికి దుమికి వీరవిహారం చేసి 'సింహోఘడ్' ను ఆక్రమించి, విజయలక్ష్మిని చేబట్టి కన్నుమూసిన వీరాధి వీరుడు 'తానాజీ'ని ఈ భరతమాతే కన్నది. నవ్వుతూ...నవ్వుతూ... ఉరికంబానికెక్కి ఉరిత్రాడు తమ స్వహస్తాలతో తగిలించుకొని 'వందేమాతరం' అంటూ అమరలోకానికి చేరుకొనిన వీరవిప్లవ జ్యోతులైన భగత్సింగ్, సుఖదేవ్, రాజగురులకు జన్మ యిచ్చింది కూడా ఈ భరతమాతే. పురాణ, ఇతిహాస, చరిత్ర పుటలను త్రిప్పుతూ పోతుంటే ఇంకా ఎంతో మంది మహాపురుషులు, మహనీయులు త్యాగశీలురు ప్రత్యక్షమవుతారు. త్యాగధనులకు పుట్టినిల్లు ఈ భరతదేశం. భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామంలో ఇంకా ఎందరో మహనీయులు ఎన్నో త్యాగాలు చేసారు. ఈ దేశానికి స్వాతంత్ర్యం భిక్షపెట్టారు. ***స్వరాజ్యం కోసం అలనాడు వారు త్యాగాలు చేస్తే, ఈనాడు సురాజ్యం కోసం మనం త్యాగాలు చేయాలి.*** ఇది మన కర్తవ్యం.

**"నకర్మణా నప్రజయా**
**ధనేన త్యాగేనైకే**
**అమృతత్వ మానశుః"** .



# క్రమశిక్షణ

*'క్రమశిక్షణ ' అంటే 'మంచిశిక్షణ'* అని అర్థం. క్రమశిక్షణ ముఖ్యంగా బాలబాలికలలో వుండవలసిన 'సద్గుణం'. ఎంతటి తెలివిగలవాడైనప్పటికీ, మంచి మార్కులను శ్రద్ధతో, పట్టుదలతో తెచ్చుకుంటునప్పటికీ, క్రమశిక్షణ గనుక అలవడకపోతే ప్రయోజనం లేదు, జీవితంలో రాణించడు, ఎందుకూ పనికిరాకుండా పోతాడు. కనుక ***ప్రతి విద్యార్థి 'క్రమశిక్షణ'ను అలవరచుకోవాలి.***

క్రమశిక్షణను గురించి పుస్తకాలు చదివితే అబ్బదు. ఉపన్యాసాలు వింటే రాదు. నిరంతర సాధన ద్వారానే ఇది అబ్బుతుంది. ఆటపాటల ద్వారా మనకు తెలియకుండానే మనం క్రమశిక్షణను నేర్చుకుంటాం. ఆటలాడేటప్పుడు మన మనస్సును మన అధీనంలో ఉంచుకోవాలి. ఎంత ఉత్సాహంగా ఆడుతున్నప్పటికీ, ఒళ్ళు మైమరచి ఆటలో నిమగ్నమైపోయినప్పటికీ, నాయకుడు 'విజిల్' ఊదటంతోనే ఎక్కడి వారక్కడ నిశ్శబ్దంగా నిలబడిపోవాలి. అదే క్రమశిక్షణ. 'కోరస్' పాడేటప్పుడు పది గొంతులూ కలిసి ఒకే గొంతుగా వినపడేట్లు పాడటం నేర్చుకోవాలి. అప్పడే అందంగా వినసొంపుగా, శ్రావ్యంగా పాట వినపడుతుంది. అదే క్రమశిక్షణ. సైన్యాధికారి ఇచ్చే సూచనలను, ఆజ్ఞలను క్రమపద్ధతిలో పాటించాలి. ఎవరిష్టంవచ్చినట్లు వారు ప్రవర్తించకూడదు. అట్టి క్రమపద్ధతినే 'క్రమశిక్షణ' అంటారు.

**పార్కు :**

మనం మన కర్తవ్యాన్ని నిర్వర్తించవచ్చును. కాని అందులో గనుక క్రమశిక్షణ లోపిస్తే అందం చెడిపోతుంది. ఉదాహరణకు తోట లేక పార్కు క్రమశిక్షణకు చిహ్నం. అడవి క్రమశిక్షణారాహిత్యానికి ప్రతీకం. తోటమాలి అడవిలో చిందర వందరగా పెరిగిన మొక్కలను తీసుకొనివచ్చి, వరుసలలో నాటి, నిత్యమూ నీరుపోసి, ఎరువు వేసి పెంచుతాడు. అందంగా కనవడటానికి అప్పుడప్పుడూ వాటిని సమానంగా కత్తిరిస్తుంటాడు. అప్పుడు ఆ పార్కు చూడటానికి అందంగా కనిపిస్తుంది. తోటమాలి అధ్యాపకుడు వంటివాడు. పిల్లలు అడవిలో చిందర వందరగా పెరిగే మొక్కల వంటివారు. అటువంటి పిల్లలను తీసుకొనివచ్చి, ప్రేమతో లాలించి, బుజ్జగించి, విద్యాబుద్ధులు నేర్పి, చక్కటి వినయవిధేయతలుగల సంస్కారవంతులుగా తీర్చిదిద్దుతాడు అధ్యాపకుడు. క్రమశిక్షణను నేర్పుతాడు. క్రమశిక్షణ లేని జీవితం అనాగరికం, అది

చిల్లికుండతో సమానం. ఎప్పుడు, ఏ పని, ఎంత అందంగా, పరిపూర్ణంగా, (Perfection) చేయాలో నేర్పుతుంది 'క్రమశిక్షణ'. ***కాబట్టి ప్రతి విద్యార్థి చదువుతో పాటు 'క్రమశిక్షణ' ను పెంపొందిం చుకోవాలి.***

క్రమశిక్షణ ప్రతి వ్యక్తిలో ఉండాలి, నాయకులలో ఉండాలి, పరిపాలకులలో ఉండాలి, సైన్యంలో ఉండాలి, సమాజంలో ఉండాలి. అప్పడే ఆ దేశం అభివృద్ధి గాంచుతుంది. అంతేకాదు ఆలోచనలను క్రమబద్ధీకరించుకోవాలి. మాట్లాడే మాటలను అదుపులో ఉంచుకోవాలి, చేసే చర్యలను కూడా నియంత్రణ చేయాలి. అప్పడే మన దైనందిన జీవనంలో 'క్రమశిక్షణ' పెంపొందుతుంది.

## WATCH :

ప్రతిఒక్కరూ 'Watch' ని ఆదర్శంగా తీసుకోవాలి. అది జడపదార్థమే అయినప్పటికీ అది నిత్యమూ, నిరంతరమూ, క్రమపద్ధతిలో తిరుగుతూ మానవునికి సమయాన్ని సూచిస్తుంటుంది. జడపదార్థమే ఆ విధంగా క్రమశిక్షణను పాటిస్తుంటే, మానవులు పాటించలేరా? అయితే 'శ్రద్ధ' ఉండాలి, 'సాధన' చేయాలి.

సాధారణంగా Watch అంటే అర్థం 'గడియారం' అంటారు. Watch అంటే మరో అర్థం కూడా ఉన్నది. జాగరూకత, కావలి, కాపు అని కూడా చెప్పకోవచ్చును. అందువలననే Watchman (కాపలా దారుడు ) Watch Dog (కావలి కుక్క) అని పేర్లు వచ్చాయి. మన యోగక్షేమాలను, సంపదను కాపాడేవాడు Watch man. మన శ్రేయస్సును మన సంపదను కాపాడేది Watch Dog.

ఒకసారి Watch కి చక్కటి ఆధ్యాత్మిక నిర్వచనం చెప్పారు శ్రీ సత్యసాయి బాబావారు. ***"ఇది కేవలం అలంకారం కోసం పెట్టుకునే వస్తువు కాదు, రెండు ముళ్ళు కలిగి సమయాన్ని చూపించేది మాత్రమే కాదు. ఇది ఒక ఆదర్శమైన జీవితాన్ని సూచిస్తున్నది. కాల స్వరూపం భగవంతుడు. కనుక మొట్టమొదట దీనిని పంచప్రాణములుగా భావించాలి. ఈ పదములో నున్న ఐదు అక్షరములను పంచాక్షరిగా భావించాలి. మననం చేయాలి. అంటే ప్రతి అక్షరముయొక్క భావమును అర్థం చేసుకొని, అవగాహన చేసుకొని, ఆచరణలో పెడితే, పవిత్రమైన పంచాక్షరి మంత్రమును జపం చేసినంత ఫలితాన్ని పొందగలుగుతాం"*** అని చెప్పారు శ్రీ సత్యసాయిబాబావారు.

'Watch' లో ఐదు అక్షరాలున్నాయి. అందులో మొదటి అక్షరం 'W' - Watch your words. కాలు జారితే తీసుకోవచ్చును గాని, నోరు జారితే తీసుకోలేం. కనుక

తొందరపడి ఇష్టం వచ్చినట్లుగా మాట్లాడరాదు. ప్రతి మాట ఆచి, తూచి మాట్లాడాలి. మాటకు ఖర్చు లేదు గాని, విలువ ఎక్కువ. మాటకు వుండే విలువ 'నోటు'కు కూడా ఉండదు. కనుక ప్రతి ఒక్కరూ మంచి మాటలు మాట్లాడాలి, క్రమశిక్షణతో మాట్లాడాలి.

రెండవ అక్షరం 'A' - Watch your Actions. చేతలు స్వార్థ రహితంగా ఉండాలి, సేవాభావంతో చేయాలి. మనం చేసే పనులు సర్వజన సమ్మతంగా ఉండాలి. అందరిచేత మెప్పును పొందేవిగా ఉండాలి. ఒక పథకం ప్రకారం ఒక పద్ధతి ప్రకారం పనిని చేయటం నేర్చుకోవాలి. ***ప్రతి పనిలో క్రమశిక్షణ కనిపించాలి.***

మూడవ అక్షరం 'T' - Watch your Thoughts మాటలకు, చేతలకు మూలం ఆలోచనలు, మన ఆలోచనలు పవిత్రంగా, స్వార్థరహితంగా, పదిమందికీ ప్రయోజనకరంగా ఉండాలి. కనుక మంచి ***ఆలోచనలు చేయాలి. చెడ్డ ఆలోచనలను దరికి చేరనీయరాదు.***

నాల్గవ అక్షరం 'C' - Watch your Character. త్రికరణ శుద్ధి మానవుని శీలానికి మూలం. శీలం జీవితపుష్పానికి సుగంధం. మానవ జీవితానికి విలువ తెచ్చి పెడుతుంది శీలం. ***కనుక ప్రతిఒక్కరూ*** Spotless character ***మచ్చలేని ప్రవర్తనను అభివృద్ధి పరచుకోవాలి.***

ఐదవ అక్షరం 'H' - Watch your Heart దయగల హృదయమేదైవమందిరం. హృదయము అంటే ఎడమ వైపున వుండే Physical heart కాదు. ఈ హృదయం కుడివైపున ఉంటుంది. అది ప్రేమకు స్థానం, అది విశాలం కావాలి. ప్రేమతో దానిని నింపాలి. ఆ ప్రేమను పదిమందికీ పంచాలి. హృదయం కరగకుండా ఎన్ని సాధనలు చేసినా, ఎన్ని పలుకులు పలికినా, ఎన్ని ఉపన్యాసాలిచ్చినా అవన్నీ అడవి గాచిన వెన్నెల వలె నిరుపయోగమైపోతాయి. సాధనతో హృదయం కరిగిపోవాలి. కరిగిన హృదయం కదిలిపోవాలి. హృదయ వేదనను పెంచాలి, పదిమందికీ పంచాలి. ***అప్పుడే ఆ జీవితం సార్థకతను పొందుతుంది.***

పంచప్రాణములైన ఈ పంచాక్షరముల అంతరార్థమును చక్కగా అర్థం చేసుకొని, అవగాహన చేసుకొని, క్రమశిక్షణతో ఆచరణలో పెట్టాలి. ఎవరికి వారు తన ప్రవర్తన Watch చేసుకుంటూ ముందుకుసాగాలి. ***క్రమశిక్షణ గలవారికి అసాధ్యమైనది ఏదీలేదు. దేనినైనా ఎంతటి అసాధ్యమైన దానినైనా సాధించగలుగుతారు. విస్మరించకండి!***

---

"ప్రజలకు స్వాతంత్ర్యం కావాలి. దేశానికి క్రమశిక్షణ కావాలి. క్రమశిక్షణలేని స్వాతంత్ర్యం వలన ప్రయోజనం లేదు".

- ఆచార్యకృపలాని

# భూతదయ

**"సర్వభూత హితే రతాః"** సమస్త ప్రాణులకు హిత మొనర్చుటయందు ఆసక్తి గలవారై ఉండాలి అని భగవద్గీత బోధిస్తున్నది. అనగా సమస్త జీవరాసుల శ్రేయస్సునుకోరటం మన ధర్మం. ఏదో ఒక ప్రాణియెడల దయ కలిగివుంటే చాలదు. సమస్త ప్రాణికోటి యెడల దయ, ప్రేమ కలిగివుండాలి.

**"నిర్వైర స్సర్వభూతేషు"** సమస్త ప్రాణులయందు ద్వేషముండరాదు అనగా ఏ ప్రాణిని ద్వేషించరాదు. సమస్త ప్రాణులను ప్రేమించాలి. **"అద్వేష్టా సర్వభూతానాం"** సమస్త ప్రాణుల యెడల ద్వేషము లేనివాడై ఉండాలి. ఈ విధంగా 'గీత' యందు ఎన్నో హితోక్తులున్నాయి. ప్రతి వాక్యంలో 'సర్వభూత' అనే పదము ప్రస్తావించబడింది. దయ ప్రేమలు ఒక్క మానవుల మీదనేగాక, సమస్త ప్రాణికోటి మీద కూడా ఉండాలని భగవద్గీత మనకు బోధిస్తున్నది. సర్వమానవ సౌభ్రాతృత్వం (Faternity) తోనే సంతృప్తి చెందక 'సర్వాత్మదృష్టి'ని కూడా అలవరచుకోవాలి. ఇదే మన భారతీయ సంస్కృతి గొప్పతనం. సమస్త ప్రాణులూ భగవత్స్వరూపులే గదా! కనుక మనం ఏ ప్రాణినీ హింసించరాదు, బాధించరాదు. సర్వభూతముల యెడల దయ కలిగివుండాలి. సర్వభూతదయ పరమోత్కృష్టమైన ధర్మం.

**ఏకనాథ్ :**

మహారాష్ట్రలో ఒక భక్తుడుండేవాడు. అతని పేరు 'ఏకనాథ్'. ఒకసారి కాశీ వెళ్ళాడు. గంగలో స్నానం చేశాడు. విశ్వేశ్వరుని దర్శించాడు. కాశీని దర్శించి, గంగను తీసుకొని రామేశ్వరం వెళ్ళి, అక్కడి సముద్రంలో కలపటం మన ప్రాచీన సంప్రదాయం. అందుకని రెండు బిందెలు గంగతో నింపి కావడిలో పెట్టుకొని, తన శిష్యులతో రామేశ్వరం బయలు దేరాడు. ఆ రోజులలో ప్రయాణ సాధనాలు లేకపోవటంవలన నడిచి వెళ్ళేవారు. మార్గమధ్యలో ఒక గాడిద క్రిందపడి గిలగిలా కొట్టుకోవటం చూస్తాడు. అది ఎండాకాలం. ప్రాణం విడిచే స్థితిలో ఉన్నది గాడిద. దానికి దాహం వేసి వుంటుందని భావించాడు ఏకనాథ్. జాలివేసింది. వెంటనే కావడిలో వున్న బిందెడు నీరు దానినోటిలో పోసి, దానిమీద చల్లాడు. కొంచెం సేపటికి ఆ గాడిద కళ్ళు తెరచి, లేచి, తోక ఆడించుకుంటూ వెళ్ళిపోయింది. అదంతా

చూస్తున్న అతని శిష్యులు ***"స్వామీ! రామేశ్వరం తీసుకొని వెళ్ళుతున్న పవిత్ర గంగా జలమును, గాడిద నోటిలో పోసి వృథా చేసారేం?"*** అని అడుగుతారు. అప్పుడు ఏకనాథుడు ***"నాయనలారా! భగవంతుడు అన్ని జీవులలో ఉన్నాడు. సర్వజీవ తిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి ఏ జీవిని తిరస్కరించినను, బాధించినను భగవంతుని బాధించినట్లే. కనుక మనం ఏ జీవి బాధపడుతున్నా చూస్తూ పోరాదు. ఆ బాధను నివారణ చేయటం మన ధర్మం. గంగా జలంతో ఒక జీవిని రక్షించగలిగాను. నాకు రామేశ్వరం వెళ్ళినంత ఆనందంగా ఉన్నది'*** అని చెబుతాడు.

ఇక్కడ మనం ఒక నీతిని నేర్చుకోవాలి. ***సర్వభూత దయకు మించిన ధర్మం వేరొకటి లేదు.***

**శంకరదేవుడు :**

ఒక సన్యాసి తన శిష్యులతో తీర్థయాత్రలకు బయలుదేరాడు. ఒక అడవి వచ్చింది. ఒకచోట, ఒక లేడి పిల్ల వేటగాడి వలలో చిక్కుకొని కొట్టుకుంటున్నది. ఆ దృశ్యం చూచి చాలా బాధపడుతాడు. వెంటనే వెళ్ళి ఆ వల నుండి లేడిపిల్లను విడిపించుతాడు. ఆ లేడిపిల్ల పరుగెత్తుకొని పోతుంది. ప్రక్కనున్న శిష్యులు ***"స్వామీ! లేడిపిల్లనైతే రక్షించారుగాని, వేటగాడి నోటి దగ్గరి ఆహారం పోగొట్టారు గదా!"*** అని ప్రశ్నిస్తారు. మారు మాట్లాడక, వెంటనే కొంత డబ్బు వేటగానికి యిస్తానంటాడు. చెట్టు ప్రక్కనే దాగి వున్న వేటగాడు ఆ మాటలు విని బయటకు వస్తాడు. ఆ డబ్బు తీసుకొని సంతోషంగా వెళ్ళిపోతాడు. ఆ సన్యాసియే ***'శంకరదేవుడు'*** అస్సాములో వైష్ణవ మతాన్ని వ్యాపింపజేసిన మహనీయుడు ఆయన.

బాధలలో నున్న జీవాలను రక్షించడమే మహనీయుల లక్ష్యం. ***సర్వజీవ సేవయే సర్వేశ్వరునిసేవ. కనుక మనం అందరినీ ప్రేమించాలి, సేవించాలి. అందరికీ సహాయం చేయాలి, ఎవరినీ బాధించరాదు.*** Love all, Serve all, Help ever, Hurt never దీనిని మరచిపోకండి.

---

"సర్వభూతములయందు దయగలవాడు మాత్రమే దేవుని కృపకు పాత్రుడవుతాడు. దయలేని హృదయం పాషాణంతో సమానం. దయగలహృదయమే దైవమందిరం".

- ఏసుక్రీస్తు

# ఏకాగ్రత

'ఏకాగ్రత' ప్రతివ్యక్తిలో ఉండాలి. ముఖ్యంగా ప్రతి విద్యార్థిలో వుండవలసిన ఉత్తమ సద్గుణం 'ఏకాగ్రత'. ఏకాగ్రత లేకుండా ఏ పనీ సాధించబడదు. మనం చేసే పనిమీద, చదివే పుస్తకం మీద దృష్టిని కేంద్రీకరించటమే 'ఏకాగ్రత' అంటారు. చేసే పనిమీద దృష్టిని కేంద్రీకరించకపోతే, ఆ పని విజయవంతం కాదు. చదివే చదువుల మీద 'ఏకాగ్రత' లేకపోతే ఉత్తీర్ణతను సాధించలేరు. **చలించని మనసు, భ్రమించని దృష్టినే** 'ఏకాగ్రత' అంటారు.

**అర్జునుని ఏకాగ్రత :**

కౌరవులు, పాండవులు ద్రోణాచార్యుని వద్ద ధనుర్విద్య నేర్చుకునేవారు. ఒకనాడు వారందరినీ పిలిచి విలువిద్యలో పరీక్షపెట్టాడు ద్రోణుడు. ఒక చెట్టుమీద నున్న పావురాన్ని చూపించి దానిని బాణంతో కొట్టాలని చెప్పాడు. దుర్యోధనుడు ముందు వచ్చాడు.

***"దుర్యోధనా! బాగా చూడు! ఆ చెట్టుమీద పావురాన్ని చుస్తున్నావా? దానిని కొట్టాలి'*** అన్నాడు ద్రోణుడు.

***"గురువర్యా! చూస్తున్నాను, అలాగే కొడ్తాను"*** అన్నాడు దుర్యోధనుడు. అయితే పావురంగాక మరేమి చూస్తున్నావు అడిగాడు ద్రోణుడు. ***"స్వామి! ఆకాశం, గుబురుగా వున్న చెట్లు అన్నిటినీ చూస్తున్నాను"*** అని సమాధానం చెప్పాడు దుర్యోధనుడు.

మిగతా వారందరూ అదేవిధంగా చెప్పారు. ఆఖరికి అర్జునుడు వచ్చాడు. గురువుగారు అవే ప్రశ్నలు వేశారు.

***"అర్జునా! ఆ చెట్టు కొమ్మమీద పావురం కనిపిస్తున్నదా?"***

***"కనిపిస్తున్నది స్వామీ!"***

***"ఇంకా ఏమి కనపడుతున్నాయి?"***

***"ఏమీ కనపడటం లేదు. పావురం మాత్రమే కనిపిస్తున్నది"***

అని అర్జునుడు సమాధానం చెబుతాడు.

ద్రోణుడు సంతోషించి, పోటీలో అర్జునుడు మాత్రమే నెగ్గాడని ప్రకటించుతాడు.

ఏకాగ్రత ముఖ్యం. తాను చేయదలచిన పనిమీద 'ఏకాగ్రత' లేకపోతే ఆ పని విజయవంతం కాదు. విద్యార్థి లక్ష్యము విద్యార్జన. మరే ఇతర విషయాల మీద దృష్టిని పోనివ్వకూడదు.

**బెస్తవాని ఏకాగ్రత :**

ఒకసారి ఒక బాటసారి ఒక గ్రామానికి వెళ్లదలచి, బయలు దేరి వెళ్ళుతున్నాడు. రెండు మార్గముల కూడలి వచ్చింది. ఎటు పోవాలో అర్థంకాలేదు. అడగడానికి ఎవరూ మనుషులు కనిపించలేదు ప్రక్కన నున్న కాలువలో ఒక బెస్తవాడు చేపలు పడుతున్నాడు. అతనిని పిలిచాడు. పలుకలేదు. పెద్దగా పిలిచాడు. ప్రయోజనం లేకపోయింది. అతని దగ్గరకు వెళ్ళి వీపు తట్టాడు. అప్పుడు వెనక్కి తిరిగాడు 'నీకేమైనా చెవుడా!' అని అడిగాడు. *'నాకు ఏమీ చెవుడు లేదు'* అన్నాడు బెస్తవాడు. *"అయితే ఎంత పెద్దగా పిలిచినా పలుకవేం?"* అని అడిగాడు బాటసారి. అప్పుడు బెస్తవాడు *"బాబూ! నాకు చెవుడు లేదు కాని, నా దృష్టి అంతా గాలంమీదనే ఉన్నది. బెండు ఎప్పుడు మునుగుతుందా! చేప వలలో ఎప్పుడు పడుతుందా! అనే ఆలోచన తప్ప, మరే ఏ ఆలోచనా నాకుండదు"* అని సమాధానం చెబుతాడు.

ఈ కథ మనకు ఒక నీతిని బోధిస్తున్నది. *ఏ పని చేస్తున్నా ఆ పని మీద 'ఏకాగ్రత' ఉండాలి. అప్పుడే ఆ పనిని సాధించగలుగుతారు. చేసే పని ఒకటి, దృష్టిమాత్రం ఇతరత్రా వుంటే ప్రయోజనం ఉండదు. ముఖ్యంగా విద్యార్థులకు ఇట్టి 'ఏకాగ్రత' ఉండాలి.*

---

"ఏవిషయమైై నీకు జ్ఞానం కావాలో దానిమీద నీ బుద్ధిని నిలపాలి. ఇటు, అటూ, కదలనియ్యకూడదు. దీనినే 'ఏకాగ్రత' అంటారు. ఏకాగ్రత అనేది నీకు అలవడకపోతే, నీకు ఎట్టి జ్ఞానమూ కలగదు, ఏ విద్యా అబ్బదు. నీవు ఏ పనీ చేయలేవు. కాబట్టి ప్రతివారూ ముందు ఏకాగ్రతను కుదర్చుకోవాలి. లేకపోతే జీవితం నిరర్థకమవుతుంది".

- ముట్నూరి కృష్ణారావు

# నీతి నిజాయితీలు

***నీతిగలవాడే నిజమైన మనిషి, నీతిలేనివాడు కోతి కంటే హీనం.*** నీతి మానవుణ్ణి ఉన్నస్థాయి నుండి ఉన్నతస్థాయికి గొనిపోయే రాజమార్గం. నీతిగల మానవుని యందే వ్యక్తిత్వం వికసిస్తుంది. మానవునికి ఎన్నిరకములైన భౌతిక సంపదలు ఉండినప్పటికీ, నైతికబలం లేకపోతే, అతను ఏ మాత్రం రాణించడు, శోభించడు. ఈనాడు మానవుడు నీతి లోపించటం వలననే పతనమైపోతున్నాడు. నీతినిజాయితీలు రెండూ, రెండు నేత్రముల వంటివి. కనుక ప్రతివ్యక్తి నీతినిజాయితీలను పెంపొందించుకోవాలి.

'Money comes and goes, but morality comes and grows' (డబ్బు వస్తుంది, పోతుంది. కాని నీతి వస్తుంది, పెరుగుతుంది) ధనం శాశ్వతంకాదు, నీతి శాశ్వతమైనది. ప్రాణమునకు నీతి సారము. జీవితమునకు ఆదర్శము 'నీతి'. నీతి లేనివాడు ఎంత గొప్పమేధావి అయినా, ఎంత గొప్ప శాస్త్రజ్ఞుడు అయినా, ఎంత గొప్పరాజకీయ నాయకుడైనా ప్రయోజనం లేదు. అవినీతి పరులవలన దేశానికి అప్రదిష్ట వచ్చితీరుతుంది. కనుక ***ప్రతి ఒక్కరూ నీతి, నిజాయితీలను అభివృద్ధి పరచుకోవాలి.***

**డా॥ సి.వి. రామన్ :**

ఒకసారి డా॥ సి.వి. రామన్, బెంగుళూరులోని, తన వైజ్ఞానిక పరిశోధనా కేంద్రంలో పనిచేయడానికి, ఉన్నత విద్యార్హతలుగల విద్యార్థులు కావాలని పత్రికలలో ఒకప్రకటన చేశాడు. అనేకమంది అభ్యర్థులు వచ్చారు. వీరందరినీ ఇంటర్వ్యూ చేసి తెలివిగలవారిని ఎంపిక చేసుకొని, మిగతావారిని పంపించి వేశాడు. ఒక గంట తరువాత ఎంపికకాని ఒక విద్యార్థి వరండాలో కనిపిస్తాడు. అతనిని చూచి డా॥ రామన్ ***"నీవు వెళ్ళవచ్చునని ఇందాకే చెప్పాను గదా! ఇంకా ఇక్కడే తిరుగుతున్నావేం?"*** అని అడుగుతాడు. అప్పుడు ఆ విద్యార్థి ***" మీ ఆఫీసువారు రాకపోకల చార్జీలు నాకు ఎక్కువగా చెల్లించారు. ఆ ఎక్కువ మొత్తాన్ని తిరిగి వాపస్ చేసి వెళ్ళుతున్నాను"*** అని బదులు చెబుతాడు. అప్పుడు డా॥రామన్ సంతోషంతో ***"బాబూ! నాకు కావల్సింది నీలాంటి నిజాయితీ పరులే. నీవు తిరిగి వెళ్ళవద్దు. యిక్కడనే వుండిపో! నిన్ను అదనంగా నియమించుకుంటాను"*** అని చెప్పి ఆ విద్యార్థికి ప్రత్యేకంగా ఉద్యోగమును యిస్తాడు.

ఈ సంఘటన మనకు ఒక సందేశమును బోధిస్తుంది. విద్యార్హతల కంటే నీతినిజాయితీలు ఎక్కువ. నీతినిజాయితీలను ప్రదర్శించిన ఆ విద్యార్థి ఎంత

ఉత్తముడో, అతని నీతి, నిజాయితీలను గుర్తించి ఉద్యోగం యిచ్చిన ఆ యజమాని (డా॥రామన్) అంతకన్నా ఉత్తముడు. అయితే ఈనాడు ఇటువంటి ఉత్తములు అరుదుగా కనిపిస్తుంటారు.

**చిత్తరంజన్ దాస్ :**

చిత్తరంజన్ దాస్ కలకత్తాలో ఒక ప్రముఖ న్యాయవాది. ఆ రోజులలోనే లక్షలు ఆర్జించేవాడు. ఆయన తండ్రి అప్పులు చేసి మరణించాడు. అది ఏనాడో జరిగిపోయిన సంగతి. అప్ప యిచ్చినవారు గతించారు. అప్పతీసుకున్న వారుగాని వారి కొడుకులుగాని లేరు. తండ్రి చేసిన అప్పను అడిగే వారూ కనిపించటం లేదు. కాని చిత్తరంజన్‌దాస్ మాత్రం బాధపడుతుండేవాడు. తన తండ్రి అప్పలు చేసి దివాలా తీసాడని, ఆ దివాలాకోరు తనయుడే చిత్తరంజన్‌దాస్ అని ఎప్పడైనా, ఎవరైనా అంటారేమోనని విచారిస్తుండేవాడు. ఒకసారి కోర్టుకువెళ్ళుతాడు. తన తండ్రి చేసిన అప్పకు వడ్డీని కూడా లెక్కించి 50వేల రూపాయిలు కోర్టులో కట్టి, ఆ అప్పదారుల మనమళ్ళకైనా చెల్లించమని కోరుతాడు. న్యాయమూర్తులు ఆశ్చర్య పోతారు. అసలు ఆ అప్పలను గురించి అడిగేవారే లేనప్పడు, తమరు ఎందుకు చెల్లించాలని అడుగుతారు న్యాయమూర్తులు. అప్పడు దాస్ ***"పితృ ఋణం తీర్చుకుంటున్నాను"*** అని ముక్త సరిగా సమాధానం చెప్పి బయటకు వస్తాడు.

ఈ సంఘటన మనకు ఒక మంచి సంప్రదాయమును బోధిస్తున్నది. వ్యక్తులు తాము చేసిన అప్పలను చెల్లించకుండా, తప్పించుకోవాలని చూస్తున్న ఈ రోజులలో, తను అప్పచేయకపోయినా, తండ్రి చేసిన అప్పలను గురించి ఎవరూ అడుగపోయినా, తనంతటతానే కోర్టుకు వెళ్ళి వడ్డీతో సహా తండ్రి చేసిన అప్పను తీర్చిన తనయుడు చిత్తరంజన్‌దాస్. నీతి, నిజాయితీలను ప్రదర్శించిన మహోత్యాగి చిత్తరంజన్‌దాస్. కనుక ప్రతి ఒక్కరూ 'పితృఋణం' తీర్చుకోవాలి. అటువంటివారే సత్కీర్తిని పొందుతారు.

లౌకిక విద్యలతో పాటు ప్రతి విద్యార్థి నీతి, నిజాయితీలను అలవరచుకోవాలి, అభివృద్ధి పరుచుకోవాలి. ఇవి ఎప్పడు పడితే అప్పడు అబ్బేవి కావు. వెలయిస్తే బజారులో దొరికేవి కావు. బాల్య దశయందే ఇవి పట్టుబడుతాయి. కనుక ప్రతి ఒక్కరూ ***బాల్యదశను సద్వినియోగ పరుచుకోవాలి. వృథా చేయకండి! నీతి నిజాయితీలను పెంపొందించుకోండి!.***

# సేవ

**సంఘసేవే సర్వేశ్వరుని సేవ.** ప్రేమ యొక్క పరాకాష్ట సేవ. సేవ యొక్క స్ఫటికరూపం త్యాగం. సేవచేయటంలో కార్యదీక్ష నిరాడంబరత్వం, అహంకార రాహిత్యం ఉండాలి. మనం చేసే పని యందు 'శ్రద్ధ' ఉండాలి. హృదయం నిర్మలంగా ఉండాలి. **నిర్మలహృదయమే ప్రేమకు నిలయం.** ప్రేమ ఉన్నచోట స్వార్థం వుండదు. అహంకారానికి అవకాశము ఉండదు. స్వార్థ రహితమైన సేవలు పదిమంది మెప్పను పొందుతాయి. భగవంతుని అనుగ్రహం కూడా లభిస్తుంది.

'Service to Humanity is service to God' **మానవసేవే మాధవ సేవ అన్నారుగదా!** అప్పుడు సేవ యోగంగా మారుతుంది. ఈనాడు చాలా మంది సేవను ఒక సత్కర్మ (Good work) అని భావించి చేస్తున్నారు. ఇది మంచిదేకాని **'దైవంపని'** (God's work) అని భావించితే ఇంకా మంచిది. ఎందువలనంటే, **'దైవంపని'** చేస్తున్నామనే భావన వుంటే, వళ్ళుదగ్గర పెట్టుకొని శ్రద్ధగా, భక్తితో సేవలు చేస్తారు. ఈనాడు చాలా మంది పర్వదినాలలో 'అన్నదానం' చేస్తుంటారు. దానిని 'Poor Feeding' అంటున్నారు. బీదలకు, పేదలకు సాంబారు అన్నం. నీళ్ళమజ్జిగ పోస్తారు. ఇది మంచిది కాదు. ముఖ్యంగా పర్వదినాలలో, ప్రతిఇంట్లో, మనం వండుకొనిన ఆహారపదార్థములు, పిండి వంటలు అన్నీ ఒక ప్లేటులో పెట్టి ముందుగా దేవునికి 'నైవేద్యం' పెట్టటం మన సంప్రదాయం. తినని దేవునికే అంత శ్రద్ధగా, భక్తితో పెడుతునప్పుడు; తినే మనుషులకు సాంబారు కూడు, నీళ్ళ మజ్జిగేనా? ఈ విషయమును గురించి ప్రతి ఒక్కరూ ఆలోచించాలి.

***"సర్వజీవ నమస్కారః! కేశవం ప్రతిగచ్ఛతి, సర్వజీవ తిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"*** ఏ జీవిని నమస్కరించినా, తిరస్కరించినా అది భగవంతునికే వర్తిస్తుందని మన శాస్త్రాలు చెబుతున్నాయి. సర్వజీవులలో భగవంతుడున్నాడని మన విశ్వాసం. కనుక దేవతా విగ్రహాలకు 'నైవేద్యం' పెట్టినట్లుగా బీదలకు, పేదలకు, కుంటివారికి, గ్రుడ్డివారికి కూడా మనం అన్నం పెట్టాలి. అప్పడే మనకు మంచి చేకూరుతుంది.

## మానవ సేవ

పూర్వకాలంలో 'అబూబెన్ ఆడమ్' అనే అతను ఉండేవాడు. కష్టాలలో వున్నవారికి ప్రేమతో సేవలు చేస్తుండేవాడు. కుంటివారిలో, గ్రుడ్డివారిలో కూడా దైవం వున్నాడనే భావించి, వారిని సేవిస్తుండేవాడు. మానవ సేవ చేస్తే, దైవాన్ని సేవించినట్లేనని భావించి బీదలకు, పేదలకు సహకారం అందిస్తుండేవాడు. అతనిది స్వార్థమెరుగని సేవ.

ఒకనాటి రాత్రి నిద్రలో అతనికి ఒక చిత్రమైన దృశ్యం కనిపిస్తుంది. ఒక కాంతిపుజం తన గదిలోనికి ప్రవేశిస్తుంది. ఆ వెలుగులో ఒక 'దేవదూత' ఒక బంగారు పుస్తకంలో ఏదో వ్రాస్తూ ఉన్న దృశ్యం కనిపిస్తుంది. అప్పుడు ***'ఆ వ్రాసేది ఏమిటి?'*** అని ఆ దేవదూతను ప్రశ్నించాడు. దేవ దూత ***"దేవుని ప్రేమించేవారి పేర్లను వ్రాస్తున్నాను"*** అని బదులు చెబుతుంది. ***"ఆ జాబితాలో నా పేరు ఉన్నదా?"*** అని అడుగుతాడు 'అబూబెన్'. ***"నీ పేరు ఈ జాబితాలో లేదు"*** అని చెబుతుంది దేవదూత. అబూబెన్ కొంచెం విచారించి ***"నా పేరు దీనిలో లేకపోయినా బాధపడను. కాని నా పేరును సాటి వారిని ప్రేమించే వారి జాబితాలోనయినా చేర్చు!'*** అని అడిగాడు. ఆ దేవదూత బదులు చెప్పకుండా అదృశ్యమై పోతుంది.

మరుసటిరోజు రాత్రి కూడా ఒక స్వప్నం వస్తుంది. ఆ స్వప్నంలో, అంతకు పూర్వం స్వప్నంలో కనిపించిన దేవదూతే కనిపిస్తుంది. అదే బంగారు పుస్తకంలో ఏదో వ్రాస్తూ కూర్చుంటుంది. ***'మరల ఏమి వ్రాస్తున్నావు?'*** అని అతడడుగుతాడు. ***"దేవుడు ఎవరిని ప్రేమిస్తున్నాడో, వారి పేర్లను వ్రాస్తున్నాను"*** అని సమాధానం చెబుతుంది ఆ దేవదూత. ***"నా పేరు ఈ జాబితాలోనయినా ఉన్నదా?"*** అని అడుగుతాడు 'అబూబెన్'. అప్పుడు దేవదూత ఆ జాబితాను చూపించింది. అతను ఆశ్చర్యపోతాడు. ఆ జాబితాలో అతని పేరే మొదటి పేరు.

***'మానవ సేవ ద్వారా భగవదానుగ్రహమును పొందవచ్చును'.*** అనే నీతిని ఈ కథ మనకు బోధిస్తున్నది. ఇందులో మరొక సందేశం కూడా ఉన్నది. ***దేవుణ్ణి మనం***

*ప్రేమించటం కాదు, మనల్ని దేవుడు ప్రేమించాలి. సహజంగా ప్రతి భక్తుడూ దేవుణ్ణి ప్రేమిస్తుంటాడు. కాని ప్రతి భక్తుడ్ని దేవుడు అనుగ్రహించడు. కారణం? మన భక్తి 'అనన్యభక్తి' అయినప్పడే మనల్ని దేవుడు అనుగ్రహిస్తాడు.* అనగా మనం ఇతరులకు చేసే సేవలు నిస్వార్థమైనవి అయినప్పడే, దైవానుగ్రహం మనకు లభిస్తుంది **'మానవ సేవే మాధవ సేవ'.**

## సర్వజీవ సేవ

ఒక పట్టణంలో 'మార్టిన్' అనే చెప్పలు కుట్టేవాడుండేవాడు. అతను 'జీసస్' భక్తుడు. నిత్యమూ బైబిల్ చదివేవాడు. చదవటమేకాదు. జీసస్ చెప్పిన మాటలను స్మరించుకుంటూ, బైబిల్‌ను తన గుండె మీద పెట్టుకొని నిద్రించేవాడు. అది అతని నిత్యకృత్యం.

ఒకనాడు 'జీసస్' మాటలను స్మరించుకుంటూ నిద్ర పోతాడు. 'మార్టిన్' కలలో *"నేను రేపు మీ ఇంటికి వస్తాను"* అని చెబుతాడు జీసస్. మార్టిన్ తెల్లవారు జామునే లేచి కాలకృత్యాలు తీర్చుకొని, రొట్టెలు, తేనీరు తయారుచేసి జీసస్ రాకకోసం ఎదురు చూస్తుంటాడు. ఇంకా మంచు కురుస్తునే ఉంటుంది. ఇంకా తెల్లవారలేదు. వీధులు ఊడ్చే ఒక ముసలివాడు వచ్చి ప్రతిఇంటి ముందున్న మంచుగడ్డలను తీసివేస్తుంటాడు, పాపం! చలితో ఆ ముసలివాడు వణుకుతుంటాడు. అయినప్పటికీ మంచుగడ్డలను తీసివేస్తూనే ఉంటాడు. ఇంటివారు మాత్రం తలుపులు తీయరు, బయటకు ఎవరూ రారు. తలుపులు వేసుకొని ఇళ్లలోనే వుండి, నిప్పసెగ ప్రక్కన కూర్చుంటారు. ఆ ముసలివాడ్ని చూచి మార్టిన్ హృదయం పరితపిస్తుంది ఆ ముసలివాడ్ని లోపలికి పిలుస్తాడు. వేడి తేనేరు యిస్తాడు. దానిని త్రాగి కృతజ్ఞతలు చెప్పకొని వెళ్లిపోతాడు ఆ ముసలివాడు.

కొంతసేపటికి ఒక వృద్ధురాలు నడవలేక నడవలేక వణుకుతూ తన ఇంటిముందుగా నడచి వెళ్ళుతుంటుంది. మార్టిన్ జాలిపడి ఆ అవ్వను లోపలికి పిలిచి రొట్టి, తేనీరు యిచ్చి, కప్పకోవడానికి ఒక ఉన్ని దుప్పటిని కూడా యిచ్చి పంపుతాడు.

ఇంక మరికొంతసేపటికి ఒక తల్లి పసిపాపతో వస్తుంది. బిడ్డ ఏడుస్తుంటుంది.

వారిని కూడా లోపలికి పిలిచి బిడ్డకు పాలు, తల్లికి రొట్టె యిస్తాడు. ఆ తల్లికి, చనిపోయిన తన భార్య దుస్తులను కూడా యిస్తాడు. ఆమె కృతజ్ఞతలు చెప్పకొని వెళ్ళిపోతుంది.

సూర్యాస్తమయమవుతుంది. జీసస్ ప్రభువు మాత్రం రాడు. నిరాశపడుతాడు. ఒకవేళ వచ్చినా ఆయనకు పెట్టేందుకు ఏమీ మిగలదు. రాత్రి అయింది. తలుపులు వేసుకొని దిగులుగా ఆలోచిస్తూ కూర్చున్నాడు 'మార్టిన్'. ఇంతలో వీధిలో అలికిడి అయింది. ద్వారం వద్ద ఒక తేజస్సు కనిపించింది. ఆ కాంతిలో మొదట వీధులు ఊడ్చే ముసలివాడు, తరువాత వృద్ధురాలు, ఆ తరువాత పసిబిడ్డ, తల్లి వరుసగా కనిపించి, అతనిని ఆశీర్వదించి వెళ్ళుతున్న దృశ్యం కనిపిస్తుంది . దాని అంతరార్థమును 'మార్టిన్' అర్థంచేసుకొని ఆనందిస్తాడు.

ఈ కథ మనకు ఒక 'నీతి'ని బోధిస్తున్నది. దేవుడనేవాడు ప్రత్యేకంగా లేడు. ఎక్కడ పడితే అక్కడ వున్నాడు. దేవుడు లేని ప్రదేశమంటూ లేదు. సర్వజీవులలో ఉన్నాడు, సర్వత్రా ఉన్నాడు. 'ప్రతి వ్యక్తీ దైవస్వరూపుడే, ప్రతిజీవి దైవస్వరూపమే' అనే భావన ప్రతి ఒక్కరిలో ఉండాలి. 'సర్వజీవ సేవే సర్వేశ్వరుని సేవ', అనే విషయాన్ని మరచిపోకండి.



---

"దేశ సేవకుండు దేశనాయకుడైన స్వార్థరహిత సేవచేయగలడు, గ్రామ సేవే రామసేవ. 'సేవ' అనేది ఎవరినీ ఆకర్షించుటకు చేసే Art కాదు. మన సేవ Heart నుండి రావాలి. Art is External, Heart is Internal. అప్పుడే మనకు Self Satisfaction (ఆత్మసంతృప్తి). సేవకుడు కానివాడు నాయకుడు కాలేడు. కింకరుడు కానివాడు శంకరుడు కాలేడు".

- శ్రీ సత్యసాయిబాబా

# సమయపాలన

"Time is one, Time is every thing. Don't waste time. Time waste is life waste" అన్నారు శ్రీ సత్యసాయిబాబావారు. సమస్తమునకూ కాలమే ప్రమాణం, కాలమే ప్రధానం. అన్నింటి కంటే విలువైనటువంటిది కాలము. గతించిన కాలం, మరల కావాలన్నా తిరిగిరాదు. అట్టి అమూల్యమైన కాలమును వృథా చేయరాదు, సద్వినియోగ పరచుకోవాలి.

కాలం వృథాచేయకుండా వుండాలంటే, సద్వినియోగపరచాలంటే దైనందిన జీవితంలో సమయపాలనను పాటించాలి. సమయపాలనను పాటించని వ్యక్తి పట్ల గౌరవం ఉండదు. అయితే ఈనాడు చాలా సభలు సకాలంలో ప్రారంభించబడటం లేదు. కారణం? సభికులు సమయానికి రావటంలేదు. ఉపన్యాసకులు సకాలమునకు రారు. నిర్వాహకుల ఏర్పాట్లు కూడా అంతంత మాత్రమే. పొరపాటున ఎవరైనా సహృదయులు, సభకు సకాలంలో వస్తే అది ఒక Punishment (శిక్ష) అవుతున్నది. కనీసం ఒక గంటసేపు ఖాళీగా కూర్చోవాలి. ***"ఏమండీ! సభ ప్రారంభించలేదేం?"*** అని ఎవరైనా అడిగితే, నిర్వాహకులు ***"మనది Indian Punctuality కదండీ!"*** అని నవ్వుతారు. ఈ విధంగా అమూల్యమైన కాలం ఎంతో వృథా అయిపోతున్నది.

**గాంధీజీ ఆదర్శం :**

***"జీవితంలో రాణించడానికి ఏం చేయాలి?"*** అని ఒకసారి పత్రికా విలేఖరులు గాంధీజీని ప్రశ్నిస్తారు. ***"విజయాన్ని సాధించేందుకు ప్రధానంగా సమయపాలన పాటించాలి. కాలం విలువ తెలుసుకున్న వ్యక్తి తప్పక పురోగమిస్తాడు"*** అని సమాధానం చెబుతారు గాంధీజీ. ఒకసారి గాంధీజీ ఒక బహిరంగ సభలో ఉపన్యసించడానికి అంగీకరిస్తారు. నిర్వాహకులు సమయానికి ముందే కారును తీసుకొని వస్తామని చెప్పివెళ్ళుతారు. గాంధీజీ సిద్ధమై కూర్చుంటారు, కారు రాదు. సమయం దగ్గరపడుతున్నది. గాంధీజీ ఒక సైకిలు తీసుకొని సకాలంలో సభాస్థలికి చేరుతారు. నిర్వాహకులు ***"తమరు కొంతసేపు ఆశ్రమంలో వుండి వుంటే మేమే కారును తీసుకొని వచ్చేవాళ్ళం గదా! ఆలస్యానికి క్షమించండి!"*** అంటారు. అప్పుడు గాంధీజీ నిర్మొగమాటంగా ***"కాలనియమం పాటించకున్న, మనలను మనమే కించపరచుకోవడం కాకుండా, ఇతరుల నియమములకు కూడా భంగం కలిగించిన***

***వారమవుతాం"*** అని అంటారు. నిర్వాహకులు చిన్నబుచ్చుకుంటారు. సమయపాలన పాటించటంలో గాంధీజీ పరమ కఠోరుడు.

**కళాతపస్వి వెంకటప్ప :**

*శ్రీ* కె.సి. రెడ్డి కర్ణాటక ముఖ్యమంత్రిగా వున్న సమయంలో ఒకసారి ప్రధాని పండిత నెహ్రూ బెంగుళూరు వెళ్ళుతారు. అనేక కార్యక్రమాలలో పాల్గొంటారు. కళాతపస్వి వెంకటప్ప ప్రముఖ చిత్రకారుడు. ఆయన కళను గురించి తెలుసుకొనిన పండిత నెహ్రూ ఆయన ఆర్ట్ గ్యాలరీని చూడాలనే కోరికను వెలిబుచ్చుతారు. ఈ విషయం అధికారులు వెంకటప్పగారికి తెలియబరచి, ప్రధాని వచ్చే సమయాన్ని కూడా నిర్ణయించుతారు. సమయానికి ప్రధానికి స్వాగతం చెప్పడానికి సిద్ధమై వెంకటప్పగారు ముఖద్వారం వద్ద వేచివుంటారు. నిర్ణయించిన సమయం దాటి 15 నిముషాలు గడచింది. వెంకటప్పయ్యగారు గ్యాలరీ తలుపులు మూయించి తమ నివాసానికి వెళ్ళిపోయారు. అరగంట తరువాత ఆర్ట్ గ్యాలరీని చూడటానికి ప్రధాని పండిత నెహ్రూ వెళ్లుతారు. తలుపులు మూసి ఉంటాయి. నిరాశతో వెనుదిరుగుతారు. ***సమయపాలన పాటించనివారు ఎంత వారైనా నిరాశకు గురికాక తప్పదు'*** అని ఈ సంఘటన తేటతెల్లం చేస్తుంది.

**లక్ష్మణయతీంద్రులు :**

ఒకసారి లక్ష్మణ యతీంద్రుల వారు ఏలూరులో ఒక పెద్ద సభకు 'ముఖ్యఅతిథి' గా పాల్గొనడానికి నిర్దేశించబడిన సమయానికి కొంచం ముందుగానే వెళ్ళుతారు. ఆ సభకు అధ్యక్షత వహించవలసిన జిల్లా కలక్టరుగారు మాత్రం 15 నిముషములు ఆలస్యంగా వస్తారు. కలక్టరుగారు వచ్చిన తక్షణమే నిర్వాహకులు స్వాగతం పలికి, కలక్టరుగారిని అధ్యక్షపీఠాన్ని అలంకరించమని కోరుతారు. కలక్టరుగారు వేదిక మీద ఆశీనులవుతారు. ముఖ్యఅతిథిగా విచ్చేసిన లక్ష్మణయతీంద్రుల వారిని వేదికపైకి ఆహ్వానిస్తారు. ముందువరసలోనే కూర్చొని వున్న యతీంద్రులు వారు మాత్రం వేదికనలంకరించడానికి నిరాకరిస్తారు. నిర్వాహకులు వచ్చి ***"స్వామీ! మావలన ఏదైనా పొరపాటు జరిగిందా? మన్నించండి! వేదికనలంకరించండి"*** అని ప్రాధేయపడుతారు. ***"అది ఎవరి పొరపాటూ కాదు. మామూలుగా జరిగే విషయమే. అయితే నేను ఒక వ్రతం పట్టాను సమయపాలనను పాటించని సభలో పాల్గొనరాదనేదే నా వ్రతం. వ్రత భంగం ఎట్లా***

***చేసుకుంటాను?"*** అని నిర్మొగమాటంగా చెబుతారు లక్ష్మణ యతీంద్రులవారు. వేదికనలంకరించిన కలక్టరుగారు క్రిందకు దిగివచ్చి ***"ఈ ఆలస్యానికి కారణం నేను. క్షమించండి!"*** అని చెప్పి యతీంద్రులవారిని వేదికనలంకరించమని కోరుతారు. అయినప్పటికి యతీంద్రులవారు నిరాకరించారు. వేదిక ఎక్కరు, ప్రసగించరు. సభ అయ్యేంతవరకూ ముందు వరసలోనే కూర్చొని ప్రసంగాలను వింటారు. ***నిర్వాహకులు సమయపాలనను పాటించకపోతే, వచ్చే అరిష్టమేమిటో ఈ సంఘటన ఋజువు చేస్తున్నది.***

**సమయపాలన :**

1990 సం॥ నవంబర్ 22వ తేదీన ***'సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్'*** శంకుస్థాపనకు, ఆనాటి రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్‌గారిని శ్రీసత్యసాయిబాబావారు ఆహ్వానిస్తారు. కాని విమానం రావటం పది నిముషాలు ఆలస్యమవుతుంది. రాష్ట్రపతిగారి కోసం వేచివుండక శ్రీసత్యసాయిబాబావారే శంకుస్థాపన చేస్తారు. ఆనాడు జరిగిన సభలో, వచ్చే సంవత్సరం ఈనాటికి (1991 సం॥నవంబరు 22వ తేది) ఈ పెద్ద హస్పిటల్‌కు ప్రారంభోత్సవం జరిపి, ఆనాడే గుండె ఆపరేషన్లు కూడా నిర్వహించబడుతాయని ప్రకటిస్తారు. 300 కోట్ల రూపాయిలతో ఆ హాస్పిటల్ నిర్మాణం జరిగింది. వారు చెప్పిన రోజునే ఆ సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌లో గుండె ఆపరేషన్లు కూడా మొదలైనాయి. శంకుస్థాపన సమయం పవిత్రతకు, సాయి సంకల్పబలం తోడు కావటం వలన ఆ హాస్పిటల్‌లో ఎన్నో వేలమందికి ఉచితంగా గుండె ఆపరేషన్లు ఈనాటి వరకూ చేయబడినాయి. కనుక ***"సమయపాలనకు మించిన పవిత్రత వేరొకటి లేదు"*** ఆ విషయమును విస్మరించకండి.

సమయపాలనను పాటించటంవలన వ్యక్తిత్వాలు మరింత ఇనుమడించుతాయి. కాబట్టి ముఖ్యంగా విద్యార్థులు సమయపాలనను పాటించి, చక్కటి ఆదర్శము నిరూపించాలి.

---

"వ్యక్తి జీవితంలో సమయపాలన ముఖ్యాంశం కావాలి. అట్టివారు మాత్రమే జీవితంలో విజయాలను సాధించగలుగుతారు. కాలం విలువ తెలియనివారు సమయపాలనను పాటించరు. సమయపాలనను పాటించనివారికి 'విలువ' ఉండదు".

**- మోక్షగుండం విశ్వేశ్వరయ్య**



# లోకమాన్య బాలగంగాధర తిలక్

"I have no tears to shed at this occasion, Because I have shed them all for my country" (ఈ సమయంలో నా నేత్రముల నుండి ఒక కన్నీటి చుక్క గూడ రాల్చలేను. కారణమేమనగా, ఉన్న కన్నీటినంతటినీ, నా మాతృభూమి కొరకు ఇదివరకే కార్చినాను) అన్నాడు ఒక స్వాతంత్ర్య సమరయోధుడు. అతను ఎవరు? సందర్భమేమిటి? చక్కగా విచారిస్తే, కఠిన హృదయాలైనా కరిగి కన్నీరు కారుస్తారు.

కేసరి, మరాఠా పత్రికలలో స్వాతంత్ర్య సమరోత్సవాన్ని సమర్థిస్తూ దేశభక్తి పరిపూరితమైన వ్యాసములు వ్రాసినందులకు, ఆయనపై దేశద్రోహ నేరం మోపి, 1908లో జూన్ 24వ తేదీన ఆరేళ్ల పాటు ద్వీపాంతరవాస శిక్ష విధించి, బర్మాలోని మాండలే జైలుకు పంపించింది ఆనాటి ఆంగ్ల ప్రభుత్వం. ***"స్వరాజ్యం నా జన్మ హక్కు"*** అని సింహగర్జన చేసి, సామాన్య ప్రజలను నిద్రలేపిన మహావీరుడు అతనే, ***లోకమాన్య బాల గంగాధరతిలక్.***

మాండలే జైలులో వుండగా ఆయన భార్య మరణవార్త టెలిగ్రామును జైల్ అధికారులు తిలక్‌కు అందిస్తారు. ఆ టెలిగ్రాము‌ను చదివి బల్లమీద ఉంచుతాడు తిలక్. ఆయన కంటి వెంబడి కనీసం ఒక కన్నీటి బొట్టుకూడా రాలదు. జైలు అధికారులకు ఆశ్చర్యం వేసి, ***"మీ ధర్మపత్ని చనిపోయింది గదా! మీ కంటి వెంబడి, కనీసం ఒక కన్నీటి బిందువు కూడా రాలలేదేమి?"*** అని అడిగినప్పుడు తిలక్ పై సమాధానం చెబుతాడు. ఆమె మృతదేహాన్ని చూడటానికి ఆంగ్ల ప్రభుత్వం అంగీకరించదు, అంత్యక్రియలకు వెళ్లడానికి కూడా అనుమతించదు. 46 సంవత్సరాల పాటు ఆమెతో కలిసి సహజీవనం నెరిపిన తిలక్ మహాశయునికి అవసాన దశలో ఆయన సతి మృత శరీరమును చూచే భాగ్యం కూడా లేకుండా పోయింది. అయినప్పటికీ ఆయన ఏ మాత్రం చలించలేదు. ఆయన

ఆత్మ విశ్వాసం ఏమాత్రం సడలలేదు. మమకార బంధనాలను త్యజించి స్వాతంత్ర్యంకోసం అవిశ్రాంత పోరాటం సలిపిన మహాయోధుడు ***బాలగంగాధర తిలక్.***

ఆయన జీవితంలో మరో దుర్ఘటనను కూడా చవిచూడవలసి వచ్చింది. ఒక రోజున 'కేసరి' పత్రికకు సంపాదకీయం వ్రాస్తున్నాడు తిలక్. ఇంతలో ఇంటినుంచి ఆయన కుమారుని ఆరోగ్య పరిస్థితి ఆందోళనకరంగా ఉన్నదని కబురు వచ్చింది. ఆ దుర్వార్త తీసుకొని వచ్చిన వ్యక్తితో తిలక్ ***"మీరు వైద్యుని పిలవండి, ఆయనే మందు ఇస్తాడు. నేను ఈ పని పూర్తి కాగానే వస్తాను"*** అని చెబుతాడు. సంపాదకీయం పూర్తి అయిన తరువాత తిలక్ ఇంటికి వెళ్ళుతాడు. కాని అప్పటికే పుత్రుడు మరణిస్తాడు. ఆయన ప్రశాంత చిత్తంతో కుమారుని దహన సంస్కారాలు చేస్తాడు. తిలక్ కర్తవ్యనిష్ఠ అటువంటిది.

మాండలే జైలులో ఉన్న ఆరు సంవత్సరాలలో భగవద్గీతకు మహారాష్ట్ర భాషలో, ఏకాగ్రతతో చక్కటి వ్యాఖ్యను వ్రాస్తాడు తిలక్. దాని పేరే ***'గీతారహస్యం'.*** జైలు నుంచి విడుదల అయ్యేటప్పుడు, దీనిలో ఏదో రహస్యమున్నదని జైలు అధికారులు భావించి, ఆ వ్రాత పతిని ఇంటికి తీసుకొనిపోవడానికి నిరాకరిస్తారు. అప్పుడు తిలక్ ***"కాగితాల మీద వ్రాసింది తీసుకో గల్గుతారుగాని, నా మనస్సులోని భావాలను తీసుకోలేరు గదా!"*** అని ఆ వ్రాత ప్రతిని అధికారుల మొహాన విసిరి పారేసి బయటకు వస్తాడు తిలక్. ఈ సంఘటన ఆయన ఆత్మవిశ్వాసాన్ని, స్వాభిమానాన్ని ఋజువు చేస్తుంది.

తిలక్ హైస్కూల్‌లో చదివే రోజులలో ఒక చిన్ని సంఘటన జరిగింది. ఒక రోజున ఎవరో కొందరు విద్యార్థులు వేరుశనక్కాయలు తిని, ఆ పొట్టును క్లాస్‌రూంలో పడవేస్తారు. ఆ తరగతి పంతులు గారు వచ్చి ***"ఎవర్రా ఈ పని చేసింది?"*** అని ప్రశ్నిస్తాడు. ఎవరూ సమాధానం చెప్పరు. పంతులు గారికి కోపం వచ్చి, ఆ గదినంతా శుభ్రం చేయమని పిల్లల్ని ఆజ్ఞాపిస్తాడు. అందరూ ఊడుస్తుంటారు. కాని ఒక విద్యార్థి మాత్రం ఆ పని చేయకుండా నిర్భయంగా నిలుచుంటాడు. పంతులుగారికి కోపం వస్తుంది. బెత్తం తీసుకొని వస్తాడు. నిర్భయంగా నిలుచొని వున్న విద్యార్థిని చేయి చాపమని హూంకరిస్తాడు. ఆ పిల్లవాడు చేయిచాప నిరాకరిస్తూ ***"నేను శనక్కాయలు తినలేదు అందువలన నేను ఊడవను"*** అని నిర్భయంగా సమాధానం చెబుతాడు. ఆ సమాధానము నకు కోపోద్రిక్తుడైన ఆ పంతులుగారు, ఆ పిల్లవాడిని పాఠశాలనుండి గెంటివేస్తాడు. ఆ బాలుడెవరో తెలుసా? ***"స్వరాజ్యం నా జన్మ హక్కు"*** అని గర్జించిన బాలగంగాధర తిలక్.

ఈనాడు మనుష్యులు సాధించేది స్వల్పమయినా, అట్టహాసం మాత్రం జాస్తి, చేసేపని తక్కువైనా ఉపకరణాల మీద మోజు మాత్రం అధికం. చేసేపని తక్కువ, డాబుసరి ఎక్కువ. ఒకప్పుడు బొంబాయిలో 'రాష్ట్రమాత' పత్రిక ప్రారంభిస్తున్నారు. ఫర్నీచర్ కోసం Estimation వేయడానికి నిర్వాహకులు చర్చిస్తున్నారు. అదే సమయానికి అక్కడికి వచ్చిన తిలక్ వారి సంభాషణలు విని 'మేము కేసరి, మరాఠా పత్రికలు ప్రారంభించినప్పుడు, ఇలాంటి సరంజామా ఏదీ మా దగ్గరలేదు. మీరు ఇప్పుడు భావిస్తున్న ఫర్నిచర్ అంతకన్నా లేదు. పరుపును చుట్టగా చుట్టి దానినే బల్లగా భావించుకొని రచనలు సాగించాం. అలా వ్రాసినప్పటికినీ, ఆ రచనలు ప్రజలలో ఉత్సుకతను, స్ఫూర్తిని కలిగించాయి' అన్నారు తిలక్. అక్కడి వారందరూ బదులు చెప్పలేక మెదలకుండా ఉండిపోయారు.

మహనీయులకు బాహ్య ఉపకరణాలతో నిమిత్తం లేదు. ఆడంబరాలకు, అట్టహాసాలకు ప్రాధాన్యత యివ్వరు. కార్యాన్ని సాధించడమే వారి జీవిత పరమావధి. కనుక *"పటారం కన్నా ప్రతిభేమిన్న"* అనే విషయాన్ని విస్మరించకండి.

*"అయ్యా! స్వాతంత్ర్యం వచ్చిన తరువాత తమరు ప్రధాని పదవిని చేబడుతారా?"* అని ఒకసారి పత్రికా విలేఖరులు తిలక్ మహాశయున్ని ప్రశ్నించగా *"నేనొక్కడిని ప్రధానినైపోతే ప్రయోజనం ఏమిటి? అనేక మంది ప్రధానులను తయారు చేయగలిగే ఉపాధ్యాయుడుగానే ఉంటాను. భారతదేశాన్ని రక్షించే యువకులను తర్ఫీదుచేసే ఉపాధ్యాయ స్థానమే నాకు గొప్ప పదవి!"* అని సమాధానం చెబుతాడు తిలక్. భారత జాతిని స్వాతంత్ర్య సమరోత్సాహంతో జాగృతమొనర్చిన మహామనిషి లోకమాన్య బాలగంగాధర తిలక్.

*ఆచార్య పదవి అందరికీ లభించేది కాదు. అది ఎంతో పవిత్రమైనటువంటిది, గౌరవప్రదమైనటువంటిది. కనుక అట్టి పవిత్రమైన ఆచార్య స్థానము యొక్క స్థాయిని ఇనుమడింపజేయటం మనందరి కర్తవ్యం.*



---

"సత్యం అన్నింటికంటే ఉత్తమమైన నీతి. సత్యాన్ని పాలించడం అగ్ని పరీక్షవంటిది. బంగారం తేటు తీరాలంటే అగ్నిలో మండిస్తాం. సత్యం పరీక్షకూడా అట్టిదే".

- తిలక్



# 'నేతాజీ' సుభాస్ చంద్రబోస్

*"నేను దేనినైనా సహిస్తాను. కాని నా మాతృదేశాన్ని దూషించడం నేను సహించలేను. నేను నరకానికి పోయినా ఫర్వాలేదు. నా దేశ గౌరవాన్ని నేను కాపాడుకోవాలి. నా దేశమంటే నీకంత చులకనట్రా!"*

అంటూ ఒక్కసారి దూకి, ఎగిరి గంతేసి ఆ బ్రిటీష్ లెక్చరర్ ఎఫ్.సి.ఓటెన్ జుట్టు పట్టుకొని చెప్పుతో కొడతాడు ఒక విద్యార్థి. పిల్లలంతా నిర్ఘాంతపోతారు, లోలోన సంతోషిస్తారు. ఆ ఆంగ్ల లెక్చరర్ ఆ రోజులలో కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజీలో పని చేస్తున్నాడు. అతనికి భారతీయులన్నా, భారతదేశం అన్నా ఏహ్యాభావం ఉండేది. అవహేళనగా, అలక్ష్యంగా ప్రతిరోజూ క్లాస్‌లో మాట్లాడుతుండేవాడు. ఒకనాడు క్లాస్‌లో భారతదేశాన్ని గురించి అతి హీనంగా మాట్లాడుతాడు. ఆ దూషణలను వినలేక భారతదేశాన్ని గురించి అతి నీచంగా మాట్లాడుతున్న ఆ మాటలను విని భరించుకోలేక కోపోద్రిక్తుడవుతాడు ఆ విద్యార్థి. ఆ విద్యార్థి ఎవరో తెలుసా? 'ఆజాద్ హింద్ ఫౌజ్'ను స్థాపించి బ్రిటీష్ వారితో పోరాడిన మహా వీరుడు **సుభాస్ చంద్రబోస్.** 'జైహింద్' అనే పిలుపునిచ్చి, జాతికి జీవం పోసిన నేతాజీ ఆయనే. ఆ ఆంగ్ల లెక్చరర్ పట్ల ప్రవర్తించిన తీరుకు, రెండు సంవత్సరాల పాటు సుభాస్‌ను 'డిబార్' చేస్తుంది ఆంగ్ల ప్రభుత్వం. ఈ బహిష్కరణ సుభాస్‌లో ఒక క్రొత్త విశ్వాసాన్ని తెచ్చి పెట్టింది. తప్పుచేయనప్పుడు ఎవరికీ తలవంచవలసిన పనిలేదని, ఎంతటి కష్టాలనైనా ధైర్యంగా ఎదుర్కోవాలని నిశ్చయించుకుంటాడు **సుభాస్.**

సుభాస్ ఇంగ్లాండ్ వెళ్తుతాడు. ఐ.సి.ఎస్. పరీక్షకు వెళ్ళటానికి యింకా ఎనిమిది మాసములు వ్యవధి మాత్రమే ఉంటుంది. అంత కొద్ది సమయంలో ఎంతో పోటీ వున్న ఆ పరీక్షకు వెళ్లి ప్యాసవుతాడు. ఆ తరువాత సుభాస్‌లో మానసిక సంఘర్షణ

ప్రారంభమైంది. ప్రభుత్వఉద్యోగం చేయటమా? లేక స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనటమా? అని ఆలోచిస్తున్న సమయంలో ***"బ్రిటీష్ పరిపాలనా యంత్రాంగంతో ఉన్న అన్ని సంబంధాలు భారతీయులు త్రెంచుకోవాలి"*** అని దేశబంధు చిత్తరంజన్ దాస్ పిలుపునిస్తారు. ఆ పిలుపు సుభాస్ అంతిమ నిర్ణయానికి తోడ్పడుతుంది. ఒక నిర్ణయానికి వచ్చి కేంబ్రిడ్జినుండి చిత్తరంజన్ దాస్‌కు లేఖ వ్రాస్తాడు. ***"ప్రభుత్వం క్రింద పనిచేయటం నాకెంత మాత్రం ఇష్టంలేదు. నా శరీరమూ, మనస్సు దేశ మాతకు అర్పణ చేయదలిచాను".*** అని వ్రాస్తాడు సుభాస్. ఐ.సి.యస్ కు రాజీనామా చేస్తాడు. స్వదేశానికి తిరిగి వస్తాడు. మన దేశంలో మరో పరీక్ష వ్రాయాలనుకొని ఆ పరీక్షకు వెళ్ళుతాడు. ఆ ప్రశ్నాపత్రంలో 'Indian Soldiers are Generally dishonest" (భారతీయ సైనికులు సాధారణంగా అవినీతి పరులు) అనే వాక్యమును మాతృభాషలో అనువదించాలి. కాని సుభాష్‌కు మనస్కరించదు. కోపంతో ***"మీరీ ప్రశ్నను తొలగించండి?"*** అని అడుగుతాడు. ***"ఆ ప్రశ్న నిర్బంధంగా వ్రాయాలి. లేకుంటే మీరు పెద్ద ఉద్యోగం కోల్పోవలసి వస్తుంది"*** అంటాడు అధికారి. ఆ సమాధానం విన్న సుభాస్ ఆగ్రహంతో ***"మీ ఉద్యోగం, ఎవరికి కావాలి? నా మాతృభూమికి కళంకం తెచ్చే, మాసైనికులను అవమానపరచే ఆవాక్యాన్ని నేను అనువదించను"*** అని నిష్కర్షగా చెప్పి, ఆ ప్రశ్నాపత్రమును చించివేసి పరీక్షహాలు నుండి బయటకు వస్తాడు సుభాస్. సుభాస్ యొక్క దేశభక్తి, స్వాభిమానం అంతటిది.

***'పట్టాభి ఓటమి నా ఓటమి'*** అని గాంధీజీ ప్రచారం చేసినప్పటికీ, పట్టాభిని ఓడించి రెండవసారి సుభాస్ కాంగ్రెస్ అధ్యక్షపీఠాన్ని అలంకరించుతాడు. సుభాస్ ప్రజల ప్రియతమ నాయకుడన్నది ఋజువవుతుంది. కాని, ఆ తరువాత కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేసి, 1939 సం॥ మే నెలలో ***'ఫార్వర్డ్ బ్లాక్'***ను స్థాపించుతారు. 1939 సెప్టెంబర్‌లోను, 1940 జనవరిలోనూ సుభాస్ ఆంధ్రలో పర్యటిస్తారు. తమ ప్రియతమ నాయకుడికి ఇక్కడ అఖండ స్వాగతం లభిస్తుంది.

భారతదేశంలో ఉండి, ఉద్యమాలు నడిపి బ్రిటీష్‌వారిని పారద్రోలడం అసాధ్యమని భావిస్తాడు సుభాస్. 1941 సం॥ జనవరి 15న మారువేషంలో బయలుదేరి పెషావర్ చేరుతాడు. అక్కడ నుండి కాబూల్‌కు వెళ్ళుతాడు. రష్యా వెళ్ళుతాడు, ఐరోపాలో పర్యటిస్తాడు. ఆ విధంగా 2 మాసాల 11రోజుల పాటు మారువేషంలో పర్యటిస్తూ బెర్లిన్ చేరుకుంటాడు సుభాస్. ఎందరో బ్రిటీష్ పోలీసులు వార్తాహారుల కన్నుగప్పి

కలకత్తా నుండి బెర్లిన్ వరకు బోస్ సాగించిన ఆ సాహసయాత్ర చరిత్రలో అత్యంత ఆసక్తికరమైన ఘట్టంగా నిలచిపోతుంది.

విదేశాలలో నున్న ప్రవాస భారతీయులను ఉత్తేజపరచి, వారి సహకారంతో **"ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్"** అనే సంస్థను స్థాపిస్తాడు. 50వేల మంది భారతీయ యుద్ధ ఖైదీలతో ఆజాద్ హింద్‌ఫౌజ్‌ను నెలకొలుపుతాడు. 1943 సం॥ అక్టోబరు 21వ తేదీన, బోస్ ప్రధానమంత్రిగా స్వతంత్రభారత తాత్కాలిక ప్రభుత్వం సింగపూర్‌లో ఏర్పడుతుంది. ఆ ప్రభుత్వాన్ని తొమ్మిది దేశాలు గుర్తిస్తాయి. జపాన్ వారు ఆక్రమించిన 'అండమాన్ నికోబార్' దీవులలో ఆ ప్రభుత్వం పాలన ఏర్పడుతుంది. 1944 సం॥ ఫిబ్రవరి 4వ తేదీన షానవాజ్‌ఖాన్ నాయకత్వాన 'ఆజాద్ హింద్ ఫౌజ్' అస్సాంలోని ఇంఫాల్ మీదకు, తూర్పు బెంగాల్‌లోని చిట్టగాంగ్ జిల్లా మీద దండయాత్ర చేస్తుంది. "జైహింద్! ఢిల్లీ చలో!" అనే నినాదాలతో పరాధీనభారత్‌లో ప్రవేశించి, 150 మైళ్ళు ఆక్రమిస్తుంది. వర్షాకాలం కావటం వలన, విమాన బలం లేనందువలన, ఆజాద్ హింద్ ఫౌజ్ సైన్యాన్ని బ్రిటీష్‌వారు ఓడించి, బర్మాలోనికి తరిమి వేస్తారు.

1945 సం॥ ఆగష్టు 18వ తేదీన నేతాజీ విమానంలో 'తైపి' నుండి బయలుదేరుతారు. దురదృష్టవశాత్తు, బయలుదేరిన కొద్ది నిమిషాలకే ఆ విమానం ప్రమాదానికి గురియై పడిపోతుంది. కాలిపోతున్న ఆ విమానం నుంచి సుభాష్ చంద్రబోస్, హబీబుర్ రహమాన్ ఖాన్ లిద్దరూ బయటకు దూకుతారు. పెట్రోల్ సుభాష్ మీద పడటం వలన, ఆయనను మంటలు చుట్టుముడుతాయి. రహమాన్ ఆ మంటలను ఆర్పివేయడానికి ప్రయత్నిస్తాడు. అప్పటికే బోస్ శరీరం చాలాభాగం కాలిపోతుంది, రక్తం కారుతుంటుంది. ఆ స్థితిలో ఉండికూడా బోస్ ***"నేను ఈ ప్రమాదం నుండి బయట పడుతాననే ఆశ నాకు లేదు, నీవు భారత దేశానికి చేరిన తరువాత, ఆఖరి శ్వాసవరకు ఈ బోస్ భారతదేశ స్వాతంత్ర్యానికి పోరాడుతునే ఉన్నాడని చెప్పు. భారతీయులు పోరాటాన్ని కొనసాగించాలి, అనతికాలంలోనే మనకు స్వాతంత్ర్యం వస్తుంది"*** అని చెప్పి కన్నీరు కారుస్తాడు బోస్. మరికొన్ని నిమిషాలకే అంబులెన్స్ వస్తుంది. జపాన్ డాక్టర్లు శక్తి వంచన లేకుండా, చేయవలసిన వైద్యమంతా చేస్తారు. కాని అదేరోజు రాత్రి గం॥ 7-30లకు 'నేతాజీ' అంతిమ శ్వాస విడుస్తారు.

విదేశాలలో భారత స్వాతంత్ర్యంకోసం ప్రచారం చేసిన నాయకు లెందరో ఉన్నారు కాని స్వాతంత్ర్య పోరాటానికి గాను సైన్యాన్ని విదేశాలలో తయారుచేసింది 'నేతాజీ' ఒక్కరే. పరాయిదేశాలలో సైన్య నిర్మాణం చేబట్టటం అంటే అంత సులభ సాధ్యమైన పనికాదు. అయినప్పటికీ ఆ కార్యాన్ని సాధించాడు 'నేతాజీ'. సాధ్యాసాధ్యాలతో నిమిత్తం లేకుండా దూసుకు పోవడం నేతాజీ లక్షణం. అకుంఠిత దేశభక్తి, నిశ్చలమైన మనస్సు, దృఢ దీక్ష, ఆత్మవిశ్వాసం, ఎనలేని సాహసం, నిశితమైన మేధా సంపత్తి నేతాజీకి సహజంగా అబ్బిన లక్షణాలు. అందువలననే, వట్టి చేతులతో విదేశాలకు వెళ్ళి, అక్కడ సైన్యాన్ని నిర్మాణం చేసుకొని బ్రిటీష్ వారిని గడగడలాడించగలిగాడు. అదే 'నేతాజీ' ప్రత్యేకత.

నేతాజీ సుభాస్ చంద్రబోస్ తన దేశీయులకు యిచ్చిన సందేశాలను సునిశితంగా పరిశీలిస్తే, ఆయన దేశభక్తి ఎంతటిదో మనకు అవగతమవుతుంది. ఆయన త్యాగబుద్ధి భావితరాలకు స్ఫూర్తినిస్తుంది, కార్యోన్ముఖులను గావిస్తుంది.

*"ప్రపంచంలో ఏ ఆదర్శమూ బాధలు, యాతనలు అనుభవించకుండా సాధించబడలేదు. బాధల నెదుర్కొనడం వలన త్యాగం చేయడంవలన ఎవడూ, ఏమీ కోల్పోడు. భూమి మీద అతడేమైనా కోల్పోయినట్లయితే, నశించనటువంటి కీర్తికి అతడు వారసుడు కావడం ద్వారా, పోగొట్టుకొనినదానికంటే అధికంగా మరల పొందుతాడు. జాతి జీవించడం కొఱకు త్యాగం చేసి తీరాలి, మరణించి తీరాలి. ఈనాడు నేను మరణిస్తాను. అందుమూలాన భారతదేశం జీవిస్తుంది. ఈ శాశ్వతమైన ప్రపంచంలో ప్రతీదీ మరణిస్తుంది. కాని ఆశయ ఆదర్శాలు మాత్రం నశించవు"* అని చెబుతారు నేతాజీ.

నేతాజీ ఆశయ ఆదర్శములను మననం చేసుకొని ఆచరణలో పెడుదాం. నవభారత నిర్మాణానికి శక్తివంచన లేకుండా కృషిచేద్దాం. ఇదే మన కర్తవ్యం. విస్మరించకండి!

---

"ఒక సిద్ధాంతం కొరకు, ఒక ఆదర్శం కొరకు, జీవించి మరణించడంలోనున్న ఆనందం ఇంకెందులో ఉన్నది? తన అనంతరం, తన ఆత్మ అనేక మందిలో ప్రవేశించి, వారిని ఉత్తేజపరచి, తాను అసంపూర్తిగా వదిలివేసిన పనిని వారిచేత చేయిస్తుందనే సంతృప్తి కంటే మిన్నమైన సంతృప్తి ఎందులో ఉన్నది?"

- సుభాష్ చంద్రబోస్



# చక్రవర్తుల రాజగోపాలాచారి (రాజాజీ)

***"కారును వాపస్ పంపండి. నేను సైకిల్ రిక్షాలో వస్తాను. ప్రభుత్వ వాహనమును ఉపయోగించడం మంచి సంప్రదాయం కాదు గదా!"***

అని చెప్పి ఆ కార్యక్రమానికి రిక్షాలో వెళ్ళుతారు. ఆయన సామాన్యవ్యక్తి కాదు. ఆనాటి తమిళనాడు ముఖ్యమంత్రి, భారతదేశ ప్రథమ గవర్నర్ జనరల్ పదవిని కూడా నిర్వహించిన ***రాజగోపాలాచారి*** (రాజాజీ) గారు. ఆయన ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఒకసారి మద్రాసులోని గిండీ ఇంజనీరింగ్ కాలేజీ, కర్ణాటక సంఘ విద్యార్థులు, తమ సంఘ ప్రారంభోత్సవానికి ఆహ్వానించడానికి వస్తారు. ఆ కబురు తెలిసికొని, రాజాజీ తన ఆఫీసు నుండి క్రిందకు దిగివచ్చి వారితో మాట్లాడి తమ అంగీకారం తెలుపుతారు. ప్రారంభోత్సవ కార్యక్రమానికి ముందు సంఘనాయకులు రాజాజీని తీసుకొనివెళ్ళడానికి ఒక కారును తీసుకొని వస్తారు. ***'ఈ కారు ఎవరిది?'*** అని రాజాజీ ప్రశ్నించగా ***'అద్దెకారు'*** అని చెబుతారు. అప్పడు రాజాజీ ***"మీ సంఘ సభ్యత్వరుసుముతో, కారును అద్దెకు తీసుకోవడం మీ శక్తికి మించింది. కారును వాపస్ పంపండి!"*** అని చెప్పి ఆ కార్యక్రమానికి రిక్షాలో వెళ్ళుతారు రాజాజీ. ఈ సంఘటన ఆయన నిరాడంబరతను, నిస్వార్థతను చాటు చున్నది. ప్రభుత్వం కల్పించిన ఉచిత సౌకర్యాలను ఆయన ఏనాడూ తన స్వంతానికి ఉపయోగించలేదు. ప్రభుత్వంతో సంబంధంలేని పనులకు తన స్వంత పైకాన్నే వెచ్చించేవారు. ఈనాటి ప్రభుత్వ నేతలు రాజాజీని అనుసరిస్తే, ప్రభుత్వ సొమ్మును ఎంతో పొదుపు చేసినవారవుతారు. మహనీయులు ఇటువంటి ఆదర్శములను ఎన్నో మనకు అందించిపోయారు. వాటిని అనుసరించడం మన ధర్మం.

ఛలోక్తిగా మాట్లాడటం రాజాజీ స్వభావం. పైకి ఛలోక్తిగా కనిపించినా, ఆ మాటలలో అంతరార్థం ఎంతో ఇమిడి ఉండేది. దానిని అర్థం చేసుకుంటే దానిలో ఎంతో నీతి వుండేది, సందేశం వుండేది, కర్తవ్యాన్ని బోధించేది. ఒకసారి రాజాజీ రైలులో ప్రయాణం చేస్తున్నారు. అది వేసవి కాలం ఎండ తీవ్రత చాలా ఎక్కువగా కూడా ఉన్నది. అదే బోగీలో ఒక తెల్లదొర కూడా ప్రయాణిస్తున్నాడు. అతనికి చెమటలు పడుతున్నాయి. కొంత సమయం అయిన తరువాత ఎదురుగా కూర్చున్న రాజాజీతో ఆ తెల్లదొర ***"ఈ వేళ ఎండ చాలా తీవ్రంగా ఉన్నది గదూ!"*** అన్నాడు. అప్పుడు ***"అంత ఎక్కువగా లేదు. మిమ్ములను ఈ దేశం నుండి వెళ్ళగొట్టేంత తీవ్రంగా లేదు"*** అన్నారు. ఆ తెల్లదొర ముఖం ఎర్రబడింది. కాని రాజాజీ చిరునవ్వు అతన్ని నిశ్చేష్టుణ్ణి చేసింది.

ఒకసారి కలకత్తాలోని రోటరీ సభకు అధ్యక్షత వహించిన సర్. సి.వి. రామస్వామి అయ్యర్ అత్యంత అద్భుతంగా ప్రసంగించి శ్రోతలను పరవశింపజేశారు. ఆ సభలో అమెరికా, రష్యా రాయబారులు కూడా ఉన్నారు. ముఖ్య అతిథిగా పాల్గొనిన రాజాజీ చలోక్తులు విసురుతూ సభికులను ఉల్లాసపరిచారు. తమ ప్రసంగం చివర ***"అమెరికా చమురు, రష్యా కాస్టిక్ సోడా రెంటినీ కలిపి తయారుచేసిన సబ్బుబిళ్ళతో ఈ ప్రపంచ కాలుష్యాన్ని పోగొట్టవచ్చును"*** అని అనడంతోనే శ్రోతల కరతాళ ధ్వనులతో సభాభవనం మారు మ్రోగింది. అక్కడ సభలో నున్న అమెరికా, రష్యా రాయబారులిద్దరూ ఆప్యాయంగా కరచాలనం చేసుకున్నారు. ఈ సంఘటన జరిగింది అమెరికా, రష్యాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం జరుగుతున్న రోజులు. రాజాజీ ఈ విషయమును సూటిగా చెప్పకుండా, పరోక్షంగా, చలోక్తిగా చెప్పి, ఆ ఇరువురి ప్రముఖులలో మార్పును తెప్పించగలిగారు. ఇదే వారి ప్రత్యేకత.

***స్వామీ వివేకానంద*** ఒకసారి రాజాజీ చదువుచున్న లా కాలేజీలోని హాస్టల్ గదికి వచ్చారు. ఆ గదిలో గోడకు తగిలించివున్న శ్రీ కృష్ణుని ఫొటోను చూచి ***'శ్రీకృష్ణునికి నీలి రంగు ఎందుకుంది?'*** అని రాజాజీని ప్రశ్నించుతారు. విద్యార్థిగా ఉన్న రాజాజీ ***"అయ్యా! సముద్రం అనంతమైనది, ఆకాశంకూడా అనంతమైనదే. వాటి రెండింటిరంగు నీలం కాబట్టి అనంతమైన భగవాన్ శ్రీ కృష్ణుని రంగుకూడా నీలం"*** అని సమాధానం చెబుతాడు. ఈ సమాధానం విని వివేకానంద అమితానందభరితుడై ***"ఈ బాలుడు మిక్కిలి ప్రజ్ఞా సంపన్నుడై కీర్తి పొందగలడు"*** అని ఆశీర్వదిస్తాడు.

అదే విధంగా రాజాజీ రాజకీయ జీవితం సేలం మున్సిపల్ అధ్యక్షపదవితో ప్రారంభమై, అనేక ఉన్నత పదవులను అలంకరించి, భారత దేశ గవర్నర్ జనరల్ పదవిని కూడా అలంకరించారు. రాజాజీ అసలుపేరు *'చక్రవర్తుల రాజగోపాలచారి'* వారి పేరులో ఉన్నది *'చక్రవర్తి'*. అందువలననే కాబోలు భారతదేశ మొదటి గవర్నర్ జనరల్ అయ్యారు వారు. అంతే కాదు భారతదేశానికి ఏదో ఒకరోజున 'రాజు' కావచ్చునని భావించో! లేక రాజాజీ ఇంటిపేరును (చక్రవర్తుల) స్పష్టంగా చదవలేకనో! ఆనాడు బెర్లిన్ రేడియో రాజాజీ పేరును 'రాజా ఆఫ్ గోపాలాచారి' అని చెబుతుండేది.

రాజాజీ రాష్ట్రపతి భవనంలోఉన్నా, మదరాసులో తన ఇంట్లో వున్నా, అతి సాధారణ జీవితాన్నే గడిపేవారు. నిరాడంబరంగా ఉండేవారు. వందలాది మంది నౌకర్లు ఉన్నా తమ దుస్తులు తామే స్వయంగా ఉతుక్కునే వారు. ఉదయం ఉతికి అరవేసిన వస్త్రాలను, సాయంత్రం తామే మడతపెట్టి తలగడ క్రింద వుంచి 'ఇస్త్రీ' చేసుకునేవారు. తమ పడకను తామే ఏర్పాటు చేసుకునేవారు. పైపెచ్చు ఎవరిపని వారేచేసుకోవాలని, ఇతరుల మీద ఆధారపడకూడదని చెప్పేవారు. వారు గవర్నర్ జనరల్ పదవిలో ఉన్నప్పుడు నౌకర్లకు రోజా శలవుగానే ఉండేది.

*"జైలును ఒక విశ్వవిద్యాలయంగా మార్చినవారిలో ముఖ్యుడు రాజాజీ"* అని అన్నారు ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు *క్రొవ్విడి లింగరాజుగారు*. రామాయణం, భారతం, భగవద్గీతలను సరళమైన ఆంగ్లభాషలో రచించారు రాజాజీ. అవి తెలుగులో కూడా అనువదించబడినాయి. ముఖ్యంగా బాలబాలికలు చదువవలసిన ఉత్తమవచన గ్రంథాలు అవి. జీవితాంతం విసుగు, విరామంలేని రాజయోగి రాజాజీ. బహుముఖ ప్రజ్ఞాశాలి. నిరాడంబరతకు నిదర్శనం రాజాజీ. అంతేకాదు రాజకీయ దురంధరుడు రాజాజీ. కనుక బాలబాలికలు రాజాజీ జీవితం నుండి నేర్చుకోవలసింది ఎంతో ఉన్నది మరచిపోకండి.

---

**"విద్య వేరు, వివేకం వేరు. మంచికీ, చెడుకూ వ్యత్యాసం తెలిసిన విద్వాంసుడు, ఎవడూ తప్పుడు పనులకు దిగడు. మనస్సులో నిలకడుగా నెలకొనిన జ్ఞానం వృథా. అది వట్టి పాండిత్యంగా మాత్రమే నిలుస్తుంది. దానివల్ల ప్రయోజనం ఉండదు.**

**- రాజాజీ**



'వీరవిప్లవ శేఖరం'

# చంద్రశేఖర్ ఆజాద్

"నీ పేరు ఏమిటి?"

నా పేరు 'ఆజాద్' ('ఆజాద్' అంటే ఉర్దూలో 'స్వేచ్ఛ' అని అర్థం )

నీ తండ్రి పేరు ఏమిటి?

నా తండ్రి పేరు 'స్వాధీన్' ('స్వాధీన్' అంటే స్వాతంత్ర్యం అని అర్థం)

మీది ఏ ఊరు?

నా ఊరు 'జైలు'

నీ గృహం ఎక్కడ?

నా గృహం ....'కారాగృహం'

భారత దేశ స్వాతంత్ర్య మహోద్యమ సమయంలో సత్యాగ్రహంలో పాల్గొనిన 14 సం॥ ఒక బాలుని అరెస్టు చేసి, మెజిస్ట్రేట్ ఎదుట పోలీసులు హాజరు పరచగా, మెజిస్ట్రేట్ అడిగిన ప్రశ్నలకు ఆ బాలుడు నదురు బెదురు లేకుండా చెప్పిన సమాధానములు అవి. న్యాయాధీశునికి కోపం వస్తుంది. ఆ కుర్రవానికి 16 హంటర్ దెబ్బల శిక్షను విధిస్తాడు. అతనిని కాశీ సెంట్రల్ జైలుకు పంపిస్తారు జైలు అధికారులు. మెజిస్ట్రేట్ విధించిన శిక్షను అమలుపరచే ముందు, ఆ బాలుని శరీరం మీద ఉన్న అన్ని వస్త్రములను (లంగోటిమినహా) ఊడదీస్తారు. చేతులు రెండూ పైకెత్తి త్రాడుతో బిగించి కడుతారు. భీముడిలాంటి ఒక జైలు అధికారి హంటర్ చేబూని ఆ బాలుని మీద దూకి దెబ్బలు కొడుతుంటాడు. శరీరం చిట్లి రక్తం ప్రవహిస్తుంటుంది. అయినప్పటికీ ఆ బాలుని నోటివెంబడి ఏడుపురాదు. **'భారతమాతకీ జై'** అంటూ సింహగర్జన చేస్తుంటాడు ఆ బాలుడు. ఆ గర్జనతో జైలు అంతా ప్రతిధ్వనిస్తుంది. 16 కొరడాదెబ్బలు ఆ బాలుని

మీద పడుతాయి. ఒళ్లంతా రక్తసిక్తమై పోతుంది. చిట్టచివరికి 'వందేమాతరం' అంటూ మూర్ఛిల్లుతాడు. త్రాళ్ళతో చేతులు కట్టి వ్రేలాడ దీసి వుండటం వలన, మాతృభూమి వడిలో విశ్రాంతి తీసుకునే అవకాశం లేక స్పృహతప్పి వ్రేలాడుతాడు. మరుసటిరోజు ఉదయం జైలు నుండి పంపేముందు, జైలు సంప్రదాయం ప్రకారం ఆ బాలుడి చేతిలో మూడు అణాలు పెడతాడు జైలు అధికారి. ఆ డబ్బులను చేతిలో పెట్టుకొని ఒక్క క్షణంచూస్తాడు. ఆ చేతిలో వున్న మూడు అణాలలో మాతృదేవి బానిసగా ఉన్న దృశ్యం అతనికి కనిపిస్తుంది. వెంటనే ఆ డబ్బులను నేలకేసి కొట్టి *'వందేమాతరం'* అని దిక్కులు పిక్కటిల్లేట్లుగా గర్జిస్తాడు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు శంకరశాస్త్రిగారు వచ్చి, ఆ బాలుని ఇంటికి తీసుకొనివెళ్ళి, గాయాలకు కట్టుకట్టి, మందులిచ్చి భోజనం పెడుతాడు. మరుక్షణం, ఆ విషాద వార్త కాశీనగరమంతా వ్యాపిస్తుంది. ఆ సాయంకాలానికే బ్రహ్మాండమైన బహిరంగ సభ ఏర్పాటవుతుంది. *'వందేమాతరం'* నినాదాలు మిన్ను ముట్టుతాయి. ఆ బాలుని ధైర్య సాహసాలను మెచ్చుకుంటూ ఎందరో నాయకులు ప్రసంగిస్తారు. ఆనాటి నుండి ఆ బాలుని 'ఆజాద్' అని పిలువనారంభిస్తారు ప్రజలు. ఆ బాలుడు ఎవరో తెలుసా? అతని అసలు పేరు 'చంద్రశేఖర్ తివారీ' అయితే ఆనాటి నుంచి ఆ బాలుని 'చంద్రశేఖర్ ఆజాద్' అని పిలిచేవారు. అతనే వీర విప్లవ శేఖరం చంద్ర శేఖర్ ఆజాద్. అతనికి కోర్టు శిక్ష విధించిన రోజు 1921సం॥ డిశంబర్ 28

అది 1931 సం॥ ఫిబ్రవరి 27వ తేదీ. తన స్నేహితుడు సుఖదేవ్ రాజ్‌తో కలిసి అలహాబాద్‌లో ఆల్‌ఫ్రెడ్ పార్క్‌లోని ఒక చెట్టుక్రింద కూర్చొని భవిష్యత్తు కార్యక్రమాన్ని చర్చిస్తుంటారు. ఆజాద్ అనుచరులలోని ఒకడు, డబ్బుకాశపడి, పోలీసులకు ఆ సమాచారం అందజేస్తాడు. పోలీస్ అధికారులు నాలుగు వ్యాన్లలో, గట్టి బందోబస్తుతో వచ్చి, ఆ పార్కును ముట్టడిస్తారు. ఒక పోలీస్ అధికారి **'నాట్‌బావర్'** కారు ఆ పార్కులోనికి దూసుకుని వస్తుంది. 'ఆజాద్'ని చూచిన ఆ పోలీస్ అధికారి తన రివాల్వర్‌తో కాలుస్తాడు. ఆ గుండు ఆజాద్ కుడితొడలో చిక్కుకుంటుంది. తోడనుంచి రక్తం చిమ్ముతుంటుంది. దెబ్బతిన్న సింహంలా గర్జిస్తూ, తన జేబులోని పిస్తోలును తీసి, గురిపెట్టి ట్రిగ్గర్ నొక్కుతాడు, రయ్యినపోయి 'నాట్‌బావర్' కుడిచేతిలో గుండు దిగపడుతుంది. అతను పారిపోతాడు. ఇంతలో మరో అధికారి వస్తాడు. గురి చూచి కాలుస్తాడు 'ఆజాద్'. ఆ అధికారి దవడకు గుండు తగలగా, అతను కూడా కేకలువేస్తూ పారిపోతాడు. ప్రక్కనే ఉన్న 'సుఖదేవ్‌రాజ్' పారిపోదామని ఆజాద్‌కు సలహా యిస్తాడు. కాని 'ఆజాద్' అంగీకరించక ***"పిరికిపందలా ప్రాణంకోసం పారిపొమ్మని సలహా యిస్తున్నావా!*** మిత్రమా! ఈ ఆజాద్

భీరువుకాడు. స్వేచ్ఛలేని ఈ శరీరం కూలిపోతేనేం? నేను నమ్మిన సిద్ధాంతం కోసం, ఈ దేశస్వాతంత్ర్యంకోసం, ఆఖరి క్షణం వరకూ, ఈ పవిత్ర వీరభూమి మీదనే నిలబడి పోరాడుతూ, ప్రాణాన్నయినా వదలుతానుగాని, నేనెన్నటికి పారిపోను. స్వేచ్ఛా వాయువులను పీల్చలేని ఈ శరీరం కూలిపోతేనేం! సుఖదేవ్ రాజ్! ఈ అశాశ్వతమైన ప్రపంచంలో ప్రతీదీ, ఏదో ఒక రోజున నశిస్తుంది, మాయమవుతుంది, కాలగర్భంలో కలిసిపోతుంది. అయితే నేనలా చరిత్రహీనుణ్ణి కావాలని కోరుకోవటంలేదు. ఈ అశాశ్వతమైన భౌతిక శరీరాన్ని రక్షించుకునేందుకు, శాశ్వతమైన అపఖ్యాతి తెచ్చి పెట్టేపని చేయమంటావా? మిత్రమా! అది ఈ జన్మలో జరగదు. ఒక పవిత్రమైన ఆశయంకోసం, ఒక మహోత్కృష్టమైన ఆదర్శం కోసం, అవసరమైతే మరణించడంలో నున్న ఆనందం, అనుభూతి, సంతృప్తి ఇంకెందులో ఉంటుంది? జాతిని జాగృతం చేయడానికి ఎంతైనా త్యాగం చేయడానికి ఏమాత్రం వెరువను. అవసరమైతే మరణిస్తాను. భావితరాలవారికి స్ఫూర్తిని, శక్తిని, ధైర్యాన్ని యివ్వడానికోసం, నా సర్వస్వాన్ని భరతమాత పాదపద్మములకు సమర్పిస్తాను. భారతదేశం సజీవమవుతోంది. శతాబ్దాల పరపీడన నుండి విముక్తి చెందుతుంది. భరతమాత సంకెళ్ళు పటాపంచలైపోతాయి. భావితరాలవారు స్వేచ్ఛా వాయువులను పీల్చగలుగుతారు. ఇదే నా ఆశయం, నా ఆకాంక్ష ***అదే నా తుది కోరిక"*** అని ఆజాద్ స్పష్టం చేస్తాడు.

ఇంతలో బ్రిటీష్ పోలీసులు చుట్టుముట్టుతారు. తన సర్వశక్తిని కూడగట్టుకొని లేస్తాడు. అడుగులు తడబడుతూ ఉంటాయి. శరీరం నుండి రక్తం ప్రవహిస్తూ ఉంటుంది. పిస్టల్‌తో బ్రిటీష్‌ముష్కరులను కాల్చి చంపుతుంటాడు. దురదృష్టవశాత్తు పిస్టల్‌లో ఒకేఒక గుండు మిగిలి ఉంటుంది. తడబడుతున్న మాటలు నోటి నుండి వినపడుతూ ఉంటాయి. ***"నా దేశానికి స్వాతంత్ర్యం వచ్చి తీరుతుంది ... వచ్చి తీరుతుంది... ఓ భరతవీరులారా! అప్పడే విశ్రమించకండి! విప్లవోద్యమాన్ని చల్లారనివ్వకండి!" అని గొణుగుతుంటాడు. క్రిందపడుతూ... లేస్తూ అమ్మా! భరతమాతా!"*** దాస్యశృంఖలాల నుండి నిన్ను విముక్తి చేయకుండానే నీ బిడ్డ వెళ్ళిపోతున్నాడమ్మా! నాకా యోగ్యత లేదమ్మా! నన్ను క్షమించవూ!'అంటూ విలపిస్తూ ***'వందేమాతరం'*** అంటూ పిస్తోలును తన కణతకు గురిపెట్టి, మిగిలి ఉన్న గుండును పేల్చుకుంటాడు. కుప్పగా కూలిపోతాడు ఆ వీరకిశోరం.

***"ఒరిగిపోయె, కూలిపోయె, ధాత్రిలో కలిసిపోయె, వీరవిప్లవ శేఖరం, మన చంద్రశేఖరం".*** అయితే ఆనాడు భారతదేశ స్వాతంత్ర్యం కోసం తన సర్వస్వాన్ని సమర్పించిన ఆ వీరవిప్లవ శేఖరం మనలో ఎందరికి గుర్తున్నాడు?



# నెపోలియన్

**మం**చి ఎక్కడ ఉన్నా, ఎవరి వద్దనున్నా ఆ మంచిని గ్రహించాలి. అతడు స్వదేశీయుడా? లేక విదేశీయుడా? అది స్వదేశమా? లేక విదేశమా? అని ఆలోచించకూడదు. మంచి అనేది స్వదేశంలోనూ వుంటుంది, విదేశాలలో కూడా వుంటుంది. చెడ్డకూడా స్వదేశంలోనూ వుంటుంది, విదేశాలలో కూడా వుంటుంది. అది మంచా? లేక చెడ్డా? విచక్షణా జ్ఞానంతో చూడాలిగాని, అది ఎక్కడ ఉన్నది? ఎవరివద్ద ఉన్నది? అని ఆలోచించగూడదు. కనుక మంచిని స్వీకరించాలి, చెడ్డను విసర్జించాలి. అట్టి సద్బుద్ధిని, విశాలభావమును అలవరచుకున్నవారే జీవితంలో రాణిస్తారు, శోభిస్తారు, ఉన్నస్థితి నుండి ఉన్నత స్థితికి ఎదగ గలుగుతారు.

నెపోలియన్ ఒక సామాన్య సైనికుడుగా తన జీవితాన్ని ప్రారంభించి ఫ్రాన్స్ సామ్రాజ్యానికి చక్రవర్తి అయ్యాడు. అంత ఎత్తుకు ఎదగడం సామాన్యమైన విషయంకాదు. జీవితంలో అతను ప్రదర్శించిన ధైర్యసాహసాలు, పట్టుదల, అకుంఠితదీక్ష, నైపుణ్యం, విచక్షణా జ్ఞానములే అతనిని అంత పెద్దవాడిని చేసాయి. ఇవి లేకుండా, ఏ వ్యక్తీ, దేనినీ సాధించలేడు. **'కృషి వుంటే మనుషులు ఋషులవుతారు'** కనుక ఈ రహస్యాన్ని విస్మరించకండి! ముఖ్యంగా విద్యార్థులు ఉన్నత శిఖరాలను అందుకోవాలంటే ఇది అత్యవసరం.

నెపోలియన్ బాల్యము నుండీ సాహసప్రియుడు. సాహసంతో, అసాధ్యమైన దానిని కూడా సాధించాలని భావించే వాడు నెపోలియన్. ఒకసారి అతను 'ఆల్ఫ్ ' పర్వతాలను అధిరోహించాలని నిర్ణయించుకుంటాడు. అప్పుడు అతని వయస్సు కేవలం 16 సంవత్సరాలే. ఆల్ఫ్ పర్వతాలను వెదుక్కుంటూ యాత్రను ప్రారంభించి, కొంత దూరం వెళ్ళుతాడు. దారిలో ఒక ముసలమ్మ కనిపిస్తుంది. ఆమె దగ్గరకు వెళ్ళి ఆల్ఫ్

పర్వత శిఖరానికి మార్గం అడుగుతాడు. ఆ ముసలమ్మ నవ్వి *"అబ్బాయీ! నీ వయసెంత? నీ అనుభవమెంత?"* అని అడుగుతుంది. ఆ బాలుడు తన వయస్సును చెబుతాడుగాని అనుభవం లేదంటాడు. అప్పుడు ఆ ముసలమ్మ నవ్వుతూ *"నీవింకా కుర్రవాడివి, నీకు ఇంకా చాలా భవిష్యత్తు వుంది. అనవసరంగా ప్రాణాలు ఎందుకు పోగొట్టుకుంటావు? ఎందరో వీరులు ఈ అసాధ్యమైన, పర్వతాన్ని ఎక్కడానికి ప్రయత్నించి దెబ్బతిన్నారు, మరికొందరు ప్రాణాలనే కోల్పోయినారు. కనుక వచ్చిన దారినే ఇంటికి వెళ్ళు!"* అని సలహా యిస్తుంది. ఆ ముసలమ్మ మాటలను ప్రశాంతంగా వినిన నెపోలియన్ *"అవ్వా! ఈ పర్వతం ఎక్కడంలో గల యిబ్బందులను చెప్పావు. నాకు సంతోషంగా వున్నది. ఏమైనా సరే, ఈ అసాధ్యమైన పర్వతాన్ని ఎక్కాలనే కుతూహలం కలుగుతున్నది, నాలో పట్టుదల కూడా పెరుగుతున్నది. ధైర్యంతో ఈ సాహసానికి పూనుకుంటాను. త్వరలోనే ఈ పర్వత శిఖరంపై అడుగుపెడుతాను"* అని అంటాడు యువకుడైన నెపోలియన్. *"బాబూ! భగవంతుడు నిన్ను రక్షించుగాక!"* అని ఆశీర్వదిస్తుంది ఆ ముసలమ్మ. ఎక్కడలేని ఉత్సాహంతో యాత్రను కొనసాగిస్తాడు, కొంతకాలం తరువాత అభేద్యమైన ఆ పర్వత శిఖరాన్ని చేరుకుంటాడు ఆ బాల వీరుడు *'నెపోలియన్'.*

*'సాధనమున బనులు సమకూరు ధరలోన'* అన్నాడు వేమన. *'ఉద్యమేన హి సిధ్యన్తి కార్యాణి న మనోరథైః'* అన్నారు అనుభవజ్ఞులైన పెద్దలు. ప్రయత్నము చేతనే పనులు సిద్ధిస్తాయి, కేవలం కోరికలుంటే చాలదు, దీనిని ఋజువు చేశాడు నెపోలియన్. కనుక పనులను సాధించాలంటే సాహసమూ కావాలి, ప్రయత్నమూ చేయాలి. ఈ రెంటినీ ముఖ్యంగా విద్యార్థులు విస్మరించరాదు.

ఒకసారి తన సైనికాధికారులను సంబోధిస్తూ నెపోలియన్ "Be clear, the rest will follow" అని చెబుతాడు. ఏదైనా ఒక పనిని సాధించాలంటే, సాధించవలసిన కార్యమును గురించి మంచి అవగాహన ఏర్పర్చుకోవాలి. అవగాహనకు వచ్చిన తరువాత కార్యక్రమాన్ని రూపొందించుకోవాలి. రూపొందించుకొనిన తరువాత, దానిని ఒక క్రమపద్ధతిలో అమలు పరచాలి. అప్పడే చేబట్టిన ఆ కార్యం విజయవంతమవుతుంది. ముఖ్యంగా యుద్ధం చేసేముందే సైన్యాధిపతులకు ఇట్టి అవగాహన అత్యవసరం. సరియైన అవగాహన లేకుండా యుద్ధానికి సంసిద్ధం కాకూడదు. అట్టి ఆలోచన, అవగాహన వుండటం వలననే స్పెయిన్ నుండి రష్యా వరకు గల అనేక దేశాలను జయించగలిగాడు నెపోలియన్.

కనుక ప్రతి ఒక్కరికీ ఆలోచన, అవగాహన వుండాలి. దానిని అమలు పరచడానికి చక్కటి **'ప్లానింగ్'** కూడా ఉండాలి. ముఖ్యంగా విద్యార్థులకు, వారు చదివే చదువుల మీద మంచి అవగాహన వుండాలి. ఏ చదువు చదివితే మంచి భవిష్యత్తు ఉంటుందో తెలిసికొని ఆ చదువును చదవాలి. పిల్లల ఆలోచనలకు పెద్దలు కూడా ప్రాధాన్యత యివ్వాలి. అప్పుడే విద్యార్థులు జీవితంలో రాణించగలుగుతారు.

ఒకసారి నెపోలియన్ మారువేషంలో ఆ దేశ ప్రజల మనోభావాలను, దేశ స్థితిగతులను స్వయంగా తెలుసుకోవడానికి బయలు దేరుతాడు. ఒక సంపన్నురాలైన ఒక మహిళ కూడా ఆయనతో బయలు దేరుతుంది. వారి వెంట అంగరక్షకులెవరూ ఉండరు. సందూలూ, గొందులూ తిరుగుతుంటారు. ఒక ఇరుకైన సందులో ఒక కూలి, నెత్తి మీద పెద్ద బరువు పెట్టుకొని ఎదురుగా వస్తాడు. తప్పకోవడానికి కూడా వీలుండదు. నెపోలియన్ మాత్రం ప్రక్కకు తప్పకొని, ఆ కూలీకి దారి యిస్తాడు. ఆ మహిళ మాత్రం ఠీవీగా నడుస్తుంటుంది. ***"మేడమ్! ఆ కూలి మనిషి మోస్తున్న బరువును మనం గమనించాలి ప్రక్కకు తప్పకోండి!"*** అంటాడు నెపోలియన్. ఆ మహిళ నివ్వెరపోతుంది. ***"మేడమ్! ఈ సామాన్య ప్రజలే నా దేశానికి మూలస్తంభాలు. దీనిని విస్మరించకండి!"*** అని అంటాడు నెపోలియన్. అప్పుడు ఆ మహిళ నెపోలియన్ మనో భావాలను అర్థం చేసికొని, ప్రక్కకు తప్పకుంటుంది. ఈ సంఘటన నెపోలియన్ విశాల భావాన్ని ప్రకటిస్తున్నది.

***గొప్పవారిని గౌరవించడం, చిన్నవారిని చీదరించుకోవటం మంచిది కాదు. అందరినీ సమంగా చూడటం నేర్చుకోవాలి. సమత్వ సిద్ధాంతానికి మించినది లేదు. "లోకాస్సమస్తా సుఖినో భవంతు", "సర్వేజనా సుఖినో భవంతు". భారతీయ సంస్కృతీ వైశిష్ట్యం అదే. మరచిపోకండి!***

---

"సాహసంతో ఎంతటి అసాధ్యమైన పనులనైనా సాధించవచ్చును. పట్టుదల వుంటే ఉన్నతశిఖరాలనైనా అధిరోహించవచ్చును. క్రమశిక్షణ వుంటే దేనినైనా సాధించవచ్చును. కనుక ప్రతి ఒక్కరూ పట్టుదల, క్రమశిక్షణలను అలవరుచుకొని, సాహసంతో ముందుకు సాగిపోవాలి".

**- నెపోలియన్**



## సంఘ సంస్కరణోద్యమ పితామహుడు రాజారామమోహనరాయ్

అగ్నిజ్వాలలు ఆకాశాన్ని అందుకుంటుంటాయి. ఆ మంటలలో నుండి ఒక అభాగ్యురాలి ఆర్తనాదం వినపడుతూ ఉంటుంది. ***"ఈ మంటలను నేను భరించలేను. నా కళ్ళు కనపడటం లేదు. నన్ను రక్షించండి... రక్షించండి ...."*** అని రోదన చేస్తుంటుంది ఒక అభాగిని. చుట్టుప్రక్కల వున్న జనానికి ఆ రోదన వినిపించదు. ***"జయం! జయం! పతివ్రతా తిలకానికి జయం!"*** అంటూ డప్పులు మ్రోగిస్తుంటారు, నాట్యం చేస్తుంటారు. ఆ చితి మీద నుండి బయట పడటానికి ప్రయత్నిస్తుంటుంది ఆ అభాగిని. ఆమె బంధువులు, పురోహితులు, ఆమెను బలవంతంగా మంటలలోనికి త్రోసివేస్తుంటారు. ఆ అగ్ని జ్వాలలకు ఆమె భస్మీపటలమైపోతుంది. ఇంతలో ఒక వ్యక్తి పరిగెత్తుకుంటూ వస్తాడు. ***"ఆగండి! ఆగండి! ఆగండి!"*** అని పెద్దగా కేకలు వేస్తూ వస్తాడు. ***"వదినా! నీవు బ్రతికి వుండగానే దగ్ధం కావడానికి వీలులేదు"*** అని ఏడుస్తూ అరుస్తుంటాడు. చుట్టూ వున్నజనం అతనిని బయటకు త్రోసివేస్తుంది. అయినప్పటికీ అతను తన ప్రయత్నాన్ని మానడు. మరల ముందుకు త్రోసుకొని వస్తాడు. ***"నా అన్నను శాంతంగా పోనివ్వండి! చనిపోయిన వారెవరూ, బ్రతికి ఉన్న వారిని తమతో రమ్మనమని కోరరు. భర్తను కోల్పోయిన ఆమెను రక్షించండి! నా సోదరుని ఆత్మను శాంతి పొందనివ్వండి!"*** అంటూ అతను విలపిస్తుంటాడు. వినేదెవరు? మద్దెళ్ళు, డప్పుల మోతలలో ఎవరు పట్టించుకుంటారు? ఆయన రోదన అరణ్య రోదనే అవుతుంది. చేయగలిగేదేమి లేక, భరించలేని బాధతో వెక్కి...వెక్కి... ఏడుస్తూ ***"ఈ ఘోర దురాచారాన్ని అరికట్టేంతవరకు విశ్రమించను"*** అని తనలో తానే శపథం చేసుకొని, పొంగిపొరలి వచ్చే కన్నీటి ధారలను తుడుచుకుంటూ ఇంటికి చేరుతాడు. అతనే ***రాజారామమోహన రాయ్.***

అది 1811 సంవత్సరం. తన అన్నగారు జగన్మోహనుడు మరణించిన సమయం అది. పతిని అనుసరించడమే సతి ధర్మమని పెద్దలు చెప్పి, భర్త పాడె మీద

భార్య 'అలోక్ మంజరి'ని కట్టివేసి దహన సంస్కారం చేస్తారు. ఆ దుస్సంఘటన 'రాయ్' హృదయాన్ని కదిలించి వేస్తుంది. అది ఆయనను సంఘసంస్కరణోద్యమ నేతగా మార్చి వేస్తుంది. బలవంతపు సహగమనానికి పురికొలిపేవారిని నివారించడానికి ఎన్నో సార్లు స్మశానం చుట్టూ తిరుగుతాడు. ఆ దురాచారం ఎంత ఘోరమైనదో ప్రజలకు నచ్చ జెప్పడానికి ప్రయత్నిస్తాడు, కొంత మంది యువకులను సమీకరించి ఉద్యమాన్ని చేబడతాడు. సంఘ సంస్కర్తలు సహజంగా ఎదుర్కొనే కష్టాలను ఆయన కూడా ఎదుర్కొంటాడు. చిట్టచివర్కి అతని తల్లి 'తారిణీదేవి' తన పూర్వీకుల ఇంటిలో నుంచి అతనిని గెంటి వేస్తుంది. రఘునాథపురం స్మశాన వాటికలో, ఇల్లు కట్టుకొని, సకుటుంబముగా అక్కడకు తరలి వెళ్ళుతాడు 'రాయ్'. సమాజం అతనిని వెలివేస్తుంది, ఏకాకిగా జీవించవలసి వస్తుంది. అయినప్పటికీ ఏమాత్రం నిరుత్సాహపడక, నిరాశ చెందక, ధైర్యమును విడనాడక, తాను నమ్మినదానిని ప్రచారం చేసుకుంటూ ముందుకు సాగిపోతాడు రాయ్'.

డిగ్బీ దొరగారి క్రింద పనిచేస్తూ, ఒకసారి కృష్ణకాంత్ బాసుతో కలిసి భూటాన్ వెళ్ళివస్తాడు. చక్కటి వ్యవహార దక్షుడుగా పేరు తెచ్చుకుంటాడు. డిగ్బీ దొర భారతదేశం విడిచి వెళ్ళగానే 1814 సం॥లో కలకత్తాలో స్థిరపడుతాడు 'రాయ్'. ఉద్యోగమును విరమించి, హిందూ ధర్మ సంస్కృతీ వేదాంతములను అధ్యయనం చేస్తాడు. వ్యక్తి యొక్క ఆధ్యాత్మిక విశ్వాసం కేవలం శాస్త్రాల సాక్ష్యం మీదనే ఆధారపడకూడదని, వ్యక్తి సామాన్య బుద్ధికి, హేతుజ్ఞానానికి కూడా అంగీకార యోగ్యంగా ఉండాలని ఆయన విశ్వాసం. వేదాంత సూత్రాలను, ఉపనిషత్తులను వంగ, ఆంగ్ల భాషలలోనికి తర్జుమా చేసినవారిలో ఈయనే ప్రథముడు. 1827 సం॥లో **'వజ్రసూచిక'** అనే సంస్కృత గ్రంథాన్ని ముద్రించాడు. కుల, మత వివక్షతలకు వ్యతిరేకంగా వ్రాసిన గ్రంథం అది. నిరర్థకమైన మూర్ఖవాదాన్ని ఆయన ఎన్నడూ అంగీకరించలేదు. విగ్రహారాధనను వ్యతిరేకించాడు. 'ఇతరులు ***నీపట్ల ఎలా ప్రవర్తించాలని నీవు కోరుకుంటావో! అదేవిధంగా నీవు వారిపట్ల ప్రవర్తించు!"*** అనే నైతిక సూత్రాన్ని ఆచరించి, అనుసరించమని కోరాడు రాజారామోహనుడు.

హిందూ సమాజంలో ఉన్న ఛాందస భావాలను ఏ విధంగా వ్యతిరేకించాడో, అదేవిధంగా, క్రైస్తవ మతంలో నున్న ఛాందస భావాలను కూడా వ్యతిరేకిస్తూ అనేక గ్రంథాలు వ్రాసాడు 'రాయ్'. క్రైస్తవ ప్రచారకులు వ్యతిరేకించినా, ఆయన వ్రాసిన గ్రంథాలకు అమెరికా, ఐరోపా ఖండాలలో విశేషమైన ఆదరణ లభించింది. 1828 సం॥లో ఆగష్టు

20వ తేదీన బ్రహ్మసమాజ స్థాపన జరిగింది. ప్రతి శనివారం ప్రార్థనా సమావేశాలు జరిగేవి. ఇద్దరు తెలుగు బ్రాహ్మణ పండితులు నిత్యమూ అక్కడ వేదపఠన చేసేవారట. సమాజంలో పాతుకొనిపోయిన దురాచారములను ప్రతిఘటించాడు గాని విశ్వజనీనత ఆయన దృక్పథం. ఆయన ప్రతిపాదించిన సర్వమత సమన్వయ సిద్ధాంతం విదేశీయులను విశేషంగా ఆకర్షించింది. 'రాయ్' బోధించిన విశ్వమానవతా వాదం విశ్వకవి రవీంద్రనాథ టాగూర్‌ని కూడా ప్రభావితం చేసింది.

శరీరం ఆరోగ్యంగా వుంటేనే మనస్సు ఆరోగ్యంగా ఉంటుందని ఆయన భావన. ఒకసారి యాభై మామిడిపండ్లు తిని, 10 శేర్ల పాలు త్రాగాడుట. అంతేకాదు స్నేహితుడు ఇచ్చిన యాభై కొబ్బరి కాయల నీరుత్రాగి పూర్తిగా కొబ్బరిని కూడా తినివేశాడుట. ఒక్క తిండిలోనే కాదు, చదువులో కూడా గొప్పవాడే. తొమ్మిది సంవత్సరముల నుండి పన్నెండేండ్ల వరకు అరబ్బీ భాష నేర్చుకున్నాడు. 16 సంవత్సరాల వరకు కాశీలో సంస్కృతం నేర్చుకున్నాడు. ఇంకా చిన్నప్పుడు పాఠశాలలో మాతృభాష బెంగాల్, ఇంటి వద్ద పారశీ భాషలను నేర్చుకున్నాడు. టిబెట్టు వెళ్లి అక్కడి భాషలు కూడా నేర్చుకున్నాడు. మొత్తం అతనికి 16 భాషలు వచ్చునంటారు.

"*బహుశః ప్రగతి శీలం గల వేదాంతి రామమోహనుడు ఒక్కడే*" అని ప్రశంసిస్తారు మాక్స్ ముల్లర్, విలియమ్స్ మహాశయులు.

ఏ జాతి చరిత్రను తరచి చూచినా మనకు కనిపించేది ఒక్కటే. మంచితో పాటు చెడు ప్రయాణం చేస్తూ ఉంటుంది. మంచికన్నా చెడు ప్రబలినప్పుడు సంస్కర్తలు ఉద్భవిస్తారు. మంచిని పెంచుతారు, చెడును త్రుంచివేస్తారు. చెడును మంచిగా మార్చగలుగుతారు. మార్పు ప్రగతికి చిహ్నం. కనుక మార్పును సహనంతో స్వీకరించడం విజ్ఞుల లక్షణం. సాంఘిక దురాచారాలు, ఛాందస ప్రవృత్తి ప్రబలిన సమయంలో సంస్కరణోద్యమాన్ని చేబట్టి ప్రజలను చైతన్యవంతులను గావించిన వారిలో ప్రముఖుడు, సంఘసంస్కరణోద్యమ పితామహుడు రాజారామమోహనరాయ్. ఆ మహనీయుడు చూపిన మార్గమున నడవటం మన విద్యుక్త ధర్మం. అప్పుడే మనం ఈ సమాజమునకు ఉపయోగపడిన వారమవుతాం.

---

"క్రమశిక్షణ, గురుభక్తి అంతరంగము నుండి రావాలి. బాహ్యంగా భయపెట్టి వాటిని రప్పించ ప్రయత్నించరాదు".

- రాజరామమోహనరాయ్



# 'భారతరత్న' శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్య

*"మీ అభిప్రాయాలు ఎలా వున్నా, మీ సహకారం పొందే అదృష్టం మాత్రం నాకుండనివ్వండి. నిష్కపటమైన మీ నిజాయితీ, మీ సామర్థ్యం, దేశ భక్తిల పట్ల నాకున్న గౌరవం, విశ్వాసం ఏనాటికీ తరగవు".* అన్నారు గాంధీజీ.

ఎవరు గొప్ప? అనే ప్రశ్న అనాదిగా మనలను వెంటాడుతూ వస్తున్న ప్రశ్న? *"కొందరు గొప్పవారుగా జన్మిస్తారు. మరి కొందరిపై గొప్పతనం వచ్చి మీదపడుతుంది"* అంటారు షేక్స్‌పియర్. అసలు అందులోనూ ఆ గొప్పతనమును నిలబెట్టుకున్నవారి సంఖ్య చాలా స్వల్పంగా ఉంటుంది. కనుక గొప్పతనాన్ని వాస్తవంగా సాధించిన వారే గొప్ప. తమ స్వశక్తి మీద పైకి వచ్చిన వారే గొప్పవారు. అలా తమ చరిత్రను తామే నిర్మించుకున్న వారిలో గొప్పవాడు *మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు.*

విశ్వవిఖ్యాత ఇంజనీరుగా, పరిపాలనా దక్షుడుగా, మైసూరు సంస్థాన దివాన్‌గా గొప్ప పేరును గడించారు విశ్వేశ్వరయ్య. ఆయన మైసూర్ సంస్థాన దివాన్ పదవిని స్వీకరించేముందు తమ బంధువులను, మిత్రులను పిలిచి *''నేను దివాను పదవిలో ఉన్నంత కాలం, ఎట్టి సిఫార్సులను చేయమని, అక్రమపద్ధతులను అనుసరించమని మీరు, నాకు హామీ యిస్తేనే నేను దివాను పదవిని చేబడతాను. లేకున్న ఆ పదవిని తిరస్కరిస్తాను"* అని చెప్పారు. ఆ విధంగా అందరూ హామీ యిచ్చిన తరువాతనే దివాను పదవీ బాధ్యతలను స్వీకరించారు విశ్వేశ్వరయ్య. ఈ సంఘటన ఆయన నిజాయితీకి దర్పణం.

తన ఇంటికి వచ్చినవారెవరైనా సరే, వారిని కుర్చీలో కూర్చుండబెట్టిన తరువాతనే వారు కూర్చుండేవారు. వారు ఏనాడూ తన అధికార దర్పమును ప్రదర్శించి ఉండలేదు. అది ఆయన నిగాడంబరానికి నిదర్శనం. ఒక మనిషిని పరీక్షించాలంటే, అతనికి

అధికారం యిచ్చి చూడాలి. సంపద వచ్చిన తరువాత చూడాలి. ***అధికారం, సంపద, ఈ రెండూ మనిషిని పతనం చేస్తాయి.*** పదవి లభించగానే ప్రజలను మరిచిపోవటం సహజంగా వస్తున్న మన సంప్రదాయం. ధనం చేరగానే దాతృత్వ బుద్ధి సన్నగిల్లి పోతుంటుంది. అలా మారనివారు బహుకొద్దిమందే ఉంటారు. నూటికి ఒకరే కనిపిస్తూ ఉంటారు, అరుదుగా ఉంటారు. అలాంటి వారిలో విశ్వేశ్వరయ్య ఒకరు. వారిని పదవులు మార్చలేదు. పైపెచ్చు వారు పదవులకే వన్నె తెచ్చారు.

శ్రీ విశ్వేశ్వరయ్య మైసూరు సంస్థాన దివాన్ పదవిని అత్యంత సమర్థవంతంగా నిర్వహించి, కీర్తి ప్రతిష్ఠలను తెచ్చుకొని, స్వచ్ఛందంగా పదవీ విరమణ చేశారు. పదవీ విరమణరోజు సాయంకాలం ఐదు గంటలకల్లా తమ బాధ్యతలనప్పగించి కార్యాలయం నుండి బయటకు వస్తారు. క్రింద పోర్టికోలో కారు సిద్ధంగా ఉంటుంది. డ్రైవరు కారు డోర్‌తెరచి ఎక్కమని ప్రాధేయపడుతాడు. అప్పడు విశ్వేశ్వరయ్య ***"ఇది దివాన్‌గారి కారు; నేను ఇప్పడు దివాన్‌ను కాదు. ఆ పదవి ముగిసింది. ఈ కారులో కూర్చునే హక్కు నాకులేదు".*** అని చెప్పి చేతికర్రను ఊపుకుంటూ కాలినడకన ఇంటికి వెళ్ళిపోతారు విశ్వేశ్వరయ్య. వారు యాదృచ్ఛికంగా పెద్దవారు కాలేదు. ఆదర్శపూర్వకమైన జీవిత విధానం వల్లనే వారు గొప్పవారయ్యారు.

మైసూరు సంస్థాన దివాన్‌గా అత్యంత సమర్థవంతంగా పదవిని నిర్వహించి నందులకు ప్రతిఫలంగా రెండు లక్షల రూపాయిలు పారితోషికంగా మహారాజుగారు, విశ్వేశ్వరయ్యగారికి పంపుతారు. కాని దానిని వారు స్వీకరించక, ఆ డబ్బును తిరిగి పంపుతూ "ఒక పారిశ్రామిక శిక్షణ సంస్థను నెలకొలిపి, ఆ సంస్థకు 'జయచామరాజేంద్ర' గారి పేరు పెట్టమని కోరుతారు. ఆయన తరువాత దివాన్‌పదవిని స్వీకరించిన **'మీర్జా ఇస్మాయిల్'** సంస్థానం తరుపున ఒక ఇల్లు నిర్మించి, ఇవ్వదలచినట్లు చెప్పగా, అద్దె తీసుకుంటేనే ఆ ఇంట్లో వుంటానని చెబుతారు విశ్వేశ్వరయ్య. అధికారం పోయినా, మంత్రిపదవులు ఊడినా, అధికార నివాసాలను ఖాళీచేయనివారు విశ్వేశ్వరయ్య నిస్వార్థ పరాయణత్వాన్ని ఆదర్శంగా తీసుకుంటే బాగుంటుంది.

విశ్వేశ్వరయ్య పలుపర్యాయములు విదేశాలలో పర్యటించారు. ఒక సారి తన స్వంత పని మీద విదేశాలకు వెళ్లవలసి వచ్చింది. ఆయన వద్ద తగినంత పైకము

లేదు. 'బ్యాంక్ ఆఫ్ మైసూర్' మేనేజరుగారికి అప్పు కావాలని ఫోన్ చేసి వెళ్ళుతారు. తాకట్టు పెట్టి అప్పుతీసుకోవడానికి భారత ప్రభుత్వ బాండ్లను మేనేజర్ గారికి యిస్తారు. ఋణ పత్రాలలో సూచించిన మూడున్నర శాతం వడ్డీ కూడా ఇస్తానని చెబుతారు. మేనేజర్ ఆశ్చర్యపోతాడు. అసలు ఆ బ్యాంక్ స్థాపకులు విశ్వేశ్వరయ్యగారే అయినప్పటికీ బ్యాంక్ నియమనిబంధనలను పాటించి, సత్సంప్రదాయమును నెలకొలిపారు విశ్వేశ్వరయ్య .

ప్రపంచ ఖ్యాతిని గడించిన డాక్టర్ విశ్వేశ్వరయ్య బాల్యంలోనే తండ్రిని కోల్పోతాడు. బెంగుళూరులోని మేనమామ ఇంటిలో భోజనం చేసి చదువుకునేవాడు. మేనమామ కూడా బీదవాడు కావటం వలన పుస్తకాలకు, స్కూల్ ఫీజుకు పిల్లలకు ట్యూషన్ చెప్పేవాడు విశ్వేశ్వరయ్య. పరీక్షఫీజుకు పైకం లేకపోయింది. 35 మైళ్ళ దూరంలో నున్న 'చిక్‌బళ్ళాపూర్'కు కాలినడకన వెళ్ళాడు. తల్లి వెంకట లక్ష్మమ్మ తన ఇంటిలోని రాగి పాత్రలను కుదువపెట్టి పన్నెండు రూపాయిలు కుమారునికి యిచ్చింది. వేకువనే లేచి కాలినడకన బెంగుళూరు చేరాడు విశ్వేశ్వరయ్య. అయితే సకాలంలో చేరలేక పోయాడు. ఫీజు తీసుకోవడానికి నిరాకరించాడు గుమస్తా. చివరకు ప్రిన్సిపాల్ గారిని కలిసి పరిస్థితిని వివరించగా ఫీజును కట్టడానికి అంగీకరిస్తారు. ఆ సంవత్సరం జరిగిన ఆ పరీక్షలో అందరిలో మొదటి వాడుగా ఉత్తీర్ణుడవుతాడు విశ్వేశ్వరయ్య.

*కష్టాలు పాఠాలు నేర్పుతాయి. 'కష్టేఫలి' అన్నారు గదా! "కృషితో నాస్తి దుర్భిక్షం" అని కూడా అన్నారు. కృషికి దైవకృపకూడా తోడవుతుంది. కృషి ఉంటే మనుషులు ఋషులవుతారు. అనే వాస్తవాన్ని తమ చేతలద్వారా డా॥ మోక్షగుండం విశ్వేశ్వరయ్య నిరూపించారు. వారు నడచిన బాటలో మనమందరం నడుద్దాం. మన కర్తవ్యాన్ని నెరవేరుద్దాం.*

---

"మన దేశము యొక్క దౌర్భాగ్యం సోమరితనం. దూరంగా వుండి చూస్తే అందరూ పనిచేస్తున్నట్లుగా కనిపిస్తారు. దగ్గరకు పోయి చూస్తే ఒకడు మాత్రమే పనిచేస్తుంటాడు. ఒకడు గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటాడు. మరొకడు నడుం వాలుస్తాడు. ఇంకొకడు వీళ్ళకు కబుర్లు చెబుతుంటాడు. ఇంకా ఎలా ఈ దేశం అభివృద్ధి చెందుతుంది?"



# గోపాలకృష్ణ గోఖలే

*"ఇదుగో! రేపు ఈ లెక్కలు ఇస్తున్నాను. ఎవరు సరిగ్గా ఇంటివద్ద చేసుకొని వస్తారో, చూస్తాను!"* అని చెప్పి ఒక లెక్కల మాస్టార్ పిల్లలకు Home work యిస్తారు. మరునాడు పిల్లలందరూ ఆ లెక్కలు చేసుకొని వస్తారు. కాని వారిలో ఒక అబ్బాయి మాత్రమే సరిగ్గా చేసుకొని వస్తాడు. ఆ ఉపాధ్యాయుడు అతనిని మెచ్చుకుంటూ *"వీడొక్కడే తెలివిగలవాడు. మీరూ ఉన్నారు ఎందుకు? వట్టి మొద్దులు. 'ఓ' అంటే 'న' రాదు"* అన్నారు. అతని వైపు పిల్లలందరూ చూచారు. ఆశ్చర్యం! ఆ పిల్లవాడు ఏడ్వటం మొదలుపెట్టాడు. *"ఏం నాయనా! ఎందుకు ఏడుస్తున్నావు?"* అని ఆ మాస్టారు అడుగగా *"మీరు నన్ను తెలివిగల వాడినని మెచ్చుకున్నారు గదా! కాని ఆ లెక్కలు నేను స్వయంగా చేయలేదుసార్! ఎవరో పెద్దల సహాయంతో చేసినవి సార్!"* అని చెప్పి పెద్దగా ఏడుస్తాడు ఆ కుర్రవాడు. మాస్టార్‌కి మరింత ఆశ్చర్యం వేసింది *"అబద్ధం చెప్పడమంటే ఎంత భయం ఈ "అబ్బాయికి! ఆహా! "* అనుకొని *"వీణ్ణి చూచి నేర్చుకోండి మంచి బుద్ధులు!"* అని మాస్టారు విద్యార్థులకు హితవు పలికాడు. ఆ అబ్బాయి ఎవరో తెలుసా? కటిక పేదరికాన్ని అనుభవిస్తూ కూడా ఏమాత్రం నిరుత్సాహ పడక తన అన్నగారు పంపిస్తున్న ఎనిమిది రూపాయిలలోనే, వంట చేసుకొని ఒక పూటే తిని, రాత్రిళ్ళు వీధి దీపాల క్రింద కూర్చొని చదివి బి.ఏ. పట్టమును పొంది, ప్రభుత్వ ఉద్యోగాలను ఆశించకుండా, పవిత్రమైన బడిపంతులు ఉద్యోగమును మాత్రమే వరించి, దేశసేవకు అంకితమైన మహాపురుషుడు అతనే *గోపాలకృష్ణ గోఖలే.*

ఒకసారి గోఖలే చదువుకుంటున్న సమయంలో, ఆ ఊరికి ఒక నాటక కంపెనీ వస్తుంది. ఆ నాటకం చూడాలని కోరిక. అయితే అతని వద్ద డబ్బు లేదు. ఇంతలో ఒక మిత్రుడు వచ్చి *'నేను తీసుకొని వెళ్ళుతాను నాటకానికి'* అని చెప్పి, టిక్కెట్టుకొని తీసుకొని

వెళ్ళుతాడు. కాని, మరునాడు ఆ మిత్రుడు వచ్చి నిన్నటి టిక్కెట్టు డబ్బు రెండు అణాలు తిరిగి యివ్వమని వత్తిడి చేస్తాడు. గోఖలే బాధపడుతాడు. టిక్కెట్టు డబ్బు అప్పుగా యిచ్చినదని నిన్ననే ముందుగా తెలిస్తే, అసలు ఆ నాటకానికే వెళ్ళకపోయేవాడను గదా! అని విచారిస్తాడు. గత్యంతరం లేక ఆ రెండు అణాలు తిరిగి యిస్తాడు. లాంతర్‌లో కిరసనాయలు కొని పోయడానికి అతని వద్ద డబ్బు ఉండదు. అప్పటి నుంచి వీధి దీపాల క్రిందనే అతను చదువుకుంటాడు. ఎంతో కష్టపడి బి.ఏ. డిగ్రీని సంపాదిస్తాడు. ఇంకా పైచదువులు చదవుకోవడానికి డబ్బులేదు. ఆ రోజులలో బి.ఏ. ప్యాసయినవారికి మంచి ఉద్యోగాలే వచ్చేవి. కాని ఆ ఉద్యోగాలు చేయడానికి అతనికి ఇష్టంలేదు. పిల్లలకు పాఠం చెప్పడమంటే గోఖలేకు చాలా ఇష్టం. అందువలన ఒక ధర్మ పాఠశాలలో నెలకు 35 రూపాయిల జీతం మీద ఉపాధ్యాయుడుగా చేరాడు. జీతం తక్కువని ఆయన ఎన్నడూ భావించలేదు. పైపెచ్చు పిల్లలకు చదువుచెప్పే మహద్భాగ్యం లభించినందులకు సంతోషించాడు. ఇంగ్లీషు, లెక్కలు, ఆర్థిక శాస్త్రం, చరిత్ర , పిల్లలకు చక్కగా బోధించి, పిల్లల హృదయాలను దోచుకున్నాడు గోఖలే.

ఒకసారి ఓడను గురించి, సముద్రమును గురించి పాఠం చెప్పవలసి వచ్చింది. సముద్రమును గురించి అతనికి తెలుసుగాని, ఓడను గురించి అంత బాగా తెలియదు. అందువలన ప్రత్యేకంగా, తన స్వంత ఖర్చులతో బొంబాయి వెళ్ళి, అక్కడి అధికారుల అనుమతిని పొంది, హార్బర్‌లో ఉన్న ఓడలోనికి వెళ్ళి, ప్రతిభాగాన్ని స్వయంగా పరిశీలించి వచ్చిన తరువాతనే, ఓడను గురించిన పాఠమును పిల్లలకు బోధిస్తాడు గోఖలే.

తనకు తెలియని విషయాలను గోఖలే పిల్లలకు చెప్పేవాడు కాదు. మొదట తాను క్షుణ్ణంగా తెలుసుకునేవాడు. ఆ తరువాతనే పిల్లలకు పాఠం చెప్పేవాడు. అదే ఆయన ప్రత్యేకత. ఈనాటి ఉపాధ్యాయులు ఆయనను అనుసరిస్తే ఎంత బాగుంటుందో!

విద్యారంగానికి సేవ చేయడంతో జీవితం ప్రారంభించి, మున్సిపల్ ఛైర్మన్ పదవిని పొంది, ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యత్వం వరకు పలుపదవులను అధిష్ఠించి, దేశానికి ఎనలేని సేవ చేశారు గోఖలే. భారత దేశమునకు అవసరమైన రాజ్యాంగ ముసాయిదాను రూపొందించి, అప్పటి వైశ్రాయికి సమర్పించిన కార్యదీక్షా దక్షుడు గోఖలే.

చిత్త శుద్ధి, స్థిరసంకల్పం ఆయనలో ప్రస్ఫుటంగా కనిపించేవి. తాను పయనించే మార్గంలో ఎన్ని అడ్డంకులు ఎదురైనా, అవరోధాలు ఏర్పడినా ఆత్మవిశ్వాసంతో

ముందుకు సాగిపోవడం ఆయన సహజ లక్షణం. నిరాశా నిస్పృహలు ఆయన ముఖంలో ఎప్పుడూ కనిపించేవి కావు. సహనంతో, పట్టుదలతో ఎంతటి అసాధ్యమైన కార్యాలనైనా సాధించేవారు. కార్యకర్తలను ఉత్సాహపరచి ముందుకు నడిపించడంలో ఆయనకు ఆయనే సాటి. అందువలననే, అతి పిన్నవయసులోనే అఖిల భారత కాంగ్రెసు సంస్థకు కార్యదర్శిగా ఎన్నుకోబడినారు.

1905 సం॥లో బ్రిటన్‌లో ఎన్నికలు జరుగుతున్నాయి. అక్కడి ప్రజాభిప్రాయాన్ని, భారత దేశానికి అనుకూలంగా మలచడం అవసరమని భావించిన కాంగ్రెసు పార్టీ ఇంగ్లాండ్‌కు గోఖలే మరియు లాలాలజపతిరాయ్‌లను మాత్రమే పంపుతుంది. అక్కడ ఉన్న 50 రోజులలో 45 సభలలో గోఖలే ప్రసంగించి, భారత్ స్వాతంత్ర్యానికి అనుకూలంగా అక్కడి ప్రజల మనోభావాలను మార్చగలుగుతాడు గోఖలే. రోజుకు 18 గంటలు పని చేయటం వలన అతని ఆరోగ్యం దెబ్బతింటుంది. తిరుగు ప్రయాణంలో ఆయన గొంతుకు ఓడలోనే ఆపరేషన్ చేయవలసి వస్తుంది. ది. 19-2-1915 న ఆయన పరమపదిస్తారు. కేవలం 49 సంవత్సరాలకే అకాల మృత్యువు ఆయనను కబళించివేస్తుంది.

'జాతిపిత'గా ఈనాడు భావిస్తున్న మహాత్మాగాంధీజీ ***"గోఖలే నా రాజకీయ గురువు. గోఖలే స్ఫటికంలా పవిత్రుడు. గొర్రెపిల్లలా సాధువు. సింహంలా పరాక్రమవంతుడు"***. అని ప్రస్తుతించుతారు. గోఖలే మరణించినప్పుడు బాలగంగాధర తిలక్ ***"భారత దేశపు మాణిక్యం, మహారాష్ట్ర మణిదీపం' అయిన గోఖలే మనలను విడిచిపోయినారు. ఇది దుఃఖం పొంగి పొరలే సమయం అయినా, మీరందరూ ఆ భౌతిక కాయంవైపు చూడండి! ఆయన ఆదర్శ ప్రాయమైన జీవితం మీ జీవితాలకు ఒరవడిగా చేసుకుంటే, ఆయన ఆత్మకు నిజంగా శాంతి చేకూర్చినవార మవుతాము"*** అని చెప్పి గోఖలే అంతిమ యాత్రలో పాల్గొంటారు తిలక్. గోఖలే వంటి అమర వీరుల చరిత్రలు భావి తరాలకు స్ఫూర్తి ప్రదాయకములు.

---

"జీవితంలో తనకాళ్ళ మీద నిలబడే శక్తి నిచ్చేదే నిజమైన విద్య. ధైర్యం, క్రమశిక్షణ నేర్పేది విద్య. అన్యాయాన్ని, అధర్మాన్ని భయంలేకుండా ఎదుర్కొనే శక్తినిచ్చేదే నిజమైన విద్య. విద్యాలయాలు మానసిక దాస్యం నేర్పే జైళ్ళుకావు".

- గోపాలకృష్ణ గోఖలే



# 'పంజాబు కేసరి' లాలాలజపతిరాయ్

*"జ్ఞాపక ముంచుకో! ఇలాంటి ప్రభుత్వం నిలువదు! ఈరోజున నా దేహంపైబడిన దెబ్బలు ప్రతి ఒక్కటి భారతదేశంలో ఆంగ్లేయుల పరిపాలన యొక్క శవపేటికను కొట్టబడిన చిట్టచివరి మేకులవుతాయి. జాగ్రత్త!"* అని వేదిక ప్రక్కనే నిలుచొని ఉన్న పోలీస్ డిప్యూటీ సూపరింటెంట్ 'నీల్' వైపు వ్రేలు చూపుతూ హుంకరించారు లాలాలజపతిరాయ్.

అది 1928 సం॥ అక్టోబర్ 20వ తేది. సైమన్ కమీషన్ లాహోర్ వచ్చిన రోజు *"సైమన్ గోబ్యాక్"*, *"సైమన్ హటావ్ ....సైమన్ హటావ్"* అనే నినాదాలు యిస్తూ అశేష ప్రజానీకం నల్లజెండాలతో ప్రవాహంలా ముందుకు సాగిపోతున్నది. ఇంతలో జన సమూహంలో గుసగుసలు మొదలైనాయి". *"లాలాజీ అయేహై"... "లాలాజీ ఆగయే"* అనే కేకలు వినిపించాయి. *'పంజాబుకేసరి' లాలాలజపతిరాయ్* రంగప్రవేశం చేశారు. ప్రజలు ఉత్సాహంతో కేరింతలు కొడుతున్నారు. 64 సంవత్సరాల వయోజ్ఞాన వృద్ధుడు అయిన లాలాజీ ఆ ఊరేగింపు అగ్రభాగాన నిలిచారు. వారి ప్రక్కనే డా॥ సత్యపాల్, గోకుల్‌చంద్ నారంగ్ ప్రభృతులు ఉన్నారు. భగవతీ చరణ్, సుఖదేవ్, యశ్ పాల్ మొదలైన విప్లవ వీరులు 'లాలాజీ'కి రక్షణ కవచంగా నిలిచారు.

*"భారత మాతాకి జై! లాలాలజపతిరాయ్‌కి జై! సైమన్ హటావ్! సైమన్ హటావ్!* నినాదాలతో ప్రజల ఉత్సాహ సాగరం పొంగనారంభించింది. లాలాజీ సాక్షాత్ ప్రళయ రుద్రుడులాగే ముందుకు సాగిపోతున్నాడు. *"సైమన్ గోబ్యాక్... సైమన్ గోబ్యాక్"*అంటూ పంజాబ్ కేసరి నోటివెంబడి వెలువడుతున్న ఆ గర్జన విన్నప్పడు బ్రిటీష్ అధికారుల గుండెలు వణకసాగాయి. లాలాజీ శిరస్సు ఎండ తీవ్రతకు లోనుకాకూడదని ఎవరో

గొడుగుపట్టారు. ఆ ప్రదర్శన రైల్వేస్టేషన్‌కు చాలా దగ్గరగా వచ్చింది. పోలీసులు ముళ్ళ తీగలను అడ్డంగా కట్టడంవలన ప్రదర్శన అక్కడనే ఆగిపోయింది గాని నినాదాలు మాత్రం మిన్ను ముట్టుతునే ఉన్నాయి. సైమన్ కమీషన్ రైలు దిగింది. ప్రజల కోపం తారాస్థాయికి చేరుకుంది. పోలీసులు అడ్డంగా పెట్టిన ముళ్ళతీగెలు పటాపంచలై పోయినాయి. జనం ముందుకు ముందుకు త్రోసుకొని పోతున్నారు. పోలీసులు ఆ జనాన్ని ఆపలేకపోయారు. ఇంతలో "ఛార్జ్" అని స్కాట్ దొర నోటినుండి ఆజ్ఞ వెలువడింది. అంతే! పోలీసుల లాఠీలు ప్రజల మీద విరుచుకుపడ్డాయి. రక్తం చింది ప్రవహింప నారంభించింది. ప్రజలు శాంతంగా దెబ్బలు తింటూ కూడా "సైమన్ గోబ్యాక్! భారత మాతకీ జై! నినాదాలు చేస్తునే ఉన్నారు. లాలాజీ చుట్టూ యువకులు చేతులు చేతులు పట్టుకొని రక్షణ కవచంగా నిలబడ్డారు.

'స్కాట్' క్రూర దృష్టి 'లాలాజీ' మీద పడింది. పోలీసులకు 'సైగ' చేశాడు. పోలీస్ అసిస్టెంట్ సూపరింటెండెంట్ జే.సి స్సాండర్స్ ఉన్మత్తుడిలాగా లాఠీతో 'లాలాజీ' పైకి దూకి కొట్టనారంభించాడు. లాలాజీకి పట్టిన గొడుగు విరిగిపోయింది. దెబ్బమీద దెబ్బ లాలాజీ దేహం మీద పడింది. ఎదురురొమ్ముపై బలమైన దెబ్బ పడింది. లాలాజీ దేహం నుండి రక్తం ప్రవహిస్తున్నది. ప్రజలను చెదిరిపొమ్మనమని లాలాజీ ఆజ్ఞాపిస్తూనే స్పృహ తప్పిపడిపోయారు. కొందరు యువకులు ఆయనను ఎత్తుకొని తీసుకొని పోయారు. లాహోర్ అంతటా స్మశాన నిశ్శబ్దం ఆవరించింది. షాపులు, స్కూళ్ళు, ఆఫీసులు అన్నీ మూసివేశారు. ఆ సాయంత్రమే 'నిరసన సభ' ఏర్పాటు అయింది. వేలాది మంది ప్రజలతో సభ క్రిక్కిరిసిపోయింది. తగిలిన గాయాలకు కట్లుకట్టి, వేదికపైకి లాలాజీని మోసుకొని తీసుకొనివచ్చారు కొందరు యువకులు. పితృసమానుడైన ఆ నాయకుణ్ణి, ఆ స్థితిలో చూచిన ప్రజలు కన్నీరు మున్నీరుగా విలపించారు. పంజాబ్ కేసరి లేచి నిలబడింది. ***"నిరపరాధ ప్రజలపై అమానుషంగా దాడి చేయించిన ప్రభుత్వమును నాగరిక ప్రభుత్వం అని పిలవడానికి ఎలాంటి హక్కు లేదు"*** అని గర్జిస్తూ పై హెచ్చరికలు (ఈ వ్యాస ఆరంభంలో పేర్కొనిన) చేస్తాడు 'లాలాజీ'. ఆనాటి సభముగిసిన వెంటనే లాలాజీని మోసుకొని ఇంటికి తీసుకొని వెళ్ళుతారు. రోజులు గడిచిన కొద్దీ లాలాజీ ఆరోగ్యం క్షీణించి పోతుంటుంది. అది 1929 సం॥ నవంబర్ 17వ తేదీ. పంజాబ్ కేసరి మరణించిన

దుర్దినం. ఆనాడు స్కాండర్స్ కొట్టిన దెబ్బల ఫలితంగానే ఆయన మరణించాడని వైద్యాధికారులు ప్రకటిస్తారు.

ఆ సాయంత్రం దుఃఖావమానములతో కృంగిపోయిన వేలాది మంది ప్రజలు లాలాజీ శవయాత్రలో పాల్గొంటారు. రావీ నదీ తీరంలో సిద్ధంచేసిన చితిపై లాలాజీ మృతదేహాన్ని ఉంచుతారు. వేదఘోషల మధ్య ఆ చితికి అగ్ని తోడై లాలాజీని తనలో చేర్చుకుంటుంది. ఆ దుర్వార్త విని దేశబంధు చిత్తరంజన్‌దాస్ పత్ని 'బసంతీదేవి' లాహోర్ వస్తుంది. లాహోర్‌లో జరిగిన సంతాప సభలో ఆమె ప్రసంగిస్తూ ***"ఈ దేశంలో పురుషత్వము, యవ్వనము ఇంకా జీవించే ఉన్నాయా? పురుషత్వ యౌవనాలకు ఈ దురంతంతో లజ్జావమానాల అనుభవం జరుగలేదా? నేనీ భరత వర్షపు స్త్రీగా ఈ ప్రశ్నకు స్పష్టమైన జవాబు ఆశిస్తాను. మన ప్రియతమ లాలాజీ చితి మంటలు చల్లారేలోపుగానే, భారతదేశంలో పురుషత్వం, యువకులు దీనికి జవాబివ్వాలి?'*** అని బసంతీ దేవి విసిరిన సవాలును ఆనాటి యువత స్వీకరించి, స్వాతంత్ర్య సమరోద్యమంలోనికి దూకుతుంది.

లాలాజీ మొదట్లో ఉపాధ్యాయవృత్తిని చేబట్టాలని తలంచాడు. కాని మిత్రుల సలహాతో న్యాయవాద వృత్తిలో జీవనయాత్ర కొనసాగించాడు. రాజకీయాలలో ప్రవేశించినప్పటికినీ, ఆర్య సమాజం ద్వారా ఆయన చేసిన సేవ నిరుపమానం. పంజాబు ప్రభుత్వం 'నీటి పన్ను'ను పెంచినందులకు 'లాలాజీ' బ్రహ్మాండమైన ఉద్యమాన్ని లేవదీశారు. బ్రిటీష్ ప్రభుత్వం భయపడింది. ఆయన దేశంలో ఉంటే, ఆ ఉద్యమం ఇంకా బలపడు తుందని భావించి, ఆయనపై రాజద్రోహ నేరంమోపి, ఆయన్ని బర్మాలోని మాండలే జైలుకు పంపుతుంది. తిరిగి వచ్చిన తరువాత అనేక ప్రజాహిత కార్యక్రమాలలో పాల్గొంటూ వృత్తి శిక్షణా కేంద్రాలు, స్త్రీ విద్యాశిక్షణా కేంద్రాలు, సంస్కృత పాఠశాలలు, ఉచిత వైద్య శాలలు, అనాథ శరణాలయాలనెన్నింటినో స్థాపించి సమాజసేవ చేశారు. 16 ఉన్నత పాఠశాలలు, ఒక మహిళా విద్యాలయమును, లాహోర్‌లో ఒక జాతీయ కళాశాలను నెలకొలిపారు. అంతేకాక బాలగంగాధర తిలక్ పేరిట ఒక రాజకీయ పాఠశాలను నెలకొలిపి, దానికి 40వేల రూపాయిల విరాళమిచ్చి, లాహోర్‌లోని తన స్వంత భవనాన్ని కూడా యిచ్చిన త్యాగశీలి 'లాలాజీ'. స్వరాజ్య నిధికి గ్రామ గ్రామం తిరిగి తొమ్మిది లక్షల రూపాయిలు వసూలు చేసిన కార్యశూరుడు లాలాజీ.

లాలాజీ గొప్పరచయిత, బహుగ్రంథకర్త. ఆయన వ్రాసినన్ని జీవిత చరిత్రలు, ఆయన సమకాలీనులెవరూ వ్రాయలేదట. ఆయన A great Biographist (గొప్ప జీవిత చరిత్రకారుడు). అంతేకాదు ఉర్దూలో ***'వందేమాతరం' దిన పత్రికను, ఇంగ్లీషులో 'పీపుల్' అనే మాసపత్రికలను నడిపారు. ఇంగ్లీషులో 'నా దేశ బహిష్కరణ కథ'*** అనే పుస్తకం కూడా వ్రాసారు 'లాలాజీ'.

పరాయిపాలన నుండి భారతదేశం బయట పడాలన్నదే వారి ఏకైక వాంఛ. భరత జాతి స్వతంత్ర జాతి అని చాటాలన్నదే వారి పరమ లక్ష్యం. అపూర్వమైన ఈ పోరాటం ప్రారంభమైన తొలి రోజులలో ***"లాల్, బాల్, పాల్"*** అనే ముగ్గురు మహనీయులు ముఖ్యంగా చెప్పకోదగినవారు. ***'లాల్' అంటే లాలాలజపతిరాయ్. 'బాల్' అంటే బాలగంగాధర తిలక్. 'పాల్' అంటే బిపిన్ చంద్రపాల్.*** ఈ త్రిమూర్తులు మన దేశ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో చిరస్మరణీయులు. ఆ మహనీయులకు మనం జోహార్లు అర్పిద్దాం.



---

"స్వదేశీ ఉద్యమం మనలో 'ఆత్మగౌరవం' (Self Respect), 'ఆత్మవిశ్వాసం' (Self Confidence), 'స్వయంపోషకత్వం' (Self Supporting), 'స్వార్థత్యాగం' (Self Sacrifice) లను పెంపొందిస్తుంది. మత భేదాలను పాగొట్టి, మనల్ని అందరినీ సమైక్య పరుస్తుంది. మన మాతృభూమికోసం దృఢవిశ్వాసంతో, హృదయపూర్వకంగా చేతులు కలిపి పనిచేయడానికి ఇది తోడ్పడుతుంది. సమైక్యభారతావనికి ఈ స్వదేశీ ఉద్యమం ఎంతగానో ఉపకరిస్తుంది".

**- లాలాలజపతిరాయ్**



# 'కవికోకిల' సరోజినీ నాయుడు

*"ఎన్నిసార్లు చేసినా, ఆన్సర్ సరీగ్గా రాదు...పాడులెక్క!"* అని విసుక్కుంటుంది ఒక అమ్మాయి. అది 'ఆల్జీబ్రా' తాలూకు ఒక లెక్క. ఆ అమ్మాయికి లెక్కలంటే తలనొప్పి. మిగిలిన పాఠ్యాంశములలో (Subjects) మాత్రం ఆమె దిట్ట. మనసు మాత్రం లెక్కల మీదకు వెళ్లేదికాదు. ఒక తెల్లకాగితం తీసుకుంది. ఆలోచిస్తూ కూర్చుంది. ఆంగ్లంలో కొన్ని వాక్యాలు వ్రాసింది. తనలో తాను చదువుకుంది. అంతులేని సంతోషంతో బిగ్గరగా చదివింది. అవి మామూలు వాక్యాలు కావు. కమ్మని కవిత అది. ఆ అమ్మాయికప్పుడు పదకొండేళ్ళు మాత్రమే.

ఆ అమ్మాయి, పన్నెండో యేటనే మదరాసు విశ్వవిద్యాలయం వారి మెట్రిక్యులేషన్ పరీక్షలో, ఆ రాష్ట్రంలోనే ఫస్టుగా ప్యాసయింది. పదమూడవ యేటనే ఇంగ్లీషులో ఒక కావ్యం వ్రాసింది. దాని పేరే 'Lady of the Lake' (సరోవరపు సారసాక్షి) ఆ అమ్మాయి ఆరోగ్యం బాగాలేదని, పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలని వైద్యులు సలహా యిస్తారు. కాని నిత్యమూ పుస్తకాలు చదువుతుండేది ఆ చిన్నవయస్సులోనే.

ఆమె ఆంగ్ల కవయిత్రిగా మంచి పేరు సంపాదించింది, పెద్దల ప్రశంసల నందుకున్నది. పెద్దయిన తరువాత ఆమె గొప్ప కవయిత్రిగా కీర్తి ప్రతిష్ఠలనందుకున్నది. అంతేకాదు భారతదేశ 'కవికోకిల' (నైటింగేల్) అనే గొప్పపేరు కూడా సంపాదించింది. ఆమే **'సరోజినీ నాయుడు'**. సరోజిని 1879 సం॥ ఫిబ్రవరి 13న హైద్రాబాద్‌లో జన్మించింది. ఆమె తండ్రి పేరు అఘోరనాథ ఛటోపాధ్యాయ, తల్లి పేరు వరద సుందరీ దేవి. ఆమె తన 16వ యేట హైద్రాబాదులోని సుప్రసిద్ధ వైద్యుడు మేజర్ జనరల్ ముత్యాల గోవిందరాజుల నాయుడు గారిని ప్రేమిస్తుంది. వివాహం చేసుకోవాలని నిశ్చయించుకుంటుంది. కాని విద్యాభ్యాసానికి విదేశాలకు వెళ్ళి, తిరిగి స్వదేశానికి వచ్చి

తరువాత 1898లో ఆయననే వివాహం చేసుకుంటుంది. ఆ దంపతులకు ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు, పెద్దకొడుకు పేరు డా॥ జయసూర్య . హోమియో వైద్యంలో ఆయన మంచిపేరు గడించారు.

1915 సం॥లో ఆమెకు మహాత్మాగాంధీజీతో పరిచయం ఏర్పడుతుంది. ఆనాటి నుంచీ ఆమె రాజకీయాలకు అంకిత మవుతుంది. 1930సం॥లో గాంధీజీ పిలుపు నందుకొని ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొంటుంది. ఆమెను ఎర్రవాడ జైలులో నిర్బంధించుతారు. జైలులో పూల మొక్కలకు నిత్యమూ నీరు పోసి చక్కగా పెంచుతుండేది. అదే ఆమె నిత్యకృత్యం. ఆ విధంగా తాను పెంచే మొక్కలలో ఒకనాడు మొగ్గలను చూచింది. సంతోషంతో ఆ మొక్కలను చూస్తూ, ఆనందిస్తూ కూర్చున్నది. ఇంతలో ఎవరో పిలిచినట్లు అనిపించి, వెనక్కి తిరిగి చూడగా ***"అమ్మా! ఈ వేళ మిమ్ముల్ని విడుదల చేస్తున్నారు. సిద్ధంగా ఉండండి!"*** అంటారు ఆ జైలరు. ఆ వార్త వినిన వారు సహజంగా సంతోషిస్తారు. కాని సరోజినీ నాయుడు మాత్రం విచారిస్తూ ***"ఇంకా ఇక్కడ ఒక్క వారం ఉంచండి! నేను పెంచిన మొక్కలకు పూలు వస్తాయి వాటిని చూడాలని నాకెంతో ఆశగా ఉంది"*** అని అంటుంది. ***'వీల్లేదమ్మా!'*** అంటాడు ఆ అధికారి. ఏం చేయాలో తోచక తన చేతులతో పెంచి, పెద్దచేసిన ఆ పూల మొక్కలను ప్రేమతో చూచి, వాటిని వదలలేక...వదలలేక జైలునుంచి బయటకు వచ్చేస్తుంది. ఆమెకు ప్రకృతి అంటే అంత యిష్టమన్నమాట.

ఆమె ఆంగ్లంలో ఎన్నో కవితలు వ్రాసింది. కావ్యాలను రచించింది. అందులో 'The golden threshold' (బంగారు వాకిలి) 'The bird of time (కాలవిహంగము) 'The broken wing' (భగ్నపక్షము) అను కావ్యములు ప్రసిద్ధిగాంచాయి.

సరోజినీ నాయుడు గొప్ప కవయిత్రిగానే కాకుండా, గొప్ప వక్తగా కూడా పేరు గాంచింది. ఒకసారి ఒక సభలో ప్రసంగించడానికి వెళ్ళుతుంది. సభాప్రారంభానికి ముందు కరెంటు పోతుంది. సభలో గందరగోళం. సరోజినీ నాయుడు ఆ చీకటిలోనే ఉపన్యసించడానికి వేదిక ఎక్కుతుంది. ఉపన్యాసం మొదలుపెట్టిందో, లేదో తలుక్కున దీపాలు వెలుగుతాయి. సమయస్ఫూర్తితో వెంటనే ***"లైట్...లైట్..."*** అంటూ ఒక ఆంగ్ల కవితను చెబుతుంది. సభికులంతా సంతోషంతో చప్పట్లు కొడుతారు. అప్రయత్నంగా ఆనాడు చెప్పిన ఆ కవిత విశేషమైన ప్రచారంలోనికి వస్తుంది. ఆమె సహజ కవయిత్రి. అందువలననే ఆమెకు ***'కవి కోకిల'*** అనే బిరుదు కూడా లభించి ఉంటుంది.

1947 సం॥లో 'ఏషియన్ రిలేషన్స్' సభ ఢిల్లీలో జరిగింది. ఆ సభకు ఆమె అధ్యక్షత వహించారు. ఆనాడు ఆమె చేసిన ప్రసంగానికి ముగ్ధులై ఆసియా ప్రజలందరికీ నాయకురాలిగా ఆమెను ఎన్నుకుంటారు. మన దేశానికి స్వాతంత్ర్యం లభించిన తరువాత ఆమె ఉత్తర ప్రదేశ్‌కు గవర్నరుగా నియమించబడింది. స్వతంత్రం వచ్చిన తరువాత మొట్టమొదటి మహిళా గవర్నరు ఆమే. ఆమె గవర్నరు పదవిని స్వీకరించిన తరువాత తన సిబ్బందిని తగ్గించి, తన నివాసమును తానే శుభ్రంచేసుకొనేది. అతినిరాడంబరంగా జీవితాన్ని గడిపి, ఆదర్శ మహిళగా పేరు తెచ్చుకున్నది. మాటలలో చమత్కారిగా పేరు పొందింది. మనసులోని విషయాలను నిర్భయంగా, నిర్మొగమాటంగా చెప్పేది. నారీ లోకానికి వన్నె తెచ్చింది. ఆ పదవిలో ఉండగానే, అనగా 1950 సం॥ మార్చి 2వ తేదీన ఆమె శాశ్వతంగా కన్ను మూసింది. లక్నోలోని గోమతీ నదీ తీరాన దహన సంస్కారాలు జరిపి, అదే స్థానంలో ఒక స్మారక చిహ్నాన్ని కూడా నిర్మించుతారు.

*"రాజకీయాలను అత్యున్నత పథానికి, అద్భుతమైన కళారంగానికి గొనిపోయిన వ్యక్తి. ఆమె దేనిని తాకినా, తనలోని ఆవేశాగ్నితో, ఆకాంక్షతో నింపేవారు. ఆమె ఒక సుసంపన్నమైన సంస్కృతికి ప్రతినిధిగా నిలవగా, అనేక రకాలైన సంస్కృతీ ప్రవాహాలు ఆమెలోనికి ప్రవహించి, భారతీయసంస్కృతిని మహోన్నతమైన సంస్కృతిగా మరింత దేదీప్యమానంగా ప్రకాశింపజేస్తూ ఉండేవి'* అని జవహర్‌లాల్ నెహ్రూ, ఆమె మరణించినప్పుడు గౌరవ నీరాజనాలిస్తారు.

*ఆమె గవర్నర్ పదవిలో వున్న కాలంలో మహిళాభ్యున్నతికి, శరణార్థుల పునరావాసానికి ఎనలేని కృషి చేసింది. పరిపాలనా రంగంలో స్త్రీలు కూడా సమర్థులేనని, పురుషులకు ఏమాత్రం తీసిపోరని ఋజువు చేసింది సరోజినీ నాయుడు.*

ఆమె మరణానంతరం, ఆమె సోదరుడు హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ రేడియోలో ప్రసంగిస్తూ *"నలభైకోట్ల భారతీయుల ప్రియసోదరి వెళ్ళిపోయినది. మాతృభూమిలో చైతన్యం మాయమయింది. పాటవెళ్ళింది, నవ్వు మాయమైంది. ఆమె వెళ్ళిపోయిందని భావించే వారు తెలివితక్కువవారు. ఆమె ఎక్కడికీ పోలేదు. ప్రజాహృదయాలలో స్థిర నివాసమేర్పరచుకున్నది'* 'అని అంటారు.

*"ఆమెను గవర్నరుగా నియమించుటవలన ఆమెకు హోదా పెరుగుట కాదు. ఆమె నియామకం, వలన ఆ పదవికి ముందెన్నడూ లేని గౌరవం లభించింది"* అంటారు బాబూ రాజేంద్రప్రసాద్.

# నీతి సుధానిధి

*(MORAL EDUCATION BOOK)*

పంచమ భాగము

5

రచన - సంకలనం

శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు

ఎడిటర్ : 'శ్రీవాణి'

వ్యవస్థాపకులు : *E.H.V.L. CENTRE*

ప్రచురణ

నైతిక మానవతా విలువల అధ్యయన కేంద్రము

**ETHICS & HUMAN VALUES' LEARNING CENTRE**

(E.H.V.L. CENTRE)

24-52, Ramanaidupet, MACHILIPATNAM - 521 001.

✆ 08672 - 22818, 21137

# మనసులో మాట

"సత్ప్రవర్తన, సద్బుద్ధి, సత్యనిరతి
భక్తి, క్రమశిక్షణ, కర్తవ్యపాలనంబు
నేర్పునదే విద్య, అద్దాని విద్యార్థి నేర్వవలయు."

'విద్య' అంటే కేవలం చదవటం, వ్రాయుటం మాత్రమే కాదు, డిగ్రీలు సంపాదించటమే కాదు. మార్కులు, ర్యాంకులు తెచ్చుకోవటమే కాదు. పై ఆరు సద్గుణములు నేర్పునదే సరియైన విద్య. కనుక ప్రతి విద్యార్థి అట్టి విద్యను అభ్యసించాలి.

వినయం లేని విద్య, వివేకం లేని విజ్ఞానం, సంస్కారంలేని చదువు ఉన్నా ప్రయోజనం లేదు. విద్యతో పాటు వినయం, వివేకం, సంస్కారం ప్రతి విద్యార్థిలో ఉండాలి. నీతి, నిజాయితీలు వీటికి తోడుకావాలి. ఈ ఐదు విద్యార్థికి పంచప్రాణములు.

సత్యం, అహింస; ప్రేమ, కరుణ; దయ, దాతృత్వం; సేవ, స్నేహం; శాంతం, సహనం - ఇవి మానవతా విలువలు. ఈ విలువలను ప్రతివిద్యార్థి పెంపొందించుకోవాలి.

ఈనాడు కులం పేరుతో క్రుమ్ములాడుకుంటున్నారు. మతంపేరిట మారణహోమాలు జరుగుతున్నాయి. 'అస్పృశ్యత' సమాజాన్ని విచ్ఛిన్నం చేస్తుంటే, 'అసూయాద్వేషములు' వ్యక్తిని పతనం చేస్తున్నాయి. కనుక భావిభారత పౌరులు వీటికి ఎంత దూరంగా వుంటే అంత మంచిది.

దుర్గుణాలను దూరం గావించి, సద్గుణాలను నేర్పునదే సరియైన విద్య. అయితే ఇటువంటి ఉత్తమమైన, పవిత్రమైన విద్యను ఎప్పుడు? ఎవరికి? ఎవరు? నేర్పాలి. ఇదే ఈనాటి ప్రధాన సమస్య. ఇలాంటి విద్య వెల చెల్లిస్తే బజారులో దొరికేది కాదు, ఎప్పుడుపడితే అప్పుడు అబ్బేది కాదు.

'శైశవేభ్యస్త విద్యానామ్' విద్య బాల్యమునందే అభ్యసించాలి. అప్పుడే అది బాగా వంటపడుతుంది. అప్పుడు నేర్చుకున్నది, అలవరచుకున్నది మాత్రమే జీవితాంతం గుర్తువుంటుంది. మధ్యలో నేర్చుకున్నది మధ్యలోనే పోతుంది. కనుక అట్టి బాల్యదశను సద్వినియోగం అయ్యేట్లుగా చూడాలి పెద్దలు.

'నైతిక విద్యావ్యాప్తి' అనే సౌధానికి నాలుగు మూలస్తంభాలు. అవి పటిష్ఠంగా, దృఢంగా ఉన్నప్పుడే 'నైతిక విద్యావ్యాప్తి' జరుగుతుంది. ఆ మూలస్తంభాలే 1. అధ్యాపకులు 2. తల్లిదండ్రులు 3. విద్యాసంస్థల అధినేతలు 4. ప్రభుత్వం. ఈ నాలుగు స్తంభాలలో ఏ స్తంభం బలహీనంగా ఉన్నా ఆ సౌధం కూలిపోతుంది. నైతిక విద్యావ్యాప్తికే అవరోధం ఏర్పడుతుంది.

ఈ పవిత్ర ఆశయసాధనకు "నైతిక మానవతా విలువల అధ్యయన కేంద్రం" **Ethics & Human values' learning centre (E.H.V.L. Centre)** స్థాపించబడింది. ప్రారంభంలో ప్రధానంగా ఈ క్రింది మూడు అంశాలను గురించి బాలబాలికలకు బోధించాలని సంకల్పించటమైనది.

1. నైతిక విలువల ప్రాముఖ్యతను, నైతికవిద్య ఆవశ్యకతను బోధిస్తూ, బాలబాలికలను సచ్ఛీల సంపన్నులుగా, విద్యా వినయ శోభితులుగా తీర్చిదిద్దటం.
2. మానవతా విలువలను బోధిస్తూ, బాలబాలికలలో మానవత్వాన్ని పెంపొందించటం.
3. కులమతాలకతీతంగా బాలబాలికలకు దేశభక్తి భావాలను బోధిస్తూ, వారిని ఉత్తమ భావిభారత పౌరులుగా తీర్చిదిద్దటం.

పై ఆశయ ఆదర్శములను ఆచరణలో పెట్టడానికి ఒక కార్యాచరణ పథకము కూడా రూపొందించబడింది.

1. ప్రతి జిల్లాలో 'విద్యా సదస్సులు' నిర్వహించడం.
2. అధ్యాపకులకు శిక్షణా తరగతులు ప్రతి జిల్లాలో ఏర్పాటు చేయటం.
3. ప్రతి తరగతిలో వారానికొక నీతితరగతి (Moral Class) నిర్వహించడం.
4. బాలబాలికలకు బోధించడానికి 'నీతి పుస్తకములు' (Moral Education Books) ముద్రించడం.

విద్యా సంస్థలలో 'నైతికవిద్య ఆవశ్యకత' అనే పుస్తకమును ముద్రించి,కొన్ని వేల కాపీలు రాష్ట్రం నలుమూలలా పంపిణీ చేయుటం జరిగింది. ఇంకా మరికొన్ని వేల కాపీలు పంపిణీ జరగాలి. సహృదయుల సహకారం ఎంతైనా అవసరం.

నైతికవిద్యను గురించి తరగతి గదులలో బాలబాలికలకు బోధించడానికి మూడు 'సిలబస్' పుస్తకములు కూడా అందిస్తున్నాము. దీని పేరు 'నీతిసుధానిధి' ఇప్పుడు తృతీయ,

చతుర్థ, పంచమభాగములు సమర్పించుకుంటున్నాము. ముఖ్యంగా ఈ మూడు పుస్తకములు హైస్కూల్, కాలేజీ విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని వ్రాయబడినాయి. 6, 7 తరగతుల విద్యార్థులకు అవసరమైన ప్రథమ, ద్వితీయ భాగములు త్వరలో అందించబడతాయి.

ప్రస్తుతం అందిస్తున్న 'నీతి సుధానిధి' మూడు భాగములలో ఒక్కొక్క పుస్తకంలో నాలుగు అంశములున్నాయి. 1. ప్రార్థనా శ్లోకములు - గీతములు 2. నీతి శ్లోకములు - పద్యములు 3. హితోక్తులు 4. మహనీయులు - త్యాగశీలురు

మొదటి అంశములోని 'ప్రార్థనా శ్లోకములు - గీతములు' పిల్లలందరిచేత కంఠస్థం చేయించాలి. మిగతా మూడు అంశములలో ఒక్కొక్క అంశములో పది విషయములు (Topics) చొప్పున ముప్పై విషయములు ఉన్నాయి. 'నీతివిద్య' (Moral Education) బోధించడానికి ప్రతి నెలా మూడు Periods కేటాయించుతే బాగుంటుంది. ఆ విధంగా పదినెలల పాటు మూడు తరగతుల వారికి బోధించవచ్చును. ముప్పై విషయాలు వరుసగా బోధించినా బోధించవచ్చును. లేక ఒక్కొక్క అంశములోని ఒక్కొక్క విషయాన్ని తీసుకొని ప్రతినెలా మూడు అంశములలోని విషయాలను బోధించవచ్చును. నిర్ణయాధికారము విద్యాసంస్థలవారికే వదిలివేయడమైనది. ఆ విధంగా బోధించి, విద్యా సంవత్సరాంతంలో వ్రాత పరీక్షలు పెట్టి ప్రథమ, ద్వితీయ, తృతీయ శ్రేణులలో ఉత్తీర్ణులైనవారికి బహుమతులు ప్రదానం చేస్తే బాగుంటుంది. నైతికవిద్య యెడల విద్యార్థులలో ఆసక్తి పెరుగుతుంది. మానసిక మార్పు వస్తుంది. వినయశీల సంపన్నులవుతారు. సంస్కారవంతులవుతారు.

తల్లిదండ్రులు, అధ్యాపకులు, విద్యాసంస్థల అధినేతలు ముఖ్యంగా ప్రభుత్వం ఈ పవిత్ర ఉద్యమానికి సహాయ సహకారములు అందించి 'నైతిక విద్యావ్యాప్తికి తోడ్పడుతారని ఆశిస్తున్నాము.

"నైతిక విద్యావ్యాప్తి దేశ ప్రగతికి సోపానం"

**ధన్యవాదములు**

(కొమరగిరి కృష్ణమోహనరావు)
వ్యవస్థాపకులు : E.H.V.L CENTRE
ఎడిటర్ 'శ్రీవాణి'

మచిలీపట్నం,
ది. 20-7-2002



# కృతజ్ఞతలు

**'నీతి సుధానిధి'** పుస్తకములు (Moral Education Books) ముద్రించే ముందు చాలా మంది అనుభవజ్ఞులైన, పెద్దలను సంప్రదించాను. వారి అమూల్యమైన సలహాలు స్వీకరించాను. వారి రచనలు కూడా నాకు సహాయపడినాయి. ముఖ్యంగా గత 17 సంవత్సరాలుగా **శ్రీవాణి మాసపత్రిక** రచనలు నాకు ఎంతగానో తోడ్పడినాయి.

**సర్వశ్రీ** ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం (వైస్‌ఛాన్సలర్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్), జానమద్ది హనుమచ్ఛాస్త్రి (కడప), చర్ల రాధాకృష్ణశర్మ (తమిళనాడు), 'పద్మశ్రీ' తుర్లపాటి కుటుంబరావు (విజయవాడ), మన్నవ గిరిధరరావు (Ex. M.L.C. గుంటూరు), కీ॥శే॥ "కరుణశ్రీ" (గుంటూరు), ఆర్. సీతాలక్ష్మి (చీరాల), ఎన్.వి. ఆర్. సత్యనారాయణమూర్తి (బొబ్బిలి), రెడ్డి రాఘవయ్య (హైదరాబాద్)గార్ల రచనలు మరియు శతకములు, భర్తృహరి సుభాషితములు ఈ మహాప్రయత్నానికి తోడ్పడినాయి.

**మచిలీపట్నం**కు చెందిన డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు, సోమంచి రామం, డా॥ రాపర్ల జనార్దనరావు, మల్లాది సూరిబాబు, డా॥ కాజ లక్ష్మీనరసింహారావు మరియు కె.పి. నాయుడుగార్ల సలహాలు నాకు ప్రోత్సాహాన్ని ఇచ్చాయి.

**విక్రమ్** పబ్లిషర్స్ (విజయవాడ) అధినేత శ్రీ జి.యస్. రావుగారు కవరు పేజీని అందంగా తీర్చిదిద్ది అందించారు.

**'నైతిక మానవతా విలువల అధ్యయన కేంద్రం'** (E.H.V.L. Centre) కార్యనిర్వాహక కమిటీవారు ఈ పవిత్ర ఉద్యమానికి అండగా నిలిచి ప్రోత్సహిస్తున్నారు.

**ఇంకా... ఇంకా...** ఎందరో మహానుభావుల సలహాలు మరియు ఎన్నో రచనలు ఈ ప్రయత్నానికి తోడ్పడినాయి.

ఈ మహోత్తర ప్రయత్నానికి తోడ్పడినవారందరికీ నా కృతజ్ఞతాభివందనములు.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు, నాలో కలిగించిన ప్రేరణ, అనుగ్రహించిన ఆశీస్సుల ఫలితమే ఈ 'నీతిసుధానిధి'. ఆ మహనీయునికి నా శతకోటి ప్రణామములు.

## ధన్యవాదములు

మచిలీపట్నం,
ది. 20-7-2002.

(కొమరగిరి కృష్ణమోహనరావు)
వ్యవస్థాపకులు : E.H.V.L CENTRE
ఎడిటర్ 'శ్రీవాణి'

# విషయసూచిక

## ప్రార్థనా శ్లోకములు - గీతములు



## నీతి శ్లోకములు - పద్యములు

## హితోక్తులు



## మహనీయులు - త్యాగశీలురు

# వందేమాతరం

**వందేమాతరం!.... వందేమాతరం !....**
**సుజలాం సుఫలాం మలయజ శీతలామ్**
**సస్య శ్యామలాం మాతరం ॥ వందేమాతరం ॥** ....1

శుభ్రజ్యోత్స్నాం పులకిత యామినీం
పుల్ల కుసుమిత ద్రుమదల శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం ॥ **వందేమాతరం** ॥ ....2

కోటి కోటి కంఠ కలకల నినాద కరాలే
కోటి కోటి భుజైర్ధృత ఖరకరవాలే
అబలా కేనో మాఁఎతో బలే
బహుబల ధారిణీం నమామి తారిణీం
రిపుదల వారిణీం మాతరం ॥ **వందేమాతరం** ॥ ....3

తుమి విద్యా తుమి ధర్మ
తుమి హృది తుమి మర్మ
త్వం హి ప్రాణాః శరీరే
బాహుతే తుమి మాఁ శక్తి
హృదయే తుమి మాఁ భక్తి
తోమారయి ప్రతిమాగడి మందిరే మందిరే ॥ **వందేమాతరం** ॥ ....4

త్వం హి దుర్గా దశప్రహరణధారిణీ
కమలా కమలదళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ, నమామిత్వాం, నమామి కమలాం
అమలాం, అతులాం, సుజలాం, సుఫలాం, మాతరం ॥ **వందేమాతరం** ॥ ...5

శ్యామలాం, సరలాం, సుస్మితాం, భూషితాం
ధరణీం, భరణీం, మాతరం ॥ **వందేమాతరం** ॥ ...6

- బంకించంద్ర చటర్జీ

# జనగణమన గీతము

జనగణమన అధినాయక జయ హే
భారత భాగ్యవిధాతా
పంజాబు సింధు గుజరాత మరాటా
ద్రావిడ ఉత్కళ వంగా
వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగా
తవ శుభ నామే జాగే
తవ శుభ ఆశిష మాగే
గాహే తవ జయ గాథా
జనగణ మంగళ దాయక జయ హే
భారత భాగ్య విధాతా
జయ హే జయ హే జయ హే
జయ జయ జయ జయ హే ...1

అహర హతన ఆహ్వాన ప్రచారిత
శుని తవ ఉదారవాణీ
హిందూ బౌద్ధ సిఖ జైన పారసిక
ముసల్మాన క్రిస్తానీ
పూరబ పశ్చిమ ఆసే
తవ సింహాసన పాసే
ప్రేమహార హయగాథా
జనగణ ఐక్య విధాయక జయ హే
భారత భాగ్య విధాతా ॥జయ హే॥ ...2

పతన అభ్యుదయ బంధుర పంథా
యుగ యుగ ధావిత యాత్రీ
తుమి చిర సారథి తవరథ చక్రే
ముఖరిత పథ దిన రాత్రీ

దారుణ విప్లవ మాఘే
తవ శంఖ ధ్వని బాజే
సంకట దుఃఖ త్రాతా
జనగణ పథ పరి చాయక జయ హే
భారత భాగ్య విధాతా ॥జయ హే॥ ....3

ఘోర తిమిర ఘన నిబిడ నిషేధే
పీడిత మూర్ఛిత దేశే
జాగృత ఛిలతవ అవిచల మంగళ
నతనయనే అనిమే షే
దుస్వప్నే అతంకే
రక్షాకరివే అంకే
స్నేహమయీ తుమి మాతా
జనగణ దుఃఖ త్రాయక జయ హే
భారత భాగ్య విధాతా ॥జయ హే॥ ....4

రాత్రి ప్రభాతిల ఉదిల రవిచ్ఛవి
పూర్వ ఉదయగిరి భాలే
గాహే విహగమ పుణ్య సమీరణ
నవ జీవన రస ఢాలే
తవ కరణారుణ రాగే
నిద్రిత భారత జాగే
తవ చరణే నత మాథా
జయ జయ జయ హే జయ రాజేశ్వర
భారత భాగ్య విధాతా ॥జయ హే॥ ....5

- 'విశ్వకవి' రవీంద్రనాధ టాగోర్

# మా తెలుగు తల్లి

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి
గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొర్లుతాయి
అమరావతి నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి! మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి! కృష్ణరాయలకీర్తి!
మా చెవులు రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం

**జై తెలుగుతల్లి! జై తెలుగుతల్లి!**

- శంకరంబాడి సుందరాచార్య

# ఏ దేశమేగినా....

ఏ దేశ మేఁగినా, ఎందుఁగాలిడినా
ఏ పీఠ మెక్కినా, యెవ రెదు రయిన
పొగడరా, నీ తల్లి భూమి భారతిని
నిలుపరా, నీ జాతి నిండు గౌరవము
లేదురా యిటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరు లింకెందు

ఏ పూర్వపుణ్యమో, ఏ యోగబలమొ,
జనియించినాడ వీస్వర్గలోకమున
ఏ మంచిపూవులన్ బ్రేమించినావొ
నిను మోసె నీ తల్లి కనక గర్భమున
సూర్యుని వెలుతురు సోకునందాక
ఓడల జెండాలు ఆడునందాక
నరుడు ప్రాణాలతో నడుచునందాక
అందాక గల యీ యనంతభూతలిని
మనభూమి వంటి కమ్మని భూమి లేదు

వెలిగిన దీ దివ్య విశ్వంబు పుత్ర
దీపించె నీ పుణ్య దేశంబు పుత్ర;
అవమానమేలరా, అనుమాన మేల
భరతపుత్రుఁడ నంచు భక్తిలోఁ బలుక

- రాయప్రోలు



# ప్రార్థన

"అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ"

చెడునుండి నన్ను మంచిని చేర్చుము. అజ్ఞానము (చీకటి) నుండి నన్ను జ్ఞానము (వెలుగు)ను చేర్చుము. మృత్యువు నుండి నన్ను మోక్షమును చేర్చుము.

"ఓ దేవదేవా! నన్ను చెడుపనులకు ప్రోద్బలం చేయకుము. మంచిపనులు చేయడానికి శక్తిని ప్రసాదించుము, చీకటిలో పడి కొట్టుమిట్టాడుకుంటున్న నన్ను వెలుగులోనికి తీసుకొని రమ్ము. మృత్యుముఖం లోపడి నరకయాతనలు అనుభవిస్తున్న నాకు మోక్షమును ప్రసాదించుము" అని ప్రతి నిత్యమూ ప్రాతఃకాలమున భగవంతుని ప్రార్థించవలెను.



# విఘ్నేశ్వర ధ్యానము

"శుక్లాంబరధరం విష్ణుం, శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్, సర్వ విఘ్నోపశాన్తయే"

*తెల్లని వస్త్రములను ధరించినవాడును, అంతటా వ్యాపించిన చంద్రుని కాంతివంటి తెల్లని కాంతి కలవాడును, నిర్మలమైన, స్వచ్ఛమైన ముఖము గలవాడు నగు విఘ్నేశ్వరుని సమస్త విఘ్నములు నశించుట కొఱకు ధ్యానము చేయవలెను.*

"అగజాననపద్మార్కం, గజాననమహర్నిశమ్
అనేకదన్తం భక్తానాం, ఏకదన్తముపాస్మహే"

*హిమవత్పర్వతము యొక్క పుత్రికయగు పార్వతీదేవి యొక్క పద్మమువంటి ముఖమునకు సూర్యునివలె సంతోషమును కలిగించు వాడును, భక్తులకు అనేక వరములను యిచ్చువాడును, ఒకే దంతము కలవాడునగు ఆ వినాయకుని పగలు, రాత్రియును (ఎల్లప్పుడునూ) సేవింతును.*



# సరస్వతీ ధ్యానము

"సరస్వతి! నమస్తుభ్యం
వరదే! కామరూపిణి!
విద్యారంభం కరిష్యామి
సిద్ధిర్భవతు మే సదా."

*"ఓ సరస్వతీదేవీ! నీ కొఱకు నమస్కారము, వరములు యిచ్చెడిదానా! చక్కని రూపము గలదానా! విద్యను ప్రారంభించుటను చేయుదును. నాకు ఎల్లప్పుడూ ఈ విద్య సిద్ధించుట అగుగాక!".*

"పద్మపత్రవిశాలాక్షీ పద్మకేసరవర్ణినీ
నిత్యం పద్మాలయా దేవీ సా మాం పాతు సరస్వతీ"

*పద్మము యొక్క రేకులవలె విశాలమైన కన్నులు కలదియును, పద్మము యొక్క కేసరములవంటి పసుపుపచ్చని రంగు కలదియును, పద్మమే నివాసముగా కలదియును, దేవతయునగు ఆ సరస్వతి ఎల్లప్పుడూ నన్ను రక్షించుగాక!*



# దైవ ప్రార్థన

**"త్వమేవ మాతాచ పితా త్వమేవ**
**త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ**
**త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ**
**త్వమేవ సర్వం మమ దేవదేవ."**

*"ఓ దేవ దేవా! నీవే తల్లివి, నీవే తండ్రివి, నీవే బంధువు, నీవే స్నేహితుడవు, నీవే నా చదువు, నీవే నా ధనము, నీవే నా సర్వము"*

**"నీవే తల్లివి తండ్రివి**
**నీవే నా తోడు నీడ నీవే సఖుఁడా**
**నీవే గురుఁడవు దైవము**
**నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా!"**

*"ఓ కృష్ణా! నిజముగా నాకు తల్లిదండ్రులును, సోదరులును, మిత్రుడును, గురుడును, దైవమును, ప్రభువును, దిక్కును అన్నిటికి నీవే, నా కితరులు ఆధారము లేదు."*



# గురు ప్రార్థన

"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవేనమః"

"గురువు బ్రహ్మదేవుడు, గురువు విష్ణువు, గురువు దేవుడగు ఈశ్వరుడు, గురువు ప్రత్యక్షముగానున్న ఆ పరమాత్మయే. అటువంటి తేజోవంతుడగు గురువు కొఱకు నమస్కారము".

"అజ్ఞానతిమిరాన్ధస్య
జ్ఞానాంజనశలాకయా
చక్షురున్మీలితం యేన
తస్మై శ్రీ గురవేనమః॥"

"అజ్ఞానము అను చీకటి యందు గ్రుడ్డివాని వలె వున్న నా యొక్క కన్ను 'జ్ఞానము' అను కాటుక పుల్లతో ఏ గురువుచే తెరిపింపజేయబడినదో, అటువంటి తేజోవంతుడగు గురువు కొఱకు నమస్కారము".



# సూరయె ఫాతిహా

(మహమ్మదీయ ప్రార్ధనా శ్లోకములు)

**బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం**

అమిత దయగలవాడును, ప్రేమించు వాడును అయిన అల్లాః పేరుతో

**అల్హాందు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్**

సమస్త స్తోత్రములు అల్లాః కొరకే, ఆయన సర్వలోకములను పాలించు ప్రభువు

**అర్రహామా నిర్రహీమ్**

అమిత దయగలవాడును, ప్రేమించువాడును

**మాలికి యౌమి ద్దీన్**

తీర్పు దినమునకు సర్వాధికారి

**ఇయ్యాక నఆబుదు వఇయ్యాక నస్తయీన్**

మేము నిన్నే ఆరాధిస్తాము, సహాయం కొరకు నిన్నే అర్ధిస్తాము

**ఇహ్‌దినస్ సిరాతల్ ముస్తఖీమ్**

మాకు సన్మార్గమును చూపుము

**సిరాతల్ లజీన అన్ అమ్త అలైహిమ్**

ఎవరిపైనయితే నీవు అనుగ్రహించి బహుమతులు కురిపించినావో

**గైరిల్ మగ్‌జూబి అలైహిమ్, వలజ్జాల్లీన్ - ఆమీన్**

ఎవరిపైనయితే నీ ఆగ్రహం వర్షించలేదో, మరెవరైతే మార్గ భ్రష్టులు కాలేదో వారి మార్గమును చూపుము - ఆమీన్ (తథాస్తు)



# క్రైస్తవ ప్రార్థనలు

Lord, make me a channel of your **PEACE;**
Where there is hatred, let me sow **LOVE;**
Where there is injury, **PARDON;**
where there is doubt, **FAITH;**
whre there is despair, **HOPE;**
where there is darkness, **LIGHT;**
and where there is sadness, **JOY;**
O Master, grant that I may never seek
so much to be consoled as to console;
to be understood as to understand;
to be loved as to love with all my soul.
For it is in giving that we receive,
it is in pardoning that we are pardoned,
and it is in dying that we are born
to eternal life

**- ST. FRANCIS**



What a friend we have in jesus,
All our sins and griefs to bear !
What a privilege to carry
Everything to God in prayer !
O what peace we often forfeit,
O What needless pain we bear,
All because we do not carry
Everything to God in prayer !

Have we trails and temptations?
Is there trouble anywhere?
We should never be discouraged :
Take it to the lord in Prayer.
Can we find a friend so faithful,
Who will all our sorrows share?
Jesus knows our every weakness;
Take it to the Lord in prayer.

Are we weak and heavy - laden,
Cumbered with a load of care?
Jesus only is our refuge:
Take it to the Lord in Prayer.
Do thy friends despise, forsake thee ?
Take it to the Lord in prayer;
In His arms He'll take and shield thee;
Thou wilt find a solace there.

**- JOSEPH SCRIVEN, 1820-'86**

# ప్రతిజ్ఞ

భారతదేశము నా మాతృభూమి, భారతీయులందరు నా సహోదరులు.

నేను నా దేశమును ప్రేమించుచున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణము. దీనికి అర్హుడనగుటకై సర్వదా నేను కృషి చేయుదును.

నా తల్లిదండ్రులను, ఉపాధ్యాయులను, పెద్దలందరిని గౌరవింతును. ప్రతివారితోను మర్యాదగా నడచుకొందును.

నా దేశముపట్లను, నా ప్రజలపట్లను సేవానిరతి కలిగి యుందునని ప్రతిజ్ఞ చేయుచున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందమునకు మూలము.

**భారతమాతాకీ జై!**

# మాతృభక్తి - మాతృదేశభక్తి

**"అపి స్వర్ణమయీ లంకా నమే లక్షణ రోచతే**
**జననీ జన్మ భూమిశ్చ, స్వర్గాదపీ గరీయసి"**

*"ఓ లక్ష్మణా! లంకాపురి బంగారుమయమయిననూ నాకు ఇష్టములేదు. తల్లియూ, జన్మించిన దేశము స్వర్గము కంటే కూడా గొప్పవి" అని శ్రీరాముడు లక్ష్మణునితో చెబుతాడు.*

శ్రీరాముడు వానరసేనను సమకూర్చుకొని లక్ష్మణునితో లంకాపురిపై దండెత్తుతాడు. రావణుని, అతని పరివారాన్ని సంహరిస్తాడు. లంకాపురి స్వాధీనమవుతుంది. అష్టఐశ్వర్యములతో తులతూగుతూ బంగారుమయమైన ఆ లంకాపురిని చూచి లక్ష్మణుడు మోహపడుతాడు. ఆ లంకాపురిలోనే ఉండి రాజ్యపాలన కొనసాగిద్దామని, బీదదైన, పేదదైన భారతదేశమునకు వెళ్ళవద్దని అన్నగారైన శ్రీరాముడ్ని అర్థిస్తాడు లక్ష్మణుడు. అప్పుడు శ్రీరామచంద్రుడు పై సమాధానము చెబుతాడు. శ్రీరాముని మాతృభక్తి, మాతృదేశభక్తి ఎంతటిదో పై శ్లోకం మనకు చాటుతున్నది.

తల్లికి మించిన దైవం లేదు. అందువలననే తల్లిని 'మాతృదేవత' అన్నారు.

తల్లిలాంటిదే జన్మించిన దేశం. మనది భారతదేశం. ఇది మన మాతృభూమి. కనుక ప్రతి ఒక్కరూ తన జననితోపాటు, జన్మించిన దేశమును కూడా ప్రేమించాలి, గౌరవించాలి, పూజించాలి. ఇది మనందరి కర్తవ్యం.

"మధుర భావంబేది మన దేశమందన్న, మాతృభావముకంటె మాన్యమెద్ది?" అన్నారు. శ్రీ సత్యసాయిబాబావారు. కనుక మాతృదేవిని, మాతృదేశమును విస్మరించకండి!

**"పుడమి, కన్నతల్లి పూజనీయులు కదా**
**వారి మించువారు వసుధ లేరు**
**కన్నతల్లి కన్న ఘనత ఏది**
**కన్న భూమి కన్న స్వర్గమేది?"** - బాబా

# సంతుష్టి - సంతృప్తి

**"అకించనస్య దాంతస్య**
**శాంతస్య సమచేతనః**
**సదా సంతుష్ట మనసః**
**సర్వాస్సుఖమయా దిశః"**

*"ఎల్లప్పుడూ సంతుష్టి, సంతోషకరమైన మనస్సు గలవారికి మరేమీ అక్కరలేదు. తనదంటూ ఏమీ లేనివాడు, దాంతుడు, వేదాంతుడు, శాంతుడు, సమచిత్తము గలవాడు, ఎల్లప్పుడూ సంతృప్తితో సంతోషంతో ఉండేవాడు - ఇలాంటి వానికి ఏది చూచినా అంతా సుఖంగానే కనపడుతుంది".*

'సంతుష్టి' అనేది మానవులలో వుండవలసిన ప్రధానమైన సద్గుణం. 'సంతృప్తి' అనేది సుఖప్రదమైనది. సంతృప్తి గలవానికి కోరికలు ఉండవు. కోరికలే దుఃఖానికి మూలకారణం. సమస్త విచారములకు కోరికలే మూలం. సంతృప్తి ఉన్నచోట సంతోషం ఉంటుంది. సంతోషం ఉన్నచోట సుఖం ఉంటుంది. సుఖం ఉన్నచోట శాంతి ఉంటుంది.

"శాంతిలేని జీవి శశిలేని నిశిసుమీ!" అన్నారు. శాంతి లేనివానికి ఎంత సంపద ఉన్నా ప్రయోజనం లేదు. అటువంటివారి జీవితం వ్యర్థమే. వారి జీవితం కాళరాత్రితో సమానం.

'అసంతుష్టో ద్విజో నష్టః సంతుష్టో ఇవ పార్థివః' తృప్తిలేని బ్రాహ్మణుడు నష్టపోతాడు, కాని తృప్తిపడితే నష్టపడుతారు రాజులు. సంతృప్తి అనేది అందరికీ వుండాలి గాని, రాజులకు (పరిపాలకులకు) విద్యార్థులకు మాత్రం సంతృప్తి ఉండరాదు. రాజులకు గనుక సంతృప్తి వుంటే, వారు సామ్రాజ్యములను విస్తరింపజేయలేరు, దేశసంపదను పెంచలేరు. సంతృప్తి అనేది విద్యార్థులకు కూడా ఉండరాదు. సంతృప్తి ఉంటే ఘనవిజయాలను సాధించలేరు. ప్యాసైతే చాలునని సంతృప్తి జెందుతారు. కనుక విద్యార్థులకు, రాజులకు మాత్రం సంతృప్తి పనికిరాదు. మిగతావారందరికీ సంతృప్తి ఉండాలి. సంతృప్తి లేకపోతే సుఖశాంతులు ఉండవు.

**"శాంతములేక సౌఖ్యములేదు**
**సారసదళనయనా!**
**దాంతునికైన వేదాంతునికైన**
**శాంతములేక సౌఖ్యములేదు".** - త్యాగరాజ

# భీరులు - దుర్బలులు

**"యథా కన్దుకపాతే నో, త్పత త్యార్యః పతన్నపి**
**తథా త్వనార్యః పతతి, మృత్పిణ్డ పతనం యథా"**

*"బంతి క్రింద పడినను మరల పైకి లేచును. అట్లే ధీరుడు, సజ్జనుడు యెప్పుడైన, పొరపాటున క్రింద పడినచో, మరల వెంటనే ధైర్యం తెచ్చుకొని, పైకి లేచి, ఉన్నతస్థితిని పొందగలడు. మట్టిముద్ద క్రింద పడినచో మరల పైకి లేవలేదు. అదేవిధంగా దుర్బలుడు హీనస్థితిని పొందినచో మరల పైకి లేవలేడు.*

మానవ జీవితం ఎల్లకాలం ఒకే విధంగా నడువదు. జీవితం అనేది సుఖదుఃఖ ములతోను, జయాపజయములతోను అటూ, ఇటూ మార్పులు చెందుతూ వుంటుంది. నిత్యజీవితంలో సంభవించే కష్టములకు క్రుంగక, సుఖములను చూచి పొంగక, నిశ్చలమైన మనస్సు గలవారే ధీరులు. వారే పూజ్యులు. ఒకవేళ అటువంటి వారికి కర్మఫలము ననుసరించి, కాలం కలసిరాకపోయినప్పటికీ, నిరుత్సాహపడక, దైవంపైన భారం వేసి, ఆత్మవిశ్వాసంతో, ధైర్యంతో ముందుకు నడచి, తిరిగి ఉన్నతస్థితిని పొంద గలుగుతారు.

ఇకపోతే దుర్బలులకు ఆత్మవిశ్వాసం ఉండదు. ధైర్యం అసలే ఉండదు. ఏ మాత్రం ఆపదలు ఎదురైనా భయపడి, వాటిని ఎదుర్కొనలేక, క్రిందకు దిగజారిపోతారు. హీనస్థితిని పొందుతారు. అటువంటి బలహీన మనస్తత్వం గలవారిలో ఎల్లప్పుడూ నిరాశా నిస్పృహలే తాండవిస్తుంటాయి. అట్టివారికి అన్నీ అపజయాలే ఎదురవుతుంటాయి.

అగ్నిని తలక్రిందుగా పట్టుకొనినను, దానిజ్వాలలు మాత్రం పైపైకే ఎగిసి పోతుంటాయి గాని, క్రిందకు పోవు. అట్లే ధీరులను, సజ్జనులను ఎవరు కించపరిచినా, అవమానపరచినా, అగ్నిజ్వాలలలాగే ఉన్నతస్థితినే చేరుకుంటారు. అధోగతిపాలుకారు.

ధీరులు, సజ్జనులు బంతిలాంటివారు. భీరువులు, దుర్బలులు మట్టిముద్ద లాంటివారు. ధీరులు ఒకవేళ ఉన్నతస్థితి నుండి క్రిందకు జారినప్పటికీ బంతిలా తిరిగి పైకి లేవగలరు. దుర్బలులు క్రిందకు జారితే మాత్రం మట్టిముద్దలా అక్కడనే పడి ఉంటారు.

**"కందుకము వోలె సుజనుడు**
**గ్రిందం బడి మగుడ మీదికి న్నెగయు సుమీ**
**మందుఁడు మృత్పిండము వలె**
**గ్రిందం బడి యడఁగియుండు గృపణత్వమునన్". - ఏనుగు లక్ష్మణ కవి**

# దుర్జనులు - సజ్జనులు

**"విద్యా వివాదాయ, ధనం మదాయ**
**శక్తిః పరేషాం పరపీడనాయ**
**ఖలస్య సాధోః విపరీత మేతత్**
**జ్ఞానాయ, దానాయ చ రక్షణాయ".**

*"దుర్జనునికి (దుష్టునికి) బాగా విద్య అబ్బితే వితండవాదన చేస్తూ కూచుంటాడు. ధనం లభిస్తే మదగర్వంతో విర్రవీగుతాడు. వంట్లో బలంవుంటే ఇతరులను పీడిస్తాడు. అయితే సజ్జనుడు విద్యవలన జ్ఞానమును అభివృద్ధి పరచుకుంటాడు. ధనం వస్తే దానం చేస్తాడు. బలంవుంటే ఆపదలో నున్నవారిని రక్షిస్తాడు".*

ఒకవేళ తెలివితేటలతో గొప్ప విద్యలనభ్యసించినా, దాని విలువను తెలుసుకోలేక, వితండవాదనలు చేస్తూ కాలమును దుర్వినియోగం చేస్తుంటాడు దుష్టుడు. శాస్త్రములకు విపరీతార్థములు చెబుతూ, ప్రజలను పెడమార్గాలలో పట్టిస్తుంటాడు ధనంవస్తే దుర్వ్యసనములకు విచ్చలవిడిగా ఖర్చుచేస్తాడు. ధనమదగర్వంతో పెద్దలను అవమానపరుస్తాడు, దైవమునైనా లక్ష్యపెట్టడు. కండబలంతో పశువులా ప్రవర్తిస్తాడు. కనుక దుష్టుల వలన ప్రమాదం.

దుష్టుడు ఎన్ని విద్యలు నేర్చినప్పటికినీ, తన దుష్టబుద్ధిని విడనాడకపోవటం వలన మంచివాడు కాలేకపోతున్నాడు. అదేవిధంగా హీనుడు ఎన్ని విద్యలు నేర్చినను హీనుడేగాని గొప్పవాడు కాదుగదా! సుగంధ ద్రవ్యములను మోసినంత మాత్రమున గాడిద ఏనుగు అవుతుందా! దుష్టుడు, సజ్జనుడు కాదు, హీనుడు, ఘనుడు కాదు.

సజ్జనుల వద్దనున్న విద్య, ధనం సద్వినియోగమవుతాయి, పదిమందికీ ఉపయోగపడుతాయి. దుర్జనుల వద్దనున్న విధ్య, ధనం, దుర్వినియోగమవుతుంది.

**"హీనుడెన్ని విద్యలు నేర్చినగాని**
**ఘనుడు గాడు హీనజనుడె గాని**
**పరిమళముల మోయుగార్ధభము గజమౌనె**
**విశ్వదాభిరామ వినురవేమ".**

గమనిక : సమాజంలో హీనజనులనేవారెవరూ లేరు. హీనబుద్ధి గలవారు మాత్రమే ఉన్నారు. గమనించ ప్రార్థన.

# సత్పురుషులు - సంపదలు

**"భవంతి నమ్రా తరవః ఫలోద్గమైః**
**నవాంబుభిః దూరవిలంబినో ఘనాః**
**అనుద్ధతా సత్పురుషాః సమృద్ధిభిః**
**స్వభావ ఏవైష పరోపకారిణామ్".**

*"చెట్లు పండ్లతో నిండి ఉన్నప్పుడు వంగి ఉంటాయి. అనగా, తనకు సమృద్ధి కలిగినదని గర్వపడక, అణకువతో వుండి, తమపండ్లు ఇతరులకు సులభంగా అందేలాగున అవి ప్రవర్తిస్తుంటాయి".*

నీటితో నిండివున్న వర్షాకాలపు మేఘాలు క్రిందికి వ్రేలాడి ఉంటాయి. నీటితో నిండివున్న ఆ మేఘాలు గర్వంతో విర్రవీగవు. ఆకాశమార్గమున తలెత్తుకొని తిరగవు. సమయం చూచుకొని వర్షిస్తాయి. మనకు ఎంతో మేలు చేస్తాయి. అలాగే సత్పురుషులకు సంపదలు వచ్చినప్పుడు త్రుళ్ళిపడరు, గర్వించరు, వినయంతో ఉంటారు. మరి దుర్జనులకు సంపదలు వచ్చినప్పుడు గర్వంతో విర్రవీగుతారు. ఆ సంపదలు పరులకోసం ఏ మాత్రం వినియోగించరు. తమ స్వార్థ స్వప్రయోజనాలకే ఉపయోగించుకుంటారు. కాబట్టి విద్య, ధనము మొదలైన సంపదలు చేకూరినప్పుడు ఏ మాత్రం గర్వపడరాదు. వాటిని ఇతరులకోసం వినియోగించాలి.

మహాత్ములగు సజ్జనులయొక్క మనస్సు, ధన ధాన్యాదిసంపదలు కలిగినప్పుడు గర్వపడక, కఠినహృదయులుగాక కలువపూవులవలె కోమలమైనదిగా వారి హృదయం ఉంటుంది.

దారిద్ర్యము మొదలైన ఆపదలు సంభవించినప్పుడు దిగులు పడక, విలవిలపోక, పెద్దకొండలయొక్క గండశిలలవలె భేదింపరానిదై, కఠోరంగా ఉంటుంది. అదే సజ్జనుల లక్షణం.

**"సంపదలు గల్గు తఱి మహాజనుల హృదయ**
**మభినవోత్పల కోమలం బగుచు వెలయు**
**నాపదలు వొందునపుడు మహామహీధ**
**రాశ్మ సంఘాత కర్కశంబై తనర్చు".** **- ఏనుగు లక్ష్మణ కవి**

# మానము - ప్రాణము

**"ప్రాణం వాஉపి పరిత్యజ్య**
**మానమేవాభి రక్షతు**
**అనిత్యో భవతి ప్రాణో**
**మాన మాచంద్రతారకమ్"**

*"ప్రాణమునైనను పరిత్యజించి మానమును (ధర్మ ప్రవర్తనమును) కాపాడుకొనవలెను. ప్రాణము అనిత్యమైనది, మానము ఆచంద్రతారార్కమైనది".*

మానాభిమానములు ప్రతి మానవునికి ఉండవలసిన ముఖ్యమైన లక్షణములు. ఈ రెండూ మానవునికి గౌరవ ప్రతిష్ఠలు తెచ్చిపెడుతాయి. ఉన్న స్థితి నుండి ఉన్నత స్థితికి తీసుకొనిపోతాయి. జీవితానికే విలువనిస్తాయి.

మానమునకు ప్రతిరూపము శీలము (Character) మానము గలవాడు మానధనుడు. మానముగల స్త్రీ మానవతి. శీలముగలది శీలవతి. మానం పోతే అవమానమే. శీలంపోతే సర్వమూ కోల్పోతారు. ధనం పోతే ఫరవాలేదు. మరల సంపాదించుకోవచ్చును. ఆరోగ్యం చెడిపోతే మరల తిరిగి పొందవచ్చును. శీలమే గనుక పోతే సర్వస్వాన్ని కోల్పోయినవారవుతారు. కనుక ప్రతి ఒక్కరూ శీలమును కాపాడుకోవాలి.

అభిమాన ధనుడు ఎటువంటి పరిస్థితులలోనూ, ఎవరి ముందు చేయిచాచడు. తన ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకుంటాడు. స్త్రీ తన మానాన్ని కాపాడుకొనడానికోసం ప్రాణాన్నయినా లెక్కచేయదు. ధర్మరక్షణ కోసం ప్రాణాలనయినా పరిత్యజించుతారు మానధనులు. మానము కొరకు ప్రాణములను సహితం అర్పించిన పతివ్రతా శిరోమణులు ఎందరో మన పవిత్ర భారతావనిలో కనిపిస్తారు.

మానధనమునకు మించిన ధనం వేరొకటి లేదు. ధనం కంటే గుణంమిన్న, ప్రాణం కంటే మానం మిన్న. ప్రాణాన్నయినా విడిచి మానాన్ని రక్షించుకోవాలి. "మానము మానవునకు మాన్యత దెచ్చున్". కనుక ప్రతి ఒక్కరూ మానమును కాపాడుకోవాలి.

**"మాటకు ప్రాణము సత్యము**
**కోటకు ప్రాణంబు సుభటకోటి ధరిత్రిన్**
**బోటికి ప్రాణము మానము**
**చీటికి ప్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ".**

# ఆశ - దురాశ

**"ఇచ్ఛతి శతీ సహస్రహం**
**సహస్రీ లక్ష మీహతే;**
**లక్షాధి పస్తథా రాజ్యం**
**రాజ్యస్థః స్వర్గ మీహతే".**

*ధనాశకు మితమంటూ లేదు. నూరు రూపాయిలున్నవాడు వెయ్యి రూపాయిలు కావాలని కోరుతాడు. వెయ్యి రూపాయిలున్నవాడు లక్ష కావాలంటాడు. లక్ష ఉన్నవాడు కోటీశ్వరుడు కావాలని లేక రాజ్యమంతా తనకే రావాలని కోరుకుంటాడు. పెద్ద రాజ్యానికి రాజైనవాడు స్వర్గలోకాధిపత్యంకూడా తనకే కావాలని ఆశపడుతాడు.*

ఆశ గాలి వంటిది. మనసు జ్యోతి వంటిది. గాలి ఉంటే జ్యోతి అటూఇటూ కదుల్తూ వుంటుంది. గాలి లేకపోతే జ్యోతి నిశ్చలంగా ఉంటుంది. జ్యోతికి గాలి కూడా అవసరమే. మితంగా వుంటే ఆరిపోదు. ఎక్కువైతే ఆరిపోతుంది. అదేవిధముగా మనిషికి ఆశ కూడా ఉండాలి. ఆశ లేకపోతే మనిషికి మనుగడలేదు. మానవుడు ఆశాజీవి కదా! అయితే ఆశ హద్దులలో ఉండాలి. హద్దులు మీరుతే అది పేరాశగా మారుతుంది. పేరాశ దురాశకు దారితీస్తుంది. దురాశ దుఃఖమును తెచ్చి పెడుతుంది. అప్పుడు మనిషికి మనశ్శాంతి ఉండదు. శాంతిలేని వానికి సుఖం వుండదు. శాంతి సుఖములు లేనివారికి జీవితంమీదనే నిరాశ కలుగుతుంది. కనుక ***ఆశకు హద్దు, మనసుకు తృప్తి ఉండాలి.***

అయితే ఈనాడు ఆశకు అంతు లేదు, మనిషికి తృప్తి లేదు. ఆశపోతు మంచి చెడుల గురించి ఆలోచించడు, పుణ్యాపాపములను గురించి పట్టించుకోడు. ఒక్కొక్క సమయంలో ఎంతటివారైనా ఆశకు దాసులై తమ కర్తవ్యాన్నే విస్మరిస్తుంటారు. ఆశచేత యోగులు కూడా మోసపోతుంటారు.

**"ఆశ పాపజాతి యన్నింటి కంటెను**
**ఆశ చేత యతులు మోసపోరె**
**చూచి విడచువారె శుద్ధాత్ములెందైన**
**విశ్వదాభిరామ వినురవేమ!"**

# పుణ్యపాపములు

**"అర్థాగృహే నివర్తంతే**
**శ్మశానే మిత్ర బాంధవాః**
**సుకృతం దుష్కృతం చైవ**
**గచ్ఛంత మనుగచ్ఛతి".**

*మానవులు ధన ద్రవ్యాలు సంపాదించి దాచిపెడుతారు. కాని, చచ్చి పోయేటప్పుడు ఆ ధనద్రవ్యాలు ఇంట్లోనే ఉంటాయి. వారివెంట రావు. ఇక స్నేహితులు, బంధువులు ఉన్నారంటే, వారు స్మశానం దాకానే వస్తారు, కాని వెంటరారు. మనుష్యులు చనిపోయేటప్పుడు వెంటవచ్చేవి రెండేరెండు. ఎవరు చేసిన పుణ్యపాపములు మాత్రమే వారివెంట వస్తాయి.*

"జాతస్య మరణం ధృవం" పుట్టిన వాడు ఏదో ఒకరోజున మరణించక తప్పదు. అయితే ఈ వాస్తవాన్ని విస్మరించి, ధన సంపాదనే జీవితపరమావధి అని భావించి, పాపపుణ్యాలను విచారించక అనేక అక్రమ, అనాచార, అవినీతి మార్గముల ద్వారా ధనాన్ని సంపాదించి కూడబెడుతుంటారు. సంపాదించి ధనాన్నయినా సద్వినియోగం చేస్తారా! అంటే అదీ చేయరు. తాము తినరు, ఇతరులకు పెట్టరు. 'దాచుకుంటే, దోచుకుంటారు'. ఇకపోతే అంత కష్టపడి సంపాదించిన సొమ్ము ఏమైనా చనిపోయేటప్పుడు వారి వెంట వస్తుందా? అంటే అదీరాదు. తాము అనుభవించక, పుణ్యకార్యాలకు ఖర్చు పెట్టక, చనిపోయేటప్పుడు వెంటరాని ద్రవ్యమువలన ప్రయోజనం ఏమిటి? కనుక మనం సంపాదించిన ద్రవ్యంలో కొంత భాగాన్నయినా బీదలకు, పేదలకు పెట్టాలి. పుణ్య కార్యాలకు వినియోగించాలి.

**"ధరణిలో వేయేండ్లు తనువు నిల్వఁగబోదు**
**ధనమెప్పటికి శాశ్వతంబు గాదు**
**దార సుతాదులు తనవెంట రాలేరు**
**భృత్యులు మృతిని తప్పింపలేరు**
**బంధుజాలము తన్ను బ్రతికించుకోలేరు**
**బలపరాక్రమేమి పనికి రాదు**
**ఘనమైన సకల భాగ్యము లెంతఁ గల్గియు**
**గోచి మాత్రంబైన గొనుచుఁబోదు**
**"వెట్టి కుక్కల భ్రమలన్ని విడిచి నిన్ను**
**భజనఁ జేసెడి వారికి బరమ సుఖము**
**భూషణ వికాశ! ధర్మపురినివాస!**
**దుష్ట సంహార! నరసింహ దురిత దూర!"** - నరసింహ శతకము

# ధనం - దానం

**"అదాన దోషేణ భవేద్దరిద్రో**
**దారిద్ర్య దోషేణ కరోతి పాపమ్**
**పాపాదవశ్యం నరకం ప్రయాతి**
**పునర్దరిద్రః పునరేవపాపీ".**

*"గత జన్మలో ఎవరికీ దానం చేయకపోవడం వలన, ఈ జన్మలో దరిద్రులుగా పుడుతారు. అట్టి దారిద్ర్య బాధవలన అనేక పాపపు పనులు చేయవలసి వస్తుంది. అలా పాపాలు చేయడం వలన నరకం ప్రాప్తిస్తుంది. ఆ నరకంలో కొన్నాళ్ళుండి మళ్ళీ దరిద్రులుగా పుట్టటం జరుగుతుంది".*

"దేయం దీన జనాయ చ విత్తం" తనకున్న దానిలో దీనులకు, దరిద్రులకు కొంత యిచ్చి సాయం చేయవలెనని శాస్త్రములు హెచ్చరిస్తున్నాయి. ఆ విధంగా యివ్వకుండా, అక్రమ, అనాచర, అవినీతి మార్గములద్వారా సంపాదించి, కూడపెట్టిన లోభికి ఎప్పుడో ఒకప్పుడు అధోగతి తప్పదు.

"అదాన దోషేణ భవేద్దరిద్రః" గత జన్మలో దానం చేయనివారు, ఈ జన్మలో దరిద్రులుగా పుడతారు. ధనంవుండి కూడా ఈ జన్మలో దానం చేయనివారు, వచ్చే జన్మలో దరిద్రులుగా పుడుతారు. అట్టి దారిద్ర్య బాధకు తట్టుకోలేక పాపపు పనులు చేస్తారు. పాపపు పనులు చేయడం వలన వారికి నరకం ప్రాప్తిస్తుంది. కొంతకాలం అక్కడ నరకయాతనలు అనుభవించి తిరిగి దరిద్రుడుగా జన్మిస్తాడు, కారణమేమిటి? తాను సంపాదించిన ధనంలో కొంత భాగాన్ని దానం చేయకపోవటం వలననే ఈ దుస్థితి దాపురిస్తున్నది.

దానధర్మాలకు వినియోగించిన డబ్బు ఇహమునందు, పరమునందు కూడా తిరిగి వస్తుంది. స్నేహితులకు వినియోగించిన డబ్బు ఇహమునందు మాత్రమే తిరిగి వస్తుంది. భోగములకొరకు దుర్వినియోగం చేయు డబ్బు ఇహమునందుగాని, పరమునందుగాని తిరిగి రాదని శాస్త్రములు చెబుతున్నాయి.

**"దానధర్మము లేక దయయు సత్యము లేక**
**మానసమున మంచి నీతి లేక**
**చెడు గుణంబులతోడ చెలగాడుచున్నట్టి**
**హీను డిలను చెడును పరము చెడును".** -బాబా

# పరమాత్మ ఒక్కడే

**"మృత్పిండ మేకో బహుభాండరూపం**
**సువర్ణమేకం బహు భూషణాని**
**గోక్షీరమేకం బహు ధేనుజాతం**
**ఏకః పరాత్మా బహు దేహవర్తీ"**

*"కుండలు వేరైనా వాటిలో వున్న మన్ను ఒక్కటే. నగలు వేరైనా వాటిలో ఉన్న సువర్ణం ఒక్కటే. ఆవులు వేరైననూ పాలు ఒక్కటే. అలాగే శరీరాలు వేరువేరుగా ఉన్నా వారిలో ఉన్న పరమాత్మ ఒక్కడే".*

కుమ్మరి రకరకాలైన కుండలు, కూజాలు తయారు చేస్తాడు. వాటి ఆకారాలు చూడటానికి భిన్నంగా కనిపిస్తాయి. కాని అవన్నీ ఒకే మట్టితోనే తయారవుతాయి. కంసాలి రకరకాలైన ఆభరణాలు తయారు చేస్తాడు. స్త్రీలు కొన్ని ఆభరణాలు చెవులకు పెట్టుకుంటారు, మరికొన్ని మెడలో వేసుకుంటారు, ఇంకా కొన్ని నడుముకు పెట్టుకుంటారు. ఆ ఆభరణముల రూపనామములు భిన్నంగా ఉండినప్పటికినీ, అవన్నీ ఒకే బంగారంతో తయారుచేస్తాడు కంసాలి. ఆవుల రంగులు భిన్నంగా ఉండినప్పటికినీ, అవి యిచ్చే పాలు మాత్రం అన్నీ తెల్లగానే ఉంటాయి. అదే విధంగా శరీరాలు వేరువేరుగా ఉన్నప్పటికీ అందరిలో వున్న పరమాత్మ ఒక్కడే. ఆ పరమాత్మను కొందరు రాముడు అన్నారు. మరి కొందరు 'కృష్ణుడు' అన్నారు. ఇంకా కొందరు 'అల్లా' అన్నారు. మరికొందరు 'యేసు' అన్నారు. రూపనామములు వేరు వేరుగా ఉండవచ్చును. కాని పరమాత్మ ఒక్కడే. GOD IS ONE. ఈ యదార్థమును తెలుసుకోలేక మా దేవుడు... మా దేవుడు అని కలహించుకుంటున్నారు. ఇది మారాలి. ఏకాత్మ భావనను అభివృద్ధిపరచుకోవాలి.

**"శృంగారములు వేరు బంగారమొక్కటె**
**వస్త్రభేధములు వేరు వస్తువొక్కటె**
**పశుల వన్నెలు వేరు పాలు ఒక్కటె**
**జీవ జాతులు వేరు జీవుండు ఒక్కడె**
**కులములన్నియు వేరు పుట్టుక ఒక్కటే**
**పూలజాతులు వేరు పూజ ఒక్కటె**
**దర్శనంబులు వేరు దైవంబు ఒక్కడె**
**మతములన్నియు వేరు మార్గమొక్కటె**
**తెలియలేకను మానవుల్ తెలివి తప్పి**
**బ్రతుకు కోసము బహుబంధ బద్ధులైరి"** -బాబా

# మాతృదేశభక్తి

మనది భారతదేశము. ఇది మన మాతృభూమి. కని పెంచిన తల్లి మీద ఏ విధమైన 'మాతృభావన' మనకుంటుందో జన్మించిన ఈ దేశం మీద కూడా అదే విధమైన మాతృభావన మనకుండాలి. అందువలననే ఈ పవిత్రగడ్డను 'మాతృభూమి' (Mother Land)గా భావించి పూజించడం మన సంప్రదాయం. ఇటువంటి 'మాతృభావన' ప్రపంచంలో మరెచటా కనిపించదు. ఇతర దేశములవారు వారివారి దేశములను 'పితృభూమి' (Father Land)గా భావించుతారు ఇదే మనకు వారికి వున్నతేడా!

## వివేకానంద ఆదర్శం :

స్వామీ వివేకానంద అమెరికా బ్రిటన్ మొదలగు సంపన్న దేశాలను సందర్శించి, భారతదేశానికి బయలుదేరుతుండగా పత్రికా విలేఖరులు **"ఇప్పుడు మీ మాతృభూమి పట్ల మీ అభిప్రాయం ఏమిటి?"** అని ప్రశ్నిస్తారు. అప్పుడు వివేకానంద ***"భారత దేశాన్ని లోగడ ప్రేమించాను కాని ఇప్పుడు భరతభూమిలోని ప్రతి ధూళికణం నాకు అత్యంత పవిత్రము. అది నాకొక తీర్థస్థానము"*** అని సగర్వంగా సమాధానం చెబుతాడు. భారత దేశంలోని ప్రతి పౌరుడి లక్ష్యం, ఆదర్శం అదేవిధంగా ఉండాలి. కనుక ***ఈ పుణ్య భూమిని మనం ప్రేమించాలి, గౌరవించాలి. ఈ దేశపురోభివృద్ధికి శక్తివంచన లేకుండా మనం శ్రమించాలి.*** ఇది మన కర్తవ్యం.

## గాంధీజీ దేశభక్తి :

ఒకసారి మహాత్మాగాంధీ తన ప్రగాఢమైన దేశభక్తిని ప్రకటిస్తూ ***"సమస్త విశ్వంలోను నాకు ప్రియమైనది భారతదేశం. భారతభూమి నా మాతృదేవత. భారత్ ప్రధానంగా కర్మభూమి, భోగభూమి కాదు. నాకు అవసరమైన ఆధ్యాత్మికతనంతటిని ప్రసాదిస్తున్నది నా యీ భారతి. నా సర్వస్వమూ ఆమె పెట్టిన భిక్షయే. అందువలననే నేను, తల్లి బిడ్డను అంటి పెట్టుకొనియున్నట్లుగా, భరతమాతను అంటిపెట్టుకుని ఉంటాను"*** అని చెప్పకుంటారు.

**మాక్స్‌ముల్లర్ :**

*'ఈ లోకంలో భూలోక స్వర్గము అనిపించునట్టి దేశం ఎక్కడ ఉన్నదని ఎవరైనా అడిగితే, అదిగో భారతవర్షము అని వేలెత్తి చూపుదును"* అని అంటారు ప్రముఖ జర్మన్ పండితుడు మాక్స్‌ముల్లర్. ఒకసారి భారతీయ సంస్కృతీ విశిష్టతను గురించి, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఏర్పాటు చేయబడిన తర్ఫీదు పొందుతున్న ఐ.సి.యస్. ఆఫీసర్ల సభలో చక్కటి ఉపన్యాసం కూడా చేస్తారు మాక్స్‌ముల్లర్. ఆ ఉపన్యాసముల సంకలనమే, 'India, What it can teach us' (భారతదేశం మనకేం నేర్పగలదు?)గా ముద్రించబడింది. మాక్స్‌ముల్లర్ సంస్కృతం నేర్చుకొని అనేక నీతిశ్లోకాలు కూడా వ్రాసారు. ఆక్స్‌ఫర్డ్ సమీపంలో ఒక ఆశ్రమమును నిర్మించుకొని, భారతీయ ఋషులలాగే **'మోక్షమూలర్‌భట్టు'** అని పేరు పెట్టుకొని, భార్యతోసహా తన శేష జీవితమును అక్కడ ప్రశాంతంగా గడిపారు. ఒక విదేశీయుడు భారతీయ సంప్రదాయం ప్రకారం జీవితాన్ని గడపటం ఆశ్చర్యం కాదా?

**విల్‌డ్యూరంట్ :**

భారతీయుల 'మాతృభావన' పవిత్రతను చక్కగా అర్థం చేసుకొని, భారతదేశం యొక్క ఔన్నత్యమును వర్ణించుతూ ప్రసిద్ధ అమెరికన్ చరిత్రకారుడు 'విల్‌డ్యూరంట్'. "Mother India is, In many ways, the mother of us all" (భారతమాత అనేక విధములుగా మన అందరికీ తల్లి) అని ప్రశంసిస్తాడు. ఒక విదేశీయుడే 'మాతృభావన' పవిత్రతను అర్థం చేసుకోగలిగినప్పుడు మనం అర్థం చేసుకోలేమా?

**రాయప్రోలు :**

ప్రముఖ తెలుగు కవి రాయప్రోలు సుబ్బారావుగారు యువతను ప్రబోధిస్తూ, అనేక పద్యాలు వ్రాసి, దేశభక్తి భావాలను విస్తృతంగా ప్రచారం చేసారు. ఆయన సాహిత్యం ముఖ్యంగా ఆంధ్ర యువకులలో ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని కలుగజేసింది.

**"ఏ దేశమేగిన ఎందుకాలిడిన**
**ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన**
**పొగడరా నీ తల్లి భూమిభారతిని**
**నిలుపరా నీ జాతి నిండు గౌరవము".**

"లేరురా ఇటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి ధీరులింకెందు
అవమానమేలరా అనుమానమేలరా
భరతపుత్రుడనంచు భక్తితోపాడ"

ఎక్కడికి వెళ్ళినా, ఏ పని మీద వెళ్ళినా నేను భారతీయుడ్ని, నాది భారత దేశము! అని సగర్వంగా చెప్పకోవాలి. భారతదేశ ఔన్నత్యాన్ని చాటాలి. మాతృదేశభక్తిని ధైర్యంగా ప్రకటించుకోవాలి. ఇది మన కర్తవ్యం.

పూర్వజన్మ సుకృతం వలన ఈ పవిత్ర భూమిలో మనం జన్మించాం. ఈ పుణ్యభూమిలోని ప్రతి అణువు మనకు అత్యంత పవిత్రమైనది. మనకు జన్మనిచ్చిన ఈ భరతమాతకు మనం ఎంతో ఋణపడి ఉన్నాం. ఆమె పాదసేవ చేయడం మన విద్యుక్త ధర్మం. *కర్తవ్యాన్ని విస్మరించకండి! కాలాన్ని వృథా చేయకండి! మాతృదేశభక్తిని పెంపొందించుకోండి! భారతదేశ సమైక్యతను, సమగ్రతను కాపాడండి! దేశపురోభివృద్ధికి శక్తివంచన లేకుండా కృషి చేయండి! ఇదే మన ఆశయం*, ఇదే మన కర్తవ్యం.



---

"భారతీయులుగా జీవించడం అలవరచుకోండి. భారతమాతను ఆరాధించండి. భారతదేశ పురోభివృద్ధికి అహర్నిశలూ శ్రమించండి. అయితే విదేశీ సంపర్కంవలన మనలో దేశభక్తి నశించింది. మన సంస్కృతిని విస్మరిస్తున్నాం. ఏ జాతి తన సనాతన సంస్కృతిని విస్మరిస్తుందో, ఆ జాతికి మనుగడే వుండదు. కన్నతల్లి మీద మాతృభావన, భరతమాత మీద మాతృదేశభక్తి ఉండాలి".

- సరోజినీ నాయుడు

# దైవభక్తి

*"డివోషన్ లేని బ్రతుకు ఓషన్"* అన్నారు శ్రీ సత్యసాయిబాబావారు. భక్తిలేని జీవితం సముద్రంలాంటిది. సముద్రంలో నీరు పుష్కలంగా ఉన్నప్పటికీ త్రాగడానికి ఉపయోగపడదు గదా! అదే విధంగా భక్తిలేని వాని జీవితం కూడా అంతే. భక్తి అంటే కేవలం దైవభక్తి మాత్రమేకాదు. కనిపెంచిన తల్లిదండ్రుల మీద 'భక్తి' ఉండాలి. పెద్దల మీద భక్తి ఉండాలి. దేశభక్తి అందరికీ ఉండాలి. ఇంతమంది మీద భక్తి ఉన్నప్పుడు 'సృష్టికర్త' మీద భక్తి ఉండకూడదా? ఇది విజ్ఞతతో ఆలోచించవలసిన విషయం.

ఇకపోతే భక్తికి మూలం శ్రద్ధ. తల్లి మీద శ్రద్ధ వుండాలంటే 'ప్రేమ' ఉండాలి. 'ప్రేమ' ఉండాలంటే 'విశ్వాసం' ఉండాలి. అనగా ఈమె 'నా తల్లి' అనే విశ్వాసం మొదట ఉండాలి. అట్టి విశ్వాసం వున్నప్పుడే తల్లిని ప్రేమించగలుగుతాం. ప్రేమ వుండినప్పుడే 'శ్రద్ధ' ఏర్పడుతుంది. శ్రద్ధ ఉన్నప్పుడే 'భక్తి' కలుగుతుంది. కనుక మొదట మనం విశ్వాసాన్ని పెంచుకోవాలి. ప్రేమతో, శ్రద్ధతో సేవలు చేయాలి. దానినే 'భక్తి' అని అంటారు. అట్టి భక్తిలేనివారి జీవితం సముద్రం వంటిది.

పూజలు చేయటం, ఆరాధనలు సల్పటం, యజ్ఞయాగాది క్రతువుల నాచరించటం, పుణ్యక్షేత్రాలను సందర్శించడం మాత్రమే 'భక్తి' అని చాలా మంది భావిస్తుంటారు. ఇది మాత్రమే కాదు. దివ్యత్వం మీద పరమప్రేమను పెంచుకోవడం. 'భక్తి' అనగా పరిపూర్ణ ప్రేమయే భక్తి. ప్రేమయే దైవం. Love is God అన్నారు గదా! కనుక సర్వులయందునూ ప్రేమను పెంచుకోవాలి.

భక్తి అనగా పరిపూర్ణ ప్రేమ. భక్తికి, ప్రేమకు అవినాభావ సంబంధమున్నది. ***ముక్తికి సాధన భక్తి. భక్తికి రూపం ప్రేమ. నిస్వార్థమైన ప్రేమతో తల్లిదండ్రులను పూజించాలి. అఖండమైన ప్రేమతో, ప్రతిఫలాపేక్ష లేకుండా సృష్టికర్త (దైవము)ను ఆరాధించాలి.*** అదే 'పరమభక్తి'.

**రామకృష్ణ పరమహంస :**

*'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం'* శ్రద్ధగలవానికే జ్ఞానం అబ్బుతుంది అని భగవద్గీత బోధిస్తున్నది. 'భక్తి' అనే పుష్పము నుండి జ్ఞానం ఆవిర్భవిస్తుంది. అట్టి అకళంక భక్తునికి ఒకవేళ శాస్త్ర పరిజ్ఞానం లేకపోయినా, ఆధునిక చదువులు చదువకపోయినా ఫరవాలేదు.

జ్ఞానోదయం కలగడానికి అర్హుడే అవుతాడు. ఉదాహరణకు **'రామకృష్ణ పరమహంస'.** ఆయన ఏ ప్రాపంచిక చదువులు చదవలేదు. కాని 'మహాజ్ఞాని' అని పేరుగాంచాడు. అది ఎలా సాధ్యమైంది? భక్తి శ్రద్ధలే ఆయనను అంతవాడిగా చేసాయి. కాబట్టి లౌకిక చదువులు విడనాడమని కాదు, అవి కూడా అవసరమే. అవి లేకపోయినా ఆధ్యాత్మిక జ్ఞానమును సంపాదించవచ్చుననడానికి రామకృష్ణ పరమహంసను ఉదాహరణగా పేర్కొనటమైనది. **"జ్ఞానానాం జ్ఞానముత్తమం".** జ్ఞానములలోకెల్ల ఆత్మజ్ఞానం ఉత్తమమైనది గదా!

**ప్రహ్లాదుడు :**

ప్రహ్లాదుడు హరిభక్తుడు. అతని తండ్రి హిరణ్యకశిపునికి 'హరి' మాటంటే అసలే సరిపడదు. హరిని స్మరించకుండా వుండలేడు ప్రహ్లాదుడు. 'హరి' పేరును స్మరించవద్దని కుమారుని ఎన్నో బాధలు పెడుతాడు. ఏనుగులతో త్రొక్కిస్తాడు. విషసర్పాలతో కరిపిస్తాడు. కొండలను మీదనుండి దొర్లిస్తాడు. కొరడాలతో కొట్టిస్తాడు. అయినప్పటికీ ప్రహ్లాదుడు హరి నామస్మరణను విడనాడడు. హిరణ్యకశిపునికి ఆశ్చర్యం వేస్తుంది. ఏమిచేయాలో తోచక, విసిగిపోయి చిట్టచివరికి ***"నీకు శక్తివుంటే ఈ స్తంభములో నీ హరిని చూపించు"*** అని గర్జించి అడిగి, తన గదతో ఆ స్తంభమును మూడు ముక్కలు చేస్తాడు. నృసింహ అవతారంలో బయటకు వచ్చి హిరణ్యకశిపుణ్ణి సంహరిస్తాడు 'హరి'.

భక్తితో సాధించలేనిదంటూ, ఈ ప్రపంచంలో మరొకటి లేదని ఈ ఉదంతం చాటుచున్నది. ***నిశ్చలభక్తి, నిర్మల హృదయం, శ్రద్ధ, పట్టుదల ఉన్నవారికి పరమాత్మ అనుగ్రహం వుంటుందనే విషయం ఈ సంఘటన ఋజువు చేస్తున్నది.***

**భక్తకన్నప్ప :**

పూర్వం కాళహస్తి సమీపానగల కొండల్లో 'కన్నప్ప' అనే వేటగాడు నివసిస్తుండేవాడు. పగలల్లా వేటాడేవాడు. సాయంత్రం ఒక శివలింగానికి, తనకు చేతనైనట్లుగా పూజ చేస్తుండేవాడు. నోటినిండా నీటిని పుక్కిలిబట్టి, ఆ నీటితో శివలింగానికి అభిషేకం చేసేవాడు. వేటాడి తెచ్చిన జంతువుల పచ్చి మాంసాన్ని నైవేద్యం పెట్టేవాడు. ఒకనాడు

ఆ గుడి పూజారి మాంసం ముక్కలు, ఎముకలు చూచి నిర్ఘాంతపోయాడు. ఆ విధంగా గుడిని అపవిత్రం చేస్తున్నదెవరో కనిపెట్టటానికి ఒకనాడు ఆ శివలింగం వెనుక దాగి కూర్చున్నాడు. కన్నప్ప భక్తి అంటే శివునికి ప్రీతి. కన్నప్ప భక్తి శ్రద్ధలు ఎంతటివో పూజారికి చూపించదలచుకున్నాడు శివుడు. ఇంతలో కన్నప్ప రానే వచ్చాడు. ఆ రోజు శివలింగానికి రెండు కళ్ళు వుండటం గమనించాడు. ఒక కన్ను ఎర్రగా వుండి కన్నీరు కారుతున్నది. కన్నప్ప బాధపడ్డాడు. కన్నీటిని తుడిచాడు. కానీ కన్నీరు ఆగలేదు. నీరు కారుతున్న కన్ను స్థానంలో తన కన్నును పెట్టాలని నిశ్చయించుకున్నాడు. తన దగ్గరవున్న బాణం తీసుకొని, తన కంటిని పెరికి, ఆ నీరు కారుతున్న కన్ను స్థానంలో వుంచాడు. నీరు కారటం ఆగింది. కానీ రెండవ కంటి నుంచి నీరు కారటం మొదలైంది. కన్నప్ప ఏ మాత్రం కలవరపడకుండా, వెంటనే తన కాలిని, ఆ రెండవ కంటిపైన గుర్తుగా వుంచి, తన రెండవ కంటిని కూడా పెరికి శివుని రెండవ కంటి స్థానంలో ఉంచుతాడు.

పరమేశ్వరుడు తన భక్తుని భక్తి శ్రద్ధలకు మెచ్చి, ప్రత్యక్షమై కన్నప్పకు తిరిగి చూపును అనుగ్రహిస్తాడు. ***అనన్య భక్తిగల భక్తుణ్ణి, భగవంతుడు సర్వవిధములా, సర్వవేళలా రక్షించి తీరుతాడని*** ఈ సంఘటన మనకు తేటతెల్లం చేస్తున్నది.

***"భగవంతుడు భక్తిని చూస్తాడేగాని శక్తినిచూడడు. గుణమును చూస్తాడేకాని కులమును చూడడు. నీతిని చూస్తాడేగాని జాతిని చూడడు. చిత్తమును చూస్తాడేగాని విత్తమును చూడడు".*** ఇది యదార్థం. మోక్షమును పొందటానికి అందరూ అర్హులే. జాతి, మత, కుల లింగబేధములు లేవు. పశుపక్ష్యాదులు, జంతువులు సహితం మోక్షమునకు అర్హులేనని పురాణములు నిరూపిస్తున్నాయి. అందువలననే అట్టడుగున వున్న కులానికి చెందిన వేటగాడైన కన్నప్పకు మోక్షమును ప్రసాదించాడు. సాలెపురుగుకు, సర్పానికి, ఏనుగుకు (శ్రీకాళహస్తి మహత్మ్యము) కూడా మోక్షం ప్రసాదించబడింది. భగవంతుని దృష్టిలో భక్తి ప్రధానంగాని, ఇతర విషయములు ప్రధానం కావు.

***కనుక భక్తిని పెంచుకోండి, శక్తిని కాదు (కండబలం కాదు) గుణమును పెంచుకోండి, కులమును కాదు. నీతిని పెంచుకోండి, జాతిని కాదు. చిత్తమును పెంచుకోండి, (మనసును విశాలం చేసుకోండి) విత్తము (డబ్బు)ను కాదు.*** ఈ సత్యమును విస్మరించకండి!

# సత్యము

"సత్యం న్నాస్తి పరోధర్మః" 'సత్యం' కన్న పరమ ధర్మం లేదు. సత్యము యొక్క అంతరార్థం తెలుసుకుంటే సత్యస్వరూపం ఏమిటో అర్థమవుతుంది. **సత్ + ఇ + యం = సత్యం.** 'సత్' అనగా ప్రాణము, 'ఇ' అనగా అన్నము, 'యం' అనగా సూర్యుడు. మానవత్వానికి 'ప్రాణం' అత్యవసరం. ప్రాణం నిలబెట్టుకోవడానికి 'అన్నం' అవసరం. సమస్తమునకూ 'సూర్యుడు' ఆధారం. ఈ త్రిపుటికి 'భగవంతుడు' మూలం. కనుక **'సత్యమేదైవం' (Truth is God).**

లోకంలో సత్యం, నిజం అనే రెండు పదాలున్నాయి. సహజంగా ఈ రెండు పదాలకు ఒకటే అర్థమని చాలామంది భావిస్తుంటారు. ఇది కాదు. సత్యం వేరు, నిజం వేరు. వీటికి వేరువేరు అర్థములున్నాయి. 'నిజము' అనగా తాత్కాలికంగా నీవు చూచినది, విన్నది, అనుభవించినది మాత్రమే. ఉదాహరణకు ఒకసారి ఒకవ్యక్తిని చూచినప్పుడు తలకు రుమాల, కంటికి నల్ల అద్దాలు పెట్టుకొని వుండవచ్చు. అది అప్పటికి మాత్రమే నిజం. ఆ వ్యక్తే మరునాడు తలకు టోపి, కంటికి తెల్ల అద్దాలు పెట్టుకొని రావచ్చు. అది ఆనాటి నిజం. కనుక కనిపించేది, చూచేది నిజం.

*'త్రికాలభాధ్యం సత్యమ్'* మూడు కాలములయందునూ మార్పు చెందనటువంటిది సత్యం. దేశకాలమాన పరిస్థితులను బట్టి అది మారదు. సత్యం శాశ్వతమైనది. దానికి నశింపులేదు. సత్యం కేవలం నాలుకతో మాత్రమే పలికేది కాదు. త్రికరణ శుద్ధితో పలికేది సత్యం. మాటకు ప్రాణం సత్యం. కనుక ప్రతిఒక్కరూ **'సత్యం వద'** అట్టి సత్యమును పలుకవలెను.

**'సత్యం'** పేరు చెప్పగానే లోకంలో ప్రధానంగా ఇద్దరు మహనీయులు ప్రతి ఒక్కరి మదిలో మెదులుతారు. ***1. శ్రీరామచంద్రుడు 2. సత్యహరిశ్చంద్రుడు.*** సత్య వాక్పరిపాలన అత్యంత పరమోత్కృష్టమైన ధర్మమని ఆచరణ ద్వారా నిరూపించాడు 'శ్రీరాముడు'. ఇచ్చినమాటను నిలబెట్టుకోవడం కోసం, తన భార్యాబిడ్డలను కోల్పోయి కాటికాపరిగా మారాడు *'సత్యహరిశ్చంద్రుడు'.*

***"సత్యం అన్నింటికంటే ఉత్తమమైన నీతి. మరే ఇతర మార్గాల ద్వారా దేశానికి మేలు చేకూర్చలేము. అయితే సత్యాన్ని పాలించటం అగ్ని పరీక్షలాంటిది. బంగారం రాటు తేలాలంటే అగ్నిలో మండిస్తాం. సత్య పరీక్షకూడా ఇట్టిదే"*** అని అంటారు బాలగంగాధర తిలక్.

*"నీవు సత్యమును అనుసరించునప్పుడు, ఎవరి గుండైనా పగిలినా విచారించనవసరంలేదు. సత్యమును హత్యచేయడం కంటె ఆ ఒక్క శరీరము నాశనము అయినా ఫరవాలేదు. శరీరం భగ్నమైనా సత్యం భగ్నం కాకూడదు"* అని అంటారు స్వామి రామతీర్థ.

"సత్యమే నా దైవము. అహింస ద్వారా మాత్రమే నేను దైవాన్ని చేరుకోగలుగుతాను" అని అంటారు మహాత్మా గాంధీ.

*"సత్యం జనవిరోధాయ, అసత్యం జనరంజకం"* సత్యం చెబితే విరోధులమవుతామని, అసత్యం చెప్పి తప్పకోవటానికి ప్రయత్నిస్తుంటారు కొందరు. ఇది మంచిది కాదు.

సత్యమును పలుకవలెను, ప్రియమైన దానిని చెప్పవలెను, సత్యమైనను అప్రియముగా చెప్పరాదు. ప్రియముగదాయని అసత్యమైనచో చెప్పరాదు. ఇది సనాతమైన ధర్మము.

## అసత్యం చెప్పరాదు (కథ)

కొంతకాలం క్రిందట ఒక తండ్రి తన ముద్దుల కుమారుడైన 'ఉదయ్'కి నాలుగు బంగారు నాణెములు యిచ్చి దాచుకోమని చెబుతాడు. పరీక్ష ప్యాసయిన తరువాత ఆ బంగారు నాణెములతో ఉంగరం చేయిస్తానని చెప్పి బజారుకు వెళ్ళుతాడు. ఆ నాణెములను ఆ బాలుడు బల్లమీద పెట్టి చదువులో నిమగ్నుడైనాడు. ఇంతలో ఆ అబ్బాయి చెల్లెలు **'విజయగౌరి'** అక్కడకు వచ్చి, ఆ బంగారు నాణెములను చూచి **"అన్నయ్యా! ఇవేమిటి?"** అని అడుగుతుంది. అప్పుడు ఉదయ్ **"ఇవి వరహాల చెట్టుకు కాసినాయి. వీటిని మరల పాతిపెట్టితే, మొక్కలు మొలచి, చెట్లు అయి, చాలా చాలా కాయలు కాస్తాయి. ఆ కాయలలో ఇటువంటి బంగారు నాణాలు చాలా ఉంటాయి".** అని చెప్పి చదువుకుంటుంటాడు. గౌరి చాలా చిలిపి పిల్ల. ఆ నాణెములను చడీచప్పడు కాకుండా తీసుకొని బావి వద్దకు వెళ్ళుతుంది. చిన్నగొయ్యిని తీస్తుంది. ఆ నాణెములను ఆ గోతిలో పెట్టి మట్టి కప్పి ఆడుకోవడానికి వెళ్ళుతుంది. ఉదయ్ చదువు పూర్తి చేసుకొని, బల్లమీద చూడగా ఆ నాణెములు కనిపించవు. ఆతురతతో వెళ్ళి 'గౌరి'ని అడుగుతాడు. జరిగినదంతా చెబుతుంది. బావివద్దకు పరుగెత్తుతారిద్దరు. గోతిమీద కప్పిన మట్టిని తీస్తారు. ఆ నాణెములు కనిపించవు. ఆ బాలిక ఆ నాణాలను గోతిలో పెడుతుండగా ఆ ప్రక్కనే అంట్లు తోముతున్న పనిమనిషి వాటిని చూచి వుండవచ్చును, ఆ తరువాత

వాటిని సంగ్రహించి వుండవచ్చును. ఏది ఏమైనప్పటికీ నాణాలు మాత్రం కనిపించవు. తన చెల్లెల్ని కొడుతాడు. ఏడుస్తూవెళ్ళి అమ్మతో జరిగినదంతా చెబుతాడు. ఇదంతా వింటున్న వాళ్ళ నాన్న వచ్చి *"అబద్ధమాడినందులకు తగిన శాస్తి జరిగిందిలే!"* అని అంటాడు.

ఈ కథ నుంచి మనం ఒక నీతిని నేర్చుకోవాలి. ఉదయ్ తన చెల్లెలుతో అబద్ధం చెప్పాడు. అది నిజమని నమ్మి విజయ గౌరి ఆ విధంగా చేసింది. నాణాలు కనిపించకుండా పోయినాయి. కనుక ***పొరపాటున కూడా పిల్లలతో అబద్ధం చెప్పకూడదు. పరిహాసంగానైనా సరే అసత్యపు మాటలు మాట్లాడరాదు. ఎల్లప్పుడూ సత్యమునే పలుకవలెను.***

## సత్యం జయిస్తుంది (కథ)

ఒక గ్రామంలో ఒక యువకుడు వుండేవాడు. పగలు జూదం ఆడటం, రాత్రిపూట దొంగతనం చేయటం అతని నిత్యకృత్యం. ఆ గ్రామానికి ఒకసారి ఒక సన్యాసి వస్తాడు. అతని ఆధ్యాత్మిక ప్రసంగాలు ఒక దేవాలయంలో ఏర్పాటు చేయబడినాయి. వినడానికి గ్రామంలోని పెద్దలు వెళ్ళేవారు. వాళ్ళతోపాటు ఆ యువకుడు కూడా వెళ్ళి స్వామీజీ ప్రసంగాలు వినేవాడు. ఒకనాడు స్వామీజీ ప్రసంగం పూర్తి అయింది ఎవరిండ్లకు వారు వెళ్ళారు. ఆ యువకుడు మాత్రం అందరూ వెళ్ళేంతవరకు వుండి, స్వామీజీ పాదముల మీదపడి ***"స్వామీజీ! నన్ను మీ శిష్యునిగా చేర్చుకోండి!*** అని ప్రాధేయ పడుతాడు. ***'నాయనా! నీ నిత్యకృత్యమేమిటి?'*** అని ప్రశ్నిస్తాడు ఆ స్వామి ***"పగలు జూదం, రాత్రి దొంగతనం"*** అని ధైర్యంగా చెబుతాడు. ఆ యువకుడు. 'వాటిని మానివేయలేవా?' అని ప్రశ్నిస్తాడు స్వామి. ***"దొంగతనం నావృత్తి. దాని వలననే నేను, నా కుటుంబం జీవిస్తున్నాం. ఇక జూదం నా కాలక్షేపం. దానిని వదిలితే పగలంతా ఏమి చేయాలి?"*** అని అడుగుతాడు. స్వామి ఆ యువకుని నిజాయితీని గుర్తించి ***"సరే! నీలో వున్న ఒక్క దుర్గుణాన్ని వదిలేయి అప్పుడు నిన్ను శిష్యునిగా స్వీకరిస్తాను"*** అంటాడు. సంతోషంతో ***"స్వామీ! ఈ క్షణం నుండి నేను అసత్యమాడను"*** అని వాగ్దానం చేస్తాడు ఆ యువకుడు. ఆశీర్వదిస్తాడు స్వామి.

ఒకసారి ఆ యువకుడు దొంగతనం చేయడానికి రాజభవనంలోని పై అంతస్తుకు చేరుతాడు. అదే సమయంలో రాజుగారికి నిద్రపట్టక వరండాలో తిరుగుతుంటాడు. రాత్రి గదా! సాదాసీదా దుస్తులు వేసుకొని గాలి కోసం అటూ ఇటూ పచార్లు చేస్తుంటాడు. అలికిడై ***'ఎవరక్కడ? ఎవరక్కడ?'*** అని పెద్దగా అరుస్తాడు రాజు. అసత్యమాడనని గురువుగారికి వాగ్దానం చేసాడు గదా! ఆ దొంగ. ధైర్యంగా

ముందుకు వెళ్ళి *'నేను దొంగను'* అని చెబుతాడు ఆ యువకుడు. రాజుగారికి ఆశ్చర్యం వేస్తుంది. దొంగ భుజం మీద చేయివేసి *"నేనూ దొంగనే. దొంగతనం చేయడానికి వచ్చాను. నాకు ఈ రాజభవనంలోని విషయాలు అన్నీ తెలుసు. మనమిద్దరం కలిసి దొంగతనం చేద్దాం. అయితే ఒక షరతు. దొంగిలించిన సొమ్ము చెరిసగం అన్నాడు.* రాజు లోపలికి వెళ్ళి గది తాళపు చెవులను తీసుకొని దొంగకిచ్చి *"అదిగో! ఆ గదిలో నిధులున్నాయి వెళ్ళు! నేనిక్కడ కాపలా కాస్తుంటాను"* అని చెబుతాడు. దొంగ గదిలోనికి వెళ్ళి అన్ని బీరువాలు తెరిచి చూస్తాడు. ఒక పెట్టెలో వున్న అతివిలువైన వజ్రముల మీద ఆ దొంగ దృష్టి పడుతుంది. అయితే ఆ పెట్టెలో మూడు వజ్రములున్నాయి. దొంగిలించిన సొమ్మును చెరిసగం పంచుకోవాలనే షరతు గుర్తుకు వస్తుంది. రెండు వజ్రములను మాత్రమే తీసుకొని బయటకు వచ్చి, *"ఇదిగో రెండు వజ్రములు. ఒకటి నీకు, మరొకటి నాకు"* అని చెప్పి ఒక వజ్రమును యిచ్చి, వెళ్తానంటాడు. రాజుగారు దొంగ చిరునామా అడుగుతాడు. మొదట చెప్పడానికి సంశయిస్తాడుగాని, స్వామీజికి యిచ్చిన వాగ్దానం (అసత్యమాడను) గుర్తుకు వచ్చి తన ఇంటి చిరునామా చెప్పి వెళ్ళిపోతాడు.

మరునాడు రాజభవనంలో దొంగతనం జరిగిందని అందరికీ తెలుస్తుంది. ఏమీ తెలియనట్లు రాజుగారు కొలువుకు విచ్చేస్తారు. మంత్రిని పిలిచి *"దొంగిలింపబడిన వస్తువుల సమాచారమును పరిశీలించి నాకు తెలియపరచండి!"* అని ఆజ్ఞాపిస్తాడు రాజుగారు. మంత్రి ఖజానా గదిలో ప్రవేశించి అంతా పరిశీలించాడు. ఎక్కడ వస్తువులు అక్కడనే ఉంటాయి. వజ్రాలువున్న పెట్టె మాత్రం తెరచి ఉంటుంది. మూడు వజ్రములకు బదులు ఆ పెట్టెలో ఒకే వజ్రం ఉంటుంది. దానిని మంచి అవకాశంగా భావించి, ఆ వజ్రమును కోటు జేబులో దాచిపెట్టుకొని బయటకు వచ్చి *"రాజా! ఒక పెట్టె మాత్రం తెరచి ఉన్నది. అందులోని మూడు వజ్రములులేవు"* అని చెబుతాడు మంత్రి. రాజుగారు మంత్రి చేసిన కుట్రను పసికడుతాడు. ఏమీ ఎరుగనట్లు భటులను పిలిచి, దొంగ యొక్క ఇంటి గుర్తులు చెప్పి, అతనిని పట్టుకొని రావల్సినదిగా ఆజ్ఞాపిస్తాడు.

భటులు వెళ్ళి దొంగను తీసుకొని వస్తారు. అసలు విషయం బయట పడుతుంది. మంత్రిని సోదాచేయగా వజ్రం కూడా బయటపడుతుంది. దొంగ యొక్క నిజాయితీని ప్రశంసించి, అతనిని తన కొలువులో నియమిస్తారు రాజుగారు. అసలు మంత్రికి పదవి పోతుంది. ఆనాటి నుంచి దొంగ యొక్క జీవన విధానమే మారిపోయింది. ఈ కథ మనకు ఒక చక్కటి నీతిని బోధిస్తున్నది. *"సత్యం జయిస్తుంది, అసత్యం ఏదో ఒకనాటికి అపజయమును పొందుతుంది".*

# ధర్మము

*'ధర్మము'* అనగా సాధారణంగా దానాలు చేయడమని, ధర్మసత్రాలు కట్టించడంలాంటివని చాలామంది భావిస్తుంటారు. ఇది సరియైన నిర్వచనం కాదు. మానవుడు చేయవలసిన కర్తవ్యాన్ని 'ధర్మము' అని అంటారు.

**'ధ్రియతా ఇతి ధర్మః'** నిలిపి వుంచునది ధర్మము. ధర్మము వ్యక్తికీ, వ్యక్తికి మధ్య; వ్యక్తికి సమాజమునకు మధ్య; జడమైన, చైతన్యవంతమైన అన్ని వ్యవహారములలోను కర్ణధారియై, వాటి మధ్యగల సంబంధములను సుగమం చేయును. సంపూర్ణ జీవన విధానమునకు 'చుక్కాని' వంటిది ధర్మం. సమాజ రక్షణ, వ్యక్తివికాసం ధర్మము యొక్క ప్రధాన లక్ష్యాలు. వ్యక్తి శ్రేయస్సుకు, సమాజ శ్రేయస్సుకు తోడ్పడే నైతిక సూత్రావళినే 'ధర్మము' అని చెప్పవచ్చును. సకల చరాచర సృష్టిలో ఒక క్రమపద్ధతిలో నిలిపి వుంచునది, నడిపించగలది 'ధర్మము' మాత్రమే. సృష్టిని ఒక పెద్ద గొలుసుగా భావించుతే, ప్రతివ్యక్తీ ఆ గొలుసులోని ఒక 'లింకు' అని చెప్పవచ్చును. 'లింకు' పటిష్టంగా వుంటే గొలుసు గట్టిగా ఉంటుంది. అదేవిధంగా వ్యక్తి శ్రేయస్సు మీదనే సమాజ శ్రేయస్సు ఆధారపడి ఉంటుంది. వ్యక్తికి, సమాజమునకు మధ్యగల సంబంధ బాంధవ్యాలను నిర్దేశిస్తుంది 'ధర్మము'.

చతుర్విధ పురుషార్థముల (ధర్మం, అర్థం, కామం, మోక్షం)లో మొదటిది 'ధర్మం'. పూసలలో దారం లాంటిది ధర్మం. ధర్మంలేని పురుషార్థం నిరర్థకం. బాధ్యతలు (Duties) హక్కులు (Rights) మధ్య ఎట్టి ఘర్షణలు (Conflicts) రాకుండా కాపాడు తుంది 'ధర్మం'. ***'ధర్మం చర'*** అట్టి ధర్మమును మనం ఆచరించాలి, రక్షించాలి. ***'ధర్మో రక్షతి రక్షితః' ఎవరు ధర్మాన్ని రక్షించుతారో, వారిని ధర్మమే రక్షిస్తుంది. కాబట్టి ధర్మాచరణ ముఖ్యం. అది ప్రతి ఒక్కరి కర్తవ్యం.***

## ధర్మోరక్షతి రక్షితః :

అది కురువంశ చక్రవర్తి శంతన మహారాజు మరణించిన సమయం. అతని కుమారుడు భీష్ముడు. తన తండ్రి శ్రాద్ధకర్మలు శ్రద్ధగా నిర్వర్తించుతుంటాడు. ఆ

దుఃఖసమయంలో గదాధరుడనే రాజు భీష్ముని బాధించాలనుకొని ఒక వర్తమానం పంపుతాడు. అందులో *'యువరాజా! పట్టపురాణి అయిన సత్యవతీదేవిని నాకు అప్పగించు లేదా యుద్ధానికి సిద్ధంగా ఉండు!"* అని వుంటుంది. భీష్ముడు ఆ లేఖను చూచి, అవమానంగా భావించి 'యుద్ధానికి సిద్ధమే' అని జవాబు పంపుతాడు. ఈ సంగతిని తెలుసుకొనిన ఆస్థాన పురోహితుడు వెంటనే భీష్ముని దగ్గరకు వెళ్ళి *"యువరాజా! మీరు ఇప్పుడు తండ్రిగారి శ్రాద్ధకర్మల దీక్షలో ఉన్నారు. ఈ పదిరోజులూ మీరు దివ్యాస్త్రములను తాకరాదు. ఈ పదిరోజులూ గడచిన తరువాత యుద్ధం చేయవచ్చు"* అని సలహా యిస్తాడు. పురోహితుడు యిచ్చిన సలహా ప్రకారం భీష్ముడు *"పదిరోజుల తరువాత యుద్ధానికి సిద్ధమవుతాను'* అని గదాధరునికి వర్తమానం పంపుతాడు. దీనిని భీష్ముని బలహీనతగా భావించి గదాధరుడు భీష్మునిపై యుద్ధానికి బయలుదేరుతాడు. గదాధరుడు దురహంకారి. అందులో తపస్సు చేసి సంపాదించిన శక్తివంతమైన చక్రాయుధం అతని చేతిలో ఉన్నది. ఆ చక్రాయుధాన్ని భీష్ముని పై ప్రయోగిస్తాడు. ఆ ప్రయోగించిన చక్రాయుధం భీష్ముని భవనం చుట్టూ తిరుగుతుంటుంది గాని భవనంలోనికి మాత్రం ప్రవేశించదు. భీష్మునికి ఏ హాని జరుగదు. ఈ దృశ్యమును చూచిన వారందరూ ఆశ్చర్యపడుతారు. గదాధరుడు నివ్వెరపోతాడు. కారణం ఏమిటి? విచారిస్తే ఒక సత్యం గోచరమవుతుంది.

భీష్ముడు తండ్రి శ్రాద్ధకర్మలను శ్రద్ధగా చేస్తున్నాడు. అది కుమారుడి ధర్మం. అట్టి పవిత్ర ధర్మమును ఆచరిస్తున్నాడు భీష్ముడు. అందువలన తన ధర్మాన్ని పాటిస్తున్న భీష్మునికి ఎట్టి హాని కలుగలేదు. *'ధర్మో రక్షతి రక్షితః' ఎవరు ధర్మాన్ని పాటిస్తారో, ఆచరిస్తారో, రక్షిస్తారో, వారిని ధర్మమే రక్షిస్తుంది. ధర్మాచరణ ప్రతి ఒక్కరి కర్తవ్యం. విస్మరించకండి!*

**ధర్మ ప్రవర్తన :**

అది కురుక్షేత్ర మహాసంగ్రామ యుద్ధ భూమి. కౌరవ, పాండవసేనలు బారులు తీరాయి. యుద్ధ ప్రారంభ సూచనగా, ఇరు పక్షాలవారు దుందుభులు మ్రోగించారు. శంఖాలు పూరించారు. ఇంతలో ధర్మరాజు తన కిరీటాన్ని అస్త్ర శస్త్రాలను, పాదరక్షలను ప్రక్కనపెట్టి కౌరవ సేనవైపు నడచి వెళ్ళుతుంటాడు. సోదరులు కూడా ధర్మరాజును

అనుసరిస్తారు. దుర్యోధనాదులు పాండవులు లొంగిపోయినట్లేనని భావిస్తారు. ధర్మరాజు భీష్మాచార్యునికి పాదాభివందనం చేసి వినయ విధేయతలతో ***"పితామహా! మా తండ్రిగారు పరమపదించిన తరువాత మమ్ముల్ని పెంచి పెద్ద చేసారు. విధివశాత్తు మీతోనే యుద్ధం చేయవలసి వస్తున్నది. మమ్మల్ని ఆశీర్వదించండి!"*** అని వేడుకుంటాడు 'ధర్మరాజు'. భీష్మాచార్యుల వారు ఆనంద భాష్పాలతో దగ్గరకు తీసుకొని ***"ధర్మనందనా! ధర్మోరక్షతి రక్షితః నేను ఇంతకన్నా చెప్పవలసింది ఏమీ లేదు. మీ ధర్మనిరతయే మీకు రక్ష!"*** అని ఆశీర్వదించాడు. వెంటనే పాండవులు తమ గురువుగారైన ద్రోణాచార్యుల వారివద్దకు వెళ్ళి ***"గురువర్యా! సకల విద్యలను నేర్పిన మీతోనే యుద్ధం చేయాల్సి వచ్చింది. దీనికి మేమెంతో విచారిస్తున్నాం. మమ్మల్ని ఆశీర్వదించండి!*** అని ప్రాధేయపడుతారు. వారి గురుభక్తికి పరవశించి ***"ధర్మజా! మీ ధర్మవర్తనయే మిమ్ముల్ని రక్షిస్తుంది"*** అని ఆశీర్వదించారు ద్రోణాచార్యులవారు.

పాండవుల ధర్మనిరతి అంతటిది. వారి ధర్మాచరణే వారిని రక్షించింది. ఎవరు ధర్మాన్ని ఆచరిస్తారో, వారిని ధర్మమే రక్షిస్తుంది. కనుక ***ప్రతి ఒక్కరి ప్రవర్తన ధర్మబద్ధంగా ఉండాలి.***



---

'ధర్మము' అనే జలం లభించనంతవరకు 'నీతి' అనే విత్తనం అంకురించదు. ధర్మం మన కార్యక్రమాలన్నింటికీ మార్గదర్శకం. ధర్మాన్ని అనుసరించాలంటే అడవులకు వెళ్ళి తపస్సుచేయనవసరం లేదు. మనిషి సమాజంలో చేసే ప్రతిపనిలో ధర్మము ప్రతిబింబించాలి. ధర్మమే దైవం. 'ధర్మంచర' ఆచరించి చూపించవలసింది 'ధర్మం'. కేవలం నోటితో చెప్పేదికాదు.

- మహాత్మాగాంధి

# శాంతి

***'శాంతి' అంటే ఏమిటి?*** ఎవరు తిట్టినా, కొట్టినా మౌనం వహించునది కాదు. తనలో లేనటువంటి తప్పులను ఎవరు వేలెత్తి చూపినా, ఏమాత్రం ఉద్రేకపడక, సంతోషంగా కృతజ్ఞతను తెలిపేదే 'శాంతి'. అట్టి శాంతిని పొందాలంటే ముందుగా అశాంతిని దూరం చేసుకోవాలి. అశాంతికి మూలం అదుపులేని ఆశలు, కళ్ళాలు లేని కోరికలు. ఈ రెంటిని అదుపు చేయడానికి 'ఇంద్రియనిగ్రహం' అవసరం. ఇంద్రియ నిగ్రహమే నిశ్చల శాంతిని అందించును. శాంతి, ప్రశాంతిని ఇచ్చును. ప్రశాంత వాతావరణం ప్రపంచ శాంతికి దోహదం చేస్తుంది. కనుక మనం ***శాంతిని పెంచే శాంతి దూతలం కావాలి, అశాంతిని పెంచే యమదూతలు కారాదు.***

ఆశలు, అసూయలు; కోపం, కోరికలు; ఉద్రేకం, భయం మొదలగునవి అశాంతిని తెచ్చిపెడుతాయి. దయ, కరుణ, ప్రేమ, త్యాగములు శాంతిని తెచ్చి పెడుతాయి. ***'త్యాగాత్ శాంతిః'*** త్యాగము వలన శాంతి లభిస్తుంది. ఇతరులను ప్రేమించగలవాడే ప్రపంచానికి అధినేత కాగలడు. సంతృప్తి ప్రేమను పెంచుతుంది. ప్రేమగలవానిలో త్యాగం ఉదయిస్తుంది. ప్రేమ, త్యాగములే ప్రపంచ శాంతిని తెచ్చిపెడుతాయి. కనుక ప్రతిఒక్కరూ ప్రేమ త్యాగములను పెంపొందించుకోవాలి.

**విశ్వామిత్రుడు :**

విశ్వామిత్రుడు ముప్పై సంవత్సరాల పాటు ఘోర తపస్సు చేశాడు. అయినప్పటికీ ఆయనకు శాంతి లభించలేదు. కారణం? బ్రహ్మర్షి అయిన వశిష్ఠునితో క్రోధం పెంచుకున్నాడు. తాను కూడా బ్రహ్మర్షికావాలని ఎంతో శ్రమించాడు. బ్రహ్మర్షి కావాలనే కోరిక మంచిదే. కాని వశిష్టుని మీద 'పగ' పూనటం వలన పడరాని పాట్లుపడ్డాడు. కోపం, పగలవలన శాంతి చేకూరదని తరువాత తెలుసుకున్నాడు. శమదమాదుల వలననే వశిష్ఠుడు 'బ్రహ్మర్షి' కాగలిగాడని, కొడుకులందరూ చనిపోయినా అశాంతికి లోనుకాకుండా, ఇంద్రియనిగ్రహంతో తపమాచరించి వశిష్ఠుడు **'బ్రహ్మర్షి'** అయినాడని గ్రహించి, ఆ తరువాత ప్రశాంతంగా తపస్సుచేసి 'బ్రహ్మర్షి' అయినాడు విశ్వామిత్రుడు. ఆ తరువాత శ్రీరామచంద్రునికే గురువైనాడు. తన సకల విద్యలను శ్రీరామునికి ధారపోసి, సమర్పణ భావంతో పరమాత్మను సేవించి, శాంతుడై ముక్తిని పొందాడు విశ్వామిత్రుడు. ఈ ఉదంతం మనకు ఒక చక్కటి గుణపాఠమును నేర్పుతున్నది.

కోపతాపములు గలవానికి 'శాంతి' చిక్కదు. శాంతి లేనివాడు దేనినీ సాధించలేడు. ***'పరమాత్మ అనుగ్రహాన్ని అంతకన్నా పొందలేడు. పరమాత్మను పొందడానికి శాంతియే పరమసాధనము. శాంతి కాముకులు మాత్రమే, సర్వులనూ జయించగలరు'.***

## మహమ్మద్ ప్రవక్త:

మహమ్మద్ ప్రవక్త ఇస్లాం మతగురువు. సత్యం, శాంతి, ప్రేమలను విస్తృతంగా ప్రచారం చేసిన దైవాంశ సంభూతుడు. ఆయన ప్రబోధలకు ప్రపంచంలో మంచి ఆదరం లభించింది, ఆయనకు కీర్తి ప్రతిష్ఠలు కూడా తెచ్చిపెట్టాయి. సహజంగా లోకంలో కీర్తి పెరుగుతుంటే, అసూయపడేవారు కూడా పెరుగుతుంటారు, ద్వేషించేవారు బయలుదేరుతారు. ఆ రోజులలో అరబ్బీ దేశంలో ఒక వృద్ధురాలుండేది. ఆమె ఎందువలననో, మహ్మద్ ప్రవక్తమీద ద్వేషం పెంచుకుంది. ప్రతిరోజు మహమ్మద్ ఆమె ఇంటి ముందునుంచే మసీదుకు వెళ్ళేవాడు. ఆ సమయంలో అతనిని అవమాన పరచాలనే దుర్బుద్ధి ఆ వృద్ధురాలిలో కలిగింది. తన ఇల్లును ఊడ్చి దుమ్మును, ధూళిని ప్రోగుచేసి ఒక చోట పెట్టింది. ఇంతలో మహమ్మద్, తన ఇంటి ముందుగా వెళ్ళుతున్నాడు. మేడపైన వున్న ఆ ముసలమ్మ, అంతకు ముందే ప్రోగుచేసి పెట్టుకున్న ఆ చెత్తను మహ్మద్ నెత్తిమీద పోసి, ఆనందంతో చప్పట్లు కొడుతుంది. పాపం! మహమ్మద్ తన తలమీద, వంటిమీద, పడ్డ దుమ్మును దులుపుకుంటూ మసీదుకు వెళ్ళుతాడు. పైకి కూడా చూడడు. ముసలమ్మకు ఆశ్చర్యం వేస్తుంది. ఆ విధంగా మూడురోజుల పాటు చేస్తుంది. ఆ ముసలమ్మ. అయినప్పటికీ మహమ్మద్ ఏ మాత్రం చలించడు, పైకి కూడా చూడకుండా శాంతంగా నడచి వెళ్ళుతాడు. నాల్గవ రోజున దుమ్ము నెత్తి మీద పడదు. ఆ విధంగా వరుసగా మూడు రోజులపాటు పైనుంచి దుమ్ముపడదు. ఆశ్చర్యం వేస్తుంది. ***"మూడు రోజుల నుంచి దుమ్ము ఎందువలన పడటం లేదు? ఆ దుమ్మువేసేవారికి నా శిష్యులు ఏమైనా అపకారం చేశారా? ఏమై ఉంటుంది?"*** అని ఆలోచిస్తూ ఆ ఇంటివైపు చూస్తాడు. తలుపులు తెరచి వుంటాయి. లోపలకు వెళ్ళుతాడు. ఎవరూ కనిపించరు. మెట్లు ఎక్కి పైకి వెళ్ళుతాడు. అంతా నిశ్శబ్దం.. ***"అమ్మా! అమ్మా!"*** అని పిలుస్తాడు. లోపల గదిలో నుంచి మూలుగు వినిపిస్తుంది. తలుపుతోసి లోపలికి వెళ్ళుతాడు. ఒక ముసలమ్మ మూలుగుతూ కుక్కి మంచంలో పడుకొని వుంటుంది. ఆమెను సమీపించి ***'అమ్మా! వంట్లో బాగాలేదా?'*** అని అడుగుతాడు. ***"అవును బాబూ!" మూడురోజులుగా జ్వరం వస్తున్నాది, మందుతెచ్చేవారు కూడా ఎవరూ లేరు నాయనా!"*** అని

దీనంగా చెబుతుంది. తన నెత్తిమీద మట్టిపోసింది ఈ ముసలమ్మేనని గ్రహిస్తాడు. ఇప్పుడే వస్తానని చెప్పి బయటకు వెళ్ళుతాడు. మరికొద్ది సేపటికి సీసాతో సహా వస్తాడు. అవ్వను లేపి మందు యిస్తాడు. ఆ విధంగా మూడు రోజులపాటు వచ్చి మందు, ముసలమ్మకు యిచ్చి వెళ్ళేవాడు. జ్వరం తగ్గుతుంది. ఇంతటి సహృదయత గలవాడి మీదనే మన్నుపోశానా? అని ఆ ముసలమ్మ బాధపడుతుంది. పశ్చాత్తాపంతో క్షమించమని వేడుకొంటుంది.

ఈ సంఘటన నుంచి మనం ఒక నీతిని నేర్చుకోవాలి. అదే ***"తన కోపమే తన శత్రువు, తన శాంతమే తనకు రక్ష"*** అనే సత్యాన్ని మరచిపోకండి!

**గౌతమ బుద్ధుడు :**

ఒకసారి గౌతమ బుద్ధుడు అడవిలో నడిచి వెళ్ళుతున్నాడు. ఒక నది కనిపించింది. దానిలో కాళ్ళూ చేతులూ కడుక్కొని, ప్రక్కననే నున్న ఒక చెట్టు క్రింద కూర్చొని ధ్యానం చేసుకుంటున్నాడు. ఇంతలో ( వే దారిన ఆ దేశపు రాజు గుర్రంమీద వెళ్ళుతున్నాడు. నీడగా ఉందని అక్కడ ఆగి, ధ్యానంలో నిమగ్నుడైవున్న ఆ సన్యాసిని చూచి ***"ఈ సన్యాసులకు పనీపాట లేదు. కళ్ళు మూసుకొని కూర్చుంటారు. కాలాన్ని వ్యర్థం చేస్తూ కాయాన్ని పెంచుకుంటుంటారు"*** అని బిగ్గరగా అంటాడు ఆ రాజు. ఆ తిట్లన్నీ విన్న గౌతముడు కళ్ళుతెరచి చిరునవ్వుతో ***"నాయనా! కూర్చో! నీవు చాలా అలసిపోయినావు దాహం వేస్తున్నదా! నదిలో నీరు చల్లగా ఉన్నది, కొంచం తెచ్చి ఇస్తాను"*** అని ఆప్యాయంగా ప్రేమతో పలుకరిస్తాడు ***"అంత కఠినంగా తిట్టినా ప్రేమతో పలుకరిస్తున్నాడేమిటి? పొరపాటు చేశానా?"*** అని లోలోన కొంచం బాధపడుతాడు రాజు, పశ్చాత్తాపం చెంది అప్రయత్నంగా గౌతముని కాళ్ళమీద పడి క్షమించమని వేడుకుంటాడు.

***"స్వామీ! నేను కఠినంగా మాట్లాడినా, తిట్టినా తమరు ఆగ్రహించలేదు. శాంతంగా ప్రేమతో పలుకరించారు. ఇంతటి నిగ్రహాన్ని తమరు ఎలా సంపాదించారు?"*** అని అడుగుతాడు రాజు. అతని పశ్చాత్తాపానికి గౌతముడు ఆనందించి ***"నాయనా! నీవు ఒక పళ్ళెంనిండా మిఠాయిలు తెచ్చి, ఎవరికైనా యివ్వబోతే, వారు పుచ్చుకోలేదనుకో! అప్పుడు నీవేంచేస్తావు?"*** అని అడుగుతాడు. తడుముకోకుండా వాటిని తీసుకొని వెళ్ళుతానని సమాధానం చెబుతాడు రాజు. వెంటనే బుద్ధుడు ***"నీవు మాట్లాడిన కఠినమైన పలుకులను నేను స్వీకరించలేదు. అప్పుడు అవి నన్ను ఏవిధంగా బాధిస్తాయి?"*** అని అంటాడు. ఆ మాటలను విన్న రాజు

*"క్షమించండీ! పొరపాటున మాట్లాడాను. శాంతిని, ఆనందాన్ని పొందడానికి మార్గాన్ని బోధించండి స్వామీ!"* అని ప్రాధేయపడుతాడు.

అప్పడు బుద్ధుడు *"ఆశ, అసూయ, భయం, క్రోధం మొదలగు దుర్గుణములు అశాంతికి గురిచేస్తాయి. సంతృప్తి, శాంతి, ప్రేమలు ఆనందాన్ని అందిస్తాయి"* అని బోధిస్తాడు. రాజులో పరివర్తన వస్తుంది. అహంకారం నశిస్తుంది. కోపం మటుమాయమవుతుంది. శాంతంతో బుద్ధునికి పాదక్రాంతుడవుతాడు ఆ రాజు.

***అధికారం అహంకారాన్ని పెంచుతుంది. శాంతి నందివ్వదు. శాంతి లేనివానికి సుఖముండదు.***

**కోరికలు :**

ఒకసారి ఒక యాత్రికుడు యాత్రకు బయలుదేరి వెళ్ళుతున్నాడు. ఒక అడవిలో ఒక పెద్ద చెట్టు కనిపించింది. నీడ బాగా వున్నది. అందువలన ఆ చెట్టు క్రింద విశ్రమించాడు. ఆ చెట్టు **'కల్పవృక్షము'** అని అతనికి తెలియదు. నిద్రపోయాడు. తెలివి వచ్చింది. చాలా దప్పికగా ఉన్నది. ఎవరైన 'చల్లని నీరు త్రాగడానికి ఒక గ్లాసు నీరు యిస్తే బాగుండు!' అని అనుకున్నాడు. అది కల్పవృక్షం గదా! అనుకున్న తక్షణమే చల్లటి నీరుతో గ్లాసు ప్రత్యక్షమైంది. ఆ నీరు త్రాగి దప్పిక తీర్చుకున్నాడు. ఆకలివేసింది 'మంచి భోజనం ఉంటే బాగుంటుంది. అనుకున్నాడు. వెంటనే భోజనం ప్లేటుతో ప్రత్యక్షమైంది. తనివితీరా తిన్నాడు. నిద్రవస్తున్నది. పడుకోవడానికి ఒక మంచం, పరుపు ఉంటే బాగుంటుంది గదా? అనుకున్నాడు. అవి ప్రత్యక్షమైనాయి. ఉబ్బితబ్బిబై, ఇల్లాలు ప్రక్కన ఉంటే బాగుంటుంది గదా! అనే కోరిక కలిగింది. వెంటనే భార్య ప్రత్యక్షమైంది. అప్పడు అనుమానం వేసింది. ఈమె నా భార్యేనా! లేక దయ్యమా? దయ్యమై నన్ను చంపి తింటుందేమో! అని భయపడ్డాడు. అనుకున్నంత పనీ జరిగింది. ఆమె దయ్యమై అతడ్ని భక్షించింది.

ఈ కథ మనకొక నీతిని బోధిస్తున్నది. ***కోరికలే అశాంతికి మూలం. అన్ని అనర్ధాలకు మూలం కోరికలే. అంతులేని కోరికలు వినాశనానికి దారితీస్తాయి.*** కనుక కోరికలు తగ్గించుకొని శాంతిని పొందండి!

# ప్రేమ

***"జ్యోతికి ప్రాణాన్ని యిస్తుంది తైలం, ప్రేమ జీవితానికే వెలుగు నిస్తుంది".*** 'Love gives and for gives, self gets and for gets' ప్రేమ ఇస్తుంది. మరిచిపోతుంది, క్షమిస్తుంది స్వార్థం తీసుకుంటుంది, మరిచిపోతుంది. ప్రేమ లక్ష్యము త్యాగం. ప్రేమ ఎన్నడూ, ఎవరిని ఏమీ అడగదు, ఎవరినీ దూషించదు. అది ఎన్నడూ, దేనినీ కోరదు, ఆశించదు. ఎల్లవేళలా యిచ్చివేయటమే ప్రేమ పరమావధి. ప్రేమ వల్ల పరులు కూడా ఆత్మీయులైపోతారు. బహుదూరంగా ఉన్నవారు కూడా అత్యంత సన్నిహితులవుతారు. వినియోగులను సంయోగపరచేది ప్రేమ. అక్రమ పంథాలో సంచరించేవారిని సక్రమ మార్గాన పెట్టగలిగేది ప్రేమ. ద్వేషపూరితమైన ప్రపంచాన్ని స్వర్గధామం చేయగలిగేది ప్రేమ. పశుత్వం నుండి పశుపతిగా మానవుని మార్చగలిగేది ప్రేమ. ప్రపంచ శాంతికి ఆధారం 'ప్రేమ'.

తల్లిదండ్రులయందు చూపే ప్రేమలో ఆదరాభిమానాలుంటాయి. మాతృభావన, పితృభావన ఉంటుంది. పిల్లల యెడల తల్లి చూపే ప్రేమలో మమత, వాత్సల్యం, మాతృత్వం ప్రతిబింబిస్తూ ఉంటుంది. భార్యాభర్తల మధ్య వున్న ప్రేమలో అనురాగం మేళవిస్తుంటుంది. మాతృదేశం యెడల చూపించే ప్రేమలో దేశభక్తి యిమిడి ఉంటుంది. వ్యక్తి, సమాజం యెడల చూపించే ప్రేమలో సమత, మమతలు ప్రస్ఫుటంగా కనిపిస్తుంటాయి. దేవుని యందు చూపే ప్రేమ పూజ్యభావమిళితమైనది. దానినే 'భక్తి' అంటారు. అందరియందును, అన్నిటి యందును ఉన్నప్రేమ ఒక్కటియే గాని, అన్ని ప్రేమలూ 'భక్తి' కానేరవు. భగవత్ప్రేమ ఒక్కటే అత్యంత పవిత్రమైనది, స్వార్థరహితమైనది. భగవంతునిపై వుండు ప్రేమను సర్వులయందునూ ప్రసరింప జేయుటనే **'సమాజసేవ'** అంటారు. ఇది ప్రేమ యొక్క పరాకాష్ఠ. కనుక ***అట్టి ప్రేమను ప్రతి ఒక్కరూ పెంపొందించుకోవాలి. సమాజసేవకు అంకితం కావాలి.***

మనిషిలో కామ వికారాదులు వున్నంతకాలం ప్రేమ అక్కడ వుండనే ఉండదు. అసలైన ప్రేమను ఒక త్రిభుజాకారంతో పోల్చవచ్చును. త్రిభుజానికి మూడు కోణములుంటాయి. అదే విధముగా ప్రేమకు మూడు సూత్రాలున్నాయి.

1. ***ప్రేమ ఎన్నడూ ఏమీ అడుగదు.*** ఏమీ అడుగకుండానే సర్వమునూ సమర్పించును, సమస్తమునూ అర్పించును. ప్రేమ బిచ్చమెత్తదు. అసలు బిచ్చగాని ప్రేమ ప్రేమయేకాదు.

2. ***ప్రేమ భయమెరుగదు.*** తల్లి తన బిడ్డను వాత్సల్యంతో అనురాగంతో ప్రేమిస్తుంది. బిడ్డకు ఏదైనా ప్రమాదం సంభవిస్తే ధైర్యంగా ఎదుర్కొంటుంది. పెద్దపులి వస్తే బిడ్డను వదిలి ఏ తల్లీ పారిపోదు. ఆ పులితో పోరాడి, బిడ్డను రక్షించుకోవడానికి ప్రయత్నిస్తుంది. అవసరమైతే తన ప్రాణాలనైనా అర్పించడానికి సిద్ధపడుతుంది. బిడ్డ నదిలో కొట్టుకొని పోతుంటే, చూస్తూ ఏ తల్లీ ఊరుకోదు. ఈత వచ్చా! రాదా! అని కూడా ఆలోచించకుండా, నదిలోనికి దూకుతుంది. ఎంతటి సాహసానికైనా పూను కుంటుంది. కారణం? హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నారు గనుకనే. ***అందువలననే ప్రేమ భయమెరుగదన్నారు.***

3. ***ప్రేమయే ప్రేమ లక్ష్యం.*** ఇది అత్యున్నతమైన స్థాయి. ప్రేమకు ప్రయోజనం ప్రేమయే. ప్రేమ పరాకాష్టనందుకున్నప్పుడు కోరికలు మటుమాయమైపోతాయి. పరిపక్వమొందిన ప్రేమయందు తరతమ బేధములుండవు. ఆ స్థాయికి చేరుకున్నవారు పరమోత్కృష్టమైన ఆదర్శములనే ప్రేమిస్తుంటారు. అటువంటి ఉన్నతమైన ఆదర్శములు స్వార్థరహితంగానే ఉంటాయి. భగవంతుడు స్వార్థరహితుడు, ప్రేమస్వరూపుడు, కనుక భగవంతుని నిస్వార్థంగా ప్రేమించాలి. ప్రతిఫలాపేక్ష లేకుండా ఆరాధించాలి. అయితే మానవప్రేమ చాలావరకు పరస్పరాశ్రయమైనది, పరస్పరాధారమైనది. అది ఇచ్చి పుచ్చుకొనే ధోరణిలో ఉంటుంది. కాని భగవంతుని ప్రేమ అట్టిది కాదు. కనుక ఎట్టి ఫలితాన్ని ఆశించకుండా, నిస్వార్థ బుద్ధితో భగవంతుని ప్రేమించినప్పుడు ప్రేమ యొక్క చరమస్థాయిని చక్కగా అవగాహన చేసుకొనినవారమవుతాం. ఆ చరమ స్థాయినే ***'ప్రేమానుభవమును పొందుటకే ప్రేమించుట'*** అంటారు. అదే నిజమైన ప్రేమలక్ష్యం. ***ప్రేమించుటయే ప్రేమలక్ష్యం.***

**యాచించటం కాదు:**

ఒకనాడు ఒక చక్రవర్తి వేటకు వెళ్ళుతాడు. అక్కడ ఒక సన్యాసిని చూచి, తన రాజధానికి వచ్చి ఆతిధ్యమును స్వీకరించమని ప్రాధేయపడుతాడు. ఆ సన్యాసి

వస్తాడు. పూజను ముగించుకొని వచ్చి ప్రసాదమును సమర్పించుకుంటానని చెప్పి, పూజామందిరంలోనికి వెళ్ళుతాడు చక్రవర్తి. ఆ సన్యాసి విశ్రాంతి తీసుకొనకుండా, పూజామందిరం ప్రక్కనే కూర్చొని, చక్రవర్తి పూజావిధానమును శ్రద్ధతో పరికిస్తుంటాడు. ఆ చక్రవర్తి యధావిధిగా పూజలు సలిపి ఆఖరిలో *"ప్రభూ! నా ఐశ్వర్యమును అభివృద్ధి చేయుము! భూసంపదను రెట్టింపు చేయుము! ఆయురారోగ్యములు ప్రసాదించి, సంతానాభివృద్ధి కలుగునట్లు వరమొసగుము!"* అని దైవమును ప్రార్థించుచుండగా, ఆ సన్యాసి లేచి వెడలి పోవుటకు సన్నద్ధుడవుతుండగా చక్రవర్తి చూచి *"స్వామీ! ప్రసాదమును ఆరగించకుండా వెళ్ళిపోతున్నారేమి?"* అని ప్రశ్నిస్తాడు చక్రవర్తి. అప్పుడు ఆ సన్యాసి *"నేను బిచ్చగాండ్ర వద్ద బిచ్చమెత్తను. ఇంత భూమి కావాలి, అంత సంపద కావాలి, సంతానాభివృద్ధి కావాలి! ఇది కావాలి! అది కావాలి! అని బిచ్చమెత్తుకొనేవారి వద్ద ఆతిధ్యం స్వీకరించను. బిచ్చమెత్తుకొనేవాడివి నాకేం భిక్షపెట్టగలవు?"* అని చెప్పి సన్యాసి నిష్క్రమిస్తాడు.

ఈ కథ మనకు చక్కటి నీతిని బోధిస్తున్నది. *దేవుని ప్రార్థించడమంటే యాచించటం కాదు. ప్రేమలక్షణం సమర్పించడమే గాని అడుక్కోవడం కాదు. పూజించటమంటే ప్రాధేయపడటం కాదు. బిచ్చమెత్తటం ప్రేమలక్షణం అంతకన్నా కాదు.*

## ప్రేమకు నిలయం....?

స్వామీ వివేకానంద ఒకసారి ఒక పట్టణంలో ఉపన్యాసం చేస్తున్నారు. వేలాది మంది ప్రజలు మంత్రముగ్ధులై వింటున్నారు. ఉపన్యాసం ముగిసింది. సభికులు కొందరు వివేకానంద చుట్టూ చేరి ప్రశ్నల వర్షం కురిపించారు. ఆ ప్రశ్నలన్నింటికీ సహనంతో సమాధానం చెప్పారు స్వామి. అందరూ వెళ్ళిపోయారు. కాని ఆఖరికి ఒక పేద హరిజనుడు వివేకానంద దగ్గరకు వచ్చి వినమ్రుడై పాదాభివందనం చేసి *"స్వామీ! నన్ను అనుగ్రహించండి! తమ ఉపన్యాసం వినడానికి నాతోపాటు నా భార్య కూడా వచ్చింది. తమ ఉపన్యాసం కావటంతోనే రొట్టెలు తయారుచేయమని నా భార్యను ఇంటికి పంపాను. తమరు చూస్తే చాలా అలసిపోయినట్లుగా కనిపిస్తున్నారు. 'నేను హరిజనుణ్ణి' అని భావించక, నా ఇంటికి దయచేయండి. నా ఆతిధ్యాన్ని ప్రేమతో స్వీకరించి నన్ను ధన్యుడను చేయండి!"* అని ప్రాధేయపడుతాడు. ఒక క్షణం ఆలోచించాడు. సభకు ఎన్నో వేలమంది వచ్చారు. ధనవంతులొచ్చారు, మేధావులొచ్చారు, ఉపన్యాసం విన్నారు, సంశయాలు తీర్చుకున్నారు.

స్వామిని వదిలి ఎవరికి వారు చెప్పకుండానే వెళ్ళిపోయారు. కాని ఈ నిరుపేద మాత్రం ఆఖరి వరకు వుండి, స్వామిని తన ఇంటికి ఆహ్వానించాడు. *"ఆహా! ప్రేమ ఎంత గొప్పది! దానికి ఎల్లలు లేవు, హద్దులు లేవు, కులం లేదు, గోత్రం లేదు"* అనుకున్నాడు వివేకానంద. ఆ నిరుపేద వెంబడి వెళ్ళి ప్రేమతో పెట్టిన రొట్టెలను తిని, పాలుత్రాగి వెళ్ళిపోతాడు వివేకానంద.

ఈ సంఘటన మనకు ఒక సందేశాన్ని అందిస్తున్నది. *'నిర్మలమైన సహృదయమే ప్రేమకునిలయం'. ప్రేమ అంతస్తును చూడదు, హృదయాన్ని మాత్రమే చూస్తుంది. ప్రేమకు తరతమభేదాలు లేవు.*

'ప్రేమ' రెండు అక్షరముల పదమే అయినప్పటికీ దానిలో ఎంతో పవిత్రత ఉన్నది, శక్తి కూడా ఉన్నది. *అణుబాంబులతో జయించలేని దానిని కూడా ప్రేమతో జయించవచ్చును.*

*"ప్రేమ లేని శరీరం స్మశానంలోని శవంతో సమానం"* అంటారు కబీరు మహాశయుడు.

**మహాత్మాగాంధీ :**

*"ప్రేమ ప్రతి ప్రాణికి ప్రధానమైనది. ప్రేమ ద్వారానే పరమాత్మను దర్శించవచ్చు. భగవదానుగ్రహమును పొందడానికి ప్రేమ ఒక్కటే మార్గం. ఎచట ప్రేమ బలంగా ఉంటుందో అచట సర్వశక్తులూ సమకూరుతాయి"* అంటారు గాంధీజీ.

"గంగా, యమునా, సరస్వతీ నదులు కలిసిన ప్రదేశమును 'త్రివేణీసంగమం' అంటారు సరస్వతీనది మనకు కనిపించదు. అది అంతర్వాహిణి. అదే విధముగ సత్య, ధర్మ, శాంతి, అహింసలు బయట ప్రపంచంలో మనకు గోచరమవుతుంటాయి. కాని 'ప్రేమ' మాత్రం మనకుపైకి కనిపించదు. సత్య, ధర్మ, శాంతి, అహింసలు జీవుణ్ణి దేవుడిగా మార్చడానికి తోడ్పడుతాయి. ప్రేమ దైవత్వంలో జీవించడానికి తోడ్పడుతుంది. ప్రేమయే దైవం (Love is God), ప్రేమలో జీవించు (Live in Love), ఇతరులను కూడా ప్రేమలో జీవించునట్లు చేయి (Make others live in love) ఇదే మనం ఈనాడు చేయవలసిన పని" అని అంటారు శ్రీ సత్యసాయిబాబా.

# అహింస

***అహింసా పరమో ధర్మః*** అహింస పరమోత్కృష్టమైన ధర్మమని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి. అయితే అహింసా సిద్ధాంతమనగానే, ఇది నిస్సహాయులు, చేతకానివారు, బలహీనులు వల్లించే సిద్ధాంతమని ఈనాడు చాలామంది అభిప్రాయపడుతున్నారు. ఈ అభిప్రాయము సరియైనది కాదు. ధైర్యము, బలము, శక్తిసామర్థ్యములు ఉన్నప్పటికీ, ఏమాత్రం తొందరపడక, ఉద్రేకపడక శాంతి సహనములను ప్రదర్శించునదే 'అహింస' ***ఆత్మనిగ్రహం-అహింస, సహనం-అహింస, శాంతం-అహింస, అసహనం-హింస, కోపం-హింస, అహింస ధర్మం, హింస అధర్మం.***

***అహింస అంటే ఏమిటి?*** అనగానే చాలామంది హింసకానిది అహింస అంటారు. ప్రాణం వున్న జీవులను కొట్టి, బాధించడం హింస అని చెబుతారు. ఇది వాస్తవమే కాని శారీరకంగా బాధించడం ఒక్కటే హింస కాదు. సూటి పోటీ మాటలతో ఇతరులను బాధించడం కూడా 'హింస' క్రిందకే వస్తుంది. కనుక ***కాయంతోగాని, వాక్కులతోగాని ఏ ప్రాణిని బాధించరాదు, హింసించరాదు.***

మానవాభ్యుదయమునకు దోహదపడేది 'అహింస'. విశాల విశ్వప్రేమయే 'అహింస'. సకల జీవరాసులను బాధించకుండా ప్రేమించటమే 'అహింస' అన్నిటి పట్ల అందరిపట్ల ప్రేమను ప్రదర్శించడమే 'అహింస'. ***"నిర్వైర స్సర్వభూతేషు" సమస్త ప్రాణులయందు ద్వేషము లేకుండా వుండటమే 'అహింస'***

***సత్య, ధర్మ, శాంతి, ప్రేమల సమ్మిళిత స్వరూపమే 'అహింస'.*** సత్యమార్గంలో జీవించే వ్యక్తి హింసలో ప్రవేశించడు. ధర్మమార్గంలో నడిచే వ్యక్తి హింసకు పూనుకోడు. శాంతి మార్గమున పయనించే వ్యక్తి హింసలో పాల్గొనడు. ప్రేమలో జీవించే వ్యక్తి హింస చేయడు. సత్య, ధర్మ, శాంతి, ప్రేమలతో నిండిన వ్యక్తి హింసామార్గమును ఎన్నుకోడు. కనుక ***"సత్య, ధర్మ, శాంతి ప్రేమ, అహింసలను పంచప్రాణాలుగా విశ్వసించాలి"*** అని చెప్పారు ***శ్రీ సత్యసాయిబాబావారు. ఈ ఐదు మౌలిక విలువలు, అతి ముఖ్యమైన మానవతా విలువలు*** **(Human Values).**

**గాంధీజీ :**

*"అహింస నాగరికతలోకానికి నవవేదం. మానవుడు కట్టకడపటికైనా ఆశ్రయించేది అహింసనే. హింసావాది నరుడుకాదు. నరరూప రాక్షసి. అహింస అజేయమైన శక్తి. అహింసకు మాత్రమే, హింసను క్షమించే గొప్పతనం తెలుసు".* అని చెప్పారు మహాత్మాగాంధీ. గాంధీజీ యదార్థవాది. అహింసను అనుభవంలో ఆచరించి చూపిన మహనీయుడు గాంధి. అహింసాయుధమును చేబూని, రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యమును కూకటి వేళ్లతో పెకలించి వేసిన స్వాతంత్ర్య సమరయోధుడు గాంధీ. ఆయన అహింసాయుధం ముందు తెల్లవారి తుపాకులు పనిచేయలేదు. అహింసకు మించిన ఆయుధం వేరొకటి లేదని నిరూపించారు *గాంధీజీ.*

**కబీరుమహాశయుడు :**

అది ముస్లీముల పర్వదినం. ఒక పెద్దవిందు ఏర్పాటు చేశారు. ఆ విందుకు ముస్లీం మత పెద్దలను, ధనవంతులను ఆహ్వానించారు. కబీరును మాత్రం ఆహ్వానించలేదు. ఏదో పని మీద తన తల్లిదండ్రులను వెతుక్కుంటూ, ఆ విందుసభలో వుంటారేమోనని భావించి అక్కడకు వెళ్తుతాడు కబీరు. అనుకోకుండా కబీరు దృష్టి, ఒక స్తంభానికి కట్టబడి వున్న ఆవుదూడ మీద పడుతుంది. ఆ స్తంభం పూలదండలతో అలంకరించబడి ఉన్నది. ఆ ఆవుదూడ మెడలో దండ వేశారు. చుట్టూ కొంతమంది చేరి ఏవో మంత్రాలు చదువుతున్నారు. కొందరు డప్పులు వాయిస్తున్నారు. ఒకడు చేతిలో తళతళలాడే ఒక పెద్దకత్తిని పట్టుకొని వీరంగం వేస్తున్నాడు. కబీరుకు అంతా అర్థమైంది. ఇంకా కొంత సేపటిలో ఆవుదూడను దేవునికి బలి యివ్వబోతున్నారని గ్రహించాడు. పరుగెత్తుకుంటూ అక్కడకు వెళ్లి ***"అయ్యా! ఆపండి! ఆపండి! నోరులేని జీవాన్ని చంపకండి!"*** అని అరిచాడు కబీరు. ఇంతలో కొందరు ముస్లీం పెద్దలు వచ్చి ***"నోరు మూసుకో! దీనిని అల్లాకోసం తీసుకొని వచ్చాం! అడ్డురాకు"*** అని గద్దించారు. దీనిని బలి యివ్వడానికి వీల్లేదని వాదించిన వాడు కబీరు ఒక్కడు మాత్రమే. అక్కడ చేరిన వారందరూ బలియివ్వడానికి మద్దతు నిచ్చారు. కాని కబీరు నిరాశ చెందలేదు. ఆ దూడను బలి యివ్వవద్దని అందర్ని బ్రతిమాలుకున్నాడు. అతని ఘోషను ఎవరూ

వినలేదు. దూడను బలి యివ్వడానికి సిద్ధమవుతున్నారు. *'నామాట వినండి!'* అని పెద్దగా అరిచి కబీరు *"మీ అందరినీ పుట్టించింది అల్లాయేయని మీకు తెలుసుగదా!"* అన్నాడు *"ఆ! బాగాతెలుసు. ఇటువంటి ప్రశ్నలు వేయవద్దు"* అన్నారు అక్కడ చేరినవారు. కాని కబీరు ఊరుకోలేదు మళ్ళీ పెద్దగా *'ఈ దూడను పుట్టించింది ఎవరు?'* అని ప్రశ్నించాడు. 'ఆయనే' అన్నారు కొందరు *"అయితే దీనిని ఎందుకు చంపుతున్నారు?"* అని అడిగాడు. *"సృష్టిలో అందమైనవాటిని భగవంతుని కోసం ఉపయోగించాలి. అందుకని అందమైన ఈ దూడను భగవంతునికి అర్పిస్తున్నాం. మా తప్పేముంది?"* అన్నారు. *"అయితే అందమైన స్త్రీలను కూడా బలి యిస్తారా?"* అని అడిగాడు. 'ఇవ్వం! ఇవ్వం!' అన్నారు. *"మీరు చెప్పింది బాగుంది. భగవంతుడు అందమైన వాటిని సద్వినియోగం చేయమన్నాడు గాని, నాశనం చేయమనలేదే? ఈ దూడ మీకేం అపకారం చేసింది? దానిని వదిలివేయండి?"* అని ప్రాధేయపడ్డాడు. ఇంతలో ఒక వృద్ధుడు ముందుకు వచ్చి *"తల్లులవద్ద పిల్లలు పాలు త్రాగినట్లుగా, మనం ఆవుపాలను త్రాగుతున్నాం. గోవు కూడా మనకు తల్లిలాంటిదే. ఆ తల్లి బిడ్డ అయిన ఈ దూడను చంపటం న్యాయమా?"* అని అడుగుతాడు. అక్కడ వారందరూ తలలు దించుకుంటారు. ఎవరూ మాట్లాడరు. అక్కడి వారందరూ మంచి వారే. కాని, దేవునికి జంతువులను బలి యివ్వడం తప్పని వారికి, అప్పటి వరకూతోచలేదు. కబీరు అహింసా తత్వాన్ని వారు అప్పుడు గ్రహించారు. ఆ దూడను వదిలివేశారు. మాంసాహారవిందు భోజనం లభించనందులకు కబీరును తిట్టుకుంటూ కొందరు ఇంటికి వెళ్లిపోయారు కాని చాలా మంది కబీరును మెచ్చుకున్నారు.

ఈ సంఘటన నుంచి మనం ఒక నీతిని నేర్చుకోవాలి. ***మనుషులను చంపటమే తప్పు అని భావిస్తున్నారుగాని, నోరులేని జంతువులను చంపటం తప్పుగా భావించటం లేదు. అది తమకు ఆహారమని భావిస్తున్నారు. విడమర్చి చెప్పేవారుంటే అటువంటి తప్పను తిరిగి చేయరు. ఏ ప్రాణిని బాధించినా అది హింసే అవుతుంది. కనుక మనం ఏ ప్రాణినీ బాధించరాదు, హింసించరాదు.***

**దయాసాగరుడు :**

ఒక పట్టణంలో *'దయాసాగరుడు'* అనే ఒక ధనవంతుడుండేవాడు. దయ ఆయన స్వభావం. 'దానం' ఆయన ప్రవృత్తి. అహింస ఆయనలోని సద్గుణం. ఈ సద్గుణములను ఆచరణ ద్వారా చూపించేవాడు కనుకనే ఆయనను 'దయా

సాగరుడు' అని ప్రజలు పిలిచేవారు. ఒకనాడు ఒక బెస్తవాడు ఒక చెరువులో కొన్ని చేపలనుపట్టి అమ్ముకోవడానికి వస్తాడు. వలలో చిక్కుకొని గిలగిలలాడుతున్న చేపలను చూచి బాధపడి వాటికి వెల యిచ్చి అన్నిటినీ కొని, వాటిని తీసుకొని వెళ్ళి అదే చెరువులో వదిలి పెడుతాడు *'దయాసాగరుడు'.* తిరగకుండా డబ్బువస్తున్నదని భావించిన బెస్తవాడు మరునాడు కూడా చేపలను దయాసాగరుని ఇంటికి తీసుకొని వస్తాడు. దయాసాగరుడు వాటిని కూడా కొని డబ్బుయిచ్చి, ఆ చేపలను చెరువుకు పంపుతాడు. బెస్తవాడిని వుండమని చెప్పి కొన్ని నీతులు బోధిస్తాడు.

*"నిన్ను ఎవరైనా కొడితే ఏం జేస్తావ్?"* 'తిరిగి కొడతా!' 'ఎందుకు?' 'నన్ను బాధించాడు కాబట్టి'. *"అయితే నీవు చేపలను బాధిస్తున్నావు గదా!" "వాటికి మాటలు రావు, నన్ను కొట్టలేవు గదా?". "నిజమే! వాటికి ప్రాణం ఉన్నది గదా! బాధపడతాయి గదా!" "అది నా వృత్తి, భుక్తినిస్తున్నాయి".*

*"నీ భుక్తికోసం, ఇతరులను బాధించడం ఎంత తప్పో! ఇతర జీవరాసులనుకూడా బాధించడం అంతే తప్పు. హింసచేయడం మహాపాపం! సమస్త ప్రాణికోటిని పుట్టించింది ఆ భగవంతుడే 'సర్వజీవ తిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' ఏ జీవిని తిరస్కరించినా, బాధించినా భగవంతుని బాధించినట్లే. సర్వజీవులలో భగవంతుడున్నాడు. కనుక ఏ జీవిని బాధించరాదు, హింసించరాదు"* అని హితబోధ చేస్తాడు 'దయాసాగరుడు'. బెస్తవాడిలో పరివర్తన వస్తుంది. జీవహింస చేయుటం మహాపాపమని తెలుసుకుంటాడు. చేపలుపట్టటం మానివేస్తాడు. మరో వృత్తిని స్వీకరించుతాడు.

**కత్తిని చూపించి మనుషుల మనసులను మార్చలేం. అహింసాయుధంతో సర్వులనూ జయించగలం.** అనే నీతిని మరచి పోకండి.

---

"సత్యం, అహింస అవిభాజ్యములు. అవి నాణెపు రెండు ముఖములవంటివి. సత్యము అన్వేషించేవ్యక్తి తప్పనిసరిగా అహింసాపథము తొక్కకతప్పదు. అలాగే సత్యం అనుసరించనినాడు అహింస సాధ్యపడదు. అందుచేత ప్రతివ్యక్తీ, మనలో అంతర్గతమై వున్న అహింసా విధానాన్ని అనుసరించి, ఆ పరమసత్యాన్ని అన్వేషించాలి. అహింస ఒక మహాశక్తి, ప్రేమ అన్నది విశ్వమానవ సిద్ధాంత సారము. వ్యక్తులకి కానివ్వండి. దేశాలకి కానివ్వండి. విమోచన సాధించాలంటే అహింసామార్గం అనుసరించాలి".

- మహాత్మాగాంధి

# క్షమ

'క్షమగవచంబు' క్షమను కవచంతో పోల్చాడు భర్తృహరి. 'క్షమ' అనగా ఓర్పు. అవమానాదులు కలిగినప్పడు, కష్టములు సంభవించినప్పడు, దుఃఖములు దాపురించినపుడు, బాధలకులోనైనప్పడు సహజంగా, మనిషి నిజస్వరూపం బహిర్గతమవుతుంది. అతనిలో సహజంగా అంతర్గూఢంగా దాగివున్న బలహీనతలు బయటపడుతాయి, అటువంటి విపత్కర పరిస్థితులలో కూడా ఏమాత్రం చలించక, అధైర్యపడక ఓర్మిని కోల్పోక, ఓర్పుతో, సహనంతో తనను తాను నిగ్రహించుకొనే సద్గుణమునే 'క్షమ' అంటారు.

ఈ 'క్షమ' గుణమును గనుక కోల్పోయినట్లయితే ఎంతోకాలం కష్టించి, శ్రమించి కృషిచేసి సంపాదించిన మంచి పేరు ఒక్కక్షణంలో భస్మీపటలం అయిపోతుంది. ఈ సద్గుణం లోపించటంవలన ఎంతోమంది మహా తపస్సంపన్నులు ఎందుకూ పనికిరాకుండా భ్రష్టులైపోయినారు. రాజాధిరాజులు తమ రాజ్యములనే కోల్పోయినారు. పండితులు పతనమైపోయినారు. కనుక ఈ 'క్షమాగుణము'ను ప్రతిఒక్కరూ స్వంతం చేసుకోవాలి. ***క్షమయే సర్వమునకూ ఆధారం. మానవత్వానికి 'క్షమ' మాణిక్యం వంటిది. క్షమాశీలి మాత్రమే క్షమాభిక్షను పెట్టగలడు.***

**తిరువళ్ళువర్ :**

పూర్వం కావేరీ నదీతీరంలో ఒక పట్టణం ఉండేది. ఆ పట్టణంలో ఒక వస్త్రవ్యాపారి ఉండేవాడు. ఆయన స్వయంగా మగ్గంపై చీరెలను నేసేవాడు. ఆ నేసిన చీరెలను తీసుకొని వెళ్ళి బజారులో అమ్మి జీవించేవాడు. ఒకనాడు చీరెలు అమ్ముడుపోలేదు. నిరాశతో ఇంటికి వెళదామనుకునే సమయానికి ఒక యువకుడు వచ్చాడు. అతడు ఆ పట్టణంలోని ఒక ధనికుని కుమారుడు. చిన్ననాటి నుండి ఆకతాయిగా తిరుగుతుండేవాడు. అతని ప్రవర్తనను చూచి తల్లిదండ్రులే అసహ్యించుకునేవారు. అతను సరాసరి బట్టలవ్యాపారి దగ్గరకు వచ్చి, ఆ చీరలలోని ఒక చీరను తీసుకొని 'దీని వెలఎంత?' అని అడుగుతాడు. 'ఒక ఫణం' (అప్పటి

తమిళనాడు నాణెం పేరు) అని చెప్పాడు వ్యాపారి. అప్పుడు ఆ యువకుడు ఆ చీరెను రెండు ముక్కలుగా చేసి, ఒక ముక్కను చూపుతూ 'దీని వెల ఎంత?' అని అడుగగా 'అర్ధపణం' అని జవాబు చెబుతాడు వ్యాపారి. ఆ యువకుడు ఆ ముక్కలను మరల సగానికి చించి 'దీనివెల ఎంత?' అని అడుగుతాడు. మరల చెబుతాడు వ్యాపారి. చిట్టచివరికి ఆ చీరెను ముక్కముక్కలుగా చించి, 'ఛీ!పో!' ఈ ముక్కలను ఎవరు కొంటారు? అని ఆ ముక్కలను వ్యాపారి ముఖాన విసిరికొడుతాడు. అయినప్పటికీ ఆ వ్యాపారి సహనంతో ఆ యువకుడ్ని ఏమీ అనడు. ఆ యువకునికి ఆశ్చర్యం వేస్తుంది. తన తప్పను తాను గుర్తించి, క్షమించమని వేడుకుంటాడు. వ్యాపారి కోపగించినట్లయితే తగాదా అయ్యేది. వ్యాపారి క్షమాగుణమును ప్రదర్శించినందువలననే, క్షమించమని వేడుకున్నాడు యువకుడు. వ్యాపారి క్షమాగుణంవలననే ఆ యువకునిలో పరివర్తనం వచ్చింది. అప్పటినుంచి ఆ యువకుడు సన్మార్గములో నడవటం ప్రారంభించాడు.

అంతటి క్షమాగుణాన్ని ప్రదర్శించిన వ్యాపారి ఎవరో తెలుసా? అతనే 'తిరువళ్ళువర్!'. అతనే తమిళంలో ప్రసిద్ధిగాంచిన 'తిరుక్కురళ్' గ్రంథ రచయిత. క్షమాగుణం అతనికి ఎంతటి పేరు ప్రతిష్ఠలు తెచ్చిపెట్టిందో! చూడండి!

**న్యూటన్ :**

సర్ ఐజాక్ న్యూటన్ ఒక ప్రఖ్యాత సైంటిస్టు. సైంటిస్టే కాదు మానవత్వం మూర్తీభవించిన మహామనిషి. ఆ రోజులలో కంప్యూటర్లు లేవు. తన పరిశోధన లన్నింటినీ కాగితాల మీదనే వ్రాసుకొని భద్రపరచుకునే వారు. కాలక్షేపంకోసం ఒక చిన్న అందమైన ఒక కుక్కపిల్లను పెంచుకున్నాడు. దానికి 'డైమండ్' అని పేరుపెట్టి ముద్దుగా పిలుచుకునేవాడు. ఆ కుక్కపిల్ల అంటే అతనికి ప్రాణం.

ఒకరోజున పగలంతా పనిచేసి, చీకటిపడిన తరువాత వెన్నెల రాత్రులలో షికారుకు బయలుదేరుతాడు. అంతవరకూ వ్రాసిన కాగితాలను బల్లమీదనే పెట్టి, వెలుగుతున్న క్రొవ్వొత్తిని ఆర్పకుండా, ఆ బల్లమీదనే వుంచి బయలుదేరుతాడు. ***కాసేపట్లో తిరిగివస్తాను గదా! ఇంతలో ఏమవుతుంది?'*** అని అనుకుంటాడు 'న్యూటన్'.

న్యూటన్ వెళ్లిన వెంటనే 'డైమండ్ (కుక్కపిల్ల) టేబుల్ మీదకు ఎక్కి అటూ, ఇటూ పచార్లు చేస్తుంటుంది. దాని కాలికి క్రొవ్వొత్తి తగిలి బల్లమీద పడుతుంది. ఇరువై సంవత్సరాలపాటు ఎంతో శ్రమించిన వ్రాసిపెట్టి ఉంచిన కాగితాలన్నీ భస్మీపటలం అయిపోతాయి. న్యూటన్ ఇంటికి తిరిగి వచ్చి బూడిదగా మారిన దృశ్యాన్ని చూచి హతాశుడైపోతాడు. డైమండ్‌ను ఏమీ అనడు. అతని స్థానంలో మరెవరున్నా డైమండ్‌ను క్షమించేవారు కాదు, చావచితక కొట్టేవారు. కానీ, న్యూటన్ మాత్రం ప్రేమతో డైమండ్‌ను దగ్గరకు తీసుకొని వళ్ళో పెట్టుకుని, తలనిమురుతూ ***'డైమండ్! నువ్వెంత పనిచేశావో! నీకు తెలియదు'***. అని మాత్రం అంటాడు న్యూటన్.

మరల ఆ కాగితాలు వ్రాసుకోవటానికి న్యూటన్‌కు ఎన్ని సంవత్సరాలు పట్టిందో! క్షమాగుణం గలవారు మాత్రమే ఇతరుల తప్పలను క్షమించగలుగుతారు. ఆ క్షమాగుణం అతనిలో ఉండటం వలనే, చరిత్రలో ఒక గొప్పవ్యక్తిగా నిలిచిపోయాడు 'న్యూటన్'. కనుక ప్రతి ఒక్కరూ 'క్షమాగుణము'ను స్వంతం చేసుకోవాలి. ***'క్షమ కవచము గదా!'*** ఆ క్షమయే రక్షిస్తుంది. కీర్తి ప్రతిష్ఠలను తెచ్చి పెడుతుంది.



---

"తాపసులకు తపమే బలం బ్రహ్మవేత్తలకు వేదవే బలం. రాజులకు అధికారమే బలం. దేశానికి ఐకమత్యమే బలం. స్త్రీలకు శీలమే బలం. దుర్జనులకు హింసయే బలం. సజ్జనులకు క్షమయే బలం"

**- మహాత్మాగాంధీ**

# అస్పృశ్యత - అంటరానితనం

అస్పృశ్యత సమాజం పాలిటి చీడపురుగు. అంటరానితనం అభివృద్ధికి ఆటంకం. అస్పృశ్యత హిందూ సమాజాన్ని తినివేస్తున్న వేరుపురుగు లాంటిది. ఒకసారి మహాత్మాగాంధీ *"నేను ఒకవేళ తిరిగి జన్మించవలసి వస్తే అస్పృశ్యునిగా జన్మిస్తాను. అప్పుడు వారి బాధలలోను, కష్టాలలోను, విచారాలలోను, అవమానాలలోను పాల్గొనడానికి వీలవుతుంది. వారిని ఆ బాధలనుంచి రక్షించడానికి, నన్ను నేను రక్షించుకోవడానికి అవకాశముంటుంది"* అని తన బాధను వ్యక్తీకరిస్తారు. అస్పృశ్యతా నివారణకు అహర్నిశలూ కృషి చేశారు గాంధీజీ.

**వివేకానంద :**

ఒకసారి స్వామి వివేకానంద ఒక గ్రామం నడిచి వెళ్ళుతుంటాడు, దాహం వేస్తుంది. మంచినీరు త్రాగడానికోసం ఒక బావిదగ్గరకు వెళ్ళుతాడు. అక్కడ ఒక వ్యక్తి నీళ్ళుతోడుతున్నాడు. మంచినీరు కావాలని అడుగుతాడు ఆ వ్యక్తి సందేహిస్తూ *"స్వామీ! తమరు చూడబోతే అగ్రకులానికి చెందిన వారుగా కనిపిస్తున్నారు. నేను అస్పృశ్యుణ్ణి. మీరు త్రాగడానికి నీళ్ళు ఎట్లా ఇచ్చేది?"* అంటాడు. అప్పడు స్వామీజీ *"అదేముంది? రాముని స్పర్శతో రాయి మనిషిగా మారింది. నీవుకూడా మనిషివి గదా! ఫరవాలేదు. నాకు మంచినీళ్ళు యివ్వవచ్చు"*అని అడిగి మంచినీరు త్రాగుతాడు వివేకానంద. ఆ తరువాత చెబుతాడు *"శ్రీరాముడు, శ్రీకృష్ణుడు జన్మించిన పుణ్యభూమి ఇది. ఇక్కడి ప్రతికణము పవిత్రమైనదే. ఈ పవిత్ర భూమిని తల్లిగా భావించేవారు ఎట్లా అస్పృశ్యులవుతారు?"* అని చెప్పి వెళ్ళిపోతాడు. ఈ పవిత్రభూమిలోని ప్రతి మట్టిగడ్డ అత్యంత పవిత్రమైనది అయినప్పడు మనిషి పవిత్రుడు కాదా? ఈ విధంగా ప్రతివ్యక్తీ ఆలోచించి, అస్పృస్యతను రూపుమాపాలి.

**గురజాడ :**

ప్రముఖ తెలుగు కవి గురజాడ అప్పారావుగారు ఇలా వ్రాశారు.

**"మంచి చెడ్డలు మనుజులందున**
**యెంచి చూడగ రెండే కులములు**
**మంచి యన్నది మాలయైతే**
**మాల నేయగుదున్".**

ఎంతటి ఆదర్శమైన భావాన్ని 'గురజాడ' మనకందించాడు! నిజానికి దేశంలో మంచి, చెడు అనే రెండు కులములే ఉన్నాయి. 'మంచి' అనేది 'మాల' అయితే, నన్నునేను మాలవానిగానే భావించుకుంటాను. అని గురజాడ చెప్పిన మాటలు మన మనసులలో నిరంతరం మారుమ్రోగుతుండాలి.

**బౌద్ధసన్యాసి :**

అది నడివేసవి. ఎండ మండిపోతున్నది. కాళ్ళు కాలుతున్నాయి. తల కాలుతున్నది. చెమట కారుతున్నది. దాహం వేస్తున్నది. కనుచూపు మేరలో నీరుదొరికే జాడ కనిపించలేదు. దూరంగా గుడిసెలు కనిపిస్తున్నాయి. అక్కడ ఏమైనా నీరు దొరుకుతుందేమోనని పరుగెత్తాడు ఆ బౌద్ధ సన్యాసి. అల్లంత దూరంలో ఒక బావి కనిపించింది. సంతోషంతో వెళ్ళాడు. ఒక యువతి నీళ్ళు తోడుకుంటున్నది. ***"అమ్మా! దాహం! కాసిని నీళ్ళు పోయమ్మా!"*** అని అర్ధించాడు ఆ సన్యాసి. అప్పుడు ఆ యువతి ***"స్వామీ! నేను ఛండాల కన్యను. ఈ బావి మేము వాడుకొనేది, మేము అంటరాని వాళ్ళంగదా! నీళ్ళు మైలపడ్డాయి. నేను ఈ నీళ్ళను నీకు పోయను"*** అని బదులు చెబుతుంది.

ఆ బౌద్ధసన్యాసి నిట్టూరుస్తాడు '***"అమ్మా! నగరం బావిలోని నీళ్ళు ఎలా ఉన్నవో! ఈ బావిలోని నీళ్ళు కూడా అలాగే ఉన్నాయి. అవి దప్పిక తీరుస్తాయి, ఇవికూడా దప్పిక తీరుస్తాయి. ఇంక వీటికి మైల ఎక్కడ?"*** అని అంటాడు. ఆ యువతి ఆశ్చర్యపడింది. ఆనందంతో బావిలోని నీళ్ళు తోడి సన్యాసికి పోస్తుంది. అతను తృప్తిగా నీళ్ళు త్రాగి, సంతోషంతో ముందుకు నడిచి వెళ్ళుతాడు.

నీళ్ళకు మైల లేదని చెప్పిన ఆ బౌద్ధ సన్యాసే 'ఆనందుడు'. గౌతమ బుద్ధుని శిష్యులలో ముఖ్యుడు ఆయన.

***"మా కులం.. మా కులం.....మా కులం.....మీ కులం ఏ కులం? గంగదే కులం? గాలిదే కులం? నిప్పదే కులం? వీటికి కులాలే లేవే? కనుక మన కులం మానవ కులం. మన జాతి మానవ జాతి. అందరూ మానవులే. ఈ సత్యాన్ని మనం గుర్తించాలి. దేహాన్ని బట్టే - ఈ కులాలు, ఈ మతాలు వచ్చాయిగాని, నిజంగా ఆత్మకు ఎట్టి కులం లేదు"*** అని ఒకసారి చెప్పారు శ్రీసత్యసాయి బాబావారు. కులపిచ్చితో క్రుమ్ములాడుకుంటున్న ఈ దుర్దినాలలో, మతం పేరిట

మారణహోమాలు జరుగుతున్న ఈ సమయంలో సంఘసంస్కర్తల సందేశాలను ఆలకించి, ఆచరిస్తే జాతీయ సమైక్యతను సాధించినవారమవుతాం.

ఆదిలో ఈ పవిత్ర భారతదేశంలో అస్పృశ్యత అనేది లేదు. కొంతమంది ఛాందసులు తమ స్వార్ధ స్వప్రయోజనాల కోసం సనాతన ధర్మమును వక్రీకరించడం జరిగింది. ఒక వేళ ఈ అస్పృశ్యత వుండి వుంటే, మృగములను సంహరించి, మాంసమును తిని బ్రతికే బోయవాడు వాల్మీకి మహర్షిగా మారి, మహోత్కృష్టమైన **"రామాయణ మహాకావ్యము"**ను మనకు అందించగలిగేవాడే కాదు. పరమ కసాయివాడైన 'ధర్మవ్యాధుని' బోధనలకు మహాభారతంలో చోటు వుండేదేకాదు. అయితే కొందరు ఛాందసుల వలన ఈ దేశంలో అస్పృశ్యత, అంటరానితనం విశృంఖలంగా విలయతాండవం చేశాయి. బుద్ధుడు, వివేకానంద, గాంధీ, అంబేద్కర్ వంటి సంస్కర్తలు వచ్చి ప్రజలను చైతన్యవంతులను గావించటంవలన అస్పృశ్యత, అంటరానితనముల ఉధృతం కొంతవరకు తగ్గింది. అయితే సంపూర్ణంగా సమూలంగా రూపుమాసిపోలేదు. ***ఈ వేరుపురుగు, ఈ చీడపురుగు సర్వనాశనం అయ్యేంతవరకూ విశ్రమించరాదు.*** ఇది మనందరి కర్తవ్యం.



---

"అస్పృశ్యత అంటే ఏమిటి? అస్పృశ్యులంటే ఎవరు? జన్మతః అందరూ సమానులే. అందరూ తల్లిగర్భమునుండి సమానంగానే జన్మించారు. నేడు అగ్రకులాలవారని భావించబడే వారిలోని రక్తం, అస్పృశ్యులని భావించబడే వారిలోని రక్తం అంతా ఒక్కటే. రక్తంలో తేడాలేనప్పుడు ఎందుకు ఈ వివక్షత? కులాలు, మతాలు మనం సృష్టించుకున్నవే. మానవులంతా ఒకే జాతికి చెందినవారే. ఆదినుంచి ఈ ప్రపంచంలో రెండేరెండు జాతులు ఉన్నాయి. 1. మానవజాతి, 2. రాక్షసజాతి. 'అస్పృశ్యత' అనేది లేనేలేదు. అయితే కొందరు స్వార్ధపరులు మధ్యలో ఈ అస్పృశ్యత అనే పదాన్ని సృష్టించారు. మధ్యలో వచ్చిన ఈ 'అస్పృశ్యత' అనే పదాన్ని చెరిపివేద్దాం".

**- కందుకూరి వీరేశలింగం**

# ఆత్మ విశ్వాసము

*"ధీరుడు ఒకేసారి మరణిస్తాడు, పిరికివాడు అనుక్షణం చనిపోతుంటాడు"* అని చెప్పాడు మహాకవి 'షేక్స్పియర్'. *'ధైర్యే సాహసే లక్ష్మీ'* అనే లోకోక్తి కూడా ఉన్నది. సాహసంతో దేనినైనా సాధించవచ్చును. ధైర్యానికి, సాహసానికి మూలం ***'ఆత్మవిశ్వాసము'*** తన మీద తనకు నమ్మకముండటమే 'ఆత్మవిశ్వాసము'. కనుక ప్రతి వ్యక్తికీ ***'ఆత్మవిశ్వాసం'*** **(Self Confidence)** ఉండాలి.

ఒకసారి స్వామీ వివేకానంద "Faith, Faith, Faith in ourselves; Faith in God. This is the secret of success" (నమ్మకం, నమ్మకం తనయందు నమ్మకం, భగవంతుని యందు నమ్మకం - ఇదే విజయానికి కీలకం) అని చెప్పారు.

***"నమ్మకమను రెండు నయనంబులే లేని అంధులైరి జనులు అవనియందు"*** అన్నారు శ్రీసత్యసాయిబాబావారు. అయితే ఈనాడు చాలా మందిలో ఇట్టి నమ్మకం లోపిస్తున్నది. మొట్టమొదట తన శక్తిమీద తనకు నమ్మకం ఉండాలి. తన తల్లిమీద తనకు నమ్మకం ఉండాలి. గురువుమీద నమ్మకం ఉండాలి. అట్టి నమ్మకాన్నే ***'ఆత్మవిశ్వాసం'*** అంటారు. ***ఆత్మవిశ్వాసం దృఢమైన సంకల్పం మీద ఆధారపడి*** వుంటుంది. ***సంకల్పంలో నుండి 'విశ్వాసం' పుడుతుంది. విశ్వాసం సాధనకు శక్తినిస్తుంది. విశ్వాసమే మనిషికి కొండంత బలం.***

అయితే ఈనాడు చాలామందిలో తన శక్తి మీదనే తనకు నమ్మకం లేకుండా పోతున్నది. చేబట్టిన కార్యం సఫలీకృతమవుతుందా? లేదా! అని సందేహిస్తుంటారు, సంశయిస్తుంటారు. ***'సంశయాత్మా వినశ్యతి'*** అని గీత చెబుతున్నది. సంశయిస్తూ చేసేపనులు సఫలీకృతం కావు. ఆత్మ విశ్వాసంతో ప్రారంభించే పనులే ఫలప్రదమవుతాయి. ***ఆత్మ విశ్వాసంతో చదివే విద్యార్థి ఉత్తీర్ణుడవుతాడు. విశ్వాసమే విజయానికి మూలం.***

## శ్రీశైలశిఖరం :

***'శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మన విద్యతే'*** శ్రీశైలశిఖరాన్ని దర్శించిన వారికి మరో జన్మ ఉండదని ఒక నమ్మకం. ఆ శిఖరాన్ని చూచినవారు పాపరహితులవుతారని ఒక విశ్వాసం. ఆ నమ్మకంతో, విశ్వాసంతో భక్తులు అక్కడకు వెళ్ళుతుంటారు. అయితే

అక్కడికి వెళ్ళేవారందరిలో అట్టి నమ్మకం విశ్వాసం ఉన్నదో! లేదో! పరీక్షించాలని సంకల్పించుకున్నారు ఒకసారి పార్వతీ పరమేశ్వరులు. పరమేశ్వరుడు ఒక ముసలివాడుగా మారాడు. పార్వతి అతని భార్యగా మారింది. వారిద్దరూ శ్రీశైల శిఖరాన్ని చూడటానికి బయలుదేరారు. మార్గమధ్యంలో ఆ ముసలివాడు ఒక ఊబిలో దిగబడుతాడు. *'రక్షించండి! రక్షించండి!'* అని అతని భార్య అరుస్తుంటుంది. శ్రీశైలశిఖరాన్ని సందర్శించి వస్తున్న చాలామంది యువకులు ఆ ముసలి వాడిని రక్షించడానికి ముందుకు వస్తారు. కాని అతని భార్య ఒక షరతు పెడుతుంది. ***'పుణ్యాత్ములైనవారు మాత్రమే రక్షించగలుగుతారు'*** అని ఆమె చెబుతుంది. చాలామందికి సందేహం కలుగుతుంది. "మనం పుణ్యాత్ములమో! కాదో!" అని అనుకుంటూ చూచి వెళ్ళపోతుంటారు. ఇంతలో ఒక వేశ్య అక్కడకు వస్తుంది. ఆమె శ్రీశైలశిఖరాన్ని సందర్శించి వస్తుంటుంది. శ్రీశైలశిఖర దర్శనంతో తన పాపాలన్నీ పటాపంచలైపోయి పుణ్యాత్మురాలనయినాననే నమ్మకం ఆమెలో వుంటుంది. ఊబి దగ్గరకు వెళ్ళుతుంది. ముసలివాని చేయి పట్టి ఒక్క ఊపుతో పైకి లాగుతుంది. ఆ ముసలివాడు బయటపడుతాడు. ఆ ముసలివాడు తన నిజస్వరూపమును చూపి ఆ వేశ్యను అభినందించుతూ *"ఆత్మవిశ్వాసమున్న వారే నిజమైన భక్తులు"* అని చెప్పి ఆ వేశ్యను దీవించుతాడు.

ఈ కథ మనకు ఒక సత్యమును బోధిస్తున్నది ***"విశ్వాసం లేనివారిని విశ్వేశ్వరుడు కూడా రక్షించడు. విశ్వాసం లేకపోతే అది ఆత్మవంచనే అవుతుంది" ఆత్మవిశ్వాసం విజయానికి మూలం.***

***ఈనాడు కొంతమంది విద్యార్థులు ఆత్మవిశ్వాసం లేక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. ఇది పిరికివాళ్ళ లక్షణం, బలహీనుల మనస్తత్వం. బలహీనతకు మించిన పాపం వేరొకటి లేదు. ఆత్మవిశ్వాసంతో ముందుకు నడవండి! అభివృద్ధిని సాధించండి! విజయ దుందుభులను మ్రోగించండి.***

---

"ఆత్మవిశ్వాసంతో ముందుకు నడవాలి. ఆత్మగౌరవాన్ని కాపాడుకోవాలి. స్వధర్మాన్ని విడనాడరాదు. పరధర్మాన్ని పట్టుకొని వ్రేలాడరాదు. స్వశక్తిమీద జీవించడం నేర్చుకోవాలి. పరులమీద ఆధారపడి జీవించడం కన్నా మించిన పాపం వేరొకటి లేదు"

**- వివేకానంద**



# బాబాసాహెబ్ అంబేద్కర్

మహారాష్ట్రలోని మాసూర్ స్టేషన్‌లో రైలు ఆగింది. ఇద్దరు బాలురు దిగారు. చూడటానికి వారిద్దరూ అన్నదమ్ములలాగే ఉన్నారు. వారికి ఏమి చేయాలో తోచలేదు. స్టేషన్‌మాస్టర్ దగ్గరుకు వెళ్ళుతారు. ఆ పిల్లల తండ్రి 'గోరేగావ్'లో ఉన్నాడని, ఆయన జబ్బుతో మంచం పట్టాడని, ఆయనను చూడటానికి వచ్చామని చెబుతారు. అప్పుడు ఆ స్టేషన్‌మాస్టర్ ఒక ఎద్దులబండిని మాట్లాడి, ఆ బండిలో వెళ్లమని చెబుతాడు. కిరాయి మాట్లాడుకొని ఆ ఇద్దరు బాలురు బండి ఎక్కుతారు. బండిలో ప్రయాణం చేస్తూ ఏదో మాట్లాడుకొంటుంటారు. ఆ మాటలు వింటున్న ఆ బండివాడికి, ఆ పిల్లలకులం ఏమిటో తెలిసిపోతుంది. వెంటనే బండి ఆపి కోపంతో ఆ పిల్లలను దిగిపొమ్మంటాడు. కాని వారు దిగరు. ఆ బండికి కట్టిన ఎద్దులను ఊడదీసి, బండిని పైకి ఎత్తివేస్తాడు. ఆ పిల్లలిద్దరూ నేలమీద పడుతారు. ఆ పిల్లలిద్దరూ అంటరాని కులంవారు కావటంవలన, తన, బండి, ఎద్దులు మైలపడి పోయినాయని భావించి, ఆ విధంగా చేస్తాడు ఆ బండివాడు. చేసేది ఏమీ లేక నడిచి వెళ్ళుతుంటారు. ఆ బండీవాడు మాత్రం ఖాళీ బండీనే తోలుకొని వెళ్ళుతుంటాడు. ఆ పిల్లలిద్దరికీ దాహంవేస్తుంది. త్రోవలో ఒక బావి కనిపిస్తుంది. పరుగెత్తుకొని వెళ్ళి, ఆ బావి వద్ద నీరును తోడుకుంటున్న వారిని మంచినీరు కావాలని అడుగుతారు. వీరు అంటరానికులానికి చెందినవారని చెబుతాడు ఆ బండివాడు. ఆ బావి వద్ద ఉన్నవారు ఆ పిల్లలకు మంచినీరు పోయడానికి కూడా అంగీకరించరు. దాహంతోనే ఇంటికి చేరుతారు ఆ ఇద్దరు పిల్లలు.

ఆ ఇద్దరిలో ఒక బాలుడు, ఒకసారి బడికి వెళ్ళుతుంటాడు. దారిలో కుండపోతగా వర్షం కురుస్తుంటుంది. దారిలో ఒక ఇల్లు కనపడుతుంటుంది. ఆ ఇంటి వసారాలో తలదాచుకోవచ్చునని వెళ్ళుతాడు. ఆ ఇంటి యజమానురాలు చూస్తుంది. ఆ బాలుడు అంటరానివాడని గ్రహించి కర్రసహాయంతో ఆ బాలుడిని

బయటకు నెట్టివేస్తుంది. అతని చేతిలో వున్న పుస్తకాలన్నీ చెల్లాచెదురుగా నీటిలో పడిపోతాయి. ఆ బాలుడు బురద గుంటలో పడుతాడు.

మరోసారి ఆ బాలుడు, క్షవరం చేయించుకోవడానికి మంగలి దగ్గరకు వెళ్ళుతాడు. *'నేను నీకు క్షవరం చేయను'* అని త్రిప్పి పంపిస్తాడు. ఆ విధంగా అంటరాని తనంలోని అమానుషత్వాన్ని చిన్ననాటనే చవిచూస్తాడు ఆ బాలుడు. అందరి పిల్లలలాగానే అతనిని క్లాసులో కూర్చోనిచ్చేవారు కాదు. ఆ బాలుడికి ఎవరైనా నీళ్ళు పోస్తే దోసిలితోనే త్రాగవలసి వచ్చేది. గ్లాసుతో త్రాగటానికి వీలు లేదు. ఇతరులతో మాట్లాడేటప్పుడు, నోటికి చెయ్యి అడ్డంపెట్టుకొని మాట్లాడాలి. ఆ విధమైన ఆంక్షలు ఆ రోజులలో ఉండేవి. అయినప్పటికీ ఏ మాత్రం జీవితం మీద నిరాశ చెందలేదు. పైపెచ్చు అతని పట్టుదల పెరిగింది. పెద్దవాడైన తరువాత ఈ సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా పోరాటం కొనసాగించాలని సంకల్పించుకున్నాడు ఆనాడే ఆ బాలుడు. బొంబాయిలోని *'ఎలిఫిన్‌స్టన్'* హైస్కూలులో చేరి పట్టుదలతో మెట్రిక్యులేషన్ ప్యాసవుతాడు. 1912 సం॥లో బి.ఏ డిగ్రీని పుచ్చుకుంటాడు. బరోడా సంస్థానాధిపతి శాయాజీ రావ్ గయక్వాడ్‌గారు ప్రేమతో అందించిన సహాయంతో అమెరికా వెళ్ళి, కొలంబియా విశ్వవిద్యాలయంలో చేరి ఎం.ఏ., పట్టమును పొందుతాడు. ***"భారతదేశంలోని కులాలు - వాటి పుట్టు పూర్వోత్తరాలు"*** అనే పరిశోధనా వ్యాసాన్ని వ్రాసి అదే విశ్వవిద్యాలయానికి సమర్పిస్తాడు. "భారతదేశ జాతీయ ఆదాయం - చారిత్రక విశ్లేషణ" అనే గ్రంథమును కూడా వ్రాసి అదే విశ్వవిద్యాలయానికి సమర్పిస్తాడు. ఆ విశ్వవిద్యాలయం ఎం.ఏ.పి.హెచ్.డి. పట్టాని ప్రదానం చేస్తుంది. ఆ విశ్లేషణా గ్రంథాన్ని అమెరికా మేధావులు శ్లాఘించుతారు, సన్మానిస్తారు. ఆ గ్రంథం ప్రపంచ ఆర్థిక వేత్తల ప్రశంసలనందుకుంటుంది. ఆ రోజులలో, వివిధ దేశాల శాసనసభలలో జరిగే బడ్జెట్ సమావేశాలలో పాల్గొనే సభ్యులందరి చేతులలో ఆ గ్రంథం ఉండేదిట. ఆ గ్రంథరచయిత వయస్సు అప్పుడు ఎంతో తెలుసా? కేవలం 25 సంవత్సరాలు మాత్రమే. ఆయన ఎవరో తెలుసా? చిన్ననాట అంటరానితనానికి గురియై, అనేక అవస్థలను అనుభవించిన ఆ బాలుడే అతను. ఎన్ని కష్టములెదురైనా చలించక, ఆత్మవిశ్వాసాన్ని కోల్పోక, పట్టుదలతో చదివి విదేశాలకు వెళ్ళి, పి.హెచ్.డి. చేసి ఆర్థిక విశ్లేషణా గ్రంథాలను రచించి, ప్రపంచ ఆర్థిక శాస్త్రవేత్తల ప్రశంసలనందుకొనిన మేధావి అతనే. అతని పేరే ***'భీమ్ రావ్ రామ్‌జీ'*** అతనే ***డాక్టర్ బి.ఆర్. అంబేడ్కర్.***

అమెరికాలో పి.హెచ్.డి. పొందిన తరువాత లండన్ వెళ్ళుతాడు. ఆయన లండన్ మ్యూజియం లైబ్రరీకి నిత్యమూ వెళ్లేవాడుట. ఉదయం 8 గంటలకు వెళ్లితే, సాయంత్రం ఆ గ్రంథాలయం మూసేంతవరకు అక్కడే వుండి గ్రంథాలు చదువు తుండేవాడు. అక్కడనే వుండి అనగా 1921 సం॥లో **"ప్రావిన్షియల్ డీసెంట్రలైజేన్ ఆఫ్ ఇండియా"** అనే పరిశోధనా పత్రాన్ని అక్కడి విశ్వవిద్యాలయానికి సమర్పించి ఎం.ఎస్.సి. పట్టం కూడా పొందుతారు. డి.ఎస్.సి డిగ్రీకోసం, అదే విశ్వవిద్యాలయానికి **"ది ప్రాబ్లం ఆఫ్ ది రూపి"** అనే సిద్ధాంత పత్రాన్ని కూడా సమర్పిస్తారు. అదే సమయంలో 'బారిష్టర్' పరీక్షను కూడా పూర్తి చేయడం విశేషం. ఆ తరువాత జర్మనీ వెళ్లి బాన్ విశ్వవిద్యాలయంలో కొంత కాలం తర్కశాస్త్రం, ఆర్థిక శాస్త్రములను అధ్యయనం చేసి, మాతృదేశానికి తిరిగివచ్చి 1923 సం॥ జూన్‌లో న్యాయవాదిగా బొంబాయిలో జీవితాన్ని ప్రారంభిస్తారు. న్యాయవాద వృత్తిని ప్రధానంగా చేసుకొని దళిత జాతులను దాస్యశృంఖలాల నుండి విముక్తి చేయాలని సంకల్పించుకుంటారు ***డా. అంబేద్కర్.***

ఆ తరువాత వ్రాసిన 'కుల నిర్మూలన' 'అస్పృశ్యులెవరు?' 'థాట్స్ ఆన్ పాకిస్థాన్' , 'రానడే -గాంధీ-జిన్నా' అనే పరిశోధనా గ్రంథాలు మేధావుల ప్రశంసల నందుకుంటాయి. అంబేద్కర్ కేవలం రచయితే కాదు, పాత్రికేయుడు కూడాను, భారత్, మూక్ నాయక్, జనతా, సరస్వతీ విలాస్, సమత అనే పత్రికలకు కొంత కాలం సంపాదకునిగా కూడా పని చేస్తారు.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత డా. అంబేద్కర్ మొట్టమొదటి న్యాయశాఖా మంత్రిగా పదవీబాధ్యతలను స్వీకరిస్తారు. ఆయన ఛైర్మన్‌గా ఏడుగురు సభ్యులతో, రాజ్యాంగ రచనకై ఒక కమిటీ ఏర్పడుతుంది. ఆయన సారధ్యంలో భారత రాజ్యాంగం రూపొందించబడుతుంది. రచయితగా, పాత్రికేయుడుగా, సంఘసంస్కర్తగా డా. అంబేద్కర్‌కు వచ్చిన కీర్తి ప్రతిష్టలు ఒక ఎత్తుకాగా, భారత రాజ్యాంగ నిర్మాతగా ఆయనకు వచ్చిన కీర్తి మరొకఎత్తు.

ప్రముఖ ఆర్థికవేత్త టి.టి. కృష్ణమాచారి ఒకసారి రాజ్యాంగ పరిషత్‌లో మాట్లాడుతూ ***"రాజ్యాంగ రచనా సంఘంలో నియమించబడ్డ ఏడుగురి సభ్యులలో ఒకరు రాజీనామా చేసారు, మరొకరు మరణించారు, వేరొకరు అమెరికాలో వుండిపోయారు, ఇంకొకరు రాజకీయాలలో నిమగ్నులయ్యారు, ఉన్న ఒకరిద్దరూ ఢిల్లీకి దూరంగా ఉన్నారు. అందుచేత రాజ్యాంగ రచనా భారమంతా డా. అంబేద్కర్ మీద పడింది. అయినప్పటికీ భారత***

*రాజ్యాంగం అత్యంత ప్రామాణికంగా రూపొందినదనటంలో ఎట్టి సందేహం లేదు"* అని అంటారు. ఇది యదార్థమని ఋజువైంది.

ప్రసిద్ధ బ్రిటీష్ రచయిత 'బెవర్లీనిఖలోస్' *"డా. అంబేద్కర్ భారత దేశపు ఆరుగురు మేధావులలో ఒకరు"* అని ప్రశంసించుతారు.

బాబాసాహెబ్‌ను వృద్ధాప్యం ఆవహిస్తుంది. ది. 6-12-1956న తుది శ్వాస విడుస్తారు. దావానలంగా ఆ దుర్వార్త ఢిల్లీ అంతా ప్రాకుతుంది. ఆ మహా సంఘసంస్కర్తను ఆఖరిగా దర్శించుకోవడానికి వేలాదిమంది వచ్చి కన్నీరు కారుస్తుంటారు. ప్రత్యేక విమానం ద్వారా ఆయన భౌతిక కాయాన్ని బొంబాయి తరలిస్తారు. బాబాసాహెబ్ అంతిమ వాంఛను నెరవేర్చడానికి లక్షమంది ప్రజలు బౌద్ధమతాన్ని స్వీకరించి, శ్రద్ధాంజలి ఘటిస్తారు. ఆనాటి ప్రధాని పండిత నెహ్రూ శ్రద్ధాంజలి ఘటిస్తూ *"కాలం మీద బలమైన ప్రభావాన్ని చూపించిన మహనీయుడు అంబేద్కర్. మానవస్వాతంత్ర్య చరిత్రలోను, మన దేశచరిత్రలోను చిరస్థాయిగా నిలిచిపోయే మహా వ్యక్తి 'బాబాసాహెబ్ అంబేద్కర్'* అంటూ కంటతడి పెట్టుకుంటారు.

చాలామంది దృష్టిలో డా. అంబేద్కర్ దళిత జాతులవైతాళికుడు మాత్రమే. అంబేద్కర్ వ్యక్తిత్వంలో ఇతర పెక్కు అంశాలు ఎక్కువమంది దృష్టికి రాకపోవడం విచారకరం. ముఖ్యంగా విద్య విషయంలో ఆయనకు స్పష్టమైన అభిప్రాయాలు ఉండేవి. 1938 సం॥ ఫిబ్రవరి 13వ తేదీన మన్మాడ్‌లో జరిగిన దళిత యువకుల సభలో ఆయన చేసిన ప్రసంగమును పరిశీలిస్తే ఆయన భావాలు మనకు బోధపడుతాయి. *"విద్య అనేది రెండు వైపులా పదునున్న కత్తి. దానిని ఉపయోగించే సమయంలో జాగ్రత్త వహించాలి. వినయము, శీలములేని విద్యావంతుడు మృగం కంటే ప్రమాదకరం. అతని విద్య పేద ప్రజల సంక్షేమాన్ని కుంటుపరిచేదయితే, ఆ వ్యక్తి సమాజానికి ఒక శాపం. అలాంటి విద్యావంతులుండటం సిగ్గుచేటు. విద్య కంటే శీలం గొప్పది"* అని డా. అంబేద్కర్ చెబుతారు.

భారత రాజ్యాంగ నిర్మాతగా భారత ప్రజాస్వామ్య పరిరక్షకుడుగా, సాంఘిక సంస్కర్తగా, మానవతావాదిగా ఆయన భారత ప్రజలకు చిరస్మరణీయుడు. ఆ మహోనీయుని వారసులుగా మనం కూడా కులతత్వాన్ని, అంటరానితనాన్ని నిర్మూలించేందుకు కృషి చేద్దాం, అప్పుడే ఆయన ఆత్మ సంతోషిస్తుంది. అదే మనందరి కర్తవ్యం.



# దయాసాగరుడు ఈశ్వరచంద్ర విద్యాసాగర్

బక్క చిక్కిన శరీరం, తాటికాయంత తల, ముతక బట్టలు, ఆ నిరాడంబరమైన వేషం చూసేవారికి ఆయన బీదవాడనే భావం సహజంగా కలుగుతుంది. నిజంగానే ఆయన బీదవాడే. కాని ఆ రోజులలో ఆయన లాంటి ధైర్యశాలి, మేధావి, దాత, సంఘ సంస్కర్త మరొకరు లేరు. ఇది అతిశయోక్తి కాదు, యదార్థం. ఆయన పేరే ***ఈశ్వరచంద్ర విద్యాసాగర్.*** పేరు వినగానే ఆయన ఒక గొప్ప సంస్కృత పండితుడని, గొప్ప సంఘసంస్కర్త అని అందరికీ తెలిసిపోతుంది. నిజంగానే ఆయన సంస్కృతంలో గొప్ప పండితుడు. వంగ సాహిత్యంలో సంస్కృత వాచకాలు వ్రాశాడు. సంస్కృత కాళిదాస శాకుంతలాన్ని అనువదించాడు. ***'కామెడీ ఆఫ్ ఎర్రర్స్'*** అనే ఆంగ్ల నాటకాన్ని వంగ భాషలోనికి ***'భ్రాంతి విలాస్'*** పేర అనువదించాడు. వ్యాకరణ గ్రంథం కూడా రచించాడు. ఇవన్నీ ఆయన సంస్కృత, వంగ, ఆంగ్ల భాషలపాండిత్యానికి మచ్చుతునకలు. ఇవన్నీ ఒక ఎత్తు అయితే, విధవా వివాహాలను గురించి రెండు సంపుటాలలో ఆయన వ్రాసిన గొప్ప పుస్తకం మరో ఎత్తు. ఆ పుస్తకంలోని బాల వితంతువుల కన్నీటి గాథలు చదువుతుంటే ఎంతటి పాషాణ హృదయాలైనా కరిగి కన్నీరు కారుస్తాయనటంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. రచయితగా, పండితుడుగా ఎంత గొప్పవాడో, సంఘసంస్కర్తగా కూడా ఆయన అంత గొప్పవాడే. ఈశ్వరచంద్రుడు విద్యాసాగరుడే కాదు, ***'దయాసాగరుడు'*** కూడా. ఏ మాత్రం కష్టంలో ఉన్న వ్యక్తి అయినా సరే, కంటతడి పెడితే చాలు ఆయన మనస్సు వెన్నలా కరిగిపోయేది.

1857 సం॥లో బెంగాల్‌లో తీవ్రమైన క్షామం వచ్చింది. ఒకసారి ఒక బీదబాలుడు పరుగెత్తుకుంటూ ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వద్దకు వచ్చి ***"అయ్యా! ఒకపైసా దానం చేయండి!"*** అని ప్రాధేయ పడుతాడు. ***"ఒక పైసా కాదు, నాలుగు పైసలు యిస్తే ఏం***

*జేస్తావ్?"* అని అడుగుతాడు. *"ఎగతాళి చేయకండి సార్! ఒక పైసా యివ్వండి చాలు సార్!"* అంటాడు ఆ బాలుడు. *"ఎగతాళి కాదు, నిజంగానే నాలుగుపైసలు యిస్తే ఏం జేస్తావ్?"* అంటాడు విద్యాసాగర్. *"రెండు పైసలతో ఏదైనా తినటానికి కొంటాను, మిగతా రెండు పైసలూ మా అమ్మకు యిస్తానంటాడు"* ఆ బాలుడు. *'నాలుగు పైసలు బదులు రెండణాలు యిస్తేను?'* ఆ బాలుడు బదులు చెప్పక చకచకా నడిచి వెళ్ళిపోతాడు. పరుగెత్తుకొని వెళ్ళి ఆ బాలుని పట్టుకొని *"రెండు అణాలకు బదులు నాలుగు అణాలు యిస్తే ఏం జేస్తావ్?"* అని అడుగుతాడు. అప్పుడు ఆ బాలుడు *"రెండు అణాలతో బియ్యం కొంటాను మిగతా రెండు అణాలతో మామిడి పండ్లు కొని లాభానికి అమ్మివేస్తాను. మా అమ్మకు కడుపునిండా అన్నంపెడతాను. బిచ్చం అడగటం మానేస్తాను"* అని సమాధానం చెబుతాడు ఆ బాలుడు. ఆ అబ్బాయిని మెచ్చుకొని ఒక రూపాయి బిళ్ల యిస్తాడు. ఈ సంఘటన జరిగిన రెండేళ్లకు ఒక వీధిలో నడిచి వెళ్ళు తుంటే, ఒక చిన్న అంగట్లో నుండి ఒక బాలుడు పరుగెత్తుకొని వచ్చి *"నమస్కారం సార్! మా అంగట్లోకి వచ్చి నన్ను ఆశీర్వదించండి సార్!"* అని వినయంగా అడుగుతాడు. *'నీవు ఎవరివో! నాకు తెలియదు'* అంటాడు విద్యాసాగర్. అప్పుడు ఆ బాలుడు రెండుసంవత్సరాల క్రిందట జరిగినదంతా గుర్తుచేస్తాడు. కష్టాలలో నున్నవారికి చేతనైనంత సాయం చేయటమే ఆయన స్వభావం. చేసిన సహాయాన్ని వెంటనే మరిచిపోవటం ఆయన ప్రవృత్తి. అదే ఉత్తముల లక్షణం.

ఒకసారి సూటు, బూటు ధరించిన ఒక యువకుడు ఒక సూట్‌కేస్ తీసుకొని రైలునుంచి దిగుతాడు. *'కూలీ! కూలీ!"* అని పిలుస్తాడు. అది చిన్న స్టేషన్ కావటం వలన అక్కడ కూలీలు ఎవరూ ఉండరు. ఇంతలో ఒక నడివయస్సుగల వ్యక్తి ఆ యువకుని దగ్గరకు వస్తాడు. ఆ యువకుడు ఆ వ్యక్తిని చూచి *'మీరు చాలా సోమరులు!'* అంటూ నాలుగు చివాట్లు పెట్టి ఆ సూట్‌కేస్‌ను యిస్తాడు. మాట్లాడకుండా ఆ సూట్‌కేసును నెత్తిన పెట్టుకొని, ఆ యువకుని వెంట బయలుదేరివెళ్ళుతాడు. ఆ సూట్‌కేస్‌ను ఇంట్లో పెట్టాక పర్సుతీసి డబ్బులు యివ్వబోతాడు ఆ యువకుడు. అప్పుడా వ్యక్తి *"ధన్యవాదాలు సార్! వాటి అవసరం నాకు లేదు సార్!"* అంటాడు. ఆ యువకుడు ఆశ్చర్యపోతాడు. ఇంతలో ఆ యువకుని అన్నగారు ఇంట్లో నుంచి బయటకు వచ్చి, ఎదురుగా వున్న ఆ నడివయస్కుడ్ని చూచి నమస్కారం చేస్తాడు. విఖ్యాతవంగ విద్వాంసుడు ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు అతనేనని తన తమ్మునికి పరిచయం చేస్తాడు. ఈ రోజు సాయంత్రం వారి సభను మన గ్రామంలో ఏర్పాటు చేసామని

చెబుతాడు. ఆ యువకుడు తన తప్పిదాన్ని తెలుసుకొని, తలవంచుకుంటాడు. అసలు ఆ యువకుడు, ఆ మహనీయుని ఉపన్యాసాన్ని వినడానికే ఆ గ్రామానికి వచ్చాడు. ***మహనీయుల గొప్పతనం వారి వేష భాషలను చూచి నిర్ణయించలేం. అసలు వారు పై పై ఆడంబరాలకు ప్రాధాన్యత యివ్వరు. బాహ్య సౌందర్యానికి ప్రాముఖ్యత అంతకన్నా యివ్వరు.*** అదే వారి ప్రత్యేకత.

ఒకసారి కలకత్తాలో జరిగిన ప్రముఖుల సభకు ఆహ్వానించగా బయలుదేరి వెళ్ళుతాడు 'విద్యాసాగర్' ఆయన నిరాడంబర వేషం చూచి గేటు వద్దనున్న జమాను ఆయనను లోపలికి అనుమతించడు. తిరిగి ఇంటికెళ్ళి సూటు, బూటు ధరించి మరల అదే సభకు వెళ్ళుతాడు. గేటువద్ద నున్న ఆ జమానే నమస్కారం చేసి లోపలికి పంపుతాడు. ***సామాన్యులు బాహ్య అలంకారాలకే విలువ యిస్తారు. అంతఃసౌందర్యాన్ని వారు చూడలేరు. వ్యక్తిలోనున్న పాండిత్యాన్ని సామాన్యులు గుర్తించలేరు.***

ఒకసారి విద్యాసాగర్ అత్యవసరంగా ప్రయాణం చేయవలసి వస్తుంది. రైలు స్టేషన్‌కు వెళ్ళుతాడు. కాని మూడవ తరగతి బుకింగ్ వద్ద పెద్ద క్యూ ఉంటుంది. రైలు బయలుదేరే సమయం అవుతుంది. మొదటి తరగతి బుకింగ్ దగ్గరకు వెళ్ళి ఫస్ట్‌క్లాస్ టిక్కెట్టుకొని మొదటి తరగతి బోగీలో ఎక్కుతాడు. అక్కడ అంతా ఆంగ్లేయ ప్రయాణికులే కనిపిస్తారు. ఒక్కొక్కరు ఇద్దరి సీట్లను ఆక్రమించి కూర్చొంటారు. ఆ బోగీనంతా కలియ జూచి, ఇద్దరు ఆంగ్లేయుల మధ్య కొంచం జాగా వుంటే ***'క్షమించండి!'*** అంటూ వీరిద్దరి మధ్య వెళ్ళి కూర్చుంటాడు విద్యాసాగర్. జాత్యహంకారంగల ఆ ఆంగ్లేయులు విద్యాసాగరుని చూచి ఏవగించుకుంటారు. అందులో ఒకడు కోపాన్ని ప్రదర్శిస్తూ ***'గాడిద'*** అంటాడు. మరొకడు ***'పంది'*** అని చీదరించుకుంటాడు. విద్యాసాగరుడు అవమానమును భరించ లేక, ఒక్క క్షణం ఆగి ***"అవును! ఆ రెండిటికి (గాడిద, పంది) నడుమనే నేను కూర్చున్నాను"*** అని బిగ్గరగా అరుస్తాడు. ఆ తెల్లవారి నోటివెంబడి మాటరాదు. విద్యాసాగరుడు సంస్కర్తే కాదు, స్వాభిమాని కూడాను.

విద్యాసాగరుడు ఎంత వినయ సంపన్నుడో, అంత ఆత్మాభిమానం గలవాడు. ఒకసారి ఆయన 'కార్' అనే ఆంగ్ల దొరను చూడటానికి వెళ్ళుతాడు. అప్పుడు ఆ దొర తన బూటుకాళ్ళను ఎదురుగా నున్న బల్లమీదకు చాపి మాట్లాడుతాడు. ఆయన ప్రవర్తన విద్యాసాగరునికి నచ్చనప్పటికీ, మాట్లాడి బయటకువస్తాడు. కొన్ని రోజులు తరువాత

ఏదో పని మీద ఆ దొర విద్యాసాగరుని వద్దకు వస్తాడు. అప్పుడు విద్యాసాగరుడు తన రెండుకాళ్ళను మేజామీదికి జాపి ఆ దొరతో మాట్లాడుతాడు. ఆ దొరకు కోపం వచ్చినప్పటికీ, ఏమీ చేయలేక వెళ్ళిపోతాడు. విద్యాసాగరుడు ఎంతటి ఆత్మాభిమానం గలవాడో ఈ సంఘటనను బట్టి మనం తెలుసుకోవచ్చును.

విద్యాసాగరుడు తన గొప్పతనాన్ని ఎప్పుడూ చాటుకోలేదు. ఇంద్రుణ్ణి, చంద్రుణ్ణి అని చెప్పకోలేదు. చడీచప్పుడూ చేయకుండా ఆయన ఒక విప్లవమును తీసుకొని వచ్చాడు. స్త్రీలుకూడా చదువుకొని చైతన్యవంతులు కావాలని బోధించాడు. స్త్రీ పునర్వివాహాలను ప్రోత్సహించాడు. కులబేధాలను నిరసించాడు. ఆ రోజులలో సంస్కృత పాఠశాలల్లో బ్రాహ్మణ విద్యార్థులను మాత్రమే చేర్చుకునేవారు. విద్యాసాగరుని ప్రయత్నం వలన అన్ని కులాలవారికి సంస్కృతం నేర్చుకోవడానికి అవకాశం లభించింది. అయితే ఆనాటి ఛాందసులకు కోపం వచ్చింది, ద్వేషంతో ఆయనను చంపడానికి కూడా ప్రయత్నించారు. అయినప్పటికీ, ఏమాత్రం భయపడక, తాను నమ్మిన సిద్ధాంతానికి అంకితమైన ధీశాలి *ఈశ్వర చంద్ర విద్యాసాగర్.*

కలకత్తాలోని సంస్కృత కళాశాలలో అధ్యాపకుడుగా చేరి, ఆ తరువాత అదే కళాశాలలో ఎనిమిది సంవత్సరాల పాటు ప్రిన్సిపాల్ పదవిని నిర్వహించి, ఏదో ఒక మాట పట్టింపుతో రాజీనామా చేస్తారు విద్యాసాగర్. ఆ తరువాత మరే ఉద్యోగం చేయరు. జీవితమంతా సంస్కరణోద్యమంలోనే కాలంగడిపి 1892సం॥లో పరమ పదించుతారు ఈశ్వర చంద్ర విద్యాసాగర్.

***సంఘ సంస్కరణోద్యమ పితామహుడు రాజారామ్‌మోహన రాయ్ అయితే, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, కందుకూరి వీరేశలింగం ప్రభృతులు ఆ ఉద్యమానికి రథసారథులు.***



---

"స్త్రీలు కూడా చదువుకోవాలి. అందుకోసం పాఠశాలలు నెలకొల్పాలి. స్త్రీ పునర్వివాహం తప్పుకాదు. కులభేదాలను నిరసించాలి. సంస్కృతం అందరూ చదువవచ్చును. అగ్రకులాల వారికే పరిమితం చేయకూడదు. వేదవిజ్ఞానం అందరూ తెలుసుకోవాలి. అప్పుడే సనాతనధర్మ ఔన్నత్యం అందరికీ తెలుస్తుంది"

**- ఈశ్వర చంద్ర విద్యాసాగర్**



# దేశబంధు చిత్తరంజన్ దాస్

**అ**ది ఒక పెద్ద భవనం. దానిని రాజభవనం అన్నా అతిశయోక్తి కాదు. ఆ భవనం కలకత్తా మహానగరంలో రూసారోడ్డులో ఉన్నది. ఆ ఇంటి యజమాని ఒక బారిష్టరు. ఆయన పేరు ప్రతిష్టలు గల ఒక గొప్ప న్యాయవాది. ఒకసారి ఆ న్యాయవాది కోర్టుకు వెళ్లడానికి బయటకు వస్తాడు. ఇంతలో ఒక పేదగృహస్థు ఎదురుగా వచ్చి, తన కూతురు పెండ్లికి ధన సహాయం అర్థిస్తాడు. ఎంతో కొంత ధనం యిచ్చి పంపుదామని కోటు జేబులు తడుముతాడు. ఏమీ కనిపించదు. సాయంత్రం రమ్మనమని చెప్పి కోర్టుకు వెళ్ళిపోతాడు ఆ న్యాయవాది. ఆ రోజు సాయంత్రం ఇల్లు చేరగానే, ఇంటివద్దనే కాచుకొని వున్న ఆ గృహస్థుని పిలిచి, ఆ రోజు వచ్చిన ఆదాయమునంతా ఇచ్చి ఇంట్లోకి వెళ్లతాడు ఆ న్యాయవాది. ఆ పేద గృహస్థు తరువాత లెక్కించుకుంటే రు. 1500/-లు ఉంటుంది. అతను ఆశ్చర్యపోతాడు. ఆ న్యాయవాది పేరు విచారిస్తే, అతనే **'చిత్తరంజన్ దాస్'** అని తెలుసుకుంటాడు ఆ పేద గృహస్థు.

ఒకనాడు 'దాస్' తన గుర్రపు బగ్గీలో బజారుకు వెళ్ళుతుంటాడు. దారిలో ఒక ఇంట్లోనుంచి రోదన ధ్వని వినిపిస్తుంది. బగ్గీని ఆపి, దిగి విషయం తెలుసుకుంటాడు. అది తన చిన్ననాటి ఉపాధ్యాయుని ఇల్లు అని తెలుసుకొని లోపలికి వెళ్ళుతాడు. ఆ ఉపాధ్యాయుడు అప్పుచెల్లించక పోవటంవలన, అతని ఇల్లును వేలం వేస్తుంటారు అధికారులు. 'దాస్' హృదయం ద్రవిస్తుంది. వెంటనే వడ్డీతో సహా చెల్లించి, ఉపాధ్యాయునికి ఆ ఇంటిని దక్కిస్తాడు 'దాస్'. ఆనాడు చెల్లించిన సొమ్ము వేలల్లోనే ఉంటుంది.

ఆ రోజులలో 'దాస్' ఆదాయం ఏడాదికి కనీసం రు. 10 లక్షలు ఉండేదిట. దేశం మొత్తం మీద, ఇంత పెద్ద మొత్తం ఆదాయం వచ్చే న్యాయవాది ఆనాడు ఇంకా ఎవరూలేరుట. 1919 సం॥లో ఆయనకు గాంధీజీతో పరిచయం ఏర్పడుతుంది. 1921 సం॥లో గాంధీజీ పిలుపు నందుకొని, స్వాతంత్ర్యమహోద్యమంలో దూకుతాడు. అంతులేని ఆదాయం యిస్తున్న న్యాయవాద వృత్తిని త్యజిస్తాడు. తన యావదాస్థిని, సువిశాల సుందర భవనాన్ని దేశానికి అంకితం చేస్తాడు. ఆ రోజులలోనే ఆ భవనం

విలువ కనీసం మూడు లక్షలట. ఆ ప్రాసాదంలో మెడికల్ కాలేజీని, మహిళలకు ఒక ఆసుపత్రిని నెలకొల్పారు 'దాస్'.

జాతీయ ఉద్యమాన్ని పటిష్టం చేయడాని కోసం బెంగాల్ అంతా ఉచిత పాఠశాలలు నెలకొలుపుతారు 'దాస్'. ఢాకాలో విశ్వవిద్యాలయమును స్థాపించుతారు. కలకత్తాలో జాతీయకళాశాలను నెలకొలిపి *'అరవిందఘోష్'*ను ప్రిన్సిపాల్‌గా నియమించుతారు. ఈ సంస్థలకు ఆనాడు ఎన్ని లక్షల దానం చేశాడో! చిత్తరంజన్‌దాస్. అంతటి మహా సంపన్నుడైన చిత్తరంజన్ దాస్, తన భోగభాగ్యములను విడనాడి, అతిసామాన్య జీవితాన్ని అలవాటు చేసుకుంటారు. రాజభోగాలను త్యజించి, చీనిచీనాంబరాలను విసర్జించి, ఖద్దరు బట్టలను ధరించి, అతి నిరాడంబరంగా జీవితాన్ని కొనసాగిస్తారు 'దాస్'. అలా అవిరళ త్యాగాన్ని చేసిన ఆ దీనబంధును *'దేశబంధు'* అని ప్రజలే పిలవనారంభించారు. ఆయన కలకత్తా మహానగరానికి ప్రప్రథమ మేయరుగా కూడా ఎన్నుకోబడ్డారు. *మొదట భోగి పిదప త్యాగి అయిన ఆ మహనీయుడే, చిత్తరంజన్ దాస్!*

అంతటి మహాభోగాన్ని అనుభవించి, వాటినన్నిటినీ త్యజించి, దేశస్వాతంత్ర్య సముపార్జనకు తన సర్వస్వాన్ని సమర్పించి, చివరి రోజులలో దారిద్ర్యాన్ని అనుభవించిన ఘనులలో దేశబంధు చిత్తరంజన్‌దాస్‌ది అగ్రస్థానం అయితే, ద్వితీయస్థానం 'ఆంధ్రకేసరి' ప్రకాశం పంతులుగారిది కావటం విశేషం. అద్వితీయ త్యాగమూర్తి, మహామేధావి, అసమాన న్యాయవాది, బీదలపాలిట కల్పతరువు అయిన 'దేశబంధు' చిత్తరంజన్ దాస్ 1925 సం॥ జూన్ 16వ తేదీన పరమపదించారు. ఆ మృతశరీర వాహకుల నలుగురిలో గాంధీజీ ఒకరు కావటం 'దాస్' ఎంతటి త్యాగమూర్తియో ఊహించవచ్చును.

'దేశబంధు' భౌతికకాయం అగ్నిజ్వాలలకు ఆహుతి అయిన సమయంలో ఏర్పాటు చేసిన స్మారక సభలో గాంధీజీ ప్రసంగిస్తూ ***"దేశబంధు కాయం నశించినప్పటికీ, ఆయన ఆత్మ అమరమైనది. అంతేకాదు, ఎంతో త్యాగం, సేవచేసిన ఆయన పేరుకూడా చిరస్థాయిగా నిలుస్తుంది. ఆయన సేవానిరతి త్యాగశీలత నిరుపమానం, ఆయన స్మృతి మనలో చిరకాలం నిలిచిపోవుగాక! ఆయన జీవితం మనకు మహత్కార్య సాధనకు మార్గదర్శకంగా ఉండుగాక! ఆయన ఆత్మకు శాంతి కలుగుగాక!"*** అని అంటూ కంట తడిపెట్టుకుంటారు **మహాత్మా గాంధీజీ.**

***"కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన"*** అన్న గీతావాక్యానికి నిదర్శనమైన జీవితం ఆయనది. తాను నమ్మిన సత్కార్యానికి తనను అంకితం చేసుకొని, ఎటువంటి త్యాగానికైనా వెనుదీయకుండా, తన లక్ష్యాన్ని చేరుకొని, జీవితాన్ని ధన్యం చేసుకొనిన మహామనీషి ***చిత్తరంజన్‌దాస్!*** భావితరాలవారికి చిరస్మరణీయుడు ***'చిత్తరంజన్ దాస్'.***



# 'బ్రహ్మర్షి' రఘుపతి వెంకటరత్నం నాయుడు

**ఒక** రోజున ఒక కాలేజిలో ఒక అధ్యాపకుడు విద్యార్థులు వ్రాసిన నలభై కాంపోజిషన్ పుస్తకాలను తీసుకొని Staff Room (అధ్యాపకులగది)కి వెళ్ళుతున్నాడు. ఇంతలో ఒక విద్యార్థి ఎదురుగా వచ్చి ఆయనను చూచి ***"మాష్టారు! గాడిద బరువు మోస్తున్నారే!"*** అన్నాడు. అప్పుడు ఆ మాష్టారు కోప్పడక, సమయస్ఫూర్తితో ***"అవునురా! ఒక్క గాడిద బరువు కాదు, నలభై గాడిదల బరువు మోస్తున్నానురా!"*** అని ప్రత్యుత్తరం యిస్తాడు. ఆ విద్యార్థి నివ్వెరపోయి తలవంచుకొని వెళ్ళిపోతాడు. ఆ విద్యార్థి కాంపోజిషన్ పుస్తకం కూడా ఆ నలభై పుస్తకాలలో ఉంటుంది. ఆ అధ్యాపకుడు ఎవరో కాదు ***'బ్రహ్మర్షి' రఘుపతి వెంకట రత్నం నాయుడుగారు.*** ఆయన సమయస్ఫూర్తి, హాస్యచతురత అలాంటివి.

మద్యపాన నిషేధం, అస్పృశ్యతా నివారణ మొదలైన సంఘ సంస్కరణోద్యమాలను గాంధీజీ కంటే ముందుగా ప్రారంభించి, తెలుగునాట విస్తృత ప్రచారం గావించిన ప్రముఖ సంఘసంస్కర్త ***రఘుపతి వెంకట రత్నంనాయుడు.*** నాయుడుగారు మహావక్త. ఇంగ్లీషులో ఆయనతో పోల్చగల వ్యక్తులు భారతదేశంలోనే వ్రేళ్ళపై లెక్కించవచ్చును. పదవులను బిరుదులను ఆయన ఎన్నడూ ఆశించలేదు. కాని అవే ఆయనను వరించాయి. ***'సర్ రావుబహద్దూర్', 'దివాన్ బహద్దూర్'*** లాంటి బిరుదులు ఇవ్వబడ్డాయి. ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయ జీవితం ప్రారంభించిన ఆయన అంచలంచలుగా ఎదిగి మద్రాసు విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ పదవిని కూడా అలంకరించుతారు. బ్రహ్మ సమాజ ఆశయాలను కోస్తా జిల్లాలో విస్తృతంగా పర్యటించి ప్రచారం చేసేవారు. తమ ఉపన్యాసాలలో ముఖ్యంగా అనాథల పునరుద్ధరణ, అస్పృశ్యత నిర్మూలన అంశాలు ప్రస్తావించేవారు. ఆయనలో అద్వైతుల సమభావం, వైష్ణవుల ప్రేమతత్త్వం, సూఫీల

దర్శనం పెనవేసుకొని మూర్తీభవించాయి. అందువలననే ఆయనను 'బ్రహ్మర్షి' అని పిలుస్తూ వచ్చారు. నాయుడు గారు 1891 సం॥లో "సాంఘిక శుద్ధి సంఘము" (Social Purity Association) ను స్థాపించారు. ఆ సంస్థలో చేరిన ప్రతిసభ్యుడు నీతి, ధర్మం, మానవత్వం కలిగి; ఆలోచనలలో, క్రియలలో పరిశుద్ధంగా ఉంటామని ప్రమాణం చేయాలని కోరారు.

మద్రాసు విశ్వవిద్యాలయానికి ఎన్నుకోబడిన తెలుగు వారిలో నాయుడుగారే మొట్టమొదటివారు. ఆయన ఆ పదవిలో మూడు సంవత్సరాలున్నారు. ఆ రోజులలో ఆయనకు రు. 2500/-లు జీతం యిచ్చేవారు. అందులో ఆయన ఒక్క రు. 150/-లు మాత్రమే తన స్వంత ఖర్చులకోసం ఉంచుకునేవారు. మిగతాదంతా పేద విద్యార్థులకు, అనాధలకు ప్రతినెలా ఖర్చు చేసేవారు. ప్రతినెలా ఒకటవ తేదీన పోస్టాఫీస్‌కు వెళ్ళి యమ్.ఓ ఫారములు పూర్తిచేసి డబ్బును పేదలకు, అనాధలకు పంపేవారు. చిట్టచివరికి ఆయనకు మిగిలినది నోట్లకట్టలు కాదు, యమ్.ఓ. కూపన్ల కట్టలు మాత్రమే. ఒక్కొక్కప్పుడు తమ నౌకర్లవద్దనే అప్పుచేసేందుకు కూడా వెనుకాడని 'దానకర్ణుడు' నాయుడుగారు.

రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు, బందరు నోబుల్ కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా వున్న సమయంలో ఎంతోమంది విద్యార్థులు వీరివద్ద శిష్యరికం చేశారు. భోగరాజు, ముట్నూరి,కోపల్లె, చెలుకువాడ ప్రభృతులు నాయుడుగారి శిష్యులే. విద్యార్థులకు ఈయన యెడల ఎనలేని గౌరవభావం ఉండేది. అందువలననే ఆనాటి నోబుల్ కళాశాల ప్రిన్సిపాల్ క్లార్క్‌దొర ఒకసారి నాయుడుగారిని ప్రశంసిస్తూ ***"విద్యార్థులపై అంతటి ప్రభావం గల ఆచార్యుని నేనెక్కడా చూడలేదు"*** అని అంటారు. విద్యతో పాటు వినయ విధేయతలను, వివేక విజ్ఞానాదులను, ఆత్మవిశ్వాసాన్ని, స్ఫూర్తిని, శక్తిని, విద్యార్థులకు ప్రసాదించిన ఉత్తమ ఉపాధ్యాయుడు ***రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు.***

ఒకసారి నాయుడుగారు ఒక మహాసభలో మాట్లాడుతూ ***"వేశ్యను నీచముగా చూడటము తప్పు. ఆమె నాకు చెల్లెలు వంటిది"*** అనగానే సభలో నుంచి "సిగ్గు! సిగ్గు!" అని కేకలు వినపడుతాయి. ఏమాత్రం జంకక, తడబడక, నిర్భయంగా ఎవరికి సిగ్గు? అని సింహగర్జన చేసి ***"తల్లులవంటి ఆ స్త్రీలను అధోగతికి తెచ్చిన ఈ సంఘ దుస్థితికి ఎవరు***

***కారకులు? ఇది ఎవరికి సిగ్గుచేటు?"*** అని అనగానే ఎవరూ మాట్లాడరు. అన్యాయాన్ని నిర్భయంగా ఎదిరించడంలో ఆయనకు ఆయనే సాటి.

నాయుడుగారు బందరు పురపాలక సంఘంలో సభ్యులుగా వున్నప్పుడు ఇంటి పన్నుల నిర్ణయం ఉపసంఘంలో సభ్యుడైనారు. ఆ సందర్భమున ఒకసారి ఒక మహమ్మదీయుని ఇల్లు తనిఖీ చేయవలసి వచ్చింది. ఆయన వెళ్లిన సమయానికి, ఆ ఇంట్లో మగవాళ్లెవరూ లేరు. కనుక లోపల నుంచి ఒక స్త్రీ ***"అయ్యా! మీరిప్పుడు రావడానికి వీలు లేదు"*** అన్నది. అప్పుడు నాయుడుగారు ఉర్దూలో ***''అమ్మా! నేను కూడా లోపలికి రాకూడదా?"*** అని అడిగారు. అప్పుడు ఆ స్త్రీ ***'బాబూ! మీరా? లోపలికి దయ చేయండి!'*** అన్నది. నాయుడుగారంటే మహమ్మదీయ స్త్రీలకు కూడా అంత గౌరవము ఉండేది.

బందరు తరువాత నాయుడుగారి కార్యక్రమాలకు కాకినాడ కేంద్రమయింది. 1904 సం॥లో కాకినాడ పి.ఆర్. కాలేజీలో ప్రిన్సిపాల్ పదవిని చేబట్టారు. ఆయన కాలంలోనే తొలిసారిగా ఆ కాలేజీలో హరిజన విద్యార్థులకు ప్రవేశం లభించింది. హరిజన బాలబాలికలకు ఉచితంగా విద్యాబోధన చేయడానికి నిర్ణయం గైకొనబడింది. అస్పృశ్యత, హరిజనోద్ధరణలకు ఆయన తమ జీవితాన్ని అంకితం చేశారు. 1862 సం॥ అక్టోబర్ 1వ తేదీన బందరులో జన్మించిన నాయుడు గారు 1919 సం॥ మే 26 తేదీన కాకినాడలో పరమపదించారు. ఆ వార్త విని ఒక ప్రముఖ కవి ఇలా పరితపించాడు.

**"సర్ రఘుపతి వేంకట ర**
**త్న! రమ్యగుణ సాంద్ర పండితవరా! దీనో**
**ద్ధరణ నిపుణ బ్రహ్మర్షీ!**
**ధరలో నీతోనె చెల్లె ధర్మము తండ్రీ!"**

---

"ఉన్నత పదవులకోసం ప్రాకులాడను. డబ్బూ దస్కం గడించాలనే ఆశకు దూరంగా ఉంటాను. సన్మార్గం అనుసరిస్తాను. భూతదయను పరమధర్మంగా భావిస్తాను. ఇదే మోక్షానికి మార్గమని విశ్వసిస్తాను".

**- రఘుపతి వెంకటరత్నంనాయుడు**



# దాదాభాయ్ నౌరోజీ

భారతదేశ రాజకీయ రంగంలో మనుమలు, మునిమనుమలచే చిరస్మర ణీయంగా గుర్తించబడిన వ్యక్తిగనుకనే ఆయనను "The Grand Old Man of India" అని, *"భారతదేశ భీష్మాచార్యుడు"* అని పిలిచేవారు. అతనే *'దాదాభాయ్ నౌరోజీ'*. సార్థకనామధేయుడు. పారశీక భాషలో 'దాదా' అనగా 'తాత' అని అర్థం. 'భాయ్' అనగా 'అన్న' అని అర్థం. 'నౌరోజీ' అనగా 'ఉగాది' అని అర్థము. భారత జాతీయ ఉద్యమ చరిత్రలో తాతగా, పెద్దన్నగా, నవశకమునకు ఉగాదిగా గుర్తించబడిన వ్యక్తి 'దాదాభాయ్ నౌరోజీ'. పారశీకుడైనప్పటికీ, భారత ప్రజల ఆదరాభిమానములను పొందిన ధన్యజీవి ఆయన.

1885 సం॥లో 'హ్యూమ్' దొరచేత భారత జాతీయ కాంగ్రెస్ స్థాపింపబడింది. కాంగ్రెస్ స్థాపనలో 'నౌరోజీ' పాత్ర అత్యంత ప్రశంసనీయమైనది. 1886 సం॥లో కలకత్తాలో జరిగిన సభలో భారత జాతీయ కాంగ్రెసుకు ఆయన అధ్యక్షుడుగా ఎన్నుకోబడినారు. మరల 1893 సం॥లో లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలో రెండవసారి అధ్యక్షుడుగా ఎన్నుకోబడినారు. మరల 1906 సం॥లో మూడవసారి కాంగ్రెస్ అధ్యక్ష పీఠాన్ని అలంకరించుతారు. ఒక పారశీకుడు, భారత జాతీయ కాంగ్రెసుకు మూడుసార్లు అధ్యక్ష పీఠాన్ని అలంకరించడం విశేషం.

1892 సం॥లో బ్రిటీష్ పార్లమెంటులోని కామన్స్ సభకు జరిగిన ఎన్నికలలో 'సెంట్రల్ ఫ్రిన్స్‌బరీ' నియోజకవర్గం నుండి పోటీ చేసి ఘనవిజయాన్ని సాధిస్తారు 'నౌరోజి. బ్రిటీష్ పార్లమెంటుకు ఎన్నికైన మొదటి భారతీయుడు 'దాదాభాయ్‌నౌరోజి'. ఇది బ్రిటీష్ సామ్రాజ్య చరిత్రలోనే నూతన అధ్యాయమును సృష్టించింది.

దాదాభాయ్ సూక్ష్మగ్రాహి. పాఠశాల విద్యలో అన్ని పరీక్షలలోనూ ప్రథమ శ్రేణి ఆ బాలునిదే. పాఠశాల విద్యానంతరం "ఎల్ఫిన్‌స్టన్" కాలేజీలో చేరి, స్కాలర్‌షిప్‌ను కూడా సంపాదించి, ప్రథముడుగా ఉత్తీర్ణుడవుతాడు. అదే కాలేజీలో అధ్యాపకునిగా నియమించ బడుతాడు, ఆ కాలేజీలో అధ్యాపకునిగా నియమించబడిన ప్రథమ భారతీయుడు ఆయనే. ఆ రోజులలో ఇంగ్లాండ్‌లోని భారతీయలను ద్వితీయ శ్రేణి పౌరులుగా పరిగణించేవారు. దాదాభాయ్ అక్కడి భారతీయులను సంఘటిత పరచి *'లండన్ ఇండియా సొసైటీ'* అనే సంస్థను స్థాపించుతాడు *"ఇండియన్ జర్నల్"* అనే పత్రికను కూడా ప్రారంభించి, అందులో అనేక వ్యాసములు వ్రాసి భారతీయులలో స్ఫూర్తిని, చైతన్యాన్ని కలుగజేస్తారు 'నౌరోజీ'. లండన్‌లోని ప్రముఖులు కొందరు నౌరోజీకి 'సర్' అనే బిరుదు యివ్వాలని భావిస్తారు. కాని నౌరోజీ దానిని తిరస్కరించి, ఆయనకు పదవీకాంక్ష లేదని నిరూపిస్తాడు 'నౌరోజీ'.

బ్రిటీష్ పార్లమెంట్ సభ్యుడుగా ఉన్నరోజులలో ఒకసారి ఆయన లండన్ నుండి బొంబాయికి ఓడలో వస్తారు. ఓడరేవులో అఖండ స్వాగతం యిస్తారు నాయకులు, ప్రజలు. ఆ తరువాత ఆయన విడిది చేయడానికి ఒక పెద్ద బంగళాను ఏర్పాటు చేస్తారు. అక్కడికి వెళ్ళకుండా, ఆయన తన పాత ఇంటికి వెళ్ళిపోతాడు. అది ఆయన నిరాడంబరతను సూచిస్తుంది.

ఆయన భారతజాతీయ కాంగ్రెస్‌కు మూడవసారి అధ్యక్షునిగా ఎన్నికైనప్పుడు, తన అధ్యక్షోపన్యాసంలో *"కలిసికట్టుగా పోరాడి స్వాతంత్ర్యాన్ని సంపాదించండి. భారత జనయిత్రికి అపూర్వ వైభవమును దక్కించండి. పాశ్చాత్య సభ్యజాతుల వలె ప్రతిష్ఠావంతులు కాండి. శాంతియుత పద్ధతులలో పోరాటాన్ని కొనసాగించండి. సహనం, నిర్భయత్వం మనకు పట్టుకొమ్మలు. నా దేశ ప్రజలకు ఇదే నా సందేశం"* అని ఉద్బోధించుతారు నౌరోజీ. ఆయన పారశీకుడైనప్పటికీ, భారత స్వాతంత్ర్యమహోద్యమంలో అగ్రస్థానాన నిలబడి, నిస్వార్థంగా పోరాడినవారిలో అతిముఖ్యుడు నౌరోజి.

1902 సం॥లో తన అభ్యుదయ ఆర్థిక విధానాలను వివరిస్తూ "Poverty and Un-British rule in India" అనే అపూర్వ గ్రంథమును రచించుతారు నౌరోజీ. ఆ గ్రంథంలో బ్రిటీష్‌వారు వాణిజ్యం పేరిట భారత ఆర్థిక వ్యవస్థను ఎలా ఛిన్నాభిన్నం చేసింది? భారత సంపదను ఎలా దోచుకున్నది? ఈ దేశ దారిద్ర్యానికి బ్రిటీష్ వారు అనుసరించిన

ఆర్థిక వలస విధానమేనని సహేతుకంగా వివరిస్తారు. ఆ గ్రంథం మంచి ప్రాచుర్యాన్ని పొందుతోంది. ఆ గ్రంథమును చదివిన ఆర్థికవేత్తలు నౌరోజీకి మించిన ఆర్థికవేత్త లేరని పొగుడుతారు. కేవలం ఆర్థిక, రాజకీయ విషయాలలోనే గాక విద్యావిషయాలలో కూడా ఆయన నిష్ణాతుడే. జాతీయ విద్యావిధాన ఆవశ్యకతను వివరిస్తూ 1882 సం॥లో భారతదేశానికి వచ్చిన 'ఎడ్యుకేషన్ కమిషన్' కు ఒక నివేదికను కూడా సమర్పించుతారు నౌరోజీ.

బాలుర వలె బాలికలు కూడా బడికి వెళ్లి చదువుకోవాలని ఆశించారు నౌరోజీ. అయితే బాలికలకు చదువెందుకు? చదువుకొని వాళ్లేమైనా ఉద్యోగాలు చేయాలా? అని భావించే రోజులు అవి. అయినప్పటికి నౌరోజీ సాహసం చేసి బొంబాయి నగరంలో ఒక బాలికల పాఠశాలను నెల కొలిపారు. అదే బొంబాయిలో వెలసిన మొట్టమొదటి బాలికల పాఠశాల. *'సమాచార్ దర్పణ్'* అనే గుజరాతీ పత్రికలో **"స్త్రీలకు విద్య ఆవశ్యకత"** అనే విషయం మీద ఎన్నో వ్యాసాలు వ్రాసి స్త్రీలలో చైతన్యాన్ని కలుగజేశారు 'నౌరోజీ'.

పచ్చని ఒళ్ళు, ఆకర్షణీయమైన కళ్ళు. అందమైన ఆ బాలుడు వచ్చాడంటే చాలు! అందరి కళ్ళు ఆ బాలుని మీదనే ఉండేవి. ఒకసారి ఒక పాఠశాలలో బహుమతిప్రదాన సభ జరుగుతున్నది. ఒక అందాల బాలుడు నిర్భయంగా ముందుకు వచ్చి మాష్టారు అడిగిన ప్రశ్నల కన్నింటికీ సమాధానం చెబుతాడు. ఆ సభలో ఉన్న ఒక ఆంగ్లేయుడు మెచ్చుకొని ఆ బాలునికి ఒక పతకాన్ని బహూకరించుతాడు. ఆ సభలోనే ఉన్న ఒక విదేశీ యాత్రికురాలు "మిసెస్ పోస్టన్" ఆ బాలుని చూచి ఆనందపడి, అతని తెలివితేటలు మెచ్చుకుంటూ తాను రచించిన "పశ్చిమ భారతం' అనే గ్రంథంలో ఆ 'అందాలబాలుని' గురించి ప్రస్తావిస్తుంది. ఆ అందాల బాలుడే పెరిగి పెద్దవాడై, భారతదేశ స్వాతంత్ర్యం కోసం, ఎనలేని త్యాగాలు చేసి తన 92వ ఏట అనగా 1919 సం॥లో పరమ పదించుతారు.

***భాషలు వేరైనా, మతాలు వేరైనా, ఈ పవిత్రగడ్డ మీద జన్మించిన వారందరూ ఈ భరతమాత బిడ్డలే! భారతీయులే! అనే సత్యాన్ని నమ్మి, ఈ భారతదేశ స్వాతంత్ర్యం కోసం తన సర్వస్వాన్ని సమర్పించి, భారతదేశ భీష్మాచార్యులుగాను,*** **"The Grand old man of India"** ***గాను భారత ప్రజల మన్ననలను, ఆదరాభిమానములను చూరగొనిన మహనీయుడు 'దాదాభాయ్ నౌరోజి'.***



### కాశీ హిందూ విశ్వవిద్యాలయ స్థాపకుడు

# పండిత మదనమోహన మాలవ్యా

పండిత మదనమోహన మాలవ్యా అనగానే కాశీ హిందూ విశ్వవిద్యాలయం మన కళ్ళముందు మెదులుతుంది. దానికి రూపకల్పన చేసి, స్థాపించి, అభివృద్ధి పరచి, జగద్విఖ్యాతి గాంచిన మహాసంస్థగా తీర్చిదిద్దిన మహామనీషి 'మాలవ్యా'. పేరెన్నికగన్న న్యాయవాదిగా, ఆదర్శ పత్రికా సంపాదకునిగా, బహుభాషాకోవిదుడుగా, అనర్గళ వక్తగా, అకుంఠిత దేశభక్తుడుగా అనన్య కీర్తి ప్రతిష్ఠల నార్జించారు 'మాలవ్యా'.

పవిత్ర గంగానదీ తీరముననున్న కాశీ మహానగరంలో హిందూ విశ్వ విద్యాలయాన్ని నెలకొల్పాలన్న మహదాశయం మాలవ్యా మనోవీథిలో మెరిసింది. అయితే అది అంత తేలికైన విషయం కాదని తెలిసి కూడా దేశమంతా 'జోలి' పట్టి తిరిగి సాధించిన మహామనీషి 'మాలవ్యా'. ఒకసారి దర్భాంగ మహారాజుగారి ఆస్థానంలో మాలవ్యా చేసిన భాగవత ప్రసంగాలను విని ముగ్ధుడై, మాలవ్యా తలబెట్టిన మహోన్నత కార్యమును తెలుసుకొని అక్కడికక్కడే 25 లక్షల రూపాయిల విరాళాన్ని ప్రకటించుతాడు ఆ మహారాజు. అంతేకాదు మాలవ్యాకు కుడి భుజంగా నిలచి 1 కోటి 34 లక్షల నిధి ప్రోగుపడేందుకు కారణభూతుడవుతాడు. కాశీ మహారాజును అర్థించి విశ్వ విద్యాలయానికి అవసరమైన, విశాలమైన స్థలాన్ని సేకరించుతారు 'మాలవ్యా'. గొప్ప ఆంగ్ల భాషా పండితునిగా పేరుగాంచిన సురేంద్రనాథ్ బెనర్జీని మొదటి ఇంగ్లీష్ ప్రొఫెసర్‌గా ఉచితంగా ఆ హిందూ విశ్వవిద్యాలయంలో పనిచేయడానికి ఒప్పించగలుగుతారు 'మాలవ్యా'.

1916 సం॥లో కాశీలో హిందూ విశ్వవిద్యాలయాన్ని స్థాపించుతారు 'మాలవ్యా. అప్పటి నుంచీ కష్టాలు ప్రారంభమవుతాయి. ఒకసారి ఒక కోటీశ్వరుడైన నవాబు

వద్దకు వెళ్లి విశ్వవిద్యాలయానికి సాయం అర్థించుతాడు. పిల్లికి బిచ్చం పెట్టని ఆ నవాబు తన వద్ద డబ్బులేదంటాడు. అయినా మాలవ్యా ఆయనను వదలకుండా, తన భుజం మీది అంగవస్త్రమును తీసి జోలెపట్టి ***"తమకు తోచింది యిప్పించండి. మీరేం ఇచ్చినా స్వీకరిస్తాను"*** అని వినయపూర్వకంగా అర్థిస్తాడు. ఆ నవాబుకు కోపం వచ్చి ***"ఇదిగో! ప్రస్తుతానికి ఇదే ఉంది! తీసుకో!"*** అంటూ తన కాలిబూటును తీసి జోలెలో వేస్తాడు. అదే మహా ప్రసాదం అన్నట్లు నమస్కరించి నిష్క్రమిస్తాడు మాలవ్యా. తగిన శాస్తి జరిగిందని ఆ నవాబు లోలోపల సంతోషించుతాడు. మరుసటి రోజు ఫలానా నవాబుగారి బూటు బహిరంగంగా వేలం వేయబడుతోందని పత్రికలలో ప్రకటించుతాడు 'మాలవ్యా'. ఆ ప్రకటన చూచిన నవాబుగారు కంగారుపడి, తన మనుషులతో పెద్ద మొత్తాన్ని చందాగా పంపించి, తిరిగి తన బూటును తెప్పించుకుంటాడు.

మరోసారి విరాళాల కోసం నిజాం ప్రభువు వద్దకు వెళ్ళుతాడు 'మాలవ్యా!'. ఆయనకు ఆశయం నచ్చినా, దానికి హిందూ విశ్వవిద్యాలయం, అన్న పేరుండటం వలన విరాళం యివ్వడానికి సంకోచించుతాడు నిజాము. అయితే ఆ సంస్థానము నుంచి వట్టి చేతులతో తిరిగి వెళ్లటం మాలవ్యాకు ఇష్టం ఉండదు. అదే రోజున హైద్రాబాద్‌లో ఒక ధనికుడైన హిందువు మరణించగా, అతని శవాన్ని స్మశానవాటికకు పెద్ద ఊరేగింపుతో తీసుకొని వెళ్ళుతుంటారు. దారి పొడవునా అభిమానులు ఆ శవం పైకి నాణాలు విసురుతుంటారు. మాలవ్యా ఆ ఊరేగింపు వెంట నడుస్తూ, క్రిందపడ్డ నాణాలను ప్రోగు చేసి తన సంచిలో వేసుకుంటుంటాడు. ప్రజలు నివ్వెరపోతారు. ఆ వార్త ఆనోట... ఆనోట... నిజాం ప్రభువుకు తెలుస్తుంది. సిగ్గుపడి మాలవ్యాను తన సంస్థానానికి పిలిపించుకొని, భూరి విరాళాన్ని అందిస్తాడు నిజాము ప్రభువు.

ఎన్ని కష్టాలు ఎదురైనా; ఎవరు ద్వేషించినా, నిరసించినా; వాటన్నింటినీ సహనంతో స్వీకరించి, తాను చేబట్టిన మహత్కార్యాన్ని సాధించిన సహనశీలి 'మాలవ్యా'. మాలవ్యా ప్రతిభా పాటవాలను తెలుసుకొని కాలాకంకర్ సంస్థానాధిపతి మాలవ్యాను ఆహ్వానించి 'ది హిందూస్థాన్' పత్రికకు సంపాదకునిగా ఉండమని కోరుతాడు. అయితే ఒక చిన్న షరతు పెడతాడు 'మాలవ్యా'. రాజుగారు మద్యం సేవించినప్పుడు తనను పిలిపించరాదన్నదే ఆ షరతు. మాలవ్యా సంపాదకత్వాన ఆ పత్రిక అతిత్వరలోనే బహుళ ప్రచారాన్ని పుంజుకుంటుంది. లాభాలు కూడా గడిస్తుంది. ఒకసారి అతిముఖ్య విషయమును గురించి చర్చించడానికి మాలవ్యాను రాజుగారు

పిలిపిస్తారు. రాజాగారి గదిలో ప్రవేశించే సరికి, ఆ రాజాగారు బాగా తాగివున్నట్లు గ్రహించుతాడు మాలవ్యా. వెంటనే తన షరతును గుర్తుచేస్తూ రాజీనామా వ్రాసి యిస్తాడు మాలవ్యా. తన తప్పను గ్రహించిన ఆ రాజు క్షమించమని ప్రాధేయపడుతాడు. అయినప్పటికీ తన నిర్ణయానికి తిరుగులేదని చెప్పి వెళ్లిపోతాడు మాలవ్యా. **స్వాభిమానం ముందు పదవులు, డబ్బు చాలా చిన్నవని భావించేవారు మాలవ్యా.**

ఒకసారి తన మిత్రులతో కలిసి విరాళములు కోసం అమృతసర్‌లోని ఒక పెద్దవ్యాపారి వద్దకు వెళ్ళుతారు మాలవ్యా. మధ్యాహ్నం అవుతుంది. ఆ వ్యాపారి అందరికీ మిఠాయి తెప్పించుతాడు. మాలవ్యా మాత్రం వాటిని ముట్టడు. తినమని వ్యాపారి బ్రతిమాలుతాడు. ఆనాడు సేకరించవలసిన లక్ష్యం పూర్తికాకుండా ఏ ఆహారం తీసుకో నంటాడు మాలవ్యా. వెంటనే ఆ వ్యాపారి ఆ రోజు లక్ష్యానికి మించిన మొత్తానికి 'చెక్' వ్రాసి యిస్తాడు. ఆ తరువాతనే మాలవ్యా ఆ మిఠాయిలను తింటాడు. అంతటి దీక్షతో, పట్టుదలతో కృషిచేశాడు గనుకనే, అంతటి మహా విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పగలిగాడు మాలవ్యా. ***కృషి వుంటే మనుషులు ఎంతటి అసాధ్యమైన పనులనైనా సాధించగలుగుతారని నిరూపించాడు మాలవ్యా. పట్టుదల వుంటే దేనినైనా సాధించవచ్చునని చేసి చూపించాడు మాలవ్యా.***

మల్లె పూవులాంటి తెల్లటి స్వచ్ఛమైన ఖద్దరు దోవతి, పొడుగాటి తెల్లటి చొక్కా, మెడలో బారైన ఉత్తరీయం, తలమీద పాగా, నుదుట బొట్టులతో భారతీయత ఆయనలో ఉట్టిపడుతుండేది. ఆయన ముఖవర్చస్సు చూడగానే ఆయన మహా పండితుడని భావించేవారు. నిజంగా ఆయన గొప్ప సంస్కృత విద్వాంసుడే. ***గాంధీజీ 'జాతిపిత' అయితే, మాలవ్యా 'జాతి ఉపదేశకుడు'.*** ఆయన స్థాపించిన కాశీ హిందూవిశ్వవిద్యాలయం ఎంత మంది మహనీయులను తయారుచేసిందో! మరి ఇంకా ఎంతమంది మహనీయులు అక్కడ తయారవుతారో! ఏదిఏమైనప్పటికీ ఆయన విద్యారంగానికి చేసిన సేవ అపారం, అత్యంత శ్లాఘనీయం.

---

"విజ్ఞానశాస్త్రం చదవడం ఎంత అవసరమో, వేద విజ్ఞానం తెలుసుకోవడమూ అంత అవసరమే. వేదవిజ్ఞానం తెలుసుకోవాలంటే సంస్కృతం రావాలి".

- మాలవ్యా



# బెంగాల్ టైగర్ అశుతోష్ ముఖర్జీ

"లండన్‌లో జరిగే ఏడవ ఎడ్వర్డు పట్టాభిషేక మహోత్సవానికి మీరు హాజరుకావాలి! ఇది మా కోరిక. మీరు తప్పకుండా లండన్ వెళ్ళాలి. ఇది మీ అదృష్టం. ఇది మీకు సమ్మతమే గదా?" అని అడుగుతాడు ఆనాటి వైస్రాయి.

"చాలా కృతజ్ఞుణ్ణి. కాని మ అమ్మ ఒప్పకోవాలి గదా! మొదట మా అమ్మకు ఈ విషయం చెబుతాను. ఆమె అనుమతిస్తే ఆ తరువాత నా అంగీకారం తెలుపుతాను" అంటాడు ఆ పెద్ద మనిషి.

"వైస్రాయి అభిమతాన్నే కాదంటున్నారా! మీరు?"

"అవును! మా అమ్మ తరువాతనే మీరు. మా అమ్మ అనుమతి లేకుండా నేను ఏ పనీ చేయను".

"మీరు ఎవరితో మాట్లాడుతున్నారో? తెలిసే మాట్లాడుతున్నారా?"

"బాగా తెలుసు! తమరు భారత దేశపు వైస్రాయి అని, తమ పేరు 'కర్జన్' అని కూడా తెలుసు".

"ఈ వైస్రాయి ఆజ్ఞాపించిన తరువాత కూడా, తమకు ఇంకా మరొకరి అనుమతి కావాలా?"

"లార్డ్ కర్జన్ కాదు గదా! అతనిని పుట్టించిన సృష్టికర్త ఆజ్ఞాపించినప్పటికి నాకు నా మాతృదేవి అనుమతియే ప్రధానము. తల్లికి మించిన దైవం లేదు. ఇది మా సంస్కృతీ సంప్రదాయం" అని చెప్పి రివ్వున ఛాంబర్ నుండి బయటకు వచ్చి తన కారులో వెళ్ళిపోతాడు. కర్జన్ నిశ్చేష్టుడైపోతాడు.

అంతటి ధీశాలి ఎవరో తెలుసా? కలకత్తా హైకోర్టులో పని చేస్తున్న ఒక న్యాయమూర్తి. ఆయన పేరే *అశుతోష్ ముఖర్జీ*. భారత పార్లమెంటులో ప్రతిపక్ష నాయకుడుగా చరిత్రను సృష్టించిన డా. శ్యాంప్రసాద్ ముఖర్జీ ఆయన కుమారుడే.

రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్య ప్రతినిధి ఆజ్ఞలకు తలవంచక తల్లి మాటకు విలువయిచ్చిన 'మాతృభక్తి' పరాయణుడు ముఖర్జీ. అందువలననే ఆయన అంతటి కీర్తిని పొందాడు. తల్లిని గౌరవించే పిల్లలకు కూడా అంతటి కీర్తి లభిస్తుంది. ఏ మాత్రం సందేహించకండి. తల్లిని ప్రేమించండి! గౌరవించండి, పూజించండి! తల్లిని మరువకండి!

ఒకసారి అశుతోష్ ముఖర్జీ, కలకత్తా వెళ్ళడానికి ఢిల్లీలో రైలు ఎక్కుతాడు. అది మొదటి తరగతి పెట్టె. అందులో ఒక మిలటరీ ఆఫీసర్ కూడా ప్రయాణిస్తుంటాడు. అతడు ఆంగ్లేయుడు. ముఖర్జీ ఎప్పుడూ ధోవతి కట్టుకొని, సాదా సీదా చొక్కావేసుకొని, పైన ఉత్తరీయము ధరించేవాడు. కాళ్ళకు చెప్పులు మాత్రమే ఉండేవి. అదే ఆయన వేషధారణ. ఆ వేషంతోనే మొదటి తరగతి పెట్టెలో ఎక్కుతాడు ముఖర్జీ. ఆ మిలటరీ ఆఫీసరుకు ఎక్కడ లేని కోపం వస్తుంది. ముఖం చిట్లించుకుంటాడు. ఆ రాత్రి ముఖర్జీ నిద్రపోతుండగా, ఆ తెల్లదొర ముఖర్జీ చెప్పలను చడీచప్పడు కాకుండా తీసి, కిటికీలో నుంచి బయటకు విసిరివేస్తాడు. తెల్లవారింది ముఖర్జీ లేస్తాడు. చెప్పలు కనిపించవు. జరిగిన విషయాన్ని ముఖర్జీ పసిగడతాడు. ఇంతలో కొంత సేపటికి ఆ మిలటరీ ఆఫీసర్ ముఖం కడుక్కోవడానికి వెళ్ళుతాడు. ఇదే మంచి తరుణమని భావించి, ఆ ఆంగ్లదొర హ్యాట్ (టోపి)ను కిటికీ గుండా బయటకు విసిరివేస్తాడు ముఖర్జీ. ఆ మిలటరీ ఆఫీసర్ వచ్చి తన హ్యాట్‌కోసం వెదుక్కుంటాడు, కనిపించదు. కోపంతో *'ఎక్కడ నా హ్యాట్?'* అని ముఖర్జీని అడుగుతాడు. ముఖర్జీ చాలా శాంతంగా *"హ్యాటా! నా చెప్పల్ని వెదికి తీసుకొని వచ్చేందుకు వెళ్ళింది!"* అంటాడు. ఆ తెల్లదొర ఉగ్రుడవుతాడు. కాని తమాయించుకొని, తాను చేసిన తప్పను తలచుకొని, ఏమీ మాట్లాడలేకపోతాడు.

ఏదైనా సంఘటన జరిగిన వెంటనే ఉద్రేకంతో స్పందించ కూడదు. సమయం చూచుకొని తగిన సమాధానం చెప్పాలి. దానినే *'కీలు ఎరిగి వాత పెట్టడం'* అంటారు. అదే చేసారు ముఖర్జీ. ఆయన సమయస్ఫూర్తి అంతటిది.

ప్రతిరోజూ తెల్లవారుజామునే లేచి, నదికి వెళ్ళి స్నానం చేసి, సంధ్యా వందన మాచరించి తిరిగి రావడం ముఖర్జీ అలవాటు. ఒకనాడు అదే విధంగా నది నుండి ఇంటికి తిరిగి వస్తుండగా ఒక ముసలమ్మ ఎదురుగా వచ్చి *"నాయనా! ఈ వేళ మాఇంట్లో ఒక వ్రతమున్నది. పొద్దుటి నుంచీ చూస్తున్నా! ఒక్క బ్రాహ్మణుడూ కనపడలేదు. మా ఇంటికి వచ్చి, పూజ చేయించి, పుణ్యం కట్టుకోబాబూ!"* అని బ్రతిమలాడుతుంది. *'సరే!'* అని ఆ ముసలమ్మతో పాటు వాళ్ళింటికి వెళ్ళి, యధావిధిగా పూజ చేయిస్తాడు ముఖర్జీ. ఆ ముసలమ్మ సంతోషించి దక్షిణాలు, బియ్యమూ ముఖర్జీకి యివ్వబోతుంటే, ప్రక్క ఇంటి ఆయన వచ్చి *"బామ్మగారూ! ఆయనెవరో తెలుసా? హైకోర్టు జడ్జీ అశుతోష్ ముఖర్జీ గారండీ!"* అని అంటాడు. ఆ ముసలమ్మ నిర్ఘాంత పోతుంది. నోట వెంబడి మాటపెగలదు. అంతలో ముఖర్జీ *"హైకోర్టు జడ్జీనయినా, నేనూ ఒక బ్రాహ్మణ్ణే. దక్షిణ తీసుకోవడం తప్పా?"* అంటూ ఆ ముసలమ్మయిచ్చిన దక్షిణాలనూ, బియ్యాన్ని తన ఉత్తరీయంలో మూట కట్టుకొని ఇంటి ముఖం పడుతాడు ముఖర్జీ. ఈ సంఘటన ఆయన నిరాడంబరతనే గాక, సంస్కృతీసంప్రదాయముల యెడల ఆయనకు వున్న విశ్వాసమును కూడా చాటుచున్నది.

*'బెంగాల్ టైగర్'*గా పేరుగాంచిన అశుతోష్ ముఖర్జీకి విశ్వవిద్యాలయముల యెడల అమితమైన గౌరవముండేది. విశ్వవిద్యాలయములు ***"గులామ్ ఖానాలు"*** (బానిసల భవనాలు) కాకూడదని స్వాతంత్ర్యోపాసకుల ఆలయాలు కావాలని ఆశించేవారు. 1923 సం॥లో జరిగిన కలకత్తా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సభలో, అప్పటి వైస్రాయి లార్డ్ లిట్టన్ ఎదుట ఉపన్యసిస్తూ **"Freedom first, freedom second, freedom always nothing else will satisfy me"** అని గర్జించిన దేశ భక్తుడు ***అశుతోష్ ముఖర్జీ.***

1894 సం॥లో 'డాక్టర్ ఆఫ్ లా'ను సంపాదించి, 1898 సం॥లో కలకత్తా విశ్వవిద్యాలయంలో 'లా' ప్రొఫెసర్‌గా చేరారు. నలభై ఏళ్ళ వయసయినా రాకముందే 1904 సం॥లో కలకత్తా హైకోర్టులో న్యాయమూర్తిగా నియమితులయ్యారు. ఆ పదవిలోనే కొనసాగుతూ 1920 సం॥లో కొద్దికాలం పాటు ప్రధాన న్యాయమూర్తిగా పనిచేసి

ఐచ్ఛికంగా పదవీ విరమణ చేస్తారు. కలకత్తా విశ్వవిద్యాలయ సెనెట్ సభ్యుడుగా కూడా కొంతకాలం ఉంటారు. 1906 సం॥ నుంచి 1914 సం॥వరకు కలకత్తా విశ్వవిద్యాలయానికి వైస్‌ఛాన్సలర్‌గా ఉండి అత్యంత ఆదర్శ విశ్వవిద్యాలయంగా రూపొందించుతారు అశుతోష్.

అశుతోష్ ముఖర్జీకి గ్రంథపఠనయందు అత్యంత ఆసక్తి. ఆంగ్ల, సంస్కృత, ఫ్రెంచిగ్రంథాలనెన్నో సేకరించారు. 85వేలకు పైగా పలుభాషా గ్రంథాలను ఆయన సేకరించారట. సేకరించటమే కాదు, సేకరించిన ప్రతి గ్రంథాన్ని ఆసక్తితో చదివేవారుట. ఆయన మరణానంతరం ఆ గ్రంథ భాండారాన్ని వారి కుమారులు కలకత్తాలోని జాతీయ గ్రంథాలయానికి దానంగా ఇచ్చారు.

కలకత్తా హైకోర్టు న్యాయమూర్తిగా, కలకత్తా విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్‌గా ఆయన చేసిన కృషి అత్యంత ప్రశంసనీయం. ఆయన మొదటి నుంచీ సర్వస్వతంత్రుడు. ఆయనది తలవంచే మనస్తత్వం కాదు. తాను విశ్వసించినదానిని నిర్భయంగా, నిర్మొగమాటంగా చెప్పేవాడు. పదవుల కోసం ఆయన ఎన్నడూ ప్రాకులాడలేదు. పదవులే వచ్చి ఆయనను వరించినాయి. పదవులెన్ని అలంకరించినా ఆయనలో అహంకారంగాని, ఆడంబరంగాని కనిపించేది కాదు. జన్మనిచ్చిన తల్లిని ఎంత ప్రేమించి, గౌరవించేవాడో, జన్మించిన దేశమును కూడా అంతే ఆరాధించేవాడు *అశుతోష్ ముఖర్జీ.*

ఆ మహనీయుని అడుగు జాడలలో నడుద్దాం, ఆయన ఆశయ, ఆదర్శములను ఆచరణలో పెడుదాం. నవభారత నిర్మాణానికి కృషిచేద్దాం.



"మనిషికి ధనం కాదు, నీతి ముఖ్యం. వేషంకాదు, నిజాయితీ ముఖ్యం. చదువుకాదు, సంస్కారంముఖ్యం. మాతృభక్తి, మాతృదేశభక్తి అందరికీ ముఖ్యం".

– అశుతోష్ ముఖర్జీ



# మౌలానా అబుల్ కలామ్ అజాద్

కలంపేరుతో అనేక విమర్శలు వ్రాస్తూ, ఒక పత్రికను నడుపుతున్న వ్యక్తికి వార్షికోత్సవానికి లాహోర్ రమ్మనమని ఒక సాంస్కృతిక సంస్థ ఆహ్వానం పంపుతుంది.

నిర్భయంగా, నిర్మొగమాటంగా, అందరినీ ఆకట్టుకొనే విధంగా వ్రాసే ఆ వ్యక్తిని చూడాలని, ఆయన ఉపన్యాసం వినాలనే కుతూహలంతో ఎందరో పెద్దలు, పండితులు ఆ సభకు వస్తారు. ఆ ఉపన్యాసకుడ్ని చూచి ఆశ్చర్యపోతారు. ఎందువలనంటే, అతడు 16 ఏండ్ల యువకుడు. అతని ఉపన్యాసం విని అందరూ మెచ్చుకుంటారు. ఉర్దూ అరబ్బీ, పారశీక భాషలలో ఆ యువకుడు ప్రదర్శించిన పాండిత్యమును తర్కము, వేదాంతము మొదలగు విషయాలలో అతని ప్రావీణ్యతను చవిచూచిన సభికులు, ఆ యువకుని ఎంతగానో ప్రశంసిస్తారు.

ఆ యువకుడి పేరే **"మౌలానా అబుల్ కలామ్ అజాద్"**. **"మౌలానా"** అన్నది మతపరమైన బిరుదు. **'అబుల్ కలామ్'** అతని ఇంటిపేరు. 'అజాద్' అనునది అతని కలంపేరు. ఇతని అసలు పేరు **'యెహో ఉద్దీన్ అహ్మద్'** ఇతని చారిత్రక నామధేయం **'ఫిరోజ్ భక్త్'**.

వీరి కుటుంబం, మొగలాయి చక్రవర్తి 'షాజహాన్' పరిపాలనా కాలంలో హీరట్ నుండి భారత దేశానికి వలస వచ్చింది. 'అజాద్' తాతగారు 'మహ్మద్‌హాథీ' ఆగ్రాకోట గవర్నరుగా పని చేసారు. 'ఆజాద్' తండ్రి మౌలానా ఖైరుద్దీన్ మంచి ఇస్లాం మత తాత్వికుడు, సూఫీమత ప్రచారకుడు. ఈయన పవిత్ర పుణ్యక్షేత్రాలైన మక్కా, మదీనాలు సందర్శించడానికి వెళ్ళగా, ఆయన ప్రతిభా విశేషాలను, అచటి మౌలాలు గుర్తించి

గౌరవిస్తారు. అక్కడనే ఒక సంపన్న అరబ్బు కుటుంబానికి చెందిన వనితతో వివాహం జరుగుతుంది. 1888 సం॥ నవంబరు 11వ తేదీన, మక్కాలో ఆ దంపతులకు 'ఆజాద్' జన్మిస్తాడు. ఎనిమిది సంవత్సరాల వరకూ అక్కడనే వుండటం వలన అరబ్బీ భాష నేర్చుకుంటాడు. ఆ తరువాత 'మౌలానా ఖైరుద్దీన్' కుటుంబం మక్కా నుండి కలకత్తా వచ్చి స్థిరపడుతుంది.

అజాద్ సాహిత్య కృషివలుడు. చిన్ననాటి నుంచే అనేక రచనలు చేసి, ప్రముఖ ఉర్దూ పండితుల ప్రశంసలను కూడా అందుకొనినాడు. 1912 సం॥లో 'అల్-హిలాల్' అనే పత్రికను ప్రారంభించి, ముస్లీం సోదరులు జాతీయ జీవన స్రవంతిలో విలీనమై, హిందువులతో కలిసి, ఐకమత్యంతో, బ్రిటీష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడాలని, ఆ పత్రిక ద్వారా ప్రచారం చేసేవాడు 'అజాద్'. ముస్లీం సోదరులు జాతీయ ఉద్యమంలో పూర్తిగా విలీనం కావాలని ప్రకటించిన మొదటి ముస్లీం **'మౌలానా అజాద్'.**

1923 సం॥లో, తన 35వ యేట ఢిల్లీలో జరిగిన కాంగ్రేస్ ప్రత్యేక సమావేశానికి అధ్యక్షత వహించి, ఆనాడు 'అజాద్' చేసిన ప్రసంగం యావత్ భారత జాతినీ ఆకట్టుకున్నది. ***"మీకు రెండు గంటలలో స్వరాజ్యం ఇస్తాము. కాని హిందూ-ముస్లీం ఐక్యతను విడనాడాలి అంటే, అందుకు నేను సుతరామూ అంగీకరించను. స్వరాజ్యమునైనా వదలుకుంటాను గాని, హిందూ-ముస్లీం సమైక్యతను మాత్రం విడువను. స్వరాజ్యం ఆలస్యమైతే, అది భారత దేశానికి కొంత నష్టాన్ని కలిగిస్తుంది. కాని హిందూ-ముస్లీం ఐక్యతను విడనాడితే మానవతకే ముప్పువాటిల్లుతుంది"*** అని అజాద్ నిర్భయంగా ప్రకటిస్తాడు. హిందూ-ముస్లీం సమైక్యత కోసం, తుదిశ్వాస విడిచేవరకు పోరాడిన గొప్ప దేశభక్తుడు 'అజాద్'.

భారతదేశంలో ఎన్ని మతాలున్నా, ఎన్ని ఆరాధనా కేంద్రాలున్నా, ఎవరు ఏ దేవుడ్ని ఆరాధించినా, భారతదేశంలో నివసించే వారందరూ ఒకే జాతికి చెందినవారని, వారందరూ భారతీయులే అనే విశ్వాసం కలిగి ప్రవర్తించాలని, ఆఖరి క్షణంవరకూ అవిశ్రాంతంగా పోరాడిన అకుంఠిత దేశభక్తుడు **'మౌలానా అబుల్ కలామ్ అజాద్'.**

అజాద్ తన సుదీర్ఘ రాజకీయ జీవితంలో 20 సంవత్సరాల పాటు కారాగార శిక్షను అనుభవించారు. ఆయన జైలులో వుండగానే 1943 సం॥లో భార్య మరణిస్తుంది.

భార్యను కడసారి చూచుకోలేకపోయిన నిర్భాగ్యుడు అజాద్. అయినప్పటికీ ఆత్మవిశ్వాసాన్ని ఆయన ఏ మాత్రం కోల్పోలేదు. స్వాతంత్ర్యానంతరం స్వతంత్ర భారత్‌లో విద్యా శాఖా మంత్రిగా పదవీ బాధ్యతలను స్వీకరించి విద్యారంగానికి ఎనలేని సేవచేసారు అజాద్. జాతీయ విద్యావిధానానికి, సాంకేతిక విద్యావ్యాప్తికి ఆయన చేసిన కృషి ప్రశంసనీయం. భారత రాజ్యాంగ నిర్మాతలలో ఆయన ఒక ప్రముఖుడు. 1958 సం॥ ఫిబ్రవరి 22న పరమపదించుతారు 'అజాద్'.

భారతదేశ స్వాతంత్రోద్యమంలో ఆ మహనీయుడు చేసిన త్యాగాలు, స్వాతంత్ర్యానంతరం ఆయన చేసిన సేవలు, చరిత్రలో శాశ్వతంగా నిలిచి, భావితరాల వారికి స్ఫూర్తిని, శక్తిని సమైక్యతను ప్రబోధిస్తూనే ఉంటాయనటం ఏ మాత్రం అతిశయోక్తి కాదు. **'హిందూ-ముస్లీం సమైక్యత'** ఆయన మనకు అందించిన మహత్తర సందేశం. నేటి పరిస్థితులలో ఆయన అందించిన ఆ సందేశం భారతావనికి ఎంతయో అవశ్యకమైనది. ఆ సందేశమును ఆచరణలో పెట్టి, భారతదేశ సమైక్యతను, సమగ్రతను కాపాడుకుందాం. అదే మన ధర్మం, అదే మన కర్తవ్యం.



---

"మతాలు వేరుకావచ్చు. కాని అవి ప్రతిపాదించే సత్యం ఒక్కటే. మత సిద్ధాంతాలు భిన్నంగా కనిపించవచ్చు. వాటి అంతిమ ధ్యేయం మాత్రం ఒక్కటే. ఎన్నో పేర్లతో భగవంతుని పిలువవచ్చు. కాని ఆ భగవానుడు ఒక్కడే. మానవునికి మోక్షమార్గాన్ని చూపించేది మతం. నైతిక, ఆధ్యాత్మిక విలువలను పెంపొందించేది మతం, మతాలు వేరైనా మనది ఒకేజాతి. మనమంతా భారతీయులం".

**- మౌలానా అబుల్ కలాం అజాద్**



## స్వాతంత్ర్య సమరయోధుడు

# దామోదర వీరసావర్కర్

*"ఒక మాదిగ కులస్థుడు ముస్లిముగా గాని, క్రైస్తవుడుగా గాని మారితే, అతనిని నీతో సమానంగా చూస్తావు గాని, మాదిగ వాడిగ అతనిని వెలివేస్తావు. ఇది ఎంత సిగ్గుచేటో మీరు ఆలోచించటంలేదు".*
అని అంటాడు ఒక ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు.

*'మతానికి మూలం కంచమూ కాదు, కడుపూ కాదు! హృదయమూ, ఆత్మ దానికి వేళ్ళు"* అని ప్రబోధిస్తాడు.

మతమౌఢ్యాన్ని, మూఢనమ్మకాలను దూరం చేయడానికి, హిందువులను చైతన్యవంతులుగా తయారుచేయడానికి ఎంతో కృషిచేశాడు. హిందూ సమాజాన్ని సంస్కరించడానికి నడుం బిగించాడు ఆయన. అంటరానితనాన్ని నిర్మూలించడానికి శ్రమించిన గొప్ప సంస్కర్త ఆయన. ఆనాటి విద్యాలయాలలో ఈ అంటరానితనం ఎక్కువగా ఉండేది. మాదిగ, మాలల పిల్లలను తరగతి గదులలో విడిగా కూర్చోబెట్టే రోజులవి. ఆ పద్ధతిని చూచి ఆయన హృదయం పరితపించింది. ఈ ఛాందస ప్రవృత్తిని మటుమాయం చేయాలని సంకల్పించుకున్నాడు ఆయన. హిందూ సమాజంలో సమన్వయాన్ని, సమానత్వాన్ని సాధించడాని కోసం ప్రచారం ప్రారంభించాడు. మహారాష్ట్ర లోని రత్నగిరి జిల్లాలో పతితపావన మందిరమును కట్టించి, దానికి పూజారిగా ఒక హరిజనుణ్ణి నియమించిన గొప్ప సంస్కర్త ఆయన. కులాల మధ్య వైషమ్యాలు, హెచ్చు తగ్గులు తగ్గించడానికి 1930 సం॥లోనే సహపంక్తి భోజనాలను ప్రోత్సహించిన మహనీయుడు ఆయన. ఆనాడు హిందూ సమాజంలో పేరుకొని పోయిన సాంఘిక

దురాచారాలను ధైర్యంగా ఎదిరించి, సంస్కరణోద్యమాన్ని చేబట్టిన ప్రముఖ సాంఘిక సంస్కర్త. ఆయన పేరు తెలుసుకుంటే చాలా మందికి ఆశ్చర్యం వేస్తుంది. అయితే చాలామంది భావించినట్లుగా ఆయన ఛాందసుడు కాదు, అభ్యుదయవాది. ఆయన ఒక్క స్వాతంత్ర్య సమర రథసారథేకాదు. సాంఘిక దురాచారాలను పారద్రోలడం కోసం నిరంతరం శ్రమించిన గొప్ప సంస్కర్త. ఆయనే ***వినాయక దామోదర వీరసావర్కర్.***

ఆ రోజులలో ఉరికంబమెక్కడం, యావజ్జీవ కారాగార శిక్షను అనుభవించడం, ప్రథమ శ్రేణి స్వాతంత్ర్య వీరులని భావించేవారు. ఆనాడు అతను యిచ్చిన ఉపన్యాసాలు, వ్రాసిన వ్రాతలు ప్రజలను రెచ్చకొట్టేవిగా వున్నాయని, యుద్ధానికి పురిగొల్పేవిగా ఉన్నాయని, బ్రిటీష్ ప్రభుత్వం భావించి 68 రోజుల పాటు విచారణచేసి అతనికి యావజ్జీవ కారాగార శిక్ష విధించింది. జాన్సన్ హత్యతో అతనికి సంబంధమున్నదని భావించి, మరల వెంటనే ది. 30-1-1911లో మరో యావజ్జీవ కారాగార శిక్షను కూడా విధించింది ఆంగ్ల ప్రభుత్వం. ఒకే వ్యక్తికి, కొద్ది సమయంలో రెండు యావజ్జీవ శిక్షలను విధించడం, విడ్డూరమని ఆనాటి ప్రపంచ న్యాయవేత్తలు భావించారు. అప్పుడు ఆయన వయస్సు 27 సంవత్సరములు. మొత్తం 50 ఏండ్లు శిక్షను అనుభవించడానికి ధైర్యంగా, సంతోషంగా ముందుకు నడుస్తూ ***"రెండు యావజ్జీవ కారాగార శిక్షలను నాకు విధించి, పునర్జన్మ ఉన్నదని బ్రిటీష్‌ప్రభుత్వం ఒప్పుకున్నట్లయింది. అది చాలు నాకు"*** అని చమత్కరిస్తారు సావర్కర్. బాధలను కూడా సంతోషంగా స్వీకరించడం ఆయనకు అలవాటు అయింది. ఈ రెండు యావజ్జీవ శిక్షలను అనుభవించడానికి అండమాన్ జైలుకు పంపుతుంది ఆనాటి ఆంగ్ల ప్రభుత్వం.

అండమాన్ జైలులో ఉన్న ఖైదీలు సావర్కర్ రాకను సంతోషంగా స్వీకరిస్తారు. ఆయన రాకతో దుర్భర జైలు జీవితం కొంతవరకు మెరుగవుతుందని వారు భావిస్తారు. అక్కడ శిక్షను అనుభవిస్తున్న ఖైదీల చేతులకు, కాళ్లకు ఇనుప గొలుసులను వేసి నడిపించేవారుట. ఆ రాపిడికి చర్మం చిట్లి రక్తం ప్రవహిస్తున్నా, జైలు అధికారులు కొరడాలతో వీపులమీద కొడుతూ, ఆ ఖైదీలచేత బరువులు మోయిస్తుండేవారుట. ఆ అకృత్యాలను చూచి సింహంలా గర్జిస్తాడు వీరసావర్కర్. అక్కడి పరిస్థితి మెరుగు పరచడానికి ప్రయత్నిస్తాడు. నూనె గానుగ త్రిప్పడం లాంటి పనులు తాను ఎన్నడూ చేయనప్పటికీ, తోటి ఖైదీలతో ఆ పనికూడా చేసేవాడు సావర్కర్. పనిచేస్తూ కవిత్వం

చెప్పేవాడు. వ్రాయడానికి కలాలు, కాగితాలు లేవుగదా! సన్నటి గులక రాళ్లను తీసుకొని తెల్లటి జైలుగోడల మీద వ్రాసి, ఆ ఖైదీలందరి చేత ఆ కవితలను కంఠస్తం చేయించేవాడు. విడుదల అయిపోయేవారు, ఆ కవితలను బయటనున్న వారికి వినిపించి, సావర్కర్ స్ఫూర్తిని, ఆలోచనను బయట ఉన్న ఆనాటి యువతరానికి అందించమని కోరేవాడు. ఎక్కడో! అండమాన్ జైలులో వుండి కూడా, బయట ఉన్న యువతరంలో స్వాతంత్ర్య బీజాలను నాటే ప్రయత్నం చేసేవారు.

ఇండియాలో తిరిగి విచారణ జరిపించడానికి సావర్కర్‌ను ఓడ ఎక్కిస్తారు. ఓడ వెళ్ళుతూ ఉంటుంది. మార్సెల్స్ సమీపానికి ఆ ఓడ వస్తూ ఉంటుంది. సావర్కర్ మెదడులో మెరుపులా ఒక ఆలోచన తడుతుంది. కాలకృత్యాలు తీర్చుకుంటానికి ఇన్‌స్పెక్టర్‌తో చెప్పి మరుగు దొడ్డిలోనికి వెళ్ళుతాడు. ఆ గది పైనున్న అద్దంలో నుంచి రక్షకభటులు, సావర్కర్ ఏమి చేస్తున్నాడో కనిపెడుతూనే ఉంటారు. అయితే సావర్కర్ తన చొక్కాను విప్పి అద్దానికి అడ్డంవేస్తాడు. మరుగుదొడ్డిలో వున్న గొట్టం ద్వారా సముద్రంలోనికి జారిపోతాడు. సావర్కర్ ఎంతసేపటికి బయటకు రాకపోవడంతో, రక్షకభటులు ఆ మరుగుదొడ్డి తలుపులు పగులగొడుతారు. సావర్కర్ కనిపించడు. వెంటనే ఆ రక్షకభటులు ఓడ ఉపరితలానికి వెళ్ళి బైనాక్యులర్స్ ద్వారా పరీక్షిస్తారు. సముద్రంలో సావర్కర్ ఈదుకుంటూ వెళ్తూ ఉంటాడు. రక్షకభటులు తుపాకులు కాలుస్తూ వెంబడిస్తుంటారు. ఆ తుపాకిగుండ్ల వర్షము నుండి తప్పించుకుంటూ, ఈదుతూ మార్సెల్స్ (ఫ్రెంచి) రేవుకు చేరుతాడు. రక్షకభటులు సావర్కర్‌ను వెంబడిస్తుంటారు. ఏదైనా బండిగాని, ట్రాముగాని ఎక్కి పారిపోవడానికి అతని వద్ద పైసలు ఉండవు. భారతదేశం రత్నగర్భ. భారతమాత సుసంపన్నురాలు కాని ఆ ముద్దుబిడ్డ వద్ద ఆ రోజున ట్రాము ఎక్కిపోవడానికి పైసలుండవు. భరతమాత సంకెళ్ళను త్రెంచివేయడానికి కంకణధారి అయిన ఆ దేశభక్తునికి సహకారం అందించేవారే కనిపించరు. అది నిజంగా దురదృష్టకరమే. సావర్కర్ ఆ క్షణంలో పడిన వేదన, ఆవేదన చేసిన ఆక్రందనను వర్ణించడం ఎవరికైనా అసాధ్యం.

ఇంతలో *దొంగ! దొంగ!* అంటూ బ్రిటీష్ సైనికులు వెంబడిస్తుంటారు. మధ్యలో కనిపించిన ఫ్రెంచిపోలీస్‌కు డబ్బులిచ్చి, మభ్యపెట్టి సావర్కర్‌ను పట్టుకొని మళ్ళీ ఓడలో

ఎక్కిస్తారు. ఇది అంతర్జాతీయ న్యాయ శాస్త్రసూత్రాలకు పూర్తిగా విరుద్ధమే అయినప్పటికీ ఆనాడు వినేదెవరు? ఆ నిర్భాగ్యుని రోదన ఎవరికి వినపడుతుంది? తిరిగి విచారించి, యావజ్జీవ కారాగార శిక్షను విధించి, ఆ వీరుణ్ణి అండమాన్స్ పంపిస్తారు. 1911సం॥ చివరలో అండమాన్ వెళ్లిన ఆ యోధుడ్ని భారత ప్రజల ఆందోళన ఫలితంగా 1921లో మే 2వ తేదీన ఓడ ఎక్కించి ఇండియాకు తీసుకొనివచ్చి రత్నగిరి జైలులో ఉంచుతారు. ఆ జైలులో ఉండగానే "హిందూత్వం" అనే గొప్ప గ్రంథమును వ్రాసాడు సావర్కర్. ఆ గ్రంథం భారతదేశ చరిత్రలో గొప్ప స్థానమును అలంకరించింది.

భారతదేశ స్వాతంత్ర్య సముపార్జన కోసం అంతర్జాతీయ స్థాయిలో విప్లవోద్యమం నిర్వహించిన ప్రథమ భారతీయుడు, దేశస్వాతంత్ర్య సాధన ప్రయత్నంలో విశ్వవిద్యాలయ పట్టాను త్యాగంచేసిన ప్రథమ పట్టభద్రుడు, ఆంగ్లచక్రవర్తికి విధేయత ప్రకటించడానికి తిరస్కరించి, న్యాయవాదపట్టాకే తిరస్కారం పలికిన ప్రథమ భారతీయ విద్యార్థి, అస్పృశ్యతా నివారణకు, కులరహిత సమాజనిర్మాణానికి ఒక సంచలనాత్మక ఉద్యమాన్ని ప్రారంభించిన గొప్ప సంస్కర్త, సంపూర్ణస్వాతంత్ర్యమే భారత ప్రజల ఏకైక ధ్యేయమని ఎలుగెత్తి చాటిన మొట్టమొదటి రాజకీయ నాయకుడు వీరసావర్కర్. 1966 సం॥ ఫిబ్రవరి 26న పరమపదించారు.

ఆ మహనీయుని పంథాలో స్వాతంత్ర్య ఉద్యమం నడిచి వుండినట్లయితే మనదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం లభించి ఉండేదేమో! కులమత ద్వేషాలకతీతంగా సమసమాజస్థాపన జరిగి ఉండేదేమో! ఏ జాతి అయితే తన గత చరిత్ర నుంచి గుణపాఠాలు నేర్చుకుంటుందో! ఆ జాతికే ఉజ్వల భవిష్యత్తు ఉంటుంది, విస్మరించకండి!

---

"మనస్సు నిశ్చలంగా వుంటే, ఎలాంటి సంకట పరిస్థితులలోనయినా ధైర్యం కలుగుతుంది. ధైర్యశాలురు మాత్రమే లోకంలో కార్యసిద్ధిని పొందుతారు. ధైర్యం విడిచినవారు ఏ ప్రయత్నమూ చేయలేరు. అధైర్యం అనేక అనర్థాలకు దారితీస్తుంది. ధైర్యవంతుడు ఒక్క పర్యాయం మాత్రమే మరణించును. భీరువు జీవితంలో అడుగడుగునా మరణిస్తునే ఉంటాడు. ధైర్యవంతుడు కీర్తిని పొందుతాడు. అధైర్యవంతుడు బ్రతికి ఉన్నా మరణించినట్లే".

**- దామోదర వీరసావర్కర్**



# స్వామీ వివేకానంద

హైందవ విజ్ఞానజ్యోతిని వెలిగించి, విశ్వనేత్రం తెరిపించిన మహాప్రవక్త, హిందూధర్మ సంస్కృతీ పరంపరల ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటిన మహనీయుడు, ఆధ్యాత్మిక ధర్మ శంఖారావంతో భారతజాతినేగాక, యావత్ ప్రపంచ ప్రజలను చైతన్య వంతులను గావించిన మహాతత్త్వవేత్త. అజ్ఞానమనే కారుమబ్బులు అవనిని ఆవరించిన సమయంలో, జ్ఞానబోధచేసి, అజ్ఞానమనే అంధకారమును పారద్రోలిన జ్ఞాన భాస్కరుడు, తన ఉపన్యాసాల ద్వారా ప్రపంచ ప్రజలను ఉత్తేజపరచి మంత్రముగ్ధులను గావించిన మహోపన్యాసకుడు, వందలాది సంవత్సరాలు విదేశీ దాస్యశృంఖలాల మధ్యపడి, నలిగి పతనమైన భారతజాతిని జాగృతమొనర్చి, ఆత్మవిశ్వాసాన్ని కలుగజేసిన ధీశాలి, ముఖ్యంగా పాశ్చాత్య ప్రజలలో, భారతావని యెడల గౌరవాదరాభిమానములను యినుమడింపజేసిన హైందవ తేజోరాసి 1863 సం॥ జనవరి 12వ తేదీన, సిమ్లాలో విశ్వనాధదత్తు, భువనేశ్వరీదేవి పుణ్యదంపతులకు జన్మించినాడు. అతని అసలు పేరు నరేంద్రుడు. సన్యాసం స్వీకరించిన తరువాత వివేకానందుడైనాడు. అతనే **స్వామీ వివేకానంద**. ఆయన ఆధ్యాత్మిక గురువే **'రామకృష్ణ పరమహంస'.**

నరేంద్రుడు చిన్నప్పటి నుంచి సత్యవాది. తాను నిజమని నమ్మినదానిని నిర్భయంగా చెప్పటం అతని ప్రవృత్తి. అతడు విద్యార్థిగా వుండే రోజులలో, ఒకసారి ఒక సంఘటన జరిగింది. పాఠశాలలో బెల్లుకొట్టారు. భూగోళశాస్త్రం బోధించే ఉపాధ్యాయుడు తరగతి గదిలో అడుగుపెట్టారు. ఆయనంటే పిల్లలందరికీ సింహస్వప్నం. కోపంవస్తే, గొడ్డును బాదినట్లు, ఆయన పేంబెత్తంతో పిల్లలను కొట్టేవాడు. అందుకనే ఆయనంటే అంత భయం. ఆ రోజు ఆయన పాత పాఠంలోంచి ప్రశ్నలు వేస్తూ, నరేంద్రుడిని కూడా ఒక ప్రశ్న అడిగాడు. నరేంద్రుడు సరిగ్గా సమాధానం చెప్పాడు. కాని అది తప్పని ఆ ఉపాధ్యాయుడు భావించాడు.

*"ఏరా! సరీగ్గా చెప్పు!"* అన్నాడు ఉపాధ్యాయుడు.

*"సరిగ్గానే చెప్పాను, సార్!"* అన్నాడు నరేంద్ర

*"సరిగ్గా చెప్పకుండా సరిగ్గానే చెప్పాననంటావా?"* అంటూ ఉపాధ్యాయుడు తన చేతిలోని బెత్తానికి పనిచెప్పాడు. దెబ్బలు తింటూ కూడా *"నేను సరిగ్గానే చెప్పాను, సార్"* అన్నాడు నరేంద్రుడు.

ఆ మాటలు వినిపించుకోకుండా, చేతులు నొప్పెక్కేంతవరకు ఆ బాలుని కొట్టి, కుర్చీలో కూర్చున్నాడు. కొంచంసేపు ఆలోచించి, నరేంద్రుని దగ్గరకు పిలిచి *"నువ్వు చెప్పింది రైటు. నిన్ను కొట్టినందులకు విచారిస్తున్నా!"* అన్నాడు ఉపాధ్యాయుడు. మాష్టారు మాటలు విని నరేంద్రుడు సంతోషించాడు, పిల్లలంతా చప్పట్లు కొట్టారు.

ఒకసారి వివేకానందుడు ఆళ్వారు సంస్థానం దివాన్‌గారింటికి వెళ్ళుతాడు. ఆయన్ని చూడటానికి ఆళ్వారు మహారాజు కూడా అక్కడికి వచ్చారు. వివేకానందుడ్ని ఒక ప్రశ్న అడుగుతారు అళ్వారు మహారాజు. *"స్వామీ! మన భారతీయులు బాతిని, రప్పను; చెట్టును, పుట్టను పూజిస్తుంటారు. ఇది ఛాందస ప్రవృత్తి కాదా?"* అని అడుగుతాడు. వెంటనే జవాబు చెప్పడు వివేకానందుడు. కొంతసేపటికి దివాన్ గారిని పిలిచి *"అయ్యా! ఆ గోడకు తగిలించివున్న పటాన్ని ఇలా తెస్తారూ!"* అని అడిగాడు. దివాన్ తీసుకొని వచ్చాడు. అది అళ్వారు మహారాజుగారి పటమే.

*"ఇదిగో, మీరంతా ఈ పటంమీద ఉమ్మేయండి!"* అని అక్కడ కూర్చొని వున్న వారిని అడుగుతాడు వివేకానందుడు. వారందరూ తెల్లబోయారు. భయపడి ఎవ్వరూ ముందుకు రారు. ఒక పెద్దమనిషి లేచి *"ఇది మా మహారాజుగారి పటం"* అంటాడు.

*"నేను మాత్రం కాదంటున్నానా? ఇందులో అద్దము, కాగితమేగా ఉన్నాయి. మీ మహారాజుగారు ఇందులో లేరు గదా! అదిగో! వారు అక్కడ కూర్చున్నారు"* అని అంటాడు వివేకానందుడు. *"లేరునుకోండి...అయినా అది వారి చిత్రపటము గదా!"* అని అంటాడు మరో ప్రముఖుడు.

*"అవును ఈ పటంలో మీ మహారాజుగారు లేరు. కానీ ఈ పటాన్ని చూడగానే మీకు మహారాజుగారు గుర్తు వస్తున్నారు. వీరి మీద వున్న గౌరవంతో, ఈ పటం మీద ఉమ్మివేయడానికి ఇష్టపడటంలేదు. నిజమేనా?"* అని అడుగుతాడు వివేకానందుడు.

*'నిజమే!...నిజమే!...'* అంటారు అక్కడ వున్నవారందరూ.

అప్పుడు చెబుతాడు. *"ఈ జగత్తును సృష్టించిన సృష్టికర్తను, భగవంతుడిగా భావించి, ఆ దేవతాపటాలను పూజామందిరంలో పెట్టుకొని మీరందరూ పూజిస్తున్నారు. మరికొందరు జాయిలో, రప్పలో, చెట్టులో పుట్టలో భగవంతుడున్నాడని భావించి పూజిస్తున్నారు. ఇంకా కొంతమంది గరుత్మంతుడు (గ్రద్ధ) విష్ణుమూర్తి వాహనమని, వృషభము (ఎద్దు) నందీశ్వరుడని, కుక్క కాలభైరవుడని, ఏనుగు గజేంద్రుడని, గుఱ్ఱము హయగ్రీవమని భావించి భక్తితో పూజిస్తున్నారు. సమస్త జంతువులను, జీవరాసులను సమదృష్టితో జూచి, ప్రేమించి, పూజించడం మన సంప్రదాయం. అదే హిందూధర్మ వైశిష్ట్యం"* అని వివేకానందుడు వివరించుతాడు. విగ్రహారాధనను నిరసించిన అళ్వారు మహారాజు తను తప్పును తెలుసుకొని, వివేకానందుడ్ని క్షమాభిక్ష కోరుతాడు.

1893 సం॥ సెప్టెంబర్ 13వ తేదీన చికాగో నగరంలో జరిగిన సర్వమత మహాసభలో ఆయన చేసిన ప్రసంగం మరువరానిది. ఉపన్యాస ప్రారంభంలో స్వామీజీ "Dear sisters & brothers of great America" అని సంబోధించడంతోనే సదస్సుల కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. ఆ సంబోధనలోనే ప్రస్ఫుటించింది భారతీయ సంస్కృతి విశిష్టత.

*"సర్వమత సామరస్యం భారతీయుల అభిమతం. అన్ని మతాలు బోధించే సూత్రాలు మంచివేనని మా భావన. అన్ని మతాలను గౌరవించి, ఆశ్రయమిచ్చిన జాతికి, దేశానికి చెందినవాడనని చెప్పకొనుటకు నేను గర్వించుచున్నాను. వేరువేరు ప్రదేశములలో పుట్టిన నదులు, విభిన్న మార్గాలలో ప్రవహించి, చిట్టచివరకు ఏ విధంగా సముద్రమును చేరుచున్నవో, అదేవిధంగా వివిధమతాలు నిర్దేశించిన ఆరాధనా మార్గాలను అనుసరించేవారు కూడా చివరకు చేరే చోటు ఒక్కటే"* అనే సత్యాన్ని చెప్పి, ప్రపంచ ప్రజల మన్ననలను పొందిన మహా ప్రవక్త *'వివేకానందుడు'*.

వివేకానంద అమెరికా, బ్రిటన్‌లాంటి సంపన్న దేశాలను పర్యటించి, భారతదేశానికి తిరిగి ప్రయాణమవుతున్న సమయంలో పత్రికా విలేఖరులు *"ఇప్పుడు మీ మాతృభూమిపట్ల మీ అభిప్రాయమేమిటి?"* అని ప్రశ్నిస్తారు. అప్పుడు వివేకానంద *"భారతదేశాన్ని లోగడ ప్రేమించాను. కాని ఇప్పుడు భారతభూమిలోని ప్రతి ధూళి కణం నాకు అత్యంత పవిత్రము. అది నాకొక తీర్థస్థానము"* అని సగర్వంగా సమాధానం చెబుతాడు. పూర్వజన్మ సుకృతం వలన ఈ పవిత్ర భూమిలో మనం జన్మించాం.

ఇక్కడి ప్రతి అణువు మనకు అత్యంత పవిత్రమైనది. కనిపెంచిన తల్లి మీద ఏ విధమైన **'మాతృభావన'** మన కుంటుందో, మనకు జన్మనిచ్చిన ఈ **'భరతమాత'** (భరతదేశం) మీద కూడా అదే విధమైన **'మాతృభావన'** (మాతృదేశభక్తి) ఉండాలి.

రామాజ్ఞచేత సముద్రాన్ని లంఘించిన హనుమంతుడ్ని ప్రతి ఒక్కరూ ఆదర్శంగా గైకొనాలని హెచ్చరిస్తూ వివేకానందుడు ***"మనకు ఒక మహత్తర ఆదర్శం ఉండాలి. అయితే ఈనాడు దురదృష్టవశాత్తు ప్రజలలో అసంఖ్యాకులు ఆదర్శహీనులై, అంధకారంలో పయనిస్తున్నారు. ఆదర్శం గలవాడు వేయి తప్పలు చేస్తే, ఆదర్శంలేనివాడు యాభై వేల తప్పలు చేస్తాడు. కనుక ఆదర్శం వుండటం చాలా అవసరం"*** అని హెచ్చరిస్తారు. ఆదర్శం లేకుండా ఏ పనీ సాధించబడదు. మొట్టమొదట ఉత్తమ ఆదర్శాన్ని ఎంచుకోవాలి. అట్టి ఆదర్శం కోసం అంకితం కావాలి. పట్టుదలతో అవిరామంగా శ్రమించి కార్యాన్ని సాధించాలి. ముఖ్యంగా విద్యార్థులు ఉత్తమ ఆదర్శమును ఎన్నుకోవాలి.

విద్య విషయంలో కూడా స్వామీజీకి నిర్దుష్టమైన అభిప్రాయాలుండేవి. ***"విద్య అంటే కేవలం చదవటం, వ్రాయటం, కంఠస్థం చేయటం"*** అనే వారితో ఏ మాత్రం ఏకీభవించేవారు కాదు. వినయములేని విద్య, వివేకంలేని విజ్ఞానం, విజ్ఞతలేని పాండిత్యం ఉన్నా ప్రయోజనం లేదని భావించేవారు. ఈ విషయమై ఒక ఉపన్యాసంలో స్వామీజీ ***''విద్య అంటే విషయక బాహుళ్యాన్ని మెదడులో ఎక్కించడంకాదు. జీర్ణంగాక కల్లోలం సృష్టించే సామాగ్రి కాదు. ఉజ్జీవనకరం, మానవ నిర్మాణకారకం, శీలసంపత్తులను పెంపొందించే భావాలను జీర్ణించుకోగలిగేదే నిజమైన విద్య''*** అని వివేకానంద విశ్వసించేవారు. ఈనాటి విద్యాసంస్థల అధినేతలు ఈ విషయాన్ని ప్రధానంగా గుర్తుంచుకోవాలి.

'Awake! Arise! Stop not till goal is reached". ***'మేల్కొనండి! లేవండి! లక్ష్యము సాధించువరకు విశ్రమించకండి!"*** అని హెచ్చరించిన వివేకానందుని మాటలు మననం చేసుకుంటూ, ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగిపోవాలి. ఇదే మన కర్తవ్యం విస్మరించకండి!

---

***"Stand and die on your own streaight. If there is any sin in the world, It is weakness. Avoid all weakness, weakness is sin, weakness is death". - VIVEKANANDA***

